శ్రీ

# వేమనసూక్తిరత్నాకరము



ఇది

సరస చతుర్విధ కవితాసామ్రాజ్య ధురంధరులగు

## నాదెళ్ల పురుషోత్తమ శాస్త్రులు గారిచే

పరిష్కృతము

[వెల రు. 12.00

శ్రీ

# వేమన సూక్తి రత్నాకరము



ఇది

సరస చతుర్విధ కవితాసామ్రాజ్య ధురంధరులగు

**నాదెళ్ల పురుషోత్తమ శాస్త్రులు గారిచే**

పరిష్కృతము

[వెల రు. 12.00



ఓం.

శ్రీగురుభ్యోనమః.

# వేమనయోగీంద్రచరిత్రము.

1. రెడ్డివంశోద్భవుండగు వేమారెడ్డియను వేమనగారు కొండవీడు రాజస్థానముగాఁగల కొండవీటిసీమ నేలిన కొమరుగిరి వేమారెడ్డిప్రభువునకు మల్లమాంబారాణియందు జన్మించిన తృతీయపుత్రుఁడును, కోమటివెంకారెడ్డి యనఁబడు ననువేమారెడ్డిప్రభువునకుఁ గనిష్ఠసోదరుఁడు నై, రెడ్లకులమున కెల్ల ఘనతఁదెచ్చినవారు. ఈకులములోఁ బంటరెడ్లు, లేక మోటాడరెడ్లు, పాకనాఁటిరెడ్లు, వెల్నాటిరెడ్లు, రేనాఁటిరెడ్లు పెడగంటిరెడ్లు మొదలగు రెడ్డితెగలుగలవు. వేమన వంశజులు పంటరెడ్లును, శైవమతస్థులు నయి, యుండిరి. ఈరెడ్లకుఁ దెనుఁగుగ్రంథములయందు విశేష ప్రేమ కలదు. బహుప్రసిద్ధిని బొందిన శ్రీనాథుఁడు, భాస్కరుఁడు, మొదలగు మహాకవులను పోషించుచు వారిచేతవీరందిన బహుకృతుల చేతనే యి దెల్లఱకును దెల్లము.

2. వీరికి మూలపురుషుఁడైన దొంతి అలియరెడ్డి యను నాతఁడు, అనుముకొండ



దొంతి అలియరెడ్డి.

కాపురస్థుఁడు, వ్యవసాయవంతుఁడు, సంపదగల విశేషధనికుఁడునై, యుండె. బంగారము చేయువాఁడనియు, నందువలన విశేషధనికుఁడయ్యెననియు, వాడుక గలదు; కాని విశేషధనికుఁడైనందునకుఁ గారణ మేమనఁగా:—ఆకాలమునందు వేమన్న యను నొకవైశ్యుఁడు శ్రీశైలయాత్రకుం బోయి, స్వామిని సేవించుకొని, పిమ్మట నక్కడనుండు పాతాళగంగయనఁబడు నదిలోఁబడియున్న పచ్చబండ సంగతి కనుఁగొనవలె నను తలంపు కలిగి, యక్కడ నిలవ యుండెను. అంతట నర్చకునికి సందేహము కలిగి, "యాత్రస్థు లందఱును దిరిగిపోయిరే; నీ వెందునకయా యిక్కడ నిలవయున్నాడవు?" వని యడుగఁగా, నందున కాతఁడు "ఆరుమాసములు స్వామిసన్నిధిలో సేవచేయుచు నుండవలె నని నాకుఁ గోర్కెయున్నది; కనుక నున్నా"ననెను.

3. అందున కర్బుకుఁడు "నీ వుండుపక్షమున నుత్తరదిశ మినహాగాఁ దక్కిన దిశలలో నెక్కడనైనఁ దిరుగవచ్చును; గాని యాదిశకు బోవ"ద్దనెను. అందుమీఁద నావైశ్యునకు సందేహముకలిగి, యర్బుకుఁ డిట్లుచెప్పుటకుఁ గారణ మేద్దియైన నుండక తీఱ దని యోజించి, కొన్నాళ్లవఱకు నర్బుకునికి నమ్మకము కలిగించి, పిమ్మటఁ దన్నుఁ బోవద్దన్నవైపున కొకనాఁడు పోవనాలోచించి, దారి కనుఁగొనుట కష్టమగు నేమో యని తోపఁగాఁ, దాఁ బోవుమార్గముపొడవున నూవులు చల్లుకొనుచుం గొంతదూరము పోయి, యక్కడ నొకటి రెండురోజులుండె, యాప్రదేశ మంతయుం బసిరిక వంటిపదార్థముతో నిండియుండుటయుం,దనచేతిలోని యినుపచువ్వ కాపదార్థమంటియాచువ్వయంతయు బంగారమగుటయుం, నావైశ్యుఁడుచూచియాశ్చర్యపడి, యదిపరసవేది యని తెలిసికొని, యర్బుకుఁడిందున కేక కాబోలునుత్తరదిశకుఁ బోవద్దన్నాఁడని యనుకొని, యక్కడనుండి నూవులుమొక్కలు మొలచిన యానవాలుంబట్టి యథాస్థానమునకుఁ జేరి, రెండుకుండలును, గావడియుం, సంపాదించుకొని మఱియొకనాఁ డాదారిని తిరిగి, యాప్రదేశమునకుఁబోయి, యక్కడ నుండు పరసవేదిని గుండలలో నింపుకొని, గడ్డిదినుసుమొక్కలను మూతగాఁ గట్టి, యాకావడి నెత్తుకొని, తిరిగిచూడక యెకాయెకి బయలుదేరెను. పిమ్మట నాయుత్తరద్వారము మనుష్యులు పోవుటకు వీలులేనంత యెత్తుగా శ్రీశైల మల్లికార్జునస్వామివారి మహిమవలన కొండరాళ్లతో మూయఁబడినది. ఆవైఖరి యిప్పటికిని గాన్పించుచున్నది. ఆవేమన్న, యనుముకొండఁ జేరి, యొకచెట్టుక్రింద కావడిదించుకొని, కొంతసే పలసటఁదీర్చుకొని, రాత్రియయినందున దొంతిఅలియరెడ్డి యింటికిఁ బోయి, "అయ్యా నేను పరుండుటకు చోటిప్పింపు"మని యడుగఁగా, గొడ్లచావడి చూపెను. అక్కడ నాగళ్లు మొదలగున వున్నమూలను గావడినిదింపి, కుండలు కనఁబడకుండ గడ్డిఁగప్పి, యావర్తకుఁడు భోజనమునకుఁబోయెను. ఆపరుసవేది యెట్లో యానాగళ్ల కిఱ్ఱుల కంటఁగా నవి యన్నియు బంగారమై మెఱయుచుండెను. పరిపాటిప్రకారమారెడ్డి రాత్రివేళ పశువులను జూచుటకుఁ బోవువఱకామూలను మెఱయు నది కాన్పించె. పరిశీలింపఁగా నాగఁటికఱ్ఱు లాకుండల కంటియుండెను. అప్పుడారెడ్డి "యీకుండలలో నేమోయున్నది; అందువలననే యినుము బంగార మైన"దనుకొని యానాగళ్లను, గుండలను, దనయింటికిఁబంపి, పశువులను వేఱొకచోటఁ గట్టించి, యాచావడికి నిప్పుముట్టించెను.

4. ఆచావడి యంటుకొని మండుచుండఁగా, వణిజుఁడు భోజనము చేసికొని వచ్చి, యదిచూచి, తనకావడికుండలు పోయినందున కేడ్చియేడ్చి, "భాగ్యహీనునకు

స్పర్శవేది యబ్బునా?" యనుకొనుచు నాపంటలోదుమికి మృతినొందెను. (పద్యము ఆ॥ భాగ్యహీనునకును బరుసవేదిదొరక। నదియు నిల్వదపుడె పదలుఁగాక। వాన తోడవచ్చు వడగండ్లునిల్చునా। విశ్వదాభిరామ వినరవేమ॥) మరునాఁడారెడ్డి యాకుండలలోనుండు పదార్థ మేమియైయుండునో తెలిసికొన నొక యినుపకడ్డీని నొకకుండలో ముంపఁగా, నప్పుడేయది బంగారమాయెను. ఆప్రకార మినుమెంతయైన బంగారమగులాగున నాపరుసవేది నుపయోగపఱచుకొనెను. అందువలన విశేషధని కుఁడైనాఁడనియే వాడుక కలదు. కాని యాపంటలోఁబడి మ్రగ్గిన వేమన్నపా టూరకపోలేదు. ఆరెడ్డికిని నాలుబిడ్డలకును బహుబాధక ప్రతిబంధకమై పీడింపఁజొచ్చె



దొంతి అలియరెడ్డియొక్క సంపద.

ను. అందులకుఁ గొంతకాల మనేక శాంతులును, బహుపుణ్యకార్యములును, జేయించి విసిగి సదా శ్రీరామభక్తుఁడైన యారెడ్డి యొకరాత్రి బహుశోకసంభరితుఁడై పరుండఁగా, నిదురపట్టి యందు స్వప్నములో నల్లవైశ్య వేమన్న కాన్పించినట్లు, నింక వారియింటఁ బుట్టుసంతతికెల్లెడలం, దనపేరుపెట్టి తన్నుఁగొలుచుకొనుచున్నయెడల

నల్లవంశము వారిచే, నూరేండ్లు రాజ్యము చేయింతునన్నట్లును దోఁపఁగనే, తటాలునలే-
చి స్నానమాచరించి, యొక బంగరుఁ బ్రతిమను వేమన్నరూపమునఁ జేయించి పూజిం-
చి, యప్పటికందరును చచ్చి చచ్చి యొకఁడు మిగిలియుండఁగాఁ బిచ్చి పుల్లాయయని
పేరు పెట్టుకొన్న బిడ్డనికి, పుల్లయ వేమారెడ్డియను పేరు పెట్టి నామకరణమహోత్సవము
చేసి బహుదానము లొనర్చెను. ఆవైశ్య వేమన్నమహిమమున నాఁడు మొదలు బహు
శీఘ్రకాలములోనే రెడ్లసంతతి యత్యధికమాయెను.

5. అదొంతి అలియరెడ్డి 1323 వ సంవత్సరములో వనుముకొండ విడిచి, కొం
డవీడున వశియించి కాలగతినొందెను. అంతనక్కడఁ బ్రభువైన చాళుక్యరాజులలోని
ప్రతాపరుద్రుఁడు, రాజ్యపద భ్రష్టుఁడైన తరువాత నీతని పెద్దకొడుకు (1) పుల్లయ
వేమారెడ్డి స్వతంత్రుఁడై 'కొండవీఁడు' అనుపర్వతపుఁ గోటమీఁద నధిపతిగానుండి
పల్నాడుసీమలోని బెల్లముకొండ, వినుకొండ, నాగార్జనకొండ, అను సీమాఁటినిగూ
డ సంపాదించి, 108 శివాలయములను జనులు పూజ చేయుటకుగా నేర్పఱచి, 1328 వ
సంవత్సరము మొదలు 12 సం॥ లు రాజ్యము చేసి, శివలోకప్రాప్తిని జెందెను, (రాజ్య
పదభ్రష్టుఁడైన ప్రతాపరుద్రుని రాజ్యములో నుత్తరభాగము ఒరిస్సారాజుల క్రిందను,
దక్షిణభాగమీ ఈప్రభువు క్రింద నుండెను.)

6. పిమ్మట నీతని తమ్ముఁడు (2) అనుపోతవేమారెడ్డి 1340వ సం॥ లో సింహాసన
మెక్కి 30 సం॥ లు రాజ్యమేలి శివలోక ప్రాప్తిని జెందెను. ఈప్రభువు తనరాజ్య
మున నుత్తరభాగమున రాజమహేంద్రవరము వఱకును, దక్షిణమునఁ గాంచీపురము వఱ
కును, పడమటను శ్రీశైలము వఱకును, గలదేశములను సంపాదించి కొండపల్లి ఖిల్లాను
గట్టించెను. ఇంతియ కాక యీ అనుపోతవేమారెడ్డి ప్రభువు కొండవీఁడు, అద్దంకి, రా
యచూరు, కూడ నేలినట్లును, అమరావతిలోని దేవాలయమును, శ్రీశైల ఘట్టమును,
మరమ్మతు చేయించినట్లును అమరేశ్వరములోని 1361వ సంవత్సరపు శిలాశాసనము వల
నఁ దెలియవచ్చుచున్నది. ఈయన ప్రభుత్వ కాలములోఁ గొండవీటి కొండమీఁద
నొకగోసాయి యుండెను. ఒకగొల్లఁడావైపునఁ బశువులను మేఁతకుఁ ద్రిప్పుచుండి,
ప్రతిదినము నాగోసాయికిఁ బాలిచ్చుచుండెడివాఁడు. ఇట్లు జరుగుచుండఁగా నొక
నాఁడా గోసాయి యాగొల్లనితో, "నీవు దినదినము కాఫం బాలిచ్చెదవే! యందు
లకు నావలన నీకేమి ప్రయోజనమున్నది? మానుకొమ్మ" నెను. "నాకేమియునక్క

ఱలేదు; నేను బాలిచ్చిన ఫలము వ్యర్థముగాఁ బోద" ని మాఱుచెప్పి, తప్పక త
వ్రతమును జరుపుచునేయుండెను. కొన్నాళ్ళకాగోసాయి గొల్లనితో "అబ్బీ! నీకొ
మేలుకలుగునట్లు చేసెదను. అక్కడ పుట్టిదిబ్బపట్టున రెండుగజములలోతున గోఁయి
త్రివ్వవలసినద" ని చెప్పెను. అంతనాగొల్లఁడట్లుచేసెను. తరువాత నాగోసాయి
యాగోతిలో సెండుపుల్లలువేసి నిప్పంటించి మండుచున్న సమయంబున, గొల్లనితో
మేలుకనఁబఱచెదను రమ్మని యాగోతియొద్దనకుఁ దీసికొనిపోయి, యేమోచెప్పుచు
వానిమెడమీఁద చేయుంచి యామంటలోఁ బడద్రోయ యత్నముచేయఁగా, వాఁడు
తప్పించుకొనియె. ఇద్దఱుం గలియఁబడిరి. ఎట్లయినను దుదకు గోసాయినే గోతిలో
బడవైచి, గొల్లఁడు పాఱిపోయెను. గోసాయి యామంటలో దహనమై పోయెను.
తరువాతఁ గొన్నాళ్ళకు గోసాయి యేమైనాఁడో యని గొల్లఁ డాగోతిదగ్గఱకు
బోయిచూడఁగా, నందు మనుష్యునెత్తుగల రెండు బంగారపు బొమ్మలు మెఱయుచు
గనఁబడెను. వాఁ డాశ్చర్యపడి యింటికిజని కొడుకులను వెంటఁ బెట్టుకొనిపోయి
యాబొమ్మల నింటికిఁ జేర్చుకొనెను. అవి మనుష్యుని మాదిరిగానే యుండుటవలన
నొకప్పుడు కాలివ్రేళ్లు, నింకొకప్పుడు చేతులవ్రేళ్లును, విఱుగఁ గొట్టి వర్తకుల
కమ్ముకొనుచుండఁగా, నూరిమీఁద వాదుపడిన ప్రభువుగారి వినికిడి కందెను. అప్పుడు
ప్రభువు పరివారముతో గొల్లని యింటెని ముట్టడించి, బంగారపు బొమ్మలను గోట
లోనికిఁ దెప్పించుకొనియె. తరువాత నీప్రభుని తమ్ముఁడు (3) అను వేమారెడ్డి 1370
సం॥ లోఁ బ్రభుత్వాధికారమునుబొంది 12 సం॥లు రాచరికముచేసి శివలోకప్రాప్తిని
జెందెను. ఈయన కాలమున శ్రీనాథ భాస్కరాది కవిపుంగవులను మంత్రివర్గముగా
జేర్చికొనఁగా నమితములుగ బిఱుదులను వహించుటయు, నపారముగాఁ బ్రఖ్యాతిని
సంపాదించుటయు, వన్నెకెక్కిన ప్రభువనఁ బడుటయు, సంభవించెను. ఈయన
తరువాతఁ గుమారుఁడు (4)కొమరగిరి వేమారెడ్డి 1382 వ సం॥లో రాజ్యమునకువచ్చి
14 సం॥లు ప్రభుత్వముచేసి శివలోకప్రాప్తిని జెందెను. ఈతఁడుసోమరియు, సౌఖ్యా
ర్థియు నయి, యుక్తాయుక్తవివేచనంబుమాని వర్తింపఁగా, మున్నున్నసంపద యెల్లను
ముఖ్యముగా సువర్ణ విగ్రహములను గానరాక, యెక్కడనున్న వక్కడనె హరించెను.
అది యీతని కృతఘ్నతకారణముగానయ్యెనని యెఱుకపడియెం గావున, వేమన్న
యను నిలువేల్పునెడల భయభక్తులు గలిగి యెక్కువగాఁ బూజించి, డాంబికమునుండి
లొంగి వైచ్యము నాపాదించుకొన్నగుఱుతునకై, వెల్లడిగాఁ జరిత్రవిషయ మెఱుక
పడునాగున నీతని పెద్దకొమరునకుం గోమటివెంకారెడ్డి యని పేరుంచబడియెను.


పయప్రవారు కోమటి వెంకారెడ్డి అనే అనువేమారెడ్డి
ప్రభువు. (అనగా వేమనయోగియొక్క పెదయన్న)
1396—1424. ఎడమవైపున మంత్రి కనాటప్ప వెంకయ్యపంతులు.
కొండవీడు.

7 ఈయన తరువాతఁ (5) గోమటి వెంకారెడ్డి అనే అనువేమారెడ్డి (వేమనయోగిగారి పెద్దయన్న) 1396 వ సం॥లో సింహాసనమెక్కి 28 సం॥ లు రాచరికము చేసెను. పై నలుగురుప్రభువులకంటె నీప్రభువు ప్రజల నెక్కువప్రేమతోఁ జూచుచు, నందఱికి నన్నివిధముల వలసిన యేర్పాటులను జేయించి, బిడ్డలను దండ్రివలెఁ గాపాడుచు, బ్రాహ్మణభక్తి గలిగి, వారిలోను థారణజ్ఞులయందు విశేషభక్తితో మెలఁగుచుఁ, బుత్రసంతతిలేకయే, శివలోకప్రాప్తిని జెందెను. ఈప్రభుత్వములో దోషసూచనగల కార్య మొక్కటియు లేక యుండెను. ఈయన శైవమతస్థుఁడైనందున శ్రీశైలభట్టమందుఁ గొన్ని లింగప్రతిష్ఠలు చేయించియు, నక్కడక్కడఁ జెరువులు, బావులు త్రవ్వించియు, నారామములు వేయించియు, బహుకీర్తి వడసి యుండె. ఈయన కనంతరప్రభు వైన (6) రాచవేమారెడ్డి (వేమనయోగిగారి చిన్నఅన్న) 1424 వ సం॥ లో సింహాసన మెక్కి ప్రభుత్వము చేయుచుండఁగా, ము న్నేర్పడియున్న వైశ్యవేమన్న వరముప్రకారము శతవత్సరము లప్పటికిఁ బూర్తియయ్యెఁ గాన, కాలకర్మవశమున నాతనిసేనలోని బం టయిన చౌదరి యెల్లప్ప చేత 1428 వ సం॥ లోఁ జంపఁ బడియె. అంత నారాజ్యము ఒరిస్సా నేలు నట్టి గజపతిరాజుల వలన నాక్రమించు కొనఁ బడియె.

8 ప్రకృతచరితాసంబంధియుఁ డగు కోమటి వెంకారెడ్డి అనే అనువేమారెడ్డిప్రభుని భార్య నరసాంబారాణియును బ్రజాసౌఖ్యమును గుఱించిన సదాలోచనయు, దివ్యజ్ఞానసంపత్తియు, గలిగి యుండి, యను పగు ఖ్యాతిని గాంచి శివలోకప్రాప్తిని జెందెను. ఆమె పెనిమిటి యయిన యీప్రభు వామెను సమాధిఁ గట్టించి, యందుమీఁద లింగప్రతిష్ఠ చేసి, యామెవలె నొక శిలావిగ్రహమును జేయించి, సమాధిమీఁద లింగమున కెదురుగ స్థాపించిరి. అవి చాలకాలము అనఁగా 1600 ల సంవత్సరము వఱకు నుండెను.

9 ఈప్రభువును, నరసాంబారాణియు, నుద్యానవనవిహారంబు సలుపుచో, నచ్చటగల రమ్యస్థలంబులందు వసియించి యాడ నాడుకొను శుక, పిక, మయూరాదుల, ముచ్చటల, నటనల, యొప్పిదంబున కానందించుచుఁ, దత్సృష్టివై చిత్ర్యంబున కీశ్వరుం బేర్కొనుచు, దాసదాసీజనంబులతో వాని యోగక్షేమంబులందుఁ దమకుఁ

(దీనికి తరువాత పొరటయందున్న చిత్రపటమున కోమటి వెంకారెడ్డి అనే అనువేమారెడ్డి ప్రభువు, భార్య అయిన నరసాంబారాణితో వనవిహారము చేయు విలాసము కాన్పించును.)

గల యనురాగంబును దెలుపుచు, వానిసంరక్షణయం దెచ్చరికఁ గలిగి యుండు నటులఁ జేసి, ముద్దుగా వానిని దీరిచి దిద్దియుంచిన వాండ్రకు బహుమానము లొసఁగుచుఁ దమకుఁగల భూతదయను వెల్లడించుచుండువారు.

10 దర్బారుచేయునపుడు కొలువుకూటమునకు ముందు నిలిచి యుండెడి యర్జీదారుల నదబు ప్రకారము, క్రమక్రమముగాఁ జోపుదారులు ప్రభుసన్నిధినె యున్న, మంత్రియగు కవాటపు వెంకయ్యపంతుల యొద్దకుఁ గొనిపోవఁగా, నాయన వారి మొఱలెల్ల సాకల్యముగ విని వానినెల్లఁ గ్లుప్తీకరించి, ప్రభునితో విన్నవింపఁగాఁ, ప్రతివిషయమునకును న్యాయముగానె ధర్మయుక్తమగు తీర్మానపు టాజ్ఞ నొసఁగుచుండెడివారు.

11 ఇట్టి కోమటివెంకారెడ్డి అనే అనువేమారెడ్డి ప్రభునకుఁ గనిష్ఠసోదరుఁ డైన వేమారెడ్డి అనఁగా మనవేమన్న, యొకవేశ్య నుంచుకొని (పద్యము. క॥ టక్కరులఁ గూడితిరుగుచు । నెక్కుడుకాలంబు జ్ఞాన మెఱుఁగఁగలేకే । నొక్కవెలయాలిపొందె। మిక్కిలి మోక్ష మ్మ టంచు మెలఁగితివేమా॥) కోటలో సన్నసువారములో భోజనము చేసికొని, రాజకీయసంబంధ మైన జోక్య మెంతమాత్రమును గలుగఁ జేసికొనక ప్రభువైన యన్న పెండ్లిప్రయత్నము చేయఁగఁ, దన కక్కరలేదని భోగపుదానియింటనేయుండి, యావేశ్యవలలోఁ జిక్కి, యింటనున్న ధనములోఁ దనచేతికిఁ జిక్కిన మట్టునకు వేశ్య కిచ్చుచుండెను. తనచేతికిఁ జిక్క నప్పుడు మాతృసమానురా లై తన యందుఁ బుత్రప్రేమగల వదినెయయిన నరసాంబారాణి నడిగి తెచ్చి యిచ్చుచుండును. ఒకానొకప్పుడు తన వదినె నడుగఁగ నామె రేపుచూచెద నని యన్నప్పుడు, మఱునాఁడామె యిచ్చువఱకు ముఖమార్జనముకూడఁ జేయకుండును. ఇట్లు బిడ్డవంటి వేమన పస్తుండుటను జూచి యామె సహించలేక జాలిపడి యిచ్చు చుండును.

12 అటుల నుండఁగా, నొకనాఁడు వేశ్యయింటి పడకగదిలో వేమన మంచము మీఁదఁ గూర్చుండి యుండ, వేశ్య తాంబూల మిచ్చుచు "రాణీగారు ధరించుకొను నగ లన్నియు నాకుఁ దెచ్చి యిచ్చిన నేను ధరించుకొని యద్దములోఁ జూచుకొని సంతోషించెదను. మీరును జూచి యానందపడెదరు, తెచ్చియిం"డ నఁగా వేమన వల్లెయనెను.



వేశ్య వేమన

13 తరువాతఁ గొన్నాళ్లకు దసరాపండుగ రాఁగా, రాణి తనకుఁ గల యాభరణములన్నియు ధరియించుకొని యుండుసమయంబున, 'వేమన చూచి యానందపడి "అమ్మా! యివి మీరు తీసినప్పుడొకసారి నాచేతి కిండు; నేను నా వేశ్యకుఁ బెట్టిచూచుకొని వెంటనే తెచ్చియిచ్చెద" నని వదినెతోఁ జెప్పఁగా, నామె విని సంతోషించి "అబ్బాయీ! ఆలాగుననే యిచ్చెద" నని చెప్పి బులాకీ మినహాగా నగ లన్నియు నిచ్చెను. వెంటనే తీసుకొనిపోయి వేశ్య కీయ, నది యన్నియు ధరించుకొని, బులాకీ యే దని యడిగెను. "అది చాల విలువకలది. చీకటిలో దీపమువలె కాంతిప్రదమై యుండునట్టిది నే నడుగఁ జాల" నని చెప్పఁగా "ఎట్లయినను దానిని దెచ్చి యీ

యని యెడల, మీరు నన్ను వదలుకో వలసిన''దని చెప్పెను. అందులకు వేమన చాల కించతోఁ గోటలోనికిఁ బోయినమీఁదట వదినె, కించతో నున్న మఱదిని జూచి, వేశ్యను విడిచిపెట్టెదుననుయును సమీపించిన దనుకొని, ''యేమి అబ్బాయీ! కించగా నున్నాడ'' వని యడుగఁగా, వేశ్య చెప్పిన మాటలను దీనత్వముతోఁ జెప్పెను. ఆమె విని ''నీవు చింతింపవద్దు; ఇచ్చెదను; తీసికొనిపోయి యావేశ్య నగలును బులాకీని ధరించుకొన్న తరువాత దానిని వస్త్రహీననుఁగఁ జేయించి నీవుచూడవలసిన''దని ప్రమాణము చేయించుకొని బులాకీ నిచ్చెను. వేమనయు నదేప్రకారముగాఁ జెప్పి వస్త్రహీననుగానే చూచెను. (పద్యము. సీ॥ నావదినెయును నాఁడు, నవరత్నభూషణ। ములు ధరించిన యంద, మలరఁజూచి। యాభూషణములువా, రాంగనకేఁబెట్ట। వలెనని తోఁచినా, వదినెకడకుఁ। జనియు నీకున్నభూ, షణములిమ్మనియన। నడ్డుబాసయెతక్క, నన్నియొసఁగె। ముక్కుభూషణమది, ముఖ్యమైనదిదాని। నీకున్న బ్రాణమ్ము, లేగునంటి। నట్టులైనను గొనిపొమ్మి, యనుచు నిచ్చె। యల్లవెలియాలి కీభూష, ణాదులిడియుఁ। జీరరవికయు విడిపింపఁ, జేసిచూడు।మనియె నటు చేయ రోసె నా, మానను వేమ॥).

14 అప్పుడు వేమన, అలంకారముతో వస్త్రహీనయైయున్న యావేశ్యనుజూచి రోతపుట్టె (పద్యము తే॥ రోతపుట్టెను మగువపైఁ బ్రీతిదొలఁగె। నాఁటినుండియు నాకేమిపాటులేమిఁ। గాలమునుబుచ్చ నాకర్మశాలయందుఁ। గూరుచుండఁగఁ గూడె నీగురుఁడు వేమ॥) యావెంటనే లేచి కోటలోనికిఁ బోయి, యొకగదిలోఁ బరుండెను. భోజనసమయమునకు వేమనరానందున వదినె, ''ఇదియేమి? వేమన యింక రాలేదు. భోగముదానియింటికిఁ బోయి కనుఁగొని ర''మ్మని యొకభటుని బంపఁగా, నచ్చట వేమనలేకపోయెను. తిరిగివచ్చియాసంగతి రాణితోఁ జెప్పఁగ, లోపల నేగదిలోనైనఁ బరుండెనేమో చూడుమనియె, అటుచూడఁగ నొకగదిలోఁ బరుండియే యుండెను. అప్పుడు రాణి, ''నేఁటితో జ్ఞానము కుదిరినది; కొట్టిలేపు''మని లేపించి ''అబ్బాయీ! భోజనమునకు ర''మ్మనఁగా లోపలికిఁ బోయెను.

15. తరువాత వేమన కేమియుఁ దోఁచక వేశ్యయింటికిఁ బోక, యేలాగునఁ బ్రొద్దు గడచునో యని యోజించి, కోటలో బంగారపుపనిచేయు దుకాణములోఁ

గూర్చుండ మని, యేర్పాటు చేసికొనెను. అక్కడ విశ్వబ్రాహ్మణులైన (1) కొండవీటి అభిరామయ్య యను రామయ్యయుఁ, దమ్ముఁడు (2) లక్ష్మయ్యయుఁ బనిచేయు శాలలో మఱునాఁ డుదయమున వేమన గూర్చుండెను. అప్పు డక్కడ లక్ష్మయ్య యొక్కఁడు మాత్రమే పనిచేయు చుండెను. మీయన్న యేడ నున్నాఁ డని వేమన యడుగఁగాఁ గొంచెము జాగుగ వచ్చు నని లక్ష్మయ్య చెప్పెను. పిమ్మట నభిరామయ్య వచ్చువఱకు 9 గంటలైనది. "ఏమి రామయ్యా! యింత యాలస్యము? ఇట్లయినఁ బను లేలాగున నగు" ననఁగాఁ "జిత్తము; చిత్తము" అని అభిరామయ్య అనెను. వేమన రాజకీయములో వేఱొకపని యేదియుఁ జూడక, యెప్పుడును బంగారపుఁబని చేయు దుకాణములోనే కూర్చుండుచు, నభిరామయ్యమీఁద సవారీ చేయుచునే యుండెను. నాలు గయిదు దినము లాలాగున జరిగినపిమ్మట, నొకనాఁ డభిరామయ్య వేమనతో "అయ్యా! ప్రతి యుదయమున నాకు స్నానము, జపము నున్నది. అందుచేత నాలస్యమగును; గనుక జాము ప్రొద్దెక్కువఱకు నన్ను క్షమింపు"డని కోరెను, అందునకు "నీ వదివఱకే, నీకర్మములు తీర్చుకొని, యుదయమునకే రావలసియుండు" నని వేమన యుత్తరువు నిచ్చెను. ఈసంగతి ప్రభువునకుఁ దెలిసి "యెప్పుడును భోగపుదానియింటిలోనే యుండుటకంటె అభిరామయ్య జాగుగ వచ్చుట మంచిదే" యనెను. పిమ్మట నభిరామయ్య యాలశ్యముగా వచ్చుట కుండు కారణముఁ గనుఁగొనవలె నని (పద్యము. క॥ ప్రతిదినమును నుదయమ్మున । మితకాలము లెక్కఁగొనక మీఱి పనికి రాఁ । గత మేమియనుచు రామయ। వ్రత మరయఁగఁ గంటి నిట్టివానిని వేమా॥) వేమన యొకనాఁటి తెల్లవారుజామున లేచి, బయలుదేరి, యభిరామయ్య యింటిదగ్గరనున్న చెట్టుమీఁదఁ గూర్చుండి దాగియుండి, యభిరామయ్య చెంబు చేతఁబట్టుకొని పోవుచుండఁగా, వెనువెంట వేమనయు వెడలి, యభిరామయ్య నిత్యకర్మము తీర్చుకొని, కొలనిలోఁ బాదప్రక్షాళన, ముఖమార్జన, స్నానములు చేసి, బట్ట లుదికి, యారవేసికొని, యాబట్టలు కట్టుకొని, బిళ్లగోచి పెట్టి, జుట్టు వ్రేల్ముడి వైచికొని, సంధ్యావందనము చేసికొని లేచి, పైబట్ట నడుమునకుఁ గట్టుకొని, యక్కడ నున్న పూలతోటలోని పువ్వులు చెంబునిండఁ గోసికొని, యక్కడకుఁ గొంచెము దూరములోఁగల యొక కొండగుహలోఁ గూర్చుండి యున్న లంబికాశివయోగులవారి ముందా పూలచెంబు నునిచి, నమస్కరించి, నిలిచియుండఁగాఁ (పద్యము సీ॥ బ్రహ్మాండ



కొండగుహ చెట్టుమీద వేమన, అభిరామయ్య, లంబికాశివయోగులవారు.

మందును, భాసిల్లుచుండెడి । కొండవీడాఖ్యచేఁ గొమరుమిగిలి । దేవఘాతంబుల
దేవాలయంబుల । దేవతల్ తపసులు, దేజరిల్లఁ । జిన్మయ లంబికా, శివయోగివరునకు
సచ్ఛిష్యుఁడగు రామ, ఘాత్రవరుఁడు । అరుణోదయస్నాన, మైనపిమ్మటఁ దాను ।
బుష్పముల్ గొని చని, పూజకిచ్చు । సతత మిటుచేయ సిద్ధుఁడు, సంతసించు । నిట్లు
గురుసేవ చిరకాల, మొనసిచేయ । ఫలము లభియించు కాలంబు, ప్రాప్తమైయుఁ ।
దప్పెఁ బూర్వకృతంబేమి, చెప్పనేను ॥ గొంతసేపటికా శివయోగులవారు "ఓరీ!

శిష్యా! రేపుదయమున నీ కెన్నిపను లున్నను దప్పక రావలసినది; రేపు నీ కుపదేశము చేయుటయు, మాకు సమాప్తియు" నని చెప్పి యుండిరి. అక్కడ నెవరికిని గనుపింపకుండఁ జెట్టుమీఁద దాగియున్న వేమన యిది యంతయు వినియుఁ, జూచియు, వెంటనే మరలి యిలు సేరి దుకాణములోఁ గూర్చుండెను. పిమ్మట నభిరామయ్యయుఁ జేరెను. మామూలు ప్రకారము దుముకుడు లేకుండ నభిరామయ్యమీఁద వేమన కోపగించెను.

16 ఆయుపదేశమును, వేమన, తా నొందవలె నను దురుద్దేశ్యముతోఁ దన వదినె యైన పట్టపుదేవి యొద్దకుఁ బోయి నమస్కరించి, "నామనవి యొకటి యున్నది; అది చేయుమ"ని కోరెను. "యేమియది చెప్పుమ"ని యామె యడుగఁగా, "రేపుదయమున 6 గంటలకే అభిరామయ్య దుకాణములోనికి వచ్చి పనిచేయులాగున నన్నగారితో విన్నవించి యాజ్ఞ యిప్పింపుమ"ని కోరెను. "ఎందునకో చెప్పుమ"ని యామెయడుగఁగా, "నాపనియిప్పుడు చెప్పను దరువాతఁ జెప్పుదును"నెను. అందున కామె "యాలాగుననే యాజ్ఞ యిప్పించెద" నని, వాగ్దానము చేసి ప్రభువు భోజనము చేసి గదిలో విశ్రమించి తాంబూలము వేసికొనుచుండఁగా, నప్పుడు రాణి, బంగారపు జూముకా యొకటి కనఁబఱచి, "దీని జతది పోయినది; దీనిమాదిరిది క్రొత్తది చేయుటకు అభిరామయ్యకు పుర్మాయించి, రేపుదయముననే దుకాణములోనికి వచ్చి, తయ్యారు చేసి రెండుజాములలోఁగా జనానాలోనికిఁ బంపులాగున నాజ్ఞ యిప్పింపుఁడ"ని కోరెను (పద్యము. సీ॥ తెల్లవారకముందు, తిన్నగా వారింటి। చెంత దాగితిఁ జింత, చెట్టుమీఁద। సరగున నతఁ డేగి, స్నాన సంధ్యలుతీర్చి। కుసుమాళి చేకొని, గుహనుజొచ్చి। యందున్న యోగికి, వందనంబులు చేసి। ముందున్న రామయ్య, మోముఁ జూచి। మంత్రోపదేశము, మఱునాడు చేయంగ। వేగ రమ్మని శిష్యు, యోగిపలుక। వింటినంత యతని వెన్నువెంట దాగి। పడనెఁ బ్రార్థించి మాయన్న, యదను చేత। నాపి రామయ్య శివయోగి, దాపుఁ జేర। నాఫలంబేను గననయ్యె, నపుడు వేమ॥).

17 ప్రభు వప్పుడే యభిరామయ్యను బిలిపించి, రాణి చెప్పిన చొప్పున ఖచితముగా నాజ్ఞ చేసిరి. అంతట నభిరామయ్య యా జూముకా చేతఁబట్టుకొని ముఖ

ము చిన్నబుచ్చుకొని, దుకాణములో నున్న తన తమ్ముని ముందు పడవైచి, "యిట్టి దొకటి రేపుదయమునకె తయ్యారు చేసి యియ్యవలెనఁట," యని తనమనంబున, "నేనేమి చేయుదును? ఇంతకాలమునుండి శుశ్రూష చేసినందులకు రేపు ఫలమును బొందు తరుణమై యుండఁగా, నిప్పుడు దానికి భంగము కలిగినదే! ఇట్టియెడ నేను గురువు నాజ్ఞప్రకార మక్కడికిఁ బోదునా? ప్రభువు నానతిప్రకార మిక్కడకు వత్తునా? యనికొనుచు విచార పడుచు నింటికిఁ బోయి గదిలోఁ బరుండెను.

18 అభిరామయ్య యింటఁ బ్రతిదినమునను సరస్వతి యమ్మవారి పూజ పగలు రెండుజాముల కభిరామయ్య చేయు నాచార ముండెను. ఎప్పుడైన నభిరామయ్య చేయ బద్ధకించి నపు డాయనభార్య యగు లక్ష్మీదేవమ్మ యాపూజ చేయుచుండెడిది. అనాఁడు పెనిమిటికి వీలులే కుండుటచేత భార్య పూజచేయుచు, 10 సం॥ ల యీడు గల తన కుమార్తెను బిలిచి, "అమ్మాయీ! మీనాన్నగారు గదిలో శయనించి యున్నారు, నీ వటకుఁ బోయి లేపి, 'మీకృషి వ్యర్థము పేరుండున'ని యమ్మ చెప్పిన దని చెప్పి, స్నానమునకు లెమ్మనిపిలువు" మనెను. ఆపిల్లకాయయట్లె యనేకవిధముల లేపి చెప్పఁగా నతఁడు స్నానము చేయఁ జనెను.

19 అభిరామయ్య స్నానముచేసి మడిఁ గట్టుకొని భోజనమునకు ముందు శివ పూజ చేయు చుండఁగా, భార్య యొద్దన మంతయుఁజేసి, నేతిగిన్నె యక్కడనుంచి చేతులు జోడించుకొని, "మీరు చేయుచున్న శుశ్రూషకు మీకు ఫలము దక్కదు గాని, ప్రపంచమున్నంతవఱకు మీపేరు మాత్రము స్థిరముగ నుండును (పద్యము. చ॥ ధర నతికీర్తిమంతుఁడును దైవసముం డతి గోప్యుఁ డోర్పు మీ। ఱ రహిని గొం డవీటి యభిరామయ నా గురువర్యుఁ డాతఁడు। న్నతియుఁ బ్రభుండ వీవు నను మానము లేదిక మీదునామముల్। స్థిరముగ నుండుఁ గాక యిది సిద్ధము సుమ్ము జగాన వేమనా॥) గనుక మీరు కించపడక, యంతకె సంతోషింపుచు, భోజనము చేసి ప్రభు వాజ్ఞ ప్రకారము రేపుదయముననే దుకాణము లోనికిఁ బోయి యాపని నెరవేర్పుఁ డ"ని చెప్పెను. అవి దేవిపలుకులుగ నమ్మి, యాసవిడనాడి, యాయన మరునాఁ డుద యమున 6 గంటలకే హాజరయి, జుముకాను మూఁడు జాములకుఁ దయారు చేసి, జనా నాలోనికిఁ బంపి, యప్పుడు భోజనమునకుఁ బోయెను.



1 సరస్వతి అమ్మవారు 2 అభిరామయ్య భార్య లక్ష్మీదేవమ్మ 3 అభిరామయ్య కుమార్తె 4 అభిరామయ్య.

20. ఈ యవకాశమున వేమన తెల్లవారుజామున లేచి, నిత్యకర్మముఁ దీర్చుకొని, యభిరామయ్యవలెనె తానును స్నానము చేసి, యక్కడ నున్న పువ్వులను జెంబులోనికి గోసికొని తీసికొని పోయి, గుహలో నున్న లంబికాశివయోగులవారి ముందుంచి, నమస్కరించుచు, నిలిచెను. కొంతసేపటికి శివయోగులవా రా క్రొత్త ముఖమును జూచి, "నీ వెవ్వఁడవురా" అని యడుగఁగా, "చిత్తము స్వామి! నే నభి

రామయ్యగారి శిష్యుఁడను; వారికిఁ బ్రభువుగారు పని చెప్పినందున నాపని మీఁదఁ బోవుచుఁ, బూవులను వేళ తప్పకుండఁగఁ దీసికొని పోవలసిన దని, నా కాజ్ఞ యిచ్చిరి. ఆయానతి ప్రకారము పువ్వులు వేళకే తెచ్చినాఁడ'' నని చెప్పెను. తరువాతఁ గొంత సేపటికిఁ ''జూడరా వచ్చుచున్నాఁడేమో'' యని శివయోగులవారు రెండు సారు లడుగఁగా, కపటి వేమన, యటు నిటుఁ జూచి ''రాలేద''ని చెప్పిన మీఁదట ''వాఁడు దరిద్రుఁడు; నీవు రార'' యని దగ్గరకుఁ బిలిచి, చెవిలో నుపదేశించి, నాలుకమీఁద బీజాక్షరములను వ్రాసి పొమ్మనెను.



వేమనకు రాజబంధువులు. వేమన. అభిరామయ్య, లక్ష్మయ్య.

21 వేమన లంబికాశివయోగులవారి యొద్ద సెల వందిన వెంటనే దుకాణపు సాలలోనికిఁ బోయి, యింకను జముకాపని నే చేయుచున్న యభిరామయ్యను గాంచి, ముం దున్న పనిముట్లను దీసి, ప్రక్కలను సర్ది మందు కూర్చున్న వా రదివఱకే లేచి నిలిచి యున్నందున నభిరామయ్యయొక్క పాదములకు సాష్టాంగదండప్రమాణ మాచరించి, (పద్యము. తే॥ పరమగురుఁ డభిరామయ పాదములకుఁ । జేతులను జాచి మ్రొక్కితి శిరముఁ జేర్చి । తప్పు వినియును క్షమియించె నొప్పిదముగఁ । దలఁపఁడే నందఁ దన పాటుఫలము వేమ॥) గట్టిగాఁ బాదములను బట్టుకొని, "మిమ్ము మోసపుచ్చియు మీకు దాసుఁడ నైతిని, గాన నాతప్పును క్షమించితి నను నంతవఱకు, మీ పాదములను విడువ" నని యనెను. అప్పు డభిరామయ్య తెల్లవోయి, "యిది యేమి? లే లెండ"ని భయనయములతో ననఁగా, "క్షమించినాఁడ నని మీ రన్న నే నేను లేచెద" ననెను. "క్షమించితి ననుటకు నే నెంతవాఁడను? నేనో! మీసంస్థానములో మీనగలు చేయుచు, జీవనము చేయు చున్నవాఁడను; మీరో! ప్రభువులు; ఇట్లు సాష్టాంగపడి నాపాదములను బట్టుకొనుట మీకు ధర్మము కాదు; లెండ"ని చెప్పఁగా వినక పోయె. అప్పుడు దుకాణములో నున్నవారిలోని రాజబంధువు లొకరిద్దరు "అభిరామయ్యా! నీ కేమి నష్టము? నీ వట్లన్న నే కాని లేవ నని చెప్పు చున్నారాయెఁ గనుక నామాట యనుము"ని చెప్పిరి. అంతఁ గొంత చింతించి, యభిరామయ్య "అట్లే క్షమించితి" ననెను. అప్పుడు వేమన లేచి నమస్కరించుచు, నాప్రాప్తము మంచిది గనుక క్షమించితిరి. మీఫలము నాకుఁ జెందినది, దానిక్రమము చెప్పెదను. వినుఁడు (పద్యము. క॥ సమయంబు మంచి దయ్యెను । క్షమియించితి రయ్య నాకు సాధ్యం బాయెం । దమఫలమ టంచుఁ జెప్పితిఁ । గ్రమముగ గధ యెల్ల ముప్పఁ గడచెను వేమా॥) అని మొదటినుండి తానుచేసిన (పద్యము. సీ॥ మీకు మాఱుగఁబోవఁ, జేకొని పుష్పముల్ । గుహలోన నున్నట్టి, గురునిఁగాంచి । యయ్య వచ్చితి నని, చయ్యనఁ బూ లిచ్చి ।సాష్టాంగ పడఁగ నా, సద్గురుండు । నామోము జూచుచు, నేమివచ్చితి వన । నభిరామ శిష్యుండ, నంపి రంటి । అంతటఁ దలయూచి, యహహా యనుచు వారు । కానిమ్ము రమ్మని, కరుణతోడఁ । జేసె నుపదేశ మయ్యది, చెందెనాకు। సూక్ష్మకాలంబులో సిద్ధ, సూరి నైతి । గురువు వదినెరేయె కాక నా, గురుఁడ వీవు । సాత్మగురుఁ డయ్యె శివయోగి, యంటివేమ॥) మాయను వివరించుచుఁ, దుద నుపదేశ



రాజబంధువులు. వేమన అభిరామయ్య, లక్ష్మయ్య.

మును బొందిన పని సైతముఁ జెప్పి, "మీ కృపాకటాక్షమున నా కజ్ఞానము వాయఁగాఁ గృతార్థుఁడ నైతి," యనుచు (పద్యము. క॥ శివకవులకు నవకవులకు । శివభక్తికిఁ దత్వమునకుఁ జింతామణికిన్ । శివలోకప్రమధులకును । శివునకు గురువునకు శరణు సేయర వేమా॥) యనుచు నభిరామయ్యయొక్క సెలవును బొంచి, వెలువడి లోకసుఖముల రోసి, మనసు నిశ్చలతత్వంబునం దుంచి, ప్రపంచ మంతయు నేమియు లేనిదిగా నెంచి, సముద్రతరంగమువలె హృదయాంత

రంగమునఁ బుట్టు వాగ్ద్వారమున వెలిఁ బొరలు జ్ఞానసూక్తులను స్వయముద్భవ కవిత్వధార కలుగఁగా పద్యరూపమునఁ జెప్పుచు నే యుండిరి. ఆయన చెప్పిన పద్యములన్నింటికిని జివరను 'వేమ' యనుచుఁ దన్నే పేర్కొనుచు నాత్మబోధగాఁ జెప్పిన యట్లున్నది సరిగదా- మఱి, చతుర్థపాదారంభమునఁ గల 'విశ్వదాభిరామ' యను మాటను ముఖ్యమైనదానిఁగఁ గైకొని, విడువక వీ లయినంత వఱకును వేసిన వైచిత్ర్యిం బరయఁగాఁ, దా నొందినలాభము నంది జగత్ప్రఖ్యాతిని బొందవలసి నట్టియును, దాను నాతని నొక్క గురునిఁగానే భావించి యున్నట్టియు, నభిరామయ్యయొక్క పేరును, గొంచె మెంచు మించుగా వర్ణనామమును, బయ ల్పఱచి తన్నెఱుంగు నంతవఱకు నాతనిగూడ నెల్లరును దెలిసి స్మరించు చుండెదరు గాక యనియే యెంచి నట్లు నమ్మదగియున్నది. ఇట్లుభయనామములజేర్చి చెప్పిన యాటవెలదులును సీసములు మఱియు స్వనామమాత్రాంకితము లగు తేటగీతులుఁ, గందములు, మున్నగు పద్యము లసంఖ్యాకములు (పద్యము. తే॥ చింత వలదయ్య గురువర మంతనమున। నంకితంబుగ నామంబు నమరఁజేసి। నాదుభక్తిని మీయందుఁ బాదుకొల్పి। చెప్ప సాగితిఁ బద్యముల్ క్షితిని వేమ॥ తే॥ నీతివైరాగ్యసద్భక్త్యుపేతులకును। ఘాతకులుగాని సుజ్ఞానకలితులకును। వ్రాల కందని పద్యము ల్వేలసంఖ్య। లుగను జెప్పంగ నయ్యెరా జగతి వేమ॥) అవియిన్నియని లెక్క కందవు. వేమనచెప్పిన పద్యములు వేయర్థముల నిచ్చును. (పద్యము. ఆ॥ వేయువిధము లమర వేమనపద్యంబు। లర్థ మిచ్చు వాని సరసి నంత। చూడఁ జూడఁ గలుగుఁ జోద్యమౌ జ్ఞానంబు। విశ్వదాభిరామ వినర వేమ॥)

22. వేమనయొక్క తల్లి తన కుమారుఁడు పెండ్లి యక్కరలే దనిపిచ్చితనముగా నుండుటనుజూచి కాశికైనం దీసికొనిపోయిన గుణము కుదురు నేమోయని యోచించి ప్రభు వైన పెద్దకుమారునితోఁ జెప్పఁగా, రాజు తల్లిమాటకు వల్లె యని ప్రయాణసన్నాహము చేసి తల్లియు నన్నయు వేమనతో "నీవుఁ గూడఁ బ్రయాణము కమ్ము, కాశియాత్రఁ జేయుటమంచిది, పాపకార్యము లేమైనఁ జేసియున్నయెడల నవిపోయి ముక్తి కలుగు" నను మొదలగు బోధ లెన్ని చేసినను వినక "నేను రాను" అని ఖచితముగాఁ జెప్పి తల్లితో, "అమ్మా! నీవు కాశికిఁ బోవు చున్నావుగదా! ఏమి ఫలముఁ దెచ్చెదవో! అందు నాకు సగ మిమ్మ" నెను. అదివిని తల్లి "ఓరి పిచ్చివాఁడా! ఆఫలము కనఁబడునది కాదు, నీవును రావలసిన" దనెను. అప్పుడు వేమన యొక రాగిడబ్బ

నకు బెజ్జముచేసి త్రాఁడుకట్టి తల్లిమెడలో వైచి "అమ్మా నీవు గంగలో స్నానము చేసెదవు గదా! అప్పుడు నీమెడలో నేను వైచిన యీ రాగిడబ్బు బంగారపుడబ్బు కావలెను; దానినిఁ దెచ్చి నా కీయవలయును సుమీ," యని చెప్పి తల్లిని గొంతదూరము సాగ నంపి, తాను వెనుకకు మరలెను. అంతట నామె కాశియాత్ర చేసికొని తిరిగి యింటికిఁ జేరి నప్పుడు, ప్రభు వైన పెద్దకుమారుడు మంత్రిసహితుఁడై తగుపరివారముతోఁ దల్లి కెదురుగఁ బోయి, యామె పాదములకు సాష్టాంగ పడి, యాయందఱిని వెంటఁ బెట్టుకొని కోటలోఁ బ్రవేశించెను. వేమనమాత్ర మెదురుగఁ బోలేదు కాని, అందఱుఁ గోటలోఁ బ్రవేశించిన తరువాత వేమన తల్లిదగ్గరకుఁ బోయి, సాష్టాంగపడి లేచి, "యమ్మా! నేను నీమెడలో వేసినది నా కిమ్మ"నెను. అప్పు డామె మెడలో నుండి తీసి చేతి కిచ్చెను. అది చూచుకొని "యమ్మా, నీవు కాశికిఁబోయి గంగలో స్నానముచేసిన నీరాగిడబ్బు రాగిదిగానే యున్నది గాని బంగారపుది కాలేద"నెను. దానికిఁ దల్లి "నాయనా! రాగిడబ్బు బంగారపు డబ్బెలాగు నగు? ననెను. అందుమీఁదట వేమన "నీవు కాశికిఁబోయిన ఫల మే మున్నది? ఇదిగో చూడు నేను గాశికిఁ బోవకయె యిక్కడనె యుండి బంగారపు డబ్బును జేయుదు"నని యా డబ్బును గ్రింద నునిచి దానిమీఁద లఘుశంక దీర్చికొన నది వెంటనే బంగారపు డబ్బాయెను. దానిని జేతఁ బట్టుకొని, "యమ్మా! యిదిగో చూడు" మని తల్లిచేతి కిచ్చెను. అప్పు డందఱును జూచి యత్యాశ్చర్యము నొందిరి.

23, వేమన యొకనాఁ డన్నతాపునకుఁ బోయి, "నే నొక డబ్బునిచ్చెదను. దానికొక యెకరముపొలమును ఖరీదున కిమ్మ"ని యడుగఁగాఁ బ్రభువు నవ్వి "యోరీ పిచ్చివాఁడా! డబ్బేటిది! పొల మేఁటిది!" యని హేళనము చేసెను. కాని రాణి, ప్రభువుతో, "మీ రబ్బాయిని హేళనము చేయకుండి. అబ్బాయి కోరినప్రకారము డబ్బు పుచ్చుకొని పొల మిండ"ని మనవి చేసెను. అప్పు డొప్పుకొని పొల మిమ్మని మంత్రి కాజ్ఞాపించి భార్యతో "నీమరది పొలము సేద్యము చేసి పంటఁ బండించు నఁట. అది నీవును వాఁడును దినుండ"ని సరసఁపుమాటగా ననెను.

24. పిమ్మటఁ జావసిద్ధముగనున్న రెండెడ్లను వేమనదెచ్చి, యొక నాఁగటికిఁ గట్టి యా పొలము దున్నసాగెను. అది పరిజనులుచూచి నవ్వసాగిరి. అప్పు డెల్ల వేమన "నవ్విన నాఁపచేనే పండును" ననుచుండెను. దున్నుట కాఁగనే యందులో విత్తులు

చల్లెను. అవి, పాపరకాయ విత్తులును వెఱ్ఱిపుచ్చకాయ గింజలు నయి యుండెను. అవి మొలిచి క్రమక్రమముగ మనుష్యు నెత్తునఁ బెరిగి చిన్న నిమ్మకాయలంత కాయలతోఁ బైరంతయును జూడ ముచ్చటగ నుండెను. వేమనయు నక్కడ నేయుండెను.

25 ఒకనాఁడు నిరుపేద యైన యొకముదుసలిది చేతి కందని యిద్దరు మనుమల నింటిలో నునిచి కూలికిఁ బోవఁగా, వేళతప్పినందున నెక్కడను గూలిపనిదొరకక, యాపొలము మార్గమునఁ గించతోఁ బోవుచుండఁగా, వేమన చూచి, "యో ముసలమ్మా! నీవెవతెవ"ని యడుగఁగా ముదుసలిది, "నాయనా నేను గూలిదాన"నెను. నీవు విచారముగఁ బోవుచున్నావె! యెందునకనఁగా నావృద్ధాంగన "యీదినమున నాకెక్కడను గూలిపని దొరకలేదు. ఈవేళ నామనుమలు నేనును బస్తుపడుకో వలసి వచ్చెగదా! యని యనుకొనుచున్నాన" నెను. అదివిని, వేమన "ఈపొలములోఁ జెట్లకాయలు కోయుము, నీకుఁ గూలి యిచ్చెదన" నెను. అప్పుడాముదిది సంతోషించి, నడుము గుడ్డతో బిగించి కట్టుకొని, కాయలు కోయ నారంభించెను. సాయంకాల మైనపిమ్మట కూలిక్రింద నొకకాయను వేమన తనచేతితోఁ దీసి యిచ్చెను. "ఇది యేమి! కూలిక్రింద నాకీకాయ నిచ్చిరే! యేమి చేసెదన" నుకొనుచు నింటికిఁబోఁగా నే మనుమలు దగ్గరకువచ్చి, "యమ్మమ్మా! యీవేళఁ బనిదొరికినదా?" యని యడిగిరి. దాని కాముత్తవ, "నాయనా! వేమనగారి పొలములో దొరకినది, కూలిక్రింద నీకాయ నిచ్చినాఁడ"ని చెప్పిచూపఁగాఁ జూచి "పాడుముండాకొడుకీకాయనిచ్చినాఁడా" యని యందొకఁ డాకాయను గ్రింద కొట్టెను. అప్పుడాకాయ పగుల, నందుండి వడ్లగింజలవంటి బంగారపు గింజలు ధగధగ మెఱయుచుఁ గ్రిందఁబడెను. తోడనె, వారలిది యేమని వింతపడుచుండ, నాయవ్వ ప్రక్కనున్న కోమటిదుకాణములోనికిఁ దీసికొనిపోయి కనఁబఱచి, "ఇవి యేమిటివ" ని యడిగె. "ఇవొకమాదిరి వడ్ల"ని యాకోమటి చెప్పఁగా, "నివి నేనేమి చేసికొందును? నాయనా! యనఁగా, "ఇవి నేను దీసికొని, నీకు బియ్యము, పప్పు, నుప్పు, మిరపకాయలు మొదలగున విచ్చెద" నని చెప్పినమీఁద, నాముదుసలి దమ్మని కొని పోయి, చక్కఁగఁ బచనము చేసికొని, తానును, మనుమలును, సంతుష్టితో భుజించి హాయిగ నిద్రించిరి.

26 మఱునాఁడు ముదుసలిదియు, మనుమలును మఱికొందఱు కూలీలును బోఁగా, వేమన ఆయెకరము పొలములోనున్న మొక్కల కాయలన్నియుఁ గోయించి

రెండు కుప్పలువేయించి, యొందఱకుఁ గూలికిఁ్రిందఁ దనచేతితోఁ గాయలిచ్చెను. కొందఱు దొంగతనముగఁ గొన్నికాయ లెత్తుకొనిపోయి పగులఁ గొట్టుకొనిరి. అట్టివానిలో నేవియో గింజ లుండెను, గాని బంగారపు పడ్లగింజలు లేకపోయెను. తరువాత వేమన చేతితో నిచ్చిన కాయలు పగులఁ గొట్టుకొనఁగా, వానిలో నెల్ల బంగారపు పడ్లగింజలు ధగ ధగ మెఱయుచు బయలుదేరినవి, వారలును వాని నమ్ముకొనిరి.

27 ఒకనాఁడు వేమన తన యన్నయయిన ప్రభుపుతావునకుఁ బోయి తాఁ బండించిన పంటను జూచుటకై పొలముదగ్గరకు రమ్మని కోరెను. అందుపై నన్న "పోరా పిచ్చివాఁడా! నీపొలముసరియె! నీపంటయు సరియె!" యనెను. అంత వేమన తన వదినెతావునకుం బోయి, యాపెతో నన్న యన్నది చెప్పి పోఁగా నామె పెనిమిటితో "మీతమ్ముఁ డంతగాఁ బ్రాధేయపడిన గేలిచేసి పొమ్మన్నారఁట; అయ్యో! పాపము! అలాగున నేల సెలవిచ్చితిరి? అబ్బాయి (వేమన) పలుకులుం బనులుం బిచ్చివి కావు; మీరుచని చూడుండి" యని విన్నవింపఁగా, నప్పుడు మంత్రిని వెంటఁ బెట్టుకొని, భటుల సహితముగఁ బొలమునకు రాఁగా, వేమన యా రెండుకుప్పలను గనఁబఱచి తనహస్తముతోఁ దాకె. వెంటనే యవియెల్లను బంగరుకాయ లాయెను. అవి పట్టించుకొని పొమ్మని ప్రభువున కొప్పగించుచు, "నిందొక కుప్ప సొమ్ముతో దానధర్మములు చేయుండ. రెండవకుప్ప ధనమును బొక్కసములో వేయింపుండ"ని చెప్పఁగాఁ బ్రభువు మహానందభరితుఁడై, వేమన మహాత్మును వెల్లడించుచుఁ గాలము గడపుచుండెను.

28 వేమన యొకనాఁడు తన వదినె యయిన నరసాంబారాణి జనానాచావడిలో నుండుసమయంబున నామె కుడికుచముమీఁద నెత్తురు పచ్చులాగున గోటితోఁ జివ్వెను, అప్పు డక్కడ నుండు దాసదాసీజనములు వేమనను దిట్టి కొట్టబోయిరి. అప్పుడు రాణి వారిం గోపగించి అబ్బాయి (వేమన) చేసినకార్యము తన మేలునకే యయి యుండునని చెప్పి భర్తకును గోపము రాకుండునట్లు తృప్తిపఱచెను. తరువాత నామరునాఁ డామె దాసీలతోఁగూడి పూలతోటలో షికారుచేయుచు నొకపూవును గోయు సమయంబున నొక నాగుబా మామెచేతి మీఁదఁ గాటువేసెను

అవెంటనే యామె స్మారకములేక పడిపోయెను, దానికేడ్చుచుఁ బ్రభువునకు విన్నవింపగాఁ బ్రభువువచ్చి చూచు చుండునెడ నావిషము యున్న స్తనముమీద వేమన గీరిపోయినగాయముగుండ బైటకువచ్చెను. అంతట నామెకు స్మారకము తెలిసి యబ్బాయి వలన దనకీ మేలు కలిగెనని పెనిమిటికిఁ జెప్పెను. అప్పు డందఱును బరమానందభరితులై వేమన యొక్క యనాగతదృష్టిని బొగడిరి.

29 వేమన పిచ్చి వేషముగ నుండుటను గుఱించి తల్లి విచారపడుచు, నొక నాఁడు కొడుకునుజూచి, "నాయనా! నీవీలాగున నుండుట బాగులేదు; మీయన్నను జూడు! ప్రతిదిన ముదయమున స్నానముచేసి జపముచేసికొనుంగదా! నీవు నట్లే చేయుచుండు మది మంచిద," ని చెప్పఁగా, వేమన విని, "యమ్మా! మాయన్నస్నానమేఁటిది? జపమేఁటిది? స్నానము మేనిమురికి పోవుటకును, జపము మావదినెకు నవరత్నస్థాపితమైన తొడుగు దిగవేయుటకునె; కాదేని, మఱికొంతరాజ్యమును సంపాదించుటకు నయి యుండును గాని, యీశ్వరునియందు భక్తి కలిగికాదు. అమ్మా! నాస్నానముఁ జూతుగాని రమ్మని తల్లిని జెరువునొద్దకుఁ దీసికొనిపోయి, తానాచెరువులో దిగి, తనపొట్టను గోసికొని, యందుండు కల్మషమును దీసివైచి, నీళ్లతోఁ గడుగఁగనె, చూడవింతగాఁ గడుపు కలిసికొనిరెను. అదిచూపి, "యమ్మా! చూచితివిగదా! యిదియె నాస్నానముసుమీ! తల్లీ! నన్నుగుఱించి నీవు విచారపడవద్దు, నేనింటికివచ్చినప్పు డింత ప్రసాదముమాత్రి మిచ్చుచుండు మ" ని యంతర్ధానము నొందెను. అట్లగుట కడలుచుఁ దల్లి వేమన మహిమ మెన్నుచుఁ దన పరిశీలనయత్నమునకుఁ బశ్చాత్తాప పడుచు, నేడ వెదకింతమా యనికొంచు, నింటికిఁ బోవఁగా, వేమన యక్కడనే యున్నందునఁ బరమానందభరితురా లయ్యెను.

30 ఒకప్పుడు వేమనయొక్క తోఁబుట్టువును సారెపెట్టి యత్తవారింటి కంపునెడ, నామెతల్లికిని బెద్దన్నయగు ప్రభువునకును వదినెయగు రాజ్ఞికిని నమస్కరించిమఱియుండగువారికినివందనమిడినతోడనేచిన్నన్నయగువేమనకునువందనముచేయవలసిన యవశిష్టముండఁగాఁ, బిచ్చివాఁడగు నాతనికేఁటికని కొందఱును, యిప్పుడాతని కీపె దండమే యాలోచనీయమా? యీమె కాతని దీవెనయే కొఱఁతయా, యని మఱికొందఱును నానావిధముల ననఁగాఁ, దల్లి యట్లుకాదని కూతు వెంటఁ బెట్టుకొని, కొనిపోయి వేమనకు మ్రొక్కించె. అందుల కాయనయు సంతసించి చెంతఁ



వేమనానందస్వాములవారు.

గలట్టి కుళ్లినపండ్లు కొన్ని యాచెల్లెలికి నొడిలో వేయఁగా నవెల్లను జూడ వింతగ వెంటనే తళతళమెఱయు రత్నములయ్యెను, అందుల కా తల్లియుం జెల్లెలు తక్కిన వెల్లరు నపరిమితాశ్చర్యమగ్ను లైరి.

31 వేమన యప్పటి నుండి విరాగియై యుండి యనేక దేశములఁ దిరుగుచు సత్యజ్ఞానానందమయపరబ్రహ్మస్వరూపుఁడై "తత్త్వమసి" యను శ్రుత్యర్థమును లక్ష్యార్థముగా ననుసరించి "వేమనానందస్వాములవార" ను పేర విలసిల్లి యెల్లెడల హరుని వలెఁ గాన్పించుచు (పద్యము. ఆ॥ నందుఁడైన యాతఁ డిందునందన కుండు। నన్ని తావులందు హరుని వలెనె। తెలియువారికెల్ల దేవుఁడై కాన్పించు। విశ్వదాభిరామ వినరవేమ॥) ననేక నీతిపద్యములను జెప్పుచు, 'కటారుపల్లె' లో నుండఁగా, నక్కడఁ గొందఱు శిష్యులు చేరిరి. పిమ్మట నక్కడనే సిద్ధిఁబొందెను. ఆశిష్యు లక్కడ సమాధికట్టించి పూజానమస్కారములు చేయుచుండిరి, సిద్ధిఁబొందిన దినము గుఱుతుగ సాంవత్సరికోత్సవ మిప్పటికిని జరుగుచుండును. అట్లుండ, నొక నాఁ డాసమాధిమీఁదఁ బిడుగు పడెను, అప్పుడు సమాధిలోనున్న వేమన యాపిడుగును జేతఁ బట్టుకొని బయటికి వచ్చి, 12 సం॥ ల ప్రాయముగల బాలకుమారుని వలె నిలచెను. అప్పుడు వారిలో నొక శిష్యుఁడు; పద్యము. ఆ॥ "నీమహత్త్వ చూడ నమాన్యమా? కాదు। ఏమహాత్మునకును నెన్నఁ దరమొ? । చెన్నకేశుకంటె మిన్నవై కాన్పింతు। బాలచంద్రవేమ! భవ్యనామ!" । యని మొదలిడి నూఱు పద్యములతో స్తోత్రము చేయుచుండఁగానె, వేమన మఱలసమాధిలోనికిఁ బోవుటయు, నది యథాపూర్వకముగాఁ గాన్పించి మఱి యుపద్రవమును బొందకుండుటయును దటస్థించెను. శ్రద్ధాభక్తులు గలిగి యక్కడ వారివారికి దగువిధముగాఁ సేవించుచుండువారి కప్పటప్పటికి మహిమావిశేషంబులు బహువిధంబులఁ గాన్పించు చుండినట్లు బహుముఖములఁ గల వదంతి యందఱు వినుచునే యుందురు.

క॥ ఈకథఁ జదివిన విన్నవి । వేకంబెక్కువగఁ గలిగి వేత్తలు తామై ।
లోకులు రంజిల్లెద రిఁక । శ్రీకంఠుని కరుణఁ గూర్మిఁ జెందెద రెపుడున్ ॥

సమస్తసన్మంగళానిభవంతు

సంపూర్ణము.



ఓం. శ్రీగురు భ్యోనమః.

—:o:—

# వేమన సూక్తిరత్నాకరము.

— ——:o:——

క. శ్రీమదు మాపతియగునా । స్వామికి దాసుండ నంగజగములు పొగడన్
వేమనయనియెడు ధీరుఁడు । నేమంబునఁ జెప్పె దీని నిక్కము వేమా.

క. శివకవులకు నవకవులకు । శివభక్తికిఁ దత్వమునకుఁ జింతామణికిన్
శివలోక ప్రమథులకును । శివునకు గురువునకు శరణు సేయర వేమా.

తే. శ్రీకరంబుగ వేమన చెప్పినట్టి । పద్యముల నెవ్వఁడేనియుఁ బఠన సేయు
నట్టి పురుషుఁడు మనమున నిట్టిదనుచుఁ । జెప్పరానట్టి వస్తువుఁ జేరు వేమ.

* * *

## అ.

ఆ. అంకిలెఱిఁగి మాడలాడ నేర్చినపుడె । పిన్న పెద్దతనము లెన్న నేల
పిన్నచేతి దివ్వె పెద్దగా వెలుఁగదా । విశ్వదాభిరామ వినర వేమ. 1

ఆ. అఖిల జీవములను నజుఁడవై పుట్టించి । విష్ణుఁడవయి దాని వెలయఁజేసి
శివుఁడవై సకలము శిక్షించు చుందువు । విశ్వ. 2

ఆ. అఖిలదేవతలును హరిపూజసేయంగ । హరుఁడు నృత్యమాడె నాదియందు
ఆది బ్రహ్మ తా నెయటు మద్దెలను గొట్టె । విశ్వ. 3

క. అఖిలాకారుఁడ నంతుఁడు । సకలాత్మలయందు సర్వసాక్షియు తానై
నిఖిలముల నిర్వికారుఁడు । నికరము బ్రహ్మమ్మనంగ నిజమురవేమా. 4

ఆ. అంగమందు లింగమతిశయంబుగఁ గట్టి । లింగమందు భక్తి లేకయున్న
దొంగగొడ్డుమెడను దుడ్డుఁ గట్టినయట్లు । విశ్వ. 5

ఆ. అంగమందులింగ మతిశయంబుగఁ గట్టి లింగమందుముక్తి లేఁడు నిలుప
ముక్తి లేక తుదను మూర్ఖుఁడై పోవురా । విశ్వ. 6

ఆ. అంగమందు లింగ మమరంగ మర్దించి । జంగమందుఁబెట్టి యంగుపఱచి
రంగుగానువసుధఁ గ్రుంగఁగఁ జూడరా । విశ్వ. 7

ఆ. అంగమెల్లవదలి యటుదంతములునూడి । తనువుముదిమిచేతఁ సఱచువడక
ముప్పుత్రిప్పలఁబడి మోహంబు విడువఁడు । విశ్వ. 8

ఆ. అంగమేడఁబుట్టె లింగమెక్కడఁబుట్టె । ఎంగిలేడఁబుట్టె యేకమాయె;
ఎంగి లెంగిలనుచు నెగ్గులు పడనేల । విశ్వ. 9

ఆ. అంగలింగములను హరునితో మర్దించి । జంగమింక గ్రంధి భంగపఱచి
రంగుగాను వసుధ వంగంబుఁ గూర్పరా । విశ్వ. 10

ఆ. అగ్నిమందుఁజేరి యుగ్రేశుఁడై యుండు । నిగ్రహించి యెరుకనియతిమీఱి
మోహగుణములన్ని ముక్కోని దాఁటరా । విశ్వ. 11

ఆ. అగ్నికుండమందు నమరంగ ఘటియించి । అవనినీరు బియ్యమందునుంచి
అదె పచనముగాఁగ హరున కర్పింతురా । విశ్వ. 12

ఆ. అగ్నిచక్రమనఁగ నాకర్ణలింగంబు । అగ్ని గుండమందు నంటఁగూర్చి
భవుని ధ్యాన మిఁకను బాటింప ముక్తిరా । విశ్వ. 13

ఆ. అగ్నిచేతఁబట్టి యాపరమేశుని । నిందఁజేసి నరులు నీఱుగారె
దక్షుక్రతువులోని తల్లడ మెఱుఁగరా । విశ్వ. 14

ఆ. అగ్ని దైవమైన నగ్నియు పాస్తిచే । చేరరానిముక్తిఁ జేరుటెట్లు
వీరభద్రుచేత వెలసిన దగ్నిరా । విశ్వ. 15

అ. అగ్నిశిఖలయందు నమరంగ మమకార । మభవుమీఁద ధ్యాన మమర నునిచి
యాహుతి యగు వెనుక హరున కర్పితమౌను । విశ్వ. 16

ఆ. అంగుమీఁటఁగాను నబల జన్మంబుల । వలచి చంపు నెంతవారలైన
అక్కరణిని దనువు లతిశయమైవచ్చు । విశ్వ. 17

క. అజ్ఞాన మనెడి యడవిని । సుజ్ఞానపు ఖడ్గమునను జూచినఱకరా
అజ్ఞానమాత్మఁ దెలుపుట । సుజ్ఞానము దివ్యపదముఁ జూడర వేమా. 18

క. అజ్ఞానమె శూద్రత్వము । సుజ్ఞానము బ్రహ్మ మౌట శ్రుతులను వినరా
యజ్ఞాన ముడిగి వాల్మికి । సుజ్ఞానపు బ్రహ్మమొందెఁ జూడర వేమా 19

ఆ. అజ్ఞులైన జీవులరయ ననేకులు । ప్రాజ్ఞుఁడనఁగ నెంత పండితుఁడును
ప్రకృతిమాయచేఁ బరముఁ దెలియంగ లేఁడు । విశ్వ. 20

ఆ. అచల తత్వమనఁగ ననుభవగమ్యంబు । చూపి చెప్పరాదు సూక్ష్మమదియె
మదికిఁ దోఁచుఁగాని మర్మమెన్నఁగ రాదు । విశ్వ. 21

క. అచల తపోన్విత యుక్తిని । ప్రచురించెడి యాత్మకాంతిఁ బ్రతిబింబములో
సుచరిత్రింబగు నిష్కళ । రచియింపుము బట్టబయలు రాజిలువేమా. 22

ఆ. అచలయోగ తపమునందఁగ గమకించి । ప్రచురమైన కాంతిఁ బడయుచుండ
రుచిరముగను దాటిరూపింపఁ బరమాత్మ । విశ్వ. 23

ఆ. అచలసూచనెంతో యధికారికే కాని । అందఱికిని దోఁపదమ్మలార
అందియున్నఁగాని యనువుఁ దెలియరాదు । విశ్వ. 24

క. అంచము నాక్షరబిందువు । పంచాక్షరి నాదమంత్రము పరమమునీంద్రుల్
ప్రాంచితముగ నదిదెలిసిన । మంచాసన మెక్కువాఁడు మహిలో వేమా. 25

ఆ. అంచ చరసమూహ మంగము లింగము । ల్సరణిఁ దెలియనట్టి శైవమేల
అష్టతనువుల మరుహరుఁడౌట నెఱుఁగరా । విశ్వ. 26

ఆ. అచట నిచటఁ జూడ నమరదు గురుభక్తి । ప్రచురముగను నాత్మ బయలఁజేరి
రుచిరముగను జూఁడ నచల మయి తోఁచురా । విశ్వ. 27

ఆ. అచటనున్నయట్టి యతివలంపఱుఁగూడి । శిశువుచెవులు ముక్కు జిహ్వ కనులు
మ్రొక్కఁబోక దేహి మొనయఁగఁ జూఁడుఁడీ । విశ్వ. 28

ఆ. అచ్చుపడఁగ మనసు మచ్చిక చేఁబట్టి । ముచ్చటించి శివుని మూర్తిఁ జూపి
కుచ్చితంబు మాన్పి చొచ్చుటే యోగంబు । విశ్వ. 29

క. అచ్చుపడముద్ర లెన్నుచు । మచ్చికమీఱంగ మనసుమరగిన మీఁదన్
విచ్చలవిడి రమియింపుచు । మెచ్చినదే ముక్తి కిరవు మేదినివేమా. 30

ఆ. అచ్చువేసికొన్న నడియేనినన్నను । తమ్మఁదిన్నపంగ దాసుఁడనన
భాగ్యవశముగాని బ్రతుకులు లేవయా । విశ్వ. 31

ఆ. అచ్చువేసికొనుచు నడియేని ననుచును । తమ్మఁ దిన్న వెనుక దాసుఁడనన
పరమ పదమురాదు ప్రకటనార్థమె కాని । విశ్వ. 32

క. అజగరమును జంటేఁగల । నిజగురువులు గాఁగనెంచు నేర్పుకు సరిగా
విజనాంతర హృదయంబున । భజియింపుము ముక్తి కిరవు భద్రసువేమా. 33

తే. అజుఁడు హరియును దాళమృదంగములకు । పురహరుఁడు నాట్యమునకును బూను
కొనిరె ఇట్టి సభకునుబ్రతిసిధి యెవ్వరనఁగ । గుఱుతుగా విశ్వకర్మయాగురుఁడె
వేమ. 34

ఆ. అంజనంబు కనుల కంటించి చూచిన । సొమ్ముదొరకు భువిని సూత్రముగను
నమ్మి గురుని కరుణనభమంటఁ జూఁడరా । విశ్వ. 3

ఆ. అంజనంబుఁ బెట్టి యాత్మలో ద్రవ్యంబు । గనఁగ లేని ఘనత కడఁగియొఱఁగి
ఆశఁదప్పినప్పు డతఁడెపో ఘనయోగి । విశ్వ. 36

క. అజుఁడీలోకము లెల్లను । సృజియించెను గజభుజంగ స్థిరచరజీవుల్
నిజరూప భావ మొందక । గజిబిజియై పుట్టుఁజచ్చుఁ గదరా వేమా. 37

ఆ. అట్టి చదువు చదివి యానందమందక । చట్టమైన మనసు చపలమంద
మొట్టమొదటి చదువు మొఱఁగంగ నేలరా । విశ్వ 38

ఆ. అట్టివార్త మహిమ నరయక భువిలోన । మిట్టిపడుదు రిలను మిడుతరీతి
గట్టి జేసినిలుపు ఘనుఁడెపో శివయోగి । విశ్వ. 39

ఆ. అంటియంటకుండు నమల స్వరూపమై । మింటిమంటి నడుమ మెలఁగుదాని
నొంటి స్తంభమందు జంటించి చూడరా । విశ్వ. 40

ఆ. అంటు ముట్టు నెంచి యదలించి పడవైచి । దూరమందుఁజేరి దూరనేల
పుట్టి చచ్చినతఱిఁబూర్ణంబుఁ దెలియరు । విశ్వ. 41

ఆ. అంటువిడని గుణమె యదిదేహ సుఖమౌను । అంటువిడిన గుణమె యాత్మసుఖము
కమ్మనంటు గుణము కలుగునా కలుగురా । విశ్వ. 42

ఆ. అడవిఁ దిరుగఁ జిక్క దాకసమునలేదు । అవనిఁదీర్ఘ యాత్రలందులేదు
ఒడలు శుద్ధిఁజేసి యొడయనిఁ జూడరా । విశ్వ. 43

ఆ. అడవి యడవి దిరిగి యాసను విడలేక । గాసిపడెడువాఁడు ఘనుఁడు గాఁడు
రోసి రోసిమదిని రూఢిగా నిలిపిన । వాఁడె పరముఁగన్న వాఁడు వేమ. 44

వ. అడవులఁ గొండలన్నదులఁ దిరుగుచు మనుజుఁడు కష్టజీవుఁడై గడ్డము గోళ్లు
తలకొండ సిగలును భూతిరేఖలుందాల్చి తపంబు సేయఁగను వట్టిదె యొడలు
నమట్టి పుట్టలు గలుగఁజేయుట వ్యర్థము వెఱ్ఱివిధంబునఁ బోవుటయు వట్టిది లేదు
లేదు ఇది కొండెముఁ జెప్పుట గాదు ఈశ్వరసాక్షిగఁ బల్కుచున్న దీని నిక్క-
ముఁజేసికొన్నవారికే దక్కును ముక్తిసులభము గట్టిగ నమ్ము మటంచు నాత్మలోఁ
జెప్పినమాట మనుజులకుఁ జిక్కునె చిక్కదు వెఱ్ఱి వేమనా. 45

ఆ. అండఁ దప్పిన నరుఁడతి ధార్మికుని యిల్లు । చేరవలయు బ్రదుకఁ జేయునతఁడు
ఆవిభీషణునకు నతిగారవంబును । భూతలమున రాము రీతివేమ. 46

ఆ. అండమండముఁగన నన్నియు నటుపిండ । మండమెట్లో బమ్మ యండమల్లై
కర్మబంధమునను గానరే యీనరుల్ । విశ్వ. 47

ఆ. అండమందునుండు నఖిలమై జనులార । ఎంపులేకయుండు నెఱుఁగుఁడతఁడె
యతని పూజఫలమునందెనా శివయోగి । విశ్వ. 48

ఆ. అండములను బుట్టు నలరుప్రాణులుకొన్ని । బుద్బుదములఁ బుట్టుఁ బురుగులెల్ల
స్వేదమునను బుట్టు జీవులుకొన్నిరా । విశ్వ. 49

క. అండములో నాకాశం । బుండంగాఁ జూడఁజూడ నొనరఁగఁదీఁపై
యుండు నవన్నియుఁ దెలిసిన । మెండుగ నటు చూచు చెన్నమేలగు వేమా 50

ఆ. అడుగకిచ్చునప్పు డతఁడు బ్రహ్మజ్ఞాని । అడుగ నర్థమిచ్చునతఁడు త్యాగి
అడుగనియ్యలేని యాతఁడే పెనులోభి । విశ్వ. 51

ఆ. అడుగడుగునఁ జిత్ర మఖిలవస్తువులను । భోగభాగ్యములను బొలుపుమిగుల
తానుదిరుగునపుడు తనతోడు నీడయై । దేవుఁడేలఁ దిరుగుఁ దివిరి వేమ 52

క. అడుగఁదగు వారినడిగిన । నిడినయెడం గొసరఁగొసర నీ లేననఁగా
గడుసువడి యాసచేఁ దా । నడిగిన దుర్మార్గవృత్తులగురా వేమా. 53

క. అడుగఁదగు వారినడుగుట । యిడినయెడం గొసరకుంట యీలేననఁగా
గడుసువడి వేడకుండుట । యడిగెడు వారలకు నీతియగురా వేమా. 54

ఆ. అణఁగియుండు సర్వ మంతరంగంబున । అందిచూడఁ జూడ బొందరాక
సుందరాంగియొకతె సుడివడఁజేయురా । విశ్వ. 55

ఆ. అణువులోననుండు నఖిలజగంబులు । నణువుదనదులోన నణఁగియుండు
మనసునిల్పనరుఁడు మరిముక్తిఁ జేరురా । విశ్వ. 56

ఆ. అత్తమామరూప మాలయిజన్మించె । ఆలిమగనిరూప మాయెసుతుఁడు
తన్నుఁబోలిపుట్టుఁ దనయుఁడన్నట్టుల । విశ్వ. 57

ఆ. అంతకోటఁతదీటి యతిశయకాముఁడై । నిన్ను నమ్ముఁజాల నిష్ఠతోడ
నిన్నుఁగొల్వ ముక్తి నిశ్చయముగఁగల్గు । విశ్వ. 58

క. అంతయు బ్రహ్మమయంబని । మంతనములుమాని మనసు మర్మముఁగనినన్
వింతలుబయటను సున్నగు । చింతలువిడినట్టివాఁడె సిద్ధుఁడు వేమా. 59

ఆ. అంతరంగమందు ననువుగాశోధించి । తలఁపఁదలఁప ముక్తి తగులుఁగాక
బాహ్యరంగమందు భాషింపఁ దెలియునా । విశ్వ. 60

ఆ. అంతరంగమందు నభవునుద్దేశించి । తలఁపఁదలఁప ముక్తి తనకుఁగలుగు
బాహ్యరంగమందు భాషింపఫలమేమి । విశ్వ. 61

ఆ. అంతరంగమందు నభవునుద్దేశించి । నిల్పిచూడ నాడ నిల్చెఁగాక
బాహ్యమందు శివుని భావింపనిలుచునా । విశ్వ. 62

ఆ. అంతరంగమందు నపరాధములుసేసి । మంచివానివలెనె మనుజుఁడుండు
ఇతరు లెఱుఁగకున్న నీశ్వరుం డెఱుఁగఁడా । విశ్వ. 63

ఆ. అంతరంగమందు నద్వైతమేయుండు । బాహ్యమందు ద్వైతభావముండు
అట్లుకాక తత్వమలవడనేరదు । విశ్వ. 64

ఆ. అంతరంగమెఱుఁగ హరుఁడౌను గురుఁడౌను । అంతరంగమెఱుఁగనలవికాదు
అంతరంగమెఱుఁగ నతఁడెపో శివుఁడయా । విశ్వ. 65

ఆ. అంతరంగహృదయ మందఁగాసాధించి । చింతలూడఁబెటికి చిక్కపడక
వింతఁజూచి మెలఁగ విజ్ఞానమందురా । విశ్వ. 66

ఆ. అంతరాత్మఁ గనకయల్పబుద్ధులతోడ । మెలఁగెడు ద్విజులెల్ల మేదినందు
యముని నరకములకు నరుగంగ సాక్ష్యమ్ము । విశ్వ. 67

తే. అంతరాత్మనుగుర్తించి యాశలుడిగి । చింతలనుద్రొక్కి మదియందు సిద్ధుఁడగుచు
వింతలనుజూచి భ్రమయక వెఱ్ఱివలెనె । సందుగొందులఁ బూర్ణతనందువేమ. 68

తే. అంతరాత్మను భవమంది యాశలుడిగి । సంతతార్చనమది నిష్ఠ సలుపఁగోరి
వంతుకెక్కినవాఁడె పోవర్యుఁడరయ । వానికెవ్వఁడు సరిరాఁడు గానవేమ 69

ఆ. అంతరిక్షమందు నమరినలింగంబు । చింతఁబూనవలెను జెనకియాత్మ
వింతలోనివింత వెన్నంటిచూడరా । విశ్వ. 70

ఆ. అతిథిదేవ విప్రు లందఱికివలయు । హవ్యకవ్యమెల్ల నతిశయముగ
వలయునందుఁబ్రమాంసమిల జనులందఱు । విశ్వ. 71

ఆ. అతిథిరాకఁజూచి యదలించిపడవైవ । కఠినచిత్తులగుచుఁ గానలేరు
కర్మమునకుముందు ధర్మంబుసేయరో । విశ్వ. 72

క. అతినిద్రావంతునకు । స్నతిపానికినిరశనునకు నతిక్రోధునకున్
ధృతిహీనున కపకృతునకు । జతపడదీ బ్రహ్మవిద్య చాటరవేమా. 73

క. అతిమోహాన్వితబుద్ధిని । సతతము క్షీణింపఁజేయు సత్వముఁగనమిన్
మతినిలుపఁజాలరెవ్వరు । యుతముజితప్రజ్ఞగూడి యుక్తిగ వేమా. 74

క. అతిసూక్ష్మ దృష్టిలోనను । మతికింపుగ శివునిఁగూర్చి మఱియొకటైనం
ప్రతిలేనిమోక్ష మిదెయగు । సతతము నిర్వాణపదమె సౌఖ్యము వేమా. 75

తే. అతులవైరాగ్యబోధో పరతుల నెఱిఁగి । సతులవలపునఁ జిక్కని సత్యమెఱిఁగి
మతిని జెదరక పట్టుటే మౌనవృత్తి । ఇద్దికుదిరినవాఁడెరా పెద్దవేమ 76

ఆ. అదనబుత్తి చేత మొదటిసొమ్ముకుహాని । కుదువసొమ్ముకన్నఁ గొంతహాని
మొదటిపక్షమునను మూలకర్తకుహాని । విశ్వ. 77

ఆ. అద నెఱిఁగిన మగువయును వెర్గఁజనువెర్గు । ముదముతోడ మగనిమోహ మెఱుఁగు
విభుని శ్రేష్ఠగుణము వేశ్యతా నెర్గునా । విశ్వ. 78

ఆ. అదరిపడకమనసు హానందమునుగోరి । మదినిమెలఁగువాఁడు మాన్యుఁడరయ
సదమలత్వమునను శాశ్వతేశ్వరుఁడగు । విశ్వ. 79

ఆ. అదరిబెదరుటేల నందంగరానిది । సూక్ష్మమరయ నొక్కి చూడ్కినిలిపి
పోకలణచియెఱుక పొందెన్నకుండురా । విశ్వ. 80

ఆ. అందరానిపం డదడవి వెన్నెలబైట । నుండుఁజూడ దొడ్డపండుగాను
పండుపడినఁజెట్టు పట్టంగలేరయా । విశ్వ. 81

ఆ. అందలమును మోసి యందటిపైనుండి । పొందివేడ్కమీఱు పూర్ణుఁడతఁడు
అతని పూజఫలములందఁగఁ జూడరా । విశ్వ. 82

ఆ. అనిమి మనసునిలిపి యానందకేళిలో । బ్రహ్మమయుఁడు ముక్తి బడయఁగోరు
జిహ్వారుచులచేత జీవుండుచెడునయా । విశ్వ. 83

క. అదియిదియని మదిదోఁచెడు । సదనము గుర్తించిలోనె సాధించినచోఁ
గుదురును బ్రహ్మానందము । గదిసిన మదిఁజేరనొక్కి కనవలె వేమా. 84

ఆ. అదియెయొకటిదెలిసి యాదినినిల్పిన । యాదిఁబాయకున్న నభవుఁడవును
యాదిఁబాయువాఁడో యంధునిరీతిరా । విశ్వ. 85

తే. అందియందనట్టి యచలస్వరూపంబు । పొందుపడఁగఁబట్టి నిపొదలువాఁడు
చెందిమిన్నకుండుఁ జిన్మయాకారుఁడై । విశ్వ. 86

ఆ. అందునిందునుండు నఖిలుండుసూడఁగా । నెందుఁదానెనిండి యెఱుఁగుచుండు
నతని పూజఫలమునందుటే ముక్తిరా । విశ్వ. 87

ఆ. అందునిందుననక యన్నింటియందును । విష్ణువమరియుండు వెలయుభువిని
వెనుకఁజక్రిదిరుగు విష్ణుచక్రంబుతో । విశ్వ. 88

ఆ. అందునిందు వెదకి యనుభవమూదక । కొందరయ్యలెపుడు కొంగవలెను
మూర్ఖతపముఁబూని మురియుటఁగానరో । విశ్వ. 89

ఆ. అందెయింద్రజాలమయ్యె లోకంబులై । మించెనొకటికొకటి మింటియందు
తన్నుఁదానె చూడఁదలఁపులు మఱచెను । విశ్వ. 90

ఆ. అధముఁడైన మనుజుఁ డధికుని చేఁబట్ట । అతనిమాట నడచు నవనిలోన
గజపతింట నెన్నగవ్వలుచెల్లవా । విశ్వ. 91

ఆ. అధరసుధనుజూచి యన్నియుమఱచును । తరుణిరూపుఁజూచి తన్నుమఱచు
ఉక్తులాలకించి యోగంబుమఱచురా । విశ్వ. 92

ఆ. అధికజనులతోడ నాప్తులతోడను । పరువుగుఱుతెఱింగి పలుకకున్న
వచ్చుఁ జెడ్డఁదనము హెచ్చుగాగాంభీర్య । హానిచెందుఁదనకు నపుడు వేమ. 93

ఆ. అధికమైనయజ్ఞ మల్పుండుతాఁజేసి । మొనసిశాస్త్రమువిడి మురువుదక్క
దొబ్బనేర్చుకుక్క దుత్తలుమోచునా । విశ్వ. 94

తే. అధికసుఖమును దుఃఖమ్ము నార్పలేక । విధినిదూరంగ ఫలమేమి వేడుకలర
బుద్ధినొక్కనఁ బరిపూర్తిఁ బొందునయ్య । అట్లు కాకూరకయుండనడఁగు వేమ

ఆ. అధికసూక్ష్మమైన యానందమెఱుఁగక । మతియులేక చదివి మగ్నుఁడయ్యె
నతిరహస్యమెల్ల నాజనుఁడెఱుఁగునా । విశ్వ. 96

ఆ. అధికుఁడైన రాజొకల్పునిఁజేఁబట్ట । వానిమాటచెల్లు వసుధలోన
గణకులొప్పియున్న గవ్వలుచెల్లవా । విశ్వ. 97

ఆ. అధికుఁడైనవాని కధికారమిచ్చిన । నచటివారసెల్ల నాదరించు
చెఱకుఁదిన్ననోరుచే దారగించునా । విశ్వ. 98

ఆ. అధిపతైన నరుఁ డనాచారవంతుఁడై । సతినిబాసి యడవిసంచరించె
సాధ్వియైనభార్య సమ్మతిదిగనాడి । కొలిచెరాజు కొలువుఁగోరి వేమ. 99

ఆ. అధిహితముగునట్లు లాడినమాటకు । సంతసింతురెల్ల సత్పురుషులు
అధికభాషణంబు లాయాసదంబులు । వి. 100

ఆ. అనఁగననఁగరాగ మతిరమ్యమైయుండు । పెనఁగఁబెనఁగ సతికిఁ బ్రేమపుట్టు
తినఁగఁదినఁగ వేము తీయనైయుండురా । విశ్వ. 101

ఆ. అనఁగననఁగరాగ మతిశయిల్లుచునుండు । తినఁగఁదినఁగ వేము తీపినుండు
సాధకమునఁబనులు సమకూరుధరలోన । విశ్వ. 102

ఆ. అనననాహతముననది లెస్సగాఁజూచి । ఇఁకను దానవాయు వీహఁజేసి
కడమవాయువందుఁ గదలకుండినవాఁడు । చెప్పనేలవాఁడె శివుఁడువేమ. 103

ఆ. అనయమీసుమాపి యనలంబుచల్లార్చి । గోచిబిగియఁగట్టి కోపమడఁచి
యాసవిడిచెనేని యతఁడు దాయోగిరా । విశ్వ. 104

క. అనలంబున జన్మించుచు । ననలంబున లీనమగుచు నాకాశమునం
గనుపించిపుట్టునదియే । జనకుఁడులేనట్టి దదియెజాలము వేమా. 105

ఆ. అనలమించుకైనఁ గనలిమండునుగాని । చనువుగానియెఱుక మనికివిడదు
తనువుమఱచినపుడె ఘనతత్వమబ్బురా । విశ్వ. 106

ఆ. అనలమించుకైన నఖిలంబుఁ జెరుచును । మనసు పెరిగి పెఱిగి మాయఁజెరుచు
బ్రహ్మమయము చెఱుచు భవబంధములనెల్ల । విశ్వ. 107

ఆ. అన్నదానమునను నధికసంపదగల్గి । అమరలోకపూజ్యుఁ డవునుమీఱి
అన్నమగును బ్రహ్మ మదికనలేరయా । విశ్వ. 108

ఆ. అన్నమదమువలన నతివలుమతిచెడి । యేపురేఁగి మదనుఁడేచెనందు
రన్నముడుగువెనక నతఁడెందుఁబోయెరా । విశ్వ. 109

ఆ. అన్నమధికమైన నరయమృత్యువునిజం । బన్నమంటకున్న నాత్మనొచ్చు
చంపఁబెంపబువ్వె చాలదావేయేల । విశ్వ. 110

ఆ. అన్నమెఱుఁగనతని కన్నంబుఁబెట్టిన । పారవేయుదాన ఫలితమేమి
ధనికునకునొసంగు దానములటువలె । విశ్వ. 111

ఆ. అన్నమిడుటకన్న నధికదానంబులు । ఎన్నిచేయనేమి యెన్నఁబోరు
అన్నమెన్న జీవనాధారమవునయా । విశ్వ. 112

ఆ. అన్నముతినువేళ నాత్మరుచులగోరు । టదియు నాల్కసెప్పనడుగుమనసు
నాత్మకుఁ దృణమైన నయ్యయ్యొయనరాదు । విశ్వ. 113

ఆ. అన్నమునకు నంటదయిన నాత్మకునంటు । ఆత్మనుబెనఁగొన్న యన్నమంటు
ఆత్మశుద్ధియన్న మన్నశుద్ధియునాత్మ । మిన్నుమన్నుమాడ్కి మెఱయువేమ. 114

ఆ. అన్నము నమృతమునునంటు నంటనుచును । బరిహరింతురి దెలియఁబడక ద్విజులు
అన్నమమృతమివియ హరిహర బ్రహ్మలు । అంటవన్నవాని కంటువేమ. 115

ఆ. అన్నయనఁగ నెవ్వరది తెలియఁగఁజూడ । తనకు ముందుపుట్టి తనరుచుండె
అన్నవంటివాఁడు హరుఁడౌను గురుఁడౌను । విశ్వ. 116

ఉ. అన్నయుఁదమ్ముఁడుం జెలియ, లక్కయుబావలు మిత్రబంధువుల్
పన్నుగ వీరిఁజేర్చుటకు, బాగుగఁ బ్రేమముం గూర్చినప్పుడే
మున్నుగ మోసపోకుమది, ముక్తికిఁద్రోవ నెఱుంగఁజేయు నీ
వెన్నఁగ నాదు వాక్యముల, నేమరకుండినసుండు వేమనా. 117

ఆ. అన్నరసమువలన నలబిందురసమయ్యె । బిందురసమువలన బీజమయ్యె
బిందుబీజములను భేదించిచూడరా । విశ్వ. 118

క. అనిచినపురుషుండొక్కఁడు । వినునిత్యమనిత్యమనక విధమిట్టిదగుం
దనసంకల్పమెబంధము । తనసంకల్పక్షయంబె తత్త్వమువేమా. 119

ఆ. అన్నిజాతులకును నాధారమైనట్టు । లున్నసానగాది మిన్నఋషుల
నెన్నిజన్మములకు నెక్కడఁగానము । విశ్వ. 120

ఆ. అన్నిజాతులందు నధికులమనుచును । యజ్ఞపశువుఁజంపి యగ్నినిడుచు
మల్లయందుఁబెట్టి మాంసంబుఁదిందురు । విశ్వ. 121

ఆ. అన్నిజాడలుడుగ నానందకాముఁడై । నిన్నునమ్మఁజాలు నిష్ఠతోడ
నిన్నునమ్మముక్తి నిక్కంబునీయాన । విశ్వ. 122

ఆ. అన్నిదానములను నన్నదానమెగొప్ప । కన్నతల్లికంటె ఘనతలేదు
ఎన్నగురునకన్న నెక్కువలేదయా । విశ్వ. 123

క. అనుచితపురుషుండెక్కఁడు । వినునిత్యానిత్యమనఁగ విధమెట్టిదనం
దనసంకల్పమెబంధము । తనసంకల్పంబె క్షయము దగనరఁగ వేమా. 124

క. అనుభవకేళికిలోనగు । తనువులుమూఁడుడిగిలోని తథ్యము గన కా
జననాంతరమునరఁగనదు । కనునదె బ్రహ్మంబుమదిని గట్టిగవేమా. 125

క. అనుమానరహితమగుగతి । వినయముతో బుద్ధినొక్క విషయింపవలెం
దనలోఁ దాఁ జైమించెదు । ఘనమగు చిత్ప్రభను బూనికవలె వేమా 126

ఆ. అనువుగానిచోట నధికులమనరాదు । కాలమెఱుక్క రీతిఁ గడపవలయు
విజయుఁడిమ్మఁదప్పి విరటునిఁ గొల్వఁడా । విశ్వ. 127

ఆ. అనువుగానిచోట నధికులమనరాదు । కొంచెముండు టెల్లఁ గొదువగాదు
కొండయద్దమందుఁ గొంచెమైయుండదా । విశ్వ. 128

ఆ. అనువుగానిచోటఁ బనిఁగొని జాదము । నాడికూడిరాడి యడవిసొచ్చి
కాఁడు సేరితెపము ఘనముగాఁ జేసిన । వాని నెన్నఁదరమె వసుధ వేమ. 129

ఆ. అనువుగానిబంటు నప్పఁడేలినయెడ । మాఱుమలయునొండె మగుడఁబడునొ
దూలమూతకోల దొరకినచందమా । విశ్వ. 130

ఆ. అనువు మీఱుమదిని నానందమందెడి । నరుఁడు పరుఁడుగాఁడె నయముగాను
మనసునిలుపకున్న మఱిముక్తి లేదురా । విశ్వ. 131

ఆ. అనృతమాడలేక యలహరిశ్చంద్రుఁడు । ఆలిబిడ్డ నమ్మి యతఁడుకూడ
మాలవానికపుడు మఱిలోకువైయుండె । విశ్వ. 132

ఆ. అన్యులకనువచ్చునాపద తనదిగా । నెన్నువాఁడు భువిని నున్నవాఁడు
ఎన్ని దానిలోన నిహపరంబులు తెన్ను । గన్నవాఁడు మిగులఘనుఁడు వేమ. 133

తే. అన్యులుండ నిష్ఠలమందు నాత్మవిద్య । చిత్తతిమిరమ్ము నణఁగించి చెంగలించి
పండువెన్నెలకాంతిలోఁ బ్రాకిచూడు । మప్పుడానందమును బొందనగుర వేమ. 134

ఆ. అపుడు నాదుమాట యానందమనుకొన । కిపుడు రమ్మటన్న నేమి కలదు
మదము నిల్పవలెను మనసెవ్వరికి నిల్చు । విశ్వ. 135

ఆ. అప్పుతీర్పలేని యానేర్పు కేటికి । కోర్కెఁదీర్పలేని కొలువదేల
పెట్టిపోయలేని వట్టి బీరంబేల । విశ్వ. 136

ఆ. అప్పుఁదీయరోఁత హరిహరాదులకైన । మెప్పుతోడ మైత్రి మెలఁగరోఁత
తప్పుఁబలుకరోఁత తాకట్టిడినరోఁత । విశ్వ. 137

ఆ. అప్పులేనివాఁడె యధికసంపన్నుండు । తప్పులేనివారు ధరను లేరు
గొప్పలేనిబుద్ధి కొంచెమైపోవురా । విశ్వ. 138

ఉత్సాహ. అంబరంబుచూడనేల నడవిఁదిరుగనేల నా
సంబళంబు లడుగనేల శంభుదూఱనేలనా
నంబివానిగోఁచిఁ జించినారిచేతఁగట్టు మై
కంబళంబుహేమమాయె కపరిసత్తుఁగూడినన్. 139

ఆ అభవునను భవమున నార్గురరులునీల్గ | సంశయంబులేదు సాధకులకు
చెంతదీపమిడక చీకటిపోవునా | విశ్వ. 140

క. అభవునిమదిలోఁగాంచెదు | శుభకరమగు చూడ్కియందు సొంపలరంగా
నభిముఖదృష్టినిబూనుము | రభసములేనట్టియోలుక రాజిలువేమా. 141

తే. అమలమవ్యయచింతన యసిపదంబు | గోరి జీవేశ్వరైక్యంబుఁ గూర్చునంత
యవిరతంబగు పరిపూర్ణమమరునయ్య | వాదులాడంగఁ జిక్కడుగాదె వేమ 142.

ఆ. అమలమవ్యయంబు నంతరాత్మకులోన | విమలదృష్టిఁబూని విడకమించి
తెమలకున్నవాఁడు తెరబయల్సేరును | విశ్వ. 143

ఆ. అమలమైనపలుకు లభిషేకవారిధి | తనువుదేవళంబు తాల్మినొంది
ఆత్మశివునిఁజేర్చునాతఁడె శివయోగి | విశ్వ. 144

క. అమలాత్మునిమానసమున | విమలాంతర్గతునిఁగాఁగ వివరింపవలెం
గ్రమమైన చాయలందంచు | మమకారము నెట్టవలెను మహిలో వేమా. 145

క. అమ్మసుమీయాలనఁగా | నమ్మనఁగా నాలుసుమ్మి యాయిద్దరియం
దిమ్మహిలోఁ బరమాత్ముని | నెమ్మదిలోఁ దెలియఁగానె నేర్పరివేమా. 146

ఆ. అమృతసాధనమున నందఱుబలిసెద | రమృతమెంచిచూడ నందలేరు
అమృతము విషమాయెనది యేమిచిత్రమో | విశ్వ. 147

క. అయమనఁగ నేమిచెప్పెదు | నయమేజయమై వెలుంగు నన్యులకెల్ల
న్నయమనఁగ వినవెయెచ్చట | నయమనఁగా నుక్కుపండువనఁదగువేమా. 148

ఆ. అయిదుచక్రములను నాడిని బడవైచి | యైదుచక్రములకు నవలఁదెలియ
నైదుచక్రములును నడఁగి బయల్తోఁచు | విశ్వ. 149

ఆ. అయిదు నైదు నైదు నైదింటఁజేకూడు | మూఁడుమూటఁజేరి మఱియునొకటి
మురిసినసకలంబు మోహించియుండురా | విశ్వ. 150

ఆ. అయిదువర్ణములను నానందమెఱిఁగిన । నందె చూడముక్తి యలరుచుండు
నయిదులోనఁ దెలియుటదియె పోబ్రహ్మంబు । విశ్వ. 151

ఆ. అయిదువర్ణముల నెయ్యఖిలంబుఁ దెలిసిన । నయిదునందు ముక్తి యమరియుండు
నయిదులోననున్న నతఁడెపో తెలియంగ । విశ్వ. 152

ఆ. అరయఁగ గంటిదృష్టి గుఱిగాను ముక్కుపై । రెప్పపడక గ్రుడ్లు త్రిప్పిపట్టి
వివరమెఱుఁగ శాంభవి ముద్రయదియండ్రు । విశ్వ. 153

ఆ. అరయఁ దఱచు కల్లలాడెడువారిండ్ల । వెడలఁజేల లక్ష్మి విశ్రమించు
నీరమోఁటికుండ నిలువనిచందాన । విశ్వ. 154

ఆ. అరయ దోఁచువాఁడు గురువనితా నెంచి । తిరుగువాఁడు తన్ను నరయలేఁడు
పనికిమాలినట్టి బానిసె కొడుకురా । విశ్వ. 155

ఆ. అరయ నాస్తి యనక యడ్డుమాటాడక । దట్టువడక మదిని తన్నుకొనక
తనదిగాదనుకొని తాఁబెట్టునదె పెట్టు । విశ్వ. 156

ఆ. అరయ మూలమందు నర్థంబునందును । నిర్మలాత్ములందు నియతులందు
బయలునందు శ్రుతుల భావంబునందును । వెలయు శివునిఁ జూడు వేడ్క వేమ 157

ఆ. అరయ లజ్జ చూడ నందఱియందుండు । లజ్జలేనివాఁడు లాలితుండు
లజ్జగల్గువాని లాభంబు లేమయా । విశ్వ. 158

ఆ. అరయ హస్తమందు నభయహస్తంబీయ । దర్పణాంగుఁడైన తన్నుఁ జూచి
మంగళంబు సేయు మంగలిహీనుఁడా । విశ్వ. 159

ఆ. అరసి గట్టిసేసి యాధారచక్రంబు । ప్రాణవాయువందె పదిలపఱచి
యెడ తెగక యేయుండు నిలయోగ్యుఁడగు యోగి । విశ్వ. 160

ఆ. అర్థయంకణమున కాధారమైనట్టి । యొంటిగుంజమేఁడ నొనరనిల్పె
ఇంటికొకఁడె మగఁడు నిల్లాండ్రొ యేడ్గురు । విశ్వ. 161

ఆ. అర్థవంతు సొమ్ము నాసింతు రర్థుల । వ్యర్థకీవి సొమ్ము వ్యర్థమౌను
వ్యర్థమైన సొమ్ము వ్యర్థులఁ జేరురా । విశ్వ. 162

క. అరిషడ్వర్గంబుల చే । నరులెల్లను జిక్కి సౌఖ్యనైజము విడకే
యరుగుదురు గాక యెఱుకను । మరుగైనది బ్రహ్మమయము మహిలో వేమా. 163

ఆ. అరుణునుదయసంఖ్య యస్తమానపుసంఖ్య । జననమరణసంఖ్య జాతిసంఖ్య
దీని నెఱుఁగుయోగి ధీరుఁడైయుండురా । విశ్వ. 164

ఆ. అఱుతలింగముండ నదియెఱుంగఁగలేక । పర్వతంబు వెదకఁబనసకొడుకు
పాయరానిలింగ మాయెఁబ్రాణమొకద । విశ్వ. 165

ఆ. అరుదుగానడిగిన యతఁడర్థిగాఁబోఁడు । తలఁచుగానొసఁగక దాతగాఁడు
దాతకర్థికింత తారతమ్యముగల్గు । విశ్వ. 166

ఆ. అలనుబుడిపిపుట్టినప్పుడే క్షయమాను । కలనుగాంచులక్ష్మిఁగనుటలేదు
ఇలనుభోగభాగ్య మీతీరెకానరో । విశ్వ. 167

ఆ. అలయఁజెసిమలచి యడిగెండ్లుమలిగెండ్లు । తిరిపెమిడెడుకటికి దెబెల్ల
నెలమిమన్నదినెడు నెట్టుకాదురుసుమీ । విశ్వ. 168

ఆ. అలలులేనిజలధి వలెనున్నమదిలోన । తెలివిగూడితన్ను దెలియవలెను
తలలుబోడులైన దక్కునాతత్వంబు । విశ్వ. 169

ఆ. అలవిగానిబయలు నందినమదిఁజూడ । గూడిమెలఁగుచుండ గోచరించు
చూడజూడనెఱుక చోద్యమైతోఁచురా । విశ్వ. 170

ఆ. అల్పబుద్ధివాని కధికారమిచ్చిన । దొడ్డవారినెల్లఁదొలఁగగొట్టు
చెప్పఁదినెడుకుక్క చెఱకుతీపెఱుఁగునా । విశ్వ. 171

ఆ, అల్పసుఖముగోరియతివలపైయాస । స్వల్పమైనఁబెరిగిసాంద్రమగును
భ్రమలఁజిక్కినపుడె ప్రబలునుబాపంబు । విశ్వ. 172

ఆ. అల్పసుఖములెల్ల నాశించిమనుజుండు । బహుళదుఃఖములను బాధపడును
పరసుఖంబునొంది బ్రతుకంగనేరఁడు । విశ్వ. 173

ఆ. అల్లబోడితలలు తెల్లనిగోంగళ్లు । నొడల భూతిపూసియుంటరోఁత
యిట్టివేషములిలఁ బొట్టకూటికెకాన । విశ్వ. 174

ఆ. అల్పుఁడెన్నిపలుకు లలయకపలికిన । నధికుఁడూరకుండు నదరిపడక
కంచుమ్రోగునట్లు కనకంబుమ్రోగునా । విశ్య. 175

ఆ. అల్పుఁడెపుడుఁబల్కు నాడంబరముగాను । సజ్జనుండు పలుకుఁజల్లగాను
కంచుమ్రోగునట్లు కనకంబుమ్రోగునా । విశ్వ. 176

ఆ. అల్పుఁడైన నేమి యధికుఁడైనను నేమి । చెప్పవలయురీతిఁ జెప్పువాఁడ
హానియెఱుకలేక యాసలల్లాడునా । విశ్వ. 177

ఆ. అల్పుఁడైనవాని కధికభాగ్యముగల్గ । దొడ్డవారిఁదిట్టి తోలఁగొట్టు
అల్పజాతి మొప్పె యధికుల నెఱుఁగునా । విశ్వ. 178

ఆ. అల్పుఁడైనవాని కధికారమబ్బినా । దొడ్డకొంచెమనక తూలఁబల్కు-
చెప్పుఁగొఱుకుకుక్క- చెఱకుచే వేమెర్గు । విశ్వ. 179

ఆ. అల్లునికగుమృతికి నాత్మఁజింతించును । తనయుమృతికిఁ దానెతల్లడిల్లు
పుణ్యపురుషుమృతికి భూమిలోజనులకీ । యుగముద్రుంగి నట్టులుండు వేమ. 180

ఆ. అవని నొక్క-బిడ్డ యతని తండ్రికిఁబుట్టి । అట్టియేలెజగము లగణితముగ
తల్లిలేక పెఱిగి ధాత్రినెట్లేలెరా । విశ్వ. 181

సీ. అవనిలోనొక కప్ప, యైదుపాములఁ బట్టి । విడబడిమ్రింగిన, విధమదేమి
యొనరనొక్కఁట రెండు, ఘనకపుల్ చెలరేగి । యొంటిపిల్లలనీను నోజయేమి
కలియుగంబుననక్క-, గర్భవాసమునందుఁ । గాము ధేనువుపుట్టు, కట్టడేమి
అవికారమట్లప్పె, నరటిఫలంబులు । పుట్టిన యట్టియా, పోలుపదేమి
అరయనేర్చిన సర్వజ్ఞు, లైనవారు - చెప్పనేర్చినవారొండు, చెప్పరేమి
శివునిఁ గాంతురుభువిలోఁ బ్ర, సిద్ధముగను-నీకుఁ దెలియనిదేముండు, నిజము వేమ 182

ఆ. అవనివేషమెన్న నజునికడ్డముగాదు । యముని గెల్వలేని యధములకును
దొంగ పథము గాక దొరకునా మోక్షంబు । విశ్వ. 183

ఆ. అవుటఁ గామెఱుఁగని యజ్ఞానజీవులు । మూలమును దెలియక ముట్టుచేత
ననుదినముసృజించి యాత్మఁదెలియలేక । చచ్చిపుట్టుచుంద్రు జగతి వేమ 184

తే. అవును వేమన్న చెప్పిన యాత్మబుధిబుద్ధిఁ । దెలియలేనట్టి యజ్ఞానిదెబ్బలకును
తలకుఁబాసిన వేంద్రుకవలెనఁజూడ । భుక్తిముక్తులు హీనమైపోవు వేమ. 185

ఆ. అష్టకష్టములకు సాలయుమైయుండు । గతులుదుర్గతులను గన్న దిదియె
కానకుండఁబోయె గగనస్వరూపమై । విశ్వ 186

ఆ. అష్టకష్టబ్రదుకదగ్ని పాలైపోవు । నిర్గయాత్మబ్రదుకు నీటఁగలియుఁ
గ్రూరకర్ముబ్రదుకు చోరులపాలౌను । విశ్వ 187

ఆ. అష్టతనువులకును నాదిమమైనట్టి । యాదిశక్తిఁగూడి యభవుఁడగును
భయములేకయుండు బ్రహ్మజ్ఞుఁడగుయోగి । విశ్వ. 188

ఆ. అష్టదళములకును నాధారమైనట్టి । యాదిదేవుఁడొకఁడె యఖిలజగము
త్రయముదాఁటువాఁడు తానెపో బ్రహ్మంబు । విశ్వ. 189

ఆ. అష్టదళములందు నాత్మ నసేవించి । నిష్ఠఁబూని మిగుల నేర్పుతోడ
దృష్టియందె దృష్టి తెమలక చూడరా । విశ్వ. 190

క. అష్టాంగయోగసాధన । కష్టంబులకోర్చితన్నుఁ గనలేఁడుగదా
చేష్టలువిడువని జీవికిఁ । గష్టంబగు పుట్టఁజావగతియిదె వేమా. 191

తే. అసిపదాంతమునను బుద్ధి నమరనొక్కి । కూటపరచిన్మయంబునఁ గొలువుదీరి
ఆటపాటల నణఁగింప నందెముక్తి । విశ్రుతంబగు విధమిది వినరవేమ. 192

ఆ. అస్థిరమగుమేని కదను పాటులుపొంది । పెక్కువిధములందుఁ బెంచిపెంచి
అగ్నికిచ్చులేక యడవినక్కలకిచ్చు । విశ్వ. 193

ఆ. అసువినాశమైన యానందసుఖకేళి । సత్యనిష్ఠపరుని సంతరించు
నిష్ఠలోని నిష్ఠ నిర్ముక్తభావంబు । విశ్వ. 194

ఆ. అక్షయమనుటంక మండంబుతోఁగూర్చి । అమరిగుణవికార మనుభవించి
అక్షయంబునంట నక్షయంబై యుండు । విశ్వ. 195

ఆ. అక్షయాత్మకంబు నర్థింప గుఱిఁగని । నిశ్చయంబుగాను నిలిపిమనసు
రక్షగట్టినట్లు రట్టడిమాన్పరా । విశ్వ. 196

క. అక్షరపదవికిఁ బదివే । లక్షరముల నఱవనేలనల "శివ" యను రెం
డక్షరములణఁచుదురితము । తక్షణమే పదవిగలుగుఁ దథ్యము వేమా. 197

క. అక్షరపు టడవిఁ జొరఁబడి । యక్షరములువేలు లక్షలరయఁగ నేల
నీక్షితి శివయని రెండెరెం । డక్షరములె పరిఢవిల్లు నరయుము వేమా. 198

క. అక్షరపు టడవిఁబొరలక । యక్షరమగు మహిమఁగాన నవనిం దొలుతా
నక్షరమును జపియించిన । నక్షయముగ నదియెచాలు నరయఁగ వేమా. 199

ఆ. అక్షరపుట మిట్టి యందంబులోఁగూర్చి । యమరునొక్కరణము ననుభవించు
నతనికొన్నముక్తి యక్షరమైయుండు । విశ్వ. 200

క. అక్షరపుటములఁ జూరవే । లక్షలు చదువంగనేల లాలితముగఁ బ్ర
త్యక్షముగను "శివ" యనురెం । డక్షరములు మదికి శుద్ధియగురా వేమా. 201

ఆ. అక్షరంబుఁ జదివి యందునుగనలేక । యెచ్చుతక్కువనుచు నేపుమీఱి
అక్షరాత్ముఁడన్న యతనికిఫలమేమి । విశ్వ. 202

ఆ. అక్షరంబెఱుఁగక యడవులఁ దిరుగుచుఁ । గొండరాలు గుళ్ళఁ గొలువనేల
హృదయమందుశివుని యేర్పాటు తెలియరో । విశ్వ. 203

ఆ. అక్షమాలఁ బూని యలసటఁ జెందక । కుక్షినింపుకొనుట కొదవగాదు
పక్షికొంగరీతిఁ బైచూఁపు లేఁటికో । విశ్వ. 204

ఆ. అక్షమాలఁ బూని యలమటపడనేల । నిశ్చయాత్మ మెఱుఁగు నియతిలేక
కుక్షినింపువాఁడు గుహఁ జేరి ఫలమేమి । విశ్వ. 205

ఆ. అక్షరాత్మకంబు నమృతపానమునకు । రక్షకత్వమునకు రాజహంస
దీక్షలోనిదీక్ష తెలివంటిచూడరా । విశ్వ. 206

ఆ. అక్షరాళివెంట నడువులవెంటను । గొండరాలగోడు కుడువనేల
హృదయమందె శివుఁడటుండుటఁ దెలియరో । విశ్వ. 207

ఆ

ఆ. ఆకఁటికి మెలంగు నాచారవిధులెల్లఁ । జీకఁటికిఁ దొలంగుఁ జిత్తశుద్ధి
వేకటిఁకిఁ దొలంగు వెనుకటి బిగువెల్ల । విశ్వ. 208

ఆ. ఆకలన్నవాని కన్నంబుఁ బెట్టిన । హరునకర్పితముగ నారగించు
ధనవిహీనునకిడు దానమునటువలె । విశ్వ. 209

ఆ. ఆకలిఁ గొనివచ్చెనని పరదేశికిఁ । బట్టెడన్నమైనఁ బెట్టలేఁడు
లంజెదానికొడుకు లంజెలకిచ్చురా । విశ్వ. 210

క. ఆకలిచే నేడ్చుచు మఱి । లోకముతనకీయరనును లోలాత్ముఁడు దా
నాకలిదీఱినయప్పుడు । చీకటి వాపంగఁ జవియుఁ జెలఁగును వేమా. 211

క. ఆకలిఁ జంపినరాదది । యాకులుదిని యడవులందె యలసిననైనం
జీకటికోసం జిక్కదు । ఏకాకృతిమదిని నిల్పి యెఱుఁగుము వేమా. 212

క. ఆకలియలసట నిద్రయుఁ । బ్రాకటముగ సంగమంబు పరిభవములెల్లం
బ్రాకుటవిడుచుట విడుచువి । భాకరుఁడ నిలుండుచలన భావ్యుఁడు లేమా. 213

ఆ. ఆకసంబుమీఁద నాడుదొమ్మరిపాప । చూఁపులొకటిగాని సుఖములేదు
ఆకసమను వీధిహంసను జూడరా। విశ్వ, 214

ఆ. ఆకసంబు శూన్యమందు శబ్దముపుట్టె । శబ్దమధ్యమునను సరగఁజూడ
శబ్దరహితమదియె బ్రహ్మమనఁగఁజెల్లు। విశ్వ. 215

క. ఆకారణవిధమెఱుఁగుచుఁ । జేకొని యా మూలధనముఁ జెందుచునున్న
న్నా కల్పాంతమునుసదా । యేకాలము పిన్నవయసు నిహమునవేమా. 216

క. ఆకాశంబున వాయువు । ప్రమసన దావాగ్నియటుల మానసమందా
యేకాకారుఁడు జగమున । జోకై తను దానెవెల్గు సుమ్మురవేమా. 217

ఆ. ఆకుకానవచ్చుహరి హరాదులకైనఁ । గొమ్మకానరాదు కోరిచూడ
కొమ్మకానరాక కొనియాడకుందురా । విశ్వ. 218

ఆ. ఆకుచాటునదగు నన్నిలోకంబులు । కొమ్మగానరాదు బ్రహ్మకైన
గొమ్మగానఁబడినఁ గొనియాడవచ్చురా। విశ్వ. 219

ఆ. ఆకుప్రక్క నున్నమవి మూఁడుపన్నెలు । నేకమైనచోటఁ దాకునెఱుపు
శోకి త్రిగుణమట్లు శోభించుఁ బరమాత్మ । విశ్వ. 220

ఆ. ఆకుమీఁదిబ్రాత యందఱికిఁదెలియుఁ । జేతిలోనిబ్రాతఁజెప్పవచ్చు
తోలుకిరిందిబ్రాత దొడ్డవాఁడెఱుఁగురా । విశ్వ. 221

ఆ. ఆకులందుఁజదివియందంగరానిది । ఏకమమరయుక్తి నెఱుఁగవలయుఁ
దాకిపూర్తిగాను దన్మయమందుఁడీ । విశ్వ. 222

ఆ. ఆకులెల్లఁదిన్న మేకపోతులకేలఁ । గాకపోయెనయ్య కాయసిద్ధి
లోకులెల్లవెఱ్ఱి పోకిళ్లుపోదురు । విశ్వ. 223

ఆ. ఆకులేనికొమ్మ యభ్రమెల్లనునిండె । బ్రమకుమొదలుఁదుదయు మహినిలేదు
ఏకమైనపండు నింపొందుచుండురా । విశ్వ. 224

క. ఆకుఁదిను విధమెఱుంగుచుఁ । జేకొని యామూలధనముఁ జెందుచునున్న
న్నా కల్పాంతమ్ముసదా । యేకాలముఁ బిన్నవయసె యిహమునవేమా. 225

ఆ. ఆకృతినరయఁగ నిరాకృతియనఁదగు । నాకృతి నొగిఁదగు నిరాకృతిట్టు
అవియురెండులేక యపరూపమైయుండు । విశ్వ. 226

క. ఆఁకొన్న యతిథిశివుఁడని । కాకించుక లేకమదిని గరుణాన్వితుఁడై
పోఁకంత యన్నమిడిననె । యాఁకొనియా మునిఁ గొట్ట నుపమిది వేమా. 227

ఆ. ఆగడంబుచేత నందెందుఁబొందదు । సాగఁదోలిమనసు సైపనేర్చి
మ్రోఁగుప్రణవరవము మూలంబుఁగానరో । విశ్వ. 228

ఆ. ఆచరాచరముల నంగాలలింగాల । సరణిఁదెలియనట్టి శైవమేల
అష్టతనుమయుండు హరుఁడౌట నెఱుఁగరో । విశ్వ. 229

ఆ. ఆడితప్పువార లభిమానహీనులు । గోడెఱుఁగనివాఁడు కొద్దివాఁడు
కూడికీలేడుసేయ క్రూరుండు దలపోయు । విశ్వ. 230

ఆ. ఆడుదనగరోఁత యదిమూడఁగారోఁత । తలచిమూడఁదనకుఁ దానెరోఁత
ఎంతవారికైన నింతియెబల్ఘాత । విశ్వ. 231

ఆ. ఆడుదానిఁజూడ నర్థంబుఁజూడఁగ । బమ్మకైన నెత్తురిమ్మతెగులు
బ్రహ్మయాలిత్రాఁడు బండిరేవునఁద్రెంప । విశ్వ. 232

ఆ. ఆడుదానిబొంకు గోడఁబెట్టినయట్లు । పురుషవరునిబొంకు పూరితడుక
స్త్రీలనేర్పుమగలఁ జీకాకుపఱచురా । విశ్వ. 233

ఆ. ఆడువారిఁగన్న నర్థంబుపాడఁగన్న । సారమైన రుచుల చవులఁగన్న
అయ్యగాండ్రికైన నాశలు పుట్టవా । విశ్వ. 234

తే. ఆత్మతనలోన గమకించి యనుదినంబు । నిర్గుణాత్మార్చనముఁజేసి నిత్యమహర
ప్రత్యగాత్మనులోనెంచి ప్రబలుయోగి । సచ్చిదానందపదమందు సతము వేమ. 235

తే. ఆత్మతేజము గమకించి యభినుతించి । కీలకబ్రహ్మతన్మయు కేళిమీరిగి
నిత్యపరిపూర్ణమందుట నిరతిశయము । సత్వసంపన్నులకు నిది సాఁగువేమ. 236

ఆ. ఆత్మతేజమూని యనుభవించుటముక్తి । ఆత్మతత్వమెఱుఁగు నతఁడె యోగి
యెఱిఁగిమరిగినంత నేకమై తోఁచురా । విశ్వ. 237

ఆ. ఆత్మతేజమూని యనువుగా శోధించి । తేజమాత్మయందుఁ దేటపఱచి
మింటిమంటినడుమ మిన్నందిచూడరా । విశ్వ. 238

ఆ. ఆత్మదేహమందు నతిసూక్ష్మముగఁజూచి । దేహమాత్మయందుఁ దేటపఱచి
ఆత్మయందె మూడ నతఁడెపోఘనయోగి । విశ్వ. 239

ఆ. ఆత్మనున్నవాని ననుదినంబునుఁజూచి । యతనిమహిమవలన నతనిఁదెలియ
నదియు సత్యమౌను నవనీతలంబున । విశ్వ. 240

ఆ. ఆత్మనెఱుఁగని మతియట్టిట్టు చేసిన । వానిమెచ్చువాఁడు వట్టివాఁడె
ముక్కిడిదియుఁ బాడమొండిదియె మెచ్చుఁడా । విశ్వ. 241

ఆ. ఆత్మబుద్ధివలన నఖిలంబుఁదానయ్యె । జీవబుద్ధివలన జీవుఁడయ్యె
మోహబుద్ధివలన ముదితలపైదృష్టి । విశ్వ. 242

ఆ. ఆత్మయందు జ్యోతియమరుట లింగంబు । తెలిసి చూడఁగాను దేటపడును
అదియు గురువులేక యబ్బునా తెలియంగ । విశ్వ. 243

ఆ. ఆత్మయందె దృష్టి యనువుగానొనరించి । నిశ్చలముగ దృష్టి నిలిపెనేని
అతఁడు నీవె సుమ్మియను మానమేలరా । విశ్వ. 244

ఆ. ఆత్మలోననాద మాలించియాలించి । యాసలందుఁజిక్కఁడాదియోగి
యాత్మలోనఁగళల నంటు నాతత్వంబు । విశ్వ. 245

ఆ. ఆత్మలోన శివుని ననువుగాశోధించి । నిశ్చలముగభక్తి నిలిపెనేని
సర్వముక్తుఁడౌను సర్వంబుఁదానౌను । విశ్వ. 246

ఆ, ఆత్మలోని జ్యోతి యమరుటలింగంబు । తెలివిచేతగాని తేటబడదు
అదియుగురువులేక యంటదుమదిలోన । విశ్వ. 247

ఆ. ఆత్మలోనిజ్యోతి యమరుటలింగంబు । తెలిసిచూడకున్నఁ దేటపడదు
గుడ్డివాఁడెఱుఁగునె గుఱుతైనరత్నంబు । విశ్వ. 248

ఆ. ఆత్మలోనిసొమ్ము నంజనమునఁజూచి । యంటితిరుగునట్టి యతఁడుయోగి
పుంజుగూఁటనుండి ప్రొద్దెటెంగియెకూయు । విశ్వ. 249

ఆ. ఆత్మశుద్ధిగలుగ నధికులమనబోరు । ధీరవృత్తిచేతఁ దిరుగబోరు
రూపుసుదురమంచి రూఢిగావింపరో । విశ్వ. 250

ఆ. ఆత్మశుద్ధిలేని యాచారమదియేల । భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా । విశ్వ. 251

ఆ. ఆత్మశుద్ధివల్ల నఖిలంబుఁదానయ్యె । జీవశుద్ధివలన జీవుఁడయ్యె
మోహబుద్ధిలయము ముందఱఁగనుఁగొన । విశ్వ. 252

ఆ. ఆత్మసూక్ష్మమైన యానందమెఱుఁగక । మతితొలంగిచదివి మగ్నుఁడయ్యె
అతిరహస్యమెల్ల నాయోగియెఱుఁగును । విశ్వ. 253

క. ఆత్మానాత్మవివేకము । స్వాత్మనుగనినంతమీఁద స్వచ్ఛందమతి
న్నాత్మకులో వెలిసెగడు మ । హాత్మునిఁ బొగడంగవశమె హరునకువేమా. 254

ఆ. ఆదికారణముల నల్పుఁడేమి యెఱుంగు । చెప్పలేఁడుగాని తప్పఁబట్టు
త్రోయనేర్చుకుక్కదొంతులు చేర్చునా । విశ్వ. 255

ఆ. ఆదిఁజూచుచుండ నన్నిఁటఁదానుండు । నాదిఁజూడనొకరి కలవిగాదు
ఆదిముక్తి తెరువ దాత్మనేయుండురా । విశ్వ. 256

ఆ. ఆదితుదియులేని దనుభవగమ్యమై । వేదతుల్యముగను వెలయుచుండు
వాదభేదముడిగి వరియించుశివయోగి । విశ్వ. 257

ఆ. ఆదినంటిచూడ నలవిగాదెరికి । సోదిఁజెప్పఁదరమె సుఖమెఱింగి
వాదమేల బయలు వర్ణించి జూడరా ।విశ్వ. 258

ఆ. ఆది నెవరు పుట్టి యవనికి దొరలైరి । వారె బ్రహ్మవిష్ణు వరశివులును
గనఁగమాయశక్తి ఘనతేజమందురు । విశ్వ. 259

ఆ. ఆదినెవరుపుట్టిరది తెలియంగోర । సోదియగును గదరసుఖములేదు
ఆదిశక్తియన్ననది బయలనినమ్ము । విశ్వ. 260

ఆ. ఆదినొకటిఁదెలిసి యాదినిమదినిల్పి । యాదిఁబాయకున్న నభవుఁడౌను
ఆదిఁబాయువాఁడె యంధునిరీతిరా । విశ్వ. 261

ఆ. ఆదిమూలమేది యాధారమెయ్యది । సోదిఁజెప్పఁదరమె సుద్దులరసి
తోడులేకఁగోని తుర్యమందునుజూడు । విశ్వ. 262

ఆ. ఆదిమూలవిద్య నానందభరితుఁడై । వేదతుల్యముగను విడకపూని
పాదుకొలిపినవాఁడు పడయునుమోక్షంబు । విశ్వ. 263

ఆ. అదిశక్తిఁగూడి యనుభవించెడుయోగి । వేదవిద్యమఱగి విడవఁబోఁడు
సాధువృత్తిఁదగిలి స్థైర్యంబునందురా । విశ్వ. 264

ఆ. ఆదిశక్తిఁదోడరి యలమటఁజెందక । ప్రాణపంచకంబు పట్టునెఱిఁగి
అంతరిక్షమందు నభినుతించుటముక్తి । విశ్వ. 265

ఆ. ఆదిసోమభౌమలల బుధనిర్జర । గురుల శుక్రశనుల గుఱుతుగాఁగ
నేఁడుదినములైన నిలనొక్కదివసమే । విశ్వ. 266

క. ఆధారంబులటారును । మోదముగా నలరుచుండు ముఖ్యముగాఁగన్
లేదన నేఁటికిఁదెలియక । సాధకమున జూడవయ్య చయ్యనవేమా. 267

ఆ. అనుకూల్యము గలయంగనగలిగిన । సతికిఁబతికిఁ బరమసౌఖ్యమమరు
ప్రాతికూల్యమైనఁ బరిహరింప సుఖంబు । విశ్వ. 268

ఆ. ఆపగాళివెంట నడువులవెంటను । గొండరాలవెంట గొడవయేల
నుల్లమందెశివుఁ డటుండుటఁ దెలియరో । విశ్వ. 269

ఆ. ఆపదందుఁజూడు మరయబంధుల । భయమువేళఁజూడు బంటుగుణము
పేదవడ్డవెనుకఁ బెండ్లము మతిఁజూడు । విశ్వ. 270

ఆ. ఆభిజాత్యమున నె యాయువున్నంతకుఁ । దిరుగుచుంద్రు భ్రమలఁదెలియలేక
మురికిభాండమునను ముసరునీఁగలరీతి । విశ్వ. 271

క. ఆమటిని మంటికడవలు । గ్రామములను వింతలైన ఘనులకువింతా
తామెందుఁ దిఱుగుచుండిన । వేమనతన తోడినీడ వెంటనెవచ్చున్. 272

ఆ. ఆయసుధముకన్న నతిశయమైనట్టి । కల్పమెఱుఁగువాఁడు కారణుండు
ఆయసున్నముఁదిన నంధకారమడంగు । విశ్వ. 273

ఆ. ఆయువుగలుగుఁగద యవనిపైఁజొరఁబారఁ । బ్రియముగల్గునేని బ్రతుకవచ్చు
కాయమునిలిపికొని కల్పంబుచూడరా । విశ్వ 274

ఆ. ఆర్పఁదీర్పలేని తీర్పరితనమేలఁ । గూర్పవిప్పలేని నేర్పదేల
పెట్టిపోయలేని నట్టి బీరంబేల । విశ్వ. 275

ఆ. ఆర్షవిద్యలెల్ల నపకీర్తిపాలాయె । వార్తకెక్కువెంత వారికైన
వార్తవిద్యలెల్ల ధూర్తులపాలాయె । విశ్వ. 276

ఆ ఆరుకోణజవింటి కాధారమైనట్టు । లొంటిగుంజమేడ నొనరనిలవ
నింటికొక్కఁడెమగఁడిదియేమిచిత్రమో । విశ్వ. 277

ఆ. ఆరుగురినిఁజేర నత్యంతదుఃఖంబు । ఏఁడుగురినిగూడ నేడుపయ్యె
పడిగవీరిపొందు వడయుటేయోంగబు । విశ్వ. 278

ఆ. ఆరుగురినిజంపి హరిమీఁదిధ్యానంబు । నిలిపినిశ్చయముగ నెగడియాత్రి
గతి నెఱుంగుచుండు ఘనుఁడగుయోగిరా । విశ్వ. 279

ఆ. ఆరుదూలములకు నాధారమైనట్టి । యొంటికంబమింటి కొనరనిల్పి
యింటికొకఁడుకర్త యేపారుచుండును । విశ్వ. 280

క. ఆరునుమూఁడునుగుళ్ళను । దీరికతోవానిమర్మ తేజములరయు
న్నేరుపుగలమనుజుండటఁ । జేరును మోక్షంబు త్రోవసిద్ధము వేమా. 281

ఆ. ఆరుమతములందు నధికమైనమతము । లింగమతముకన్న లేదుజగతి
లింగధారికన్న దొంగలులేరయా । విశ్వ. 282

ఆ. ఆరుమూఁడుగట్టి యలమటఁజెందక । పోరిగుణములడఁచి పూనిమిగుల
తేరుశిఖరమెక్కి తెలివంటఁజూడరా । విశ్వ. 283

ఆ. ఆరురుచులువేరు సారంబదొక్కటి । సత్యనిష్ఠవేరు సత్యమొకటి
పరమబుధులువేరు భావ్యుఁడొక్కండయా । విశ్వ. 284

ఆ. ఆరువేషములను నరయంగఁగడువింత । యాత్మయందు ధ్యానమమర దెందు
భీకరంబుగాని బిరుదులేదువిరక్తి । విశ్వ. 285

ఆ. ఆరుశాస్త్రములను నఖిలవేదంబులఁ । జదువనేర్తురిలను జచ్చువఱకు
వ్యర్థవిద్యఁజదివి వడిఁజెడుచుందురు । విశ్వ. 286

క. ఆర్గురుదొంగలఁబట్టుక । మార్గమున నెకొట్టి యొకనిమన్నింపఁదగుం
దుర్గము మిది తెలియంగా । నిర్గుణరూపంబుఁ దెలియునిజముగ వేమా. 287

ఆ. ఆర్యులైనఘనులు కార్యహీనులుగారు । శౌర్యధైర్యములను సంతరించి
పూర్ణభావమమరఁ బొందింపఁజేయరే । విశ్వ. 288

ఆ. ఆర్యులైనవార లనుభవరూఢిని । దెలియఁజెప్పకున్నఁ దేటపడదు
గుఱుతుఁగననివాఁడు గుఱియొప్పఁజెప్పునా । విశ్వ. 289

క. ఆరూఢజ్ఞానమ్మునఁ । జేరెడివిధమెఱిఁగి లోనజితుడైయుండ
న్నారాడని పరిపూర్ణము । తారాడక యెఱుఁగువాఁడె ధన్యుఁడు వేమా. 290

క. ఆలవగ లసౌఖ్యములకు । నాలయమగు నేనిదాని నాలనవచ్చు
న్నాలాగునఁ గాకుండినఁ । గాలునియమదూత యదియొకదరా వేమా. 291

క. ఆలనఁగా నాత్మసుమీ । యాలనఁగా నమ్మసుమ్మి యరయఁగ వెదిలో
నాలమ్మ యనఁగ నెవ్వరొ । వాలాయము దీనిఁ దెలియ వలయును వేమా. 292

ఆ. ఆలమెఱుఁగుబంటుటల్లుని జేరెనే । మాఱుపలయుఁ బొత్తు మరిగి మగఁడు
మాళ్లముంతకోళ్ల మఱికోతి కైనట్లు । విశ్వ. 293

ఆ. ఆలమెఱుఁగుయోధుఁ డల్లునిఁ జేరిన । మార్పుచేత బుద్ధి మరగి తిరుగు
బ్రమను బ్రమనుఁ దిరుగు మహిఁగోతి కైవడి । విశ్వ. 294

ఆ. ఆలిఁ దోలి వెంట నధముఁ డైతా నింక । నేలఁ బోవు టెల్ల నెఱ్ఱితనము
చెట్టుముదురనిచ్చి చిదిమినఁ బోవునా । విశ్వ. 295

ఆ. ఆలినమ్మి భువిని నాచారహీనుఁడై । పాఱిలుమాలెనొక్క ప్రతినకొఱకు
ఆడితప్పకుండఁ గాడుగాచినవాఁడు । వాఁడె పరమగురుఁడు వసుధ వేమ. 296

ఆ. ఆలినిముసువంచ కధముఁడైతా వెన్క । విహ్వలుండగుటయు వెఱ్ఱితనము
చెట్టుముదురనిచ్చి చిదిమినఁ బోవునా । విశ్వ. 297

ఆ. ఆలిమాటలు విని యన్నదమ్ములరోసి । వేరుపడెడువాఁడు వెఱ్ఱివాఁడు
కుక్కతోకఁ బట్టి గోదావరీదునా । విశ్వ. 298

ఆ. ఆలిఱంకుఁ దెలుప నఖిలయజ్ఞంబులు । తల్లిఱంకుఁ దెలుపఁ దద్దినములు
కాని తెలివికర్మకానఁ గల్పితమాయె । విశ్వ. 299

ఆ. ఆలివంకవార లాత్మబంధువులైరి । తల్లివంకవారు తగినసాటి
తండ్రివంకవారు దాయాదివర్గమా । విశ్వ. 300

ఆ. ఆలివంచలేక యధమత్వమున నుండి । వెనుకవంతు ననుట వెఱ్ఱితనము
చెట్టుముదురనిచ్చి చిదిమినఁ బోవునా । విశ్వ. 301

ఆ. ఆలిసిగ్గు చెఱుచు నగణితార్థములందుఁ । దల్లిసిగ్గు చెఱుచుఁ దద్దినమున
కర్త చేయఁ గర్మకాండంబుఁ గల్పించు । విశ్వ. 302

క. ఆలుపతిసౌఖ్యములకిల । నాలాయంబైనదాని నాలనఁదగుఁదా
నాలాగునఁ గాకుండినఁ । గాలుని పెనుదూత గదరకదియఁగ వేమా. 303

ఆ. ఆలుపర సుఖమున కాలయమై యుండ । నట్టి దాని నాలనంగ రాదు
కీలుదెలియకున్నఁ గాలుని పెనుదూత । విశ్వ. 304

ఆ. ఆలుబిడ్డ గల్గి యధికసంపదగల్గి। భజనసేయరీశుభక్తి లేక
భజన సేయనతఁడు భక్తుండు గాఁడయా । విశ్వ. 305

ఆ. ఆలుబిడ్డలనుచు నతిమోహముననున్న । ధనము మీఁద వాంఛ దగిలియున్న
నట్టి నరులకెల్ల నవని ముక్తియె లేదు । విశ్వ. 306

ఆ. ఆలుబిడ్డలు ధన మరయఁదల్లియుఁదండ్రి । కలమనుజుఁడు మిగులఁగష్టపడును
దనకునెవరులేరు తానుబ్రహ్మముగన్న । విశ్వ. 307

ఆ. ఆలుమగఁడు గూడి యల్లర్లు సేయఁగాఁ। గారిన దినుసెల్లఁ జేరఁబట్టి
బూతునాక మహిని బుచ్చుక తినరటో । విశ్వ. 308

ఆ. ఆలుమగఁడుఁగూడి యానంద మందిన । మేలుసుతుఁడు పుట్టి జాలిఁగడపు
వీలు పొంచి మించి విడలేరు భువిలోన । విశ్వ. 309

ఆ. ఆలు మగఁడు సుతుఁడు నందఱిలో నాత్మ । మేలు గానె యుండి మెఱయుచుండు
వేలు వేలుగాను వెలసె రూపంబులై । భూతగణము లెల్ల భువిని వేమ 310

ఆ. ఆలు మగనిమాట కడ్డంబువచ్చెనే । నాలుగాదు నుదుటివ్రాలుగాని
యట్టియాలివిడిచి యడవినుండుట మేలు । విశ్వ. 311

ఆ. ఆలురంభయైన నతిశీలవతియైన । జారపురుషుఁడేల జాడమాను
మాలవాఁడఁగుక్క మరిగినచందంబు । విశ్వ. 312

ఆ. ఆలు సుతులు ధనము లరయంగనీవని । మోహముననుజిక్కి మోసపోకు
కాలుఁగన్నయపుడు కనలేకచెడుదువు । విశ్వ. 313

ఆ. ఆలు సుతులుమాయ యన్నదమ్ములుమాయ । తల్లి తండ్రిమాయ తానుమాయ
తెలియనీదుమాయ దీనిల్లుపాడాయె । విశ్వ. 314

ఆ. ఆవుచన్ను పితికి యాపాలు గాచినఁ । జేరి పెరుగు చల్ల పేర్లుగలుగు
తవిలిలో నెప్పటి నవనీతగుణమును । విశ్వ. 315

ఆ. ఆవుపాలు శివుని కభిషేకమునకౌను । ఆవుపాలఁజూడ నౌషధంబు
నావుపాలనున్న యతిశయమెఱుఁగుఁడీ । విశ్వ. 316

ఆ. ఆశకన్న దుఃఖ మతిశయంబుగలేదు । చూపునిలుపకున్న సుఖములేదు
మనసునిలుపకున్న మఱిముక్తి లేదయా । విశ్వ. 317

ఆ. ఆశఁ గననివాని నాశ్రయింపఁగరాదు । ఆశఁ దీర్చువాని నడుగవలయు
ఆశగలుగునాతఁ డసలుండుగాఁడయా । విశ్వ. 318

ఆ. ఆశగోసివేసి యనలంబుఁ జల్లార్చి । గోచిబిగియఁగట్టి కోపమడఁచి
యాసవిడిచెనేని నతఁడుదా యోగిరా । విశ్వ. 319

ఆ. ఆశచేతధనము నార్జింపఁగానేల । మట్టిక్రిందఁ బెట్టి మఱవనేల
ధనము పోవవెనుక ధర్మంబుఁ దలఁతురు । విశ్వ. 320

ఆ. ఆశచేత మనుజు లాయువుగలనాళ్ళుఁ । దిరుగుచుంద్రు భ్రమలఁ ద్రిప్పలేక
మురికి భాండమందు ముసరు నీఁగలభంగి । విశ్వ. 321

క. ఆశనువిడువని జీవికిఁ । గ్లేశమువిడిపింపఁదరమె కేశవునకునా
యాశాపాశములెల్లను । కోసినఁ గ్లేశంబువిడును రూఢిగ వేమా. 322

ఆ. ఆశపాపజాతి యన్నిఁటికంటెనా । యాసచేతయతులు మోసపోరె
చూచివిడుచువారు శుద్ధాత్ములెంద్రైన । విశ్వ. 323

తే. ఆశపాశముఁ బట్టింతు రాలుసుతులు । గాసిపడనేలఁ గూఁటికే గడపరాదు
శోకమందినఁ గాలుఁడు తాకివిడఁడు । పాకమెఱిఁగిన గురుభక్తి పదిలమగును. 324

ఆ. ఆశపాశము మొదలంటఁగాఁ దెగఁగోసి । పారవేయకున్న ఫలముగలదె
కొక్కుబోనులోనఁ జిక్కుచచ్చినరీతి । విశ్వ. 325

ఆ. ఆశపాశమెల్లఁ గోసివేసినవాని । చిత్తమెపుడు గురునిఁ జేరియుండు
మోహపాశమున్న మోక్షంబు దొరకునా । విశ్వ. 326

ఆ. ఆశయనెడిత్రాఁట నఖిలజంతువులెల్లఁ । గట్టువడెనుగాని నిట్టలమున
జ్ఞానమనెడుచురియఁ బూనికోయఁగలేక । విశ్వ. 327

ఆ. ఆశయనెడుదానిఁ గోసివేయఁగలేక । మోసబుద్ధివలన మునిఁగినారు
కాశివాసులైనఁ గనఁబోరు మోక్షంబు । విశ్వ. 328

క. ఆశయె యిహపరసౌఖ్యవి । నాశముభవ బంధములకు నైరృతితానై
యీశునిఁగనుఁగొన నీయదు । ఆశవినాశంబె పరమపదవనిని వేమా- 329

ఆ. ఆశలఁ దెగఁగోసి యనలంబుఁ జల్లార్చి । గోచిబిగియఁ బెట్టి కోపమడఁచి
గుట్టుమీఱువాఁడు గురునకు గురువురా । విశ్వ. 330

ఆ. ఆశలనెడుత్రాళ్ల నఖిలజనంబులు । కట్టువడియుముక్తిఁ గానలేరు
జ్ఞానఖడ్గమునను ఖండింపలేరయా । విశ్వ. 331

ఆ. ఆశలనెడుత్రాళ్ల నమరఁగోయఁగఁజేసి । పారవైవఁగాని పరములేదు
కొప్పుకతిండి మూసఁ జిక్కిచచ్చినయట్లు । విశ్వ. 332

ఆ. ఆశలుడుగఁగాని పాశముక్తుఁడుగాఁడు । ముక్తుఁడైనఁగాని మునియుఁగాఁడు
మునియునైనఁగాని మోహంబులుడుగవు । విశ్వ. 333

ఆ. ఆశవిడక కాని పాశముక్తుఁడు గాఁడు । కాఁడుముక్తుఁడైనఁ గానిమృతుఁడు
మృతినిబడయకున్న క్షితిమోహమూడదు । విశ్వ. 334

ఆ. ఆసపాపజాతి యైహికములలోన । ఆసచేత నెవరు మోసపోరు
చూచివిడుచువారు శుద్ధాత్ములెందును । విశ్వ. 335

ఆ. ఆసనంబెఱుఁగక యానామకర్మంబు । గురువుచేతఁ దెలిసి కూర్పకున్న
మనసునిలుపకున్న మతిద్విజుండెట్లగు । విశ్వ. 336

ఆ. ఆసనములుపన్ని యంగంబుబిగియించి । యొడలువిఱుచుకొనెడు యోగమెల్లఁ
జెట్టిసాముకన్నఁ జింతాకుతక్కువ । విశ్వ. 337

ఇ

ఆ. ఇంగలంబుతోడ నిలనల్పుతోడను । బరునియాలితోడఁ బతితుతోడ
సరసమాడుటెల్లఁ జావుకు మూలంబు । విశ్వ. 338

ఆ. ఇంగిలీకము స్థితినెఱుఁగక మనుజులు। చిత్తరువులు వ్రాసిచెఱిపిరకట
బొంతజెముడుపాలు పొసగింపనేరరు । విశ్వ. 339

ఆ. ఇచ్చవచ్చునరుని కెచ్చువైష్ణవమిచ్చి । ద్విజులకన్న దొడ్డతీరటంచు
నెల్లచోట్లకరిగి పల్లాండుఁబాడరే । విశ్వ. 340

ఆ. ఇచ్చినొచ్చువేల నిలభోగభాగ్యముల్ । వచ్చిపోవుచుండు వాంఛదీఱ
చచ్చినట్లునరుఁడు శత్రుఁడైసాధించు । విశ్వ. 341

ఆ. ఇచ్చిపుచ్చుకొన్న హితమైనమనుషులు । తగ్గులేక యల్లుతామరవతె
కాచిపూచిపండి కడురమ్యమైయుండు । విశ్వ. 342

క. ఇచ్చెడివారలసంపద । యెచ్చెడి సేకానిలేమి యెట్లుకలుగుం
అచ్చెలమ నీరుచల్లిన । విచ్చలవిడి నూరుచుండు వినరావేమా. 343

ఆ. ఇచ్చకంబుచేత నిందీవరాక్షులు । మచ్చరంబుమాని మగనిఁజేరి
తుచ్ఛగుణమువిడక దూఱుచునుందురు । విశ్వ. 344

క. ఇచ్చకము భువినవశ్యము । కచ్చితమీలోకనింద కోవిదునకునీ
తచ్చనవె హానివచ్చును । మచ్చరమే తన్నుఁజెఱుచు మహిలోవేమా 345

ఆ. ఇచ్చువానికంటె నింద్రియనిగ్రహుం। డతనికంటెఁజాల నవనిమఱచు
వాఁడువానికంటె వీడినపుణ్య పా । పములప్రీతినిసముఁడు భవుఁడువేమ 346

ఆ. ఇచ్చువానియొద్ద నీనివాఁడుండిన । చచ్చుఁగానియీవి సాగనీఁడు
కల్పతరువుక్రింద గచ్చచెట్టున్నట్లు । విశ్వ. 347

ఆ. ఇంచుకంతబోన మీశ్వరార్పణమన్న । పుణ్యలోకమునకుఁ బోవునతఁడు
అన్నదానమునకు నధికదానములేదు । విశ్వ. 348

ఆ. ఇంచుకంతసుఖమె యీరేడు జగములు । కంచమునకుఁబిల్లి గాచినట్లు
పంచబాణుబారిఁ బడలుచునాసింత్రు । విశ్వ. 349

క, ఇటునటు పుట్టినపురుషులకుఁ । బటుతరముగఁ బుట్టినట్టి బాపనవారల్
దిటముగ బ్రహ్మమునెఱుఁగక । నటియించిన ముక్తిలేదు నయముగ వేమా. 350

ఆ. ఇట్టికనులబ్రిష్ట మెట్టుచూడఁగవచ్చుఁ । జూచుకనులువేఱు చూపువేఱు
చూపులోననుంచి చూడంగవలవదా । విశ్వ. 351

ఆ. ఇట్టిఘటములోనఁ బెట్టినజీవునిఁ । గానలేక నరుఁడు కాశికేగి
వెదకివెదకియతఁడు వెఱ్ఱియైచెడిపోవు । విశ్వ. 352

ఆ. ఇట్టితనువుగలిగి యీలోకమందును । బుట్టిచచ్చుభ్రమను గట్టిగాను
తెట్టతెరువుఁజేరి తెలివంటిచూడరా । విశ్వ. 353

ఆ. ఇట్టిపద్యపంచకైశ్యముఁదెలిసినఁ । బెట్టిపుట్టికట్టి పృథివిబ్రదికి
చచ్చిశుద్ధుఁడగుచు సర్వజ్ఞుఁడైనిల్చు । నెల్లమహిమనీకుఁ జెల్లువేమ. 354

ఆ. ఇట్టియౌవనమున నీశ్వరధ్యానంబు । కలిగిచేయవలయుఁ గడఁకతోడఁ
జేయకున్నయెడల క్షితిసౌఖ్యమేదయా । విశ్వ. 355

ఆ. ఇష్టలింగమందు నీరేడుజగములు । పుట్టిబ్రదుకనరులు భువినివెలసి
గట్టిగాయిమునికిఁ గానుకలైయుండు । రసనిజనులు చెప్పడవుర వేమ. 356

ఆ. ఇట్టిసాధువిద్య యెంతలేదనిచూచి । గాధవిద్య నేర్చి కానలేక
సాధుసజ్జనముల సాంగత్యమెఱుఁగక । బాధపడుదురు తుదఁబరులువేమ. 357

ఆ. ఇంటిపగనిఁజూచి యిల్లాలు దుఃఖించి । వెంటవిటునిఁదగిలి వెతలఁబడును
తుంటరైనదానిఁదోలఁగింప మేలురా । విశ్వ. 358

ఆ. ఇంటియాలివిడిచి యిలజారకాంతల । వెంటఁదిరుగువాఁడు వెఱ్ఱివాఁడు
పంటచేనువిడిచి పరిగెయేరినయట్లు । విశ్వ. 359

ఆ. ఇంటియింటిలోన నీశ్వరుండుండగ । నంటిచూడలేక యడవులందు
నుంట మేలటంచు నుందురు జోగులై । విశ్వ. 360

ఆ. ఇంటిలోననున్న యీశ్వరునెఱుఁగక । కంటిమింటినడుమఁ గనుటయెట్లు
జంటఁబాయనెఱుక జాలంబుఁద్రుంపరా । విశ్వ. 361

ఆ. ఇంటిలోనజ్యోతి యెంతయు వెలుఁగఁగాఁ । బొరుగువారయగ్గి కరుగనేల
తాను దైవమాయె దైవముఁగొలుచునా । విశ్వ. 362

ఆ. ఇంటిలోనికోతి యిరవుఁగానఁగలేక । తిరుగఁబోవువారు తీరకుండు
కోతినొకఁటనిల్పి కుదురుండలేరయా । విశ్వ. 363

ఆ. ఇంటిలోనిధనమె యిదినాదియనుచును । మంటిలోనదాచు మంకుజీవి
కొంచుఁబోఁడువెంట గుల్లకాసునురాదు । విశ్వ. 364

ఆ. ఇంటివెనుకఁదిఁగ యింగ్లికముండంగఁ । బారదంబుఁగలుగఁ బసిడివేల
సత్తుపొత్తుఁజేసి సాధింపవచ్చురా । విశ్వ. 365

తే. ఇట్టియోధానుయోధులై యిలనుబుట్టి । గట్టిగానుండువేళను గడచిరపుడు
మండలంబునుగానక మఱచిరంతఁ । దెలిసినడచినవారె పోతీరువేమ. 366

ఆ. ఇడనివానిచేత నిప్పించుఁదనప్రాప్తి । యిచ్చువానిచేత నీయనీదు
ఇయ్యఁబుచ్చుకొనఁగ నిరువురుకర్తలా । విశ్వ. 367

క. ఇడపింగళనాడులకు । న్నడుమసుషుమ్నమువెలుంగు నడయాడంగాఁ
గడుమస్తర మదిగననా । నడుమనెయిన చంద్రహారుల నగరమువేమా. 368

ఆ. ఇతరచింతలన్ని వెతలనిమదినెంచి । జతుకమంటిరీతి జగమునుఱచి
సతతమాత్మయందె సయ్యాటలాడరా । విశ్వ. 369

క. ఇతరాపేక్షలుగోరక । సతతముగురుభక్తియుక్తి సారముఁగనకే
గతియగుబ్రహ్మానందము । మతికింపుగఁదోఁపఁబోదుమహిలోవేమా. 370

ఆ. ఇంతకాలముండి యెఱుకమాలినజీవి । చచ్చిపుట్టుచుండు సహజమనుచు
నెఱుకమఱచుచోట నెఱుఁగునాబ్రహ్మంబు । విశ్వ. 371

ఆ. ఇంతవగపదేల నేకాంతబుద్ధితో । హరిహరాదులందు నాశలుడిగి
శాంతబుద్ధినుండ సమకూడునుసుఖంబు । విశ్వ. 372

ఆ. ఇంతవగవనేల నేకాంతబుద్ధిని । హరిహరాదులందు నాసలుడిగి
వాసనలఁదెలిసిన వాఁడెపోబ్రహ్మంబు । విశ్వ. 373

ఆ. ఇంతికనులువింత వింతలౌచున్నలం । చింతగవయువాని నెఱిఁగితొలఁగి
సరసకరుగనతఁడె సర్వదాయోగిరా । విశ్వ. 374

ఆ. ఇంతిఁగన్నఁజన్ను లింతింతలనిచూచి । మోహపడునుబుద్ధి మోసపోయి
గరితలేనివాని కానలేదాయెరా । విశ్వ. 375

ఆ. ఇంతిచనులబిరుసు కొంతకాలమెకాని । పంతగించిచూడఁబాలతిత్తి
చెంతవిడకయేడ్చి చీరఁడేపుత్రుండు । విశ్వ. 376

ఆ. ఇంతిఁజూచెనేని నింతంతయనరాదు । కాలవహ్నిలక్కగరఁగినట్లు
పట్టిమోహమిట్లు రట్టులఁజేయురా । విశ్వ. 377

ఆ. ఇంతితనదుపేరె యెల్లకాలంబును । బ్రజలుదలఁచునట్లుప్రతిభఁగాంచె
నింతికిఁబతిభక్తి యెంతనవచ్చును । విశ్వ. 378

తే. ఇంతియాకృతిపై యాస కెదురు చూచి । చింతలోఁబడి ప్రాణము ల్చిక్కఁబట్టి
యంతుఁగన లేక చచ్చెదరవనిలోనఁ । గాముకులగతి యారీతి కాదెవేమ. 379

ఆ. ఇంతులఁగనఁగానెయింతింతి యనరాదు । అగ్గిలక్కకరఁగనైనరీతి
వెలయు మోహ మిట్టి వింతలు చేయురా । విశ్వ. 380

ఆ. ఇంద్రజాలమట్టు లీజగద్భ్రాంతులు । చంద్రకళలు దాటి సఖ్యపడెదు
రంధ్ర మందుఁజేరి రహిమీఱఁగాంచువే । వేంద్ర పూర్ణపదవి విడక వేమ. 381

ఆ. ఇంద్రపదవిఁగోరియింపుగాయజ్ఞముల్ । కలిమిచేతఁజేసి కామ్యులైరి
పరమయోగమూని పట్టఁగలేమిని । విశ్వ. 382

ఆ. ఇంద్రలోకమనఁగ నింద్రజాలమనంగ । నింద్రవిద్యలనఁగ నన్నియొకటె
కలియుగమున నరులు కానరు భ్రమచేత । విశ్వ. 383

ఆ. ఇంద్రలోకమైనఁ జంద్రలోకమైన । నందిచూడవచ్చుఁ బొందుగాను
నందిమీఁద నెక్కి నయముగఁ జూడరా । విశ్వ. 384

క. ఇదినాపుఁ జాలదనుచును । మదిలోఁదా నెపుడుఁ దలఁచి మమతఁగను మతిం
బొదలుచు విడువంజాలని । దదియే సంసార బీజమనఁబడు వేమా. 385

క. ఇదియదిగానిది మదిలోఁ । జెదరని గుఱితోడఁ జూచి చేపట్టి కనం
గదలక మెదలక తోఁచెడు । విదితంబే దండుఁబెనఁగి వెలయును వేమా. 386

ఆ. ఇదియెపరమటంచు మదికిఁ దోఁచినఁజాలు । మనసుచెదరకొక్క మట్టు పఱచి
సుధను గ్రోలువాఁడు సుడిఁబడి చచ్చునా । విశ్వ. 387

క. ఇది రాజ మార్గభావము । సుదయై జగములకు నెల్లసూక్ష్మాకృతియై
సదమల మదియైతోఁచెడు । నదియే పరమైన బయల దరయర వేమా. 388

క. ఇదిలేక జరుగ దనుచును । మదిలో నేపస్వైన మమతఁదగు మతిం
గదిసి విడి పోవఁజాలని । దదెపో సంసార బీజమనఁబడు వేమా. 389

వ. ఇది సామాన్యముగాదు, సరస్వతులకు నైపొంగరాదు, నారద దత్తాత్రేయుల యినను దీని యోగ మెవ్వరు నెఱుంగరు. బ్రహ్మవంశజుండగు లంబి కాశిప యోగులవారు నాకుమూలగురువు, విశ్వకర్మ వంశజుండగుకొండవీఁటి అభిరామయ్యగారు నాకుమధ్యగురువు, వారుముక్తిఁజూపవారిరువుర శిష్యుఁడైనవెత్తి వేమన్నకుఁగాని యెఱుకలేదు, తనదుశాంతుఁడగు తండ్రి రెడ్డన్న మహిత కీర్తివహించు తల్లిమల్లమ్మతల్లినిఁ బోలఁదగినదివదిన, ఆమెరాజ్యంబు కొండవీఁడు, మూగచింతలపల్లె మొదటి యిల్లు, భువనంబులు విష్ణుమాయ శివుని తేజంబు బ్రహ్మకుటుంబము, కలియుగధర్మ మేమనిచెప్పవచ్చు? సర్వకాల సర్వావస్థలయందు సత్సమాధి నోలలాడుచుండెడు వతని యోగీంద్రుఁడని చెప్పవచ్చువేమా. 390

క. ఇంద్రియపరవశుఁడ ధముం । డింద్రియపరవశుఁడె భక్తియెడ మధ్యముఁడౌ
నింద్రియ జయుఁడుత్తముఁడుజి । తేంద్రియసమధికుఁడు వినమహేశుఁడు వేమా 391

ఆ. ఇంద్రియముల చేత నెగ్గొందుచుండెడు । వెఱ్ఱిమనుజుఁడేల వెదకుశివుని
నింద్రియములఁ దోసి యీశునిఁ జూడరా । విశ్వ. 392

ఆ. ఇంద్రియముల చేష్ట లెన్నక భువిలోనఁ । దన్నుఁ దెలిసి మదిని తమకముడిగి
మింటి మంటి నడుమ మిత్తి నిరోధింపరా। విశ్వ. 393

ఆ. ఇంద్రియముల భ్రాంతి నీరేడు జగముల । మందుఁ బెట్టి నట్టి మరులు గొనుచుఁ
బొందు సుఖము చేతఁ బుత్రులఁ గాంచిరి । సకల జనులు నిట్లు జగతి వేమ. 394

ఆ. ఇంద్రియములు విడిచి యేకస్థుఁడై నిల్చి । ఎటఁగి తన్నుఁ బిదప నెఱుఁగకున్న
యతఁడె మాని జ్ఞాని యౌనని యందురు । విశ్వ. 395

ఆ. ఇంద్రుఁడాయెఁ గామిహీనుఁడై పోయెను। మారుఁడాయెఁ గామిమడిసిపోయె
బ్రహ్మయాయెఁ గామిబయిసి పోనాడెను । విశ్వ. 396

ఆ. ఇంద్రుఁడైనఁ గాని చంద్రుఁడైనను గాని । నందిదుర్గ మెక్కి నాతితోడి
పొందుఁ బడక ముక్తి పోరాడవలెనయా। విశ్వ. 397

ఆ. ఇన్నిజాతులందు నేజాతిముఖ్యమా। నెఱుక గల్గువారె యెచ్చుగారె
యెఱుకలేని వారలే జాతియన్నను। మాలకంటెఁ జెడుగు మహిని వేమ. 398

ఆ. ఇన్నినాళ్లనుండి యెనసిన మోహంబు। చెలిమి చుట్టరికము చెల్లెలక్క
తల్లితండ్రి బిడ్డ దాయాదులను నిట్టి। భ్రాంతి చేతఁ జిక్కుపడుర వేమ. 399

ఆ. ఇన్నిఫలములందు నేఫలంబెక్కువ। అన్నఫలముకంటె నధిక మేది
కన్నదిఁ కఁగనని దిన్పించునారూపు। విశ్వ. 400

## అంత్యనియమ ఘటిత చిత్రపదము.

ఇనుమునఁ జేసిన మైనపుదిడ్డి। ముంటిమొనన ట్రావులదొడ్డి
కూర్చుండి మేపిన కుందనగడ్డి। విప్పిచెప్పరా వేమారెడ్డి. 401

ఆ. ఇనుము విఱిగనేని నినుమాఱు ముమ్మాఱు। కాచియతుక నేర్చుఁ గమ్మరీఁడు
మనసు విఱిగనేని మఱియంట నేర్చునా। విశ్వ. 402

ఆ. ఇమ్ముదప్పువేళ నెమ్మెలన్నియుఁ దప్పుఁ । గాలమొక్కరీతిఁ గడపవలయు
విజయుఁ డనువుదప్ప విరటునిఁ గొలువఁడా। విశ్వ. 403

ఆ. ఇయ్యనతని చేత నిప్పించుఁ దనపాప్తి । యిచ్చువాని చేత నీయనీదు
ఇయ్యఁ గొనఁగ నీశ్వరుఁడే కర్త । విశ్వ. 404

ఆ. ఇయ్యఁబుచ్చుకొనఁ గనింపొందు ప్రాణియా। నయిననటులఁ జేయనలవిగాదు
మనసుఁ గాననిలసుమతి యెక్కరును లేరు। విశ్వ. 405

తే. ఇరవుఁ గనుఁ గొనిపరమార్థమెన్నఁ గోరి। పరమనిర్గుణపుబయటఁ బ్రాకినిలిచి
తన్మయంబున మదినిల్పి తనరుయోగి। శాశ్వత సుఖంబు నొందునుసతమువేమ. 406

ఆ. ఇఱుకువచ్చువేళ నీశ్వరుఁ దలచినఁ। గరుణఁ గను నెవట్టిగాసిగాక
సుఖమువచ్చువేళఁ జూడంగ లేరయా। విశ్వ. 407

ఆ. ఇరుగుపొరుగులందు నిమిడికతోనుండి। తనకుఁదానె మొదలితలఁపుఁజూపి
ధర్మమన్నయెఱుక తన్నుఁదాఁబోడఁజూపు। కర్మఫలమువలనఁ గలిగివేమ. 408

ఆ. ఇరుగుపొరుగువారి కెనయు సంపదఁజూచి। తమకులేదటన్న ధర్మమేమి
ధర్మమన్నఁదొల్లి తన్నుకచచ్చిరి। కర్మఫలము నేఁడు గలిగెవేమ. 409

క. ఇరుమూడక్షర సాధన। పరుఁడగు నిర్వాతదీప పద్ధతిమదిలో
గుఱిమీఱి బయలుసేరిన। నిరుపమసానందమూర్తి నిత్యుఁడు వేమా. 410

క. ఇరువదియారవ తత్వం। బరయఁగ జీవాత్ము నెలవ యలపరమాత్ము
న్నిరవందఁగూర్చు గురుపద। మరయంగానందుయోగి యందురు వేమా. 411

ఆ. ఇలనుజ్ఞానమనెడి యీత నేర్చినవాఁడు। జలధియనెడు తమముజడియకవిడి
విలయమనెడిగట్టు వెఱవక దాఁటురా। విశ్వ. 412

ఆ. ఇలనుశూద్రులౌట నెఱుఁగరు మొదలను। మనసునతనిమీఁద మరులుకొల్పి
కొల్వఁగా రెద్విజులు కోటానుకోట్లెల్ల। విశ్వ. 413

ఆ. ఇలమిషలనుబన్ని యేమేమిచెప్పినఁ। గలుగఁబోదు పరము కపటముడిగి
వెలయుమనసుఁబట్టి వేడ్క చేఁజూడరా। విశ్వ. 414

ఆ. ఇల్లుకల్లఁజేసి యిహముపరముఁజేసి। దీనవృత్తిచేతఁ దిరుగుచుండి
భక్తి కలిగియున్న ఫలమెట్లులేదయా। విశ్వ. 415

ఆ. ఇల్లునాలివిడిచి యినుపకచ్చలఁగట్టి। వంటకంబునీటి వాంఛలుడిగి
యొంటినున్నయంత నొదవునాతత్వంబు। విశ్వ. 416

ఆ. ఇల్లువిడిచినట్లె యిల్లాలిమదిరోసి। తల్లడంబుమాని తలఁపునిలిపి
యొడలుమఱచియోగ ముల్లసిల్లెడునట్టి। వాఁడెపరమగురుఁడు వసుధ వేమ. 417

క. ఇల్లుసుమీ సంసారమె । యిల్లుసుమీ యాయుధంబు నిఁకవినుచాలం
దల్లిసుమీ పంచాక్షరి । కల్లసుమీ సతులవలపుఁగనుగొనవేమా. 418

ఆ. ఇష్టలింగముండ నిఁక నేమిగానక । పర్వతమున కేగుఁ బామరుండు
ముక్తి లేకనరుఁడు మూర్ఖుఁడై చెడిపోవు । విశ్వ. 419

ఆ. ఇష్టలింగమేది యిళశిలలింగంబె । నిష్ఠమీఱమెడను నీల్గఁగట్టి
కష్టపడుటెకాని కలుగదుమోక్షంబు । విశ్వ. 420

ఆ. ఇష్టసిద్ధికొఱకు నీరారుబీజముల్ । కష్టమునను జదివికానలేఁడు
నిష్టలోననిష్ట నిజమనికనవలె । విశ్వ. 421

ఆ. ఇష్టసిద్ధిఁగోరి కష్టమొందఁగలేరు । నిష్ఠనెఱిఁగినంత నిష్ఠలోన
అష్టసిద్ధులందు నమరుటఁగానరో । విశ్వ. 422

ఆ. ఇసుకబొగ్గురాయి యినుముఁజర్మంబును । గసవుపొల్లుగట్టికట్టెపెట్టి
పల్లుదోమినట్టి పాపాత్ముఁడెవఁడయా । విశ్వ. 423

ఆ. ఇసుకబొగ్గురాయి యినుమునుస్వర్ణంబు । కసవుపోచవలెను గన్నవాఁడు
పరమపదముగాంచుఁ బరిణామమందును । విశ్వ. 424

ఆ. ఇహపరంబులందు నింతులపైయాస । సహజవృత్తిఁదగిలి సమయుచుండ్రు
రహితమమరుభక్తి రాణింపదేలకో । విశ్వ. 425

క. ఇహపరసౌఖ్యము లొల్లక । దహరమునను గుటినిడించి దత్తముగాఁగం
గుహరములో వెలిబయలున । మహదాకాశంబుఁజేరు మహిలోవేమా. 426

ఆ. ఇహపరాదులకును, నిదిసాధనంబని । వ్రాసిచదివివిన్న వారికెల్ల
మధ్యకర్మములను మహిమతోనడఁచును । బరులకైనముక్తిపథము వేమ. 427

ఆ. ఇహమునందుగురుని కీదేహమిచ్చినఁ । బరముఁజూపిగుఱుతుఁ బట్టియిచ్చు
స్థిరముగానుబుద్ధి చెడనీక చూడరా ।విశ్వ. 428

ఆ. ఇహమునందు నేమి యిడుమలఁబడినను । బరమసాధనార్హ పథముగాదు
గురునియుక్తిమీఱి గుర్తించిచూడరా । విశ్వ. 429

ఆ. ఇహమునందుఁబాధ లెన్నైనఁబడవచ్చు । యముని బాధలేక యమరవలెను
బరులబాధలేక బ్రదుకుఁడీ నరులార । విశ్వ. 430

ఆ. ఇహమునందుఁబుట్టి యింపారుచున్నట్టి । జనులుమృగఖగములుస్థావరములు
జంగమాదులనుట జగతిలోభవకోటి । విశ్వ. 431

ఆ. ఇహమునందుసుఖము లింపారకుండినఁ । బరమునందు నెట్లు పడయవచ్చు
మొదటలేనిచేత తుద నెట్లుకలుగురా । విశ్వ. 432

ఆ. ఇహమునందుసుఖము లీడేరఁగాలేదు । పరమునమ్మి నేని బ్రతుకనగునె
మొదటలేనిసుఖము తుద నెట్లుకల్గురా । విశ్వ. 433

ఆ. ఇహమునం దెచాల యిడుమలువడినను । బరముసాధనపడ తరముగాదు
పేదకనువుపడునె పృథివిపైభాగ్యంబు । విశ్వ. 434

ఆ. ఇహమునందుసుఖమె యింపారలేదట । పరమునందుసుఖముఁబడయు టెట్లు
మొదలు చేవలేక తుద నెట్లుకల్గురా। విశ్వ. 435

ఆ. ఇహమున సుఖియింప హేమతారకవిద్య । పరమునసుఖియింప బ్రహ్మవిద్య
కడమవిద్యలెల్లఁ గల్లమూఢులకెరా। విశ్వ. 436

ఆ. ఇహమువిడిచి ఫలము లింపుగఁగలవని । మహినిబల్కువారి మతముకల్ల
యిహములోనె పరము నెసఁగుటఁగానరో । విశ్వ. 437

## ఈ

ఆ. ఈకనులను మిమ్ము నెట్లు చూడఁగవచ్చు । చూపుకనులువేఱు చూపువేఱు
చూపులోననుండి చూడంగవలయురా । విశ్వ. 438

క. ఈకపటనాటకము మఱి । యీకపటపుఁ జదువులన్ని యింపుగదురఁగా
నేకపటాత్ముఁడు సేసెనొ । యీకపటాత్మునకు మ్రొక్కి యలరుము వేమా. 439

ఆ. ఈకెలంటఁజేసెఁ దోకలంటనుజేసెఁ । గోకలంటఁజేసె లోకమునను
మానరక్షణంబు మర్యాదయని తెల్ప । విశ్వ. 440

ఆ. ఈకెలనుచుఁగొన్ని తోకలనుచుఁగొన్ని । కోకలనుచుఁగొన్ని గోచులనుచుఁ
గొన్నియాయెనున్న గుఱుతును మాయఁగా । విశ్వ. 441

ఆ. ఈఁగతలవిషంబది యుడదునీలోనఁ । దేలుతోకవిషము తెంపుఁజూపు
పాముకోరవిషము పట్టిచంపునుగదా। విశ్వ. 442

ఆ. ఈఁగ తేనెరుచికి నింపుగాఁజచ్చును । ఓగుకామరుచికి నొరిగిచచ్చు
త్యాగిగానివాని ధర్మమ్మడుగఁజచ్చు। విశ్వ. 443

ఆ. ఈఁగయెట్టిదన్న నీశ్వరువంటిది । తెలిసిచూడమన్నఁ దేటపడదు
అదియుగురువులేక యబ్బునా తెలియంగ। విశ్వ. 444

క. ఈఘటమునందుఁజూచియు । నేఘటమున నింతెయనుచు నెఱుఁగకమదిలో
నేఘటముమీఁదవాంఛయు । మోహంబని కొనఁగవలయు ముఖ్యము వేమా. 445

క. ఈఘనసూత్రమెఱుంగుమి । నీఘటమున శివుఁడు సేరి యిరవుకొనంగా
నేఘటపటములకందక । తాఘనుఁడై యాడుచుండుఁ దథ్యము వేమా. 446

క. ఈచెవిఁ గొఱికిన నొల్లరు । వాచవులను విందుమన్న వాక్యంబులచేఁ
బూచనుబడుచులు వెఱచిన । యాచందములాయె జగములన్నియు వేమా. 447

ఆ. ఈజగమున ముక్తికిరు మాఁటికవ్వల । రాజమార్గ మమరురంగుగాను
తేజమూనినొక్క తెంపుగాఁజూడరా। విశ్వ. 448

ఆ. ఈడుగానిదెఱిఁగి తోడుసుఁ బొల్పడి । జోడుగూడరాదు సూటిగాదు
ఆడితప్పెనేనిఁ గీడపకీర్తిరా । విశ్వ. 449

ఆ. ఈతకన్నలోతు నెంచంగఁబనిలేదు । చావుకన్నఁగీడు జగతిలేదు
గోచిపాతకంటెఁ గొంచెంబిఁకనులేదు । విశ్వ. 450

ఆ. ఈతగింజవంటి దెఱిఁగియుదానికే । యాసపడును మనుజుఁడవనిలోన
దోయజాక్షిఁజూచి తొలఁగంగవశమానె। విశ్వ. 451

ఆ. ఈతగింజంటి దెవ్వరెఱుంగరు । ఆశపడుదురవని నఖిలజనులు
దీనివిడిచినట్టిధీరులెవ్వరు లేరు। విశ్వ. 452

క. ఈతనువునందుఁజూచిన। నేతనువులకింతెయనుచు నెదిరినిదన్నుం
జూతురు లోగాఁజూపున । నాతురముగఁ దపసులెల్ల నమరఁగ వేమా. 453

ఆ. ఈతరానివాఁడిఁ కెగరోజి యెగరోజి। యేరుదాటఁగలఁడే యీఁదఁబోయి
పరుఁడు గానివాఁడు పరలోకమందునా। విశ్వ. 454

గీ. ఈతవచ్చినపుడు లోతనిపించునా। పాతలంజె కటులె భయములేదు
కోతికొమ్మకెక్కి కుప్పించిదాటదా। విశ్వ. 455

క. ఈ తెఱిఁగిన వారైనను। లోతైనటువంటి నూతిలోఁబడిపోరా
యీతలు నేర్చిన నేలా। చేతిరుగక యున్న నేమి చేయుదు వేమా. 456

ఆ. ఈఁదవచ్చు నేఱు బాధలేకుండఁగనె । యాదిగురువు లేక యందరాదు
సోదిఁజెప్ప నేలఁ జొక్కినమదిఁ జూడు । విశ్వ. 457

ఆ. ఈఁదిదాటవచ్చునే సాగరంబైన । సాధువృత్తితోడ సమయమాయు
పాదుకొనినమనసు పరిపూర్ణమందురు । విశ్వ. 458

క. ఈదేహి కెన్నిభంగుల । బోధయొనర్చినను నెంతపాలు పగునటుగా
నీదేహ మలినముడిగిన । భేధంబులు మానిముక్తిఁ బెడగనువేమా. 459

ఆ. ఈనినట్టి పులినిబూని చంపఁగవచ్చు। మనమ మర్మమరసి కనఁగవచ్చు
తానకంబు మఱిగి తగులుట సాధ్యంబు । విశ్వ. 460

ఆ. ఈనివాని చేత నిప్పించుఁదనగతి । యిచ్చువాని చేత నీయనీక
యీయనీయకుండ నితరులుకర్తలా। విశ్వ. 461

ఆ. ఈ నెలో నెపుట్టి యీ నెలోఁబెరిగియు । నీ నెలో నొకరికి నియ్యలేఁడు
ఈ నెలోని వాఁడె యీలేనివాఁడురా। విశ్వ. 462

క. ఈమాయ జగముఁజూడఁగఁ । బ్రేమాస్పద దృష్టిలోనఁ బెంపగుచుండుం
గామాంధకారమునఁబడి । ధీమసమునఁ దెలియలేరు దేవునివేమా. 463

క. ఈరారక్షరజపమునఁ । బోరాడినముక్తిగలదు పూనినవారల్
వే రెన్నని మదిలోపల । మాటాడకపూర్ణతఁగని మనెదరువేమా. 464

క. ఈరారక్షర మంత్రము । పోరాడనిపతనమమరి పొందికపడనా
సారమె శరీరమూలము । నారూఢతపంబుసుమ్మి యవనినివేమా. 465

క. ఈలోక చిహ్నలన్నియు । మేలుగ గురుశక్తిఁగూడి మిన్నందినచోఁ
గాలుఁడెదుర్కొనఁజాలఁడు । చాలును జన్మంబులనుచుఁ జాటరవేమా. 466

క. ఈలోకమర్త్యులందఱు । స్త్రీలోలతమగ్నులగుచుఁ జిక్కెదరకటా
కాలుని మదిలోనెంచరు । మేలగుపురుషార్థమహిమ మెచ్చరువేమా. 467

ఆ. ఈశ్వరనకునుంచితి సుమంతయగుసొడ్డు । బ్రహ్మకేనొసఁగితిఁ బాడుసొడ్డు
విష్ణుదేవునకిడి విపరీతమగుసొడ్డు । విశ్వ. 468

ఆ. ఈశ్వరునిఁదలంప నేపుపాల్లగఁజేసి । తనదుమూర్తినెల్ల దారఁబోసి
నిత్యకర్మములను నిలుచురా నెరయోగి । విశ్వ. 469

తే. ఈశుమీఁద భక్తి యిసుమంతయును లేక । పాశమందుఁ జిక్కి ఫలముఁ గనక
కాశియాత్రఁ బోవఁ గాలుఁ డెఱుంగఁడా । విశ్వ. 470

ఆ. ఈషణత్రయంబు నెడపంగ నేరక । మోహరాశిలోన మునిఁగియుండు
జనులకెట్లు మోక్ష సౌఖ్యంబు కలుగురా । విశ్వ. 471

తే. ఈషణాదులనన్నింటి నీడ్చిపట్టి । మోసశోకయుమదిలోన గాసిపడక
రోసిబయలునఁ జేరుట వాసియగును । ఇట్టులగు నాతఁ డెన్నికకెక్కు వేమ 472

ఆ. ఈస్వరంబులన్ని యేడుపాళ్లుగఁ జేసి । యేడుమూర్తులకవి యిచ్చివేసి
నిత్యకర్మమునను నిలుచురా నెరయోగి । విశ్వ. 473

వ. ఈస్మృతి సామాన్యముగాదు, అష్టాంగయోగులకును, గురుముద్రభావులకును, సాంఖ్యతారకయోగ లక్షణజ్ఞులకును, వ్యాసవాల్మీకాది వరమునీంద్రాదులకును, దీనిరహస్యంబెవ్వరికి నెఱుకపడదు. ఇట్టి తేజంబుఁ జూడ రేచక పూరక కుంభకంబులనంటి యాపరబ్రహ్మంబు తానెయన నెఱుకపడు. నేనజుఁడఁగాను. హరినిగాను. హరుఁడఁగాను నరుఁడనైన సద్గురుకరుణాకటాక్షంబున నీకవిత్వంబుఁ జెప్పంబూనితిఁగాని దండి వాఁడననియెంచవలదు. నేనెంతవాఁడనని నమస్కరించి పరమఘోరభవతారక తాండవమండలికుండలి జ్యోతిచిన్మయాకారంబిట్టిదని పరికింపంజూడ స్థూలసూక్ష్మ కారణంబులైయుండు. తర్కవాదు లిట్టివచనము నిజమో యనిజమో యనితర్కింపఁగడఁగుదురు. అట్టివారలకు నట్టిదిగానే యుండును. మహినిగొండవీఁటి మహిమపర్వతగుహ యందుఁ గొండవీఁటి యభిరామయ్యగారివలన లంబికాశివయోగీంద్రుల వారియొద్ద దొరికె. ముక్తిపదవిఁ జూడఁ దెలియఁగలరా? కఠినంబుగాదె? సులభమైయుండునా? మహాతేజమైపారురుచుండెడు చిద్రూపంబుఁ జూచిన పురుషుండు పృథివిలో నెవ్వరని చెప్పశక్యము? ఎంతవారలైన నంతవారనియె చెప్పవలయు సర్వకాల సర్వావస్థలయందు సత్యమాధినోలలాడుచుండెడు నతఁడు యోగీంద్రుఁడని చెప్పఁబడును వేమా. 474

ఉ

తే. ఉక్కుకత్తి నీఁ జేఁబూని యున్నవాఁడు । కుక్కనక్కలు బెదరింపఁ గొంకుపడఁడు
దృక్కుదృశ్యంబులనుమించి తెలియఁగానఁ । జక్కగా నొప్పుమనమునజరుగు వేమ 475

ఆ. ఉక్కుకల్లుఁదిన్న నోరికిఁ దేటగాఁజేయు । నుక్కుకల్లుఁదిన్న నుడుగు వ్యాధి
యుక్కుకల్లకన్న నుర్విఁగల్పములేదు । విశ్వ. 476

ఆ. ఉక్కుచూర్ణముఁదిన నుడుగునుగష్టమ్ము । లుక్కుచూర్ణముఁదిన నుడుగుక్షయయు
నుక్కుచూర్ణముఁదిన నుడుగునుగర్మముల్ । విశ్వ, 477

ఆ. ఉక్కుఁదిన్నవాఁడె యుర్విపైసిద్ధుండు । ఉక్కుఁదిన్నవాఁడె యుండుజగతి
ఉక్కుసుధకుమీఱు నెక్కుడుకల్పంబు । విశ్వ. 478

ఆ. ఉక్కురసముఁజేర్చి యుదుటుగసిందూర । హారిదళములచేత హాతముచేయఁ
గరసవాదపది యొధరఁజేయలేరది । విశ్వ. 479

ఆ. ఉక్కుశుద్ధిచేసి చుంచితినెడువాఁడు । ఉక్కుదిటవువలెనె యుండుజగతి
ఉక్కుచూర్ణముఁదిను టొప్పగుకల్పంబు । విశ్వ. 480

క. ఉచ్చఁదగు శ్వాసశ్వాబ్రహ్మగు । నిచ్చలునిశ్శ్వాసహరియె నిజమెఱిఁగిసదా
యచ్చుపడ వానితోడను । మచ్చికశివుఁజేర్చి వెలసిమనరా వేమా. 481

తే. ఉచితమిత్రులు సతిసుతులూరుపేరు । ధనముధాన్యంబుఁబాడియు ఘనమతములు
నాశనంబొందునివి యెల్లనమ్మఁబోకు । నీవెస్థిరుఁడవెఱుంగరా నిన్నువేమ. 482

ఆ. ఉచితవంతుఁడైనను ద్యోగపరుఁడన్న । సాగిపారియున్న సమయమునను
పరులకుపకరించి పరగరక్షించును । విశ్వ. 483

క. ఉచితాహారమువల్లనె । యుచితంబుగబుద్ధిస్థిరత యొప్పునటులనే
యుచిత గురుబోధవల్లను । సుచరితుఁడైపరముఁగాంచు సుమ్మురసేమా. 484

క. ఉచ్చకుఁ దోవిగుతావుఁ । ద్రచ్చంగాజగముపుట్టెఁ దాతలనాఁడే
హెచ్చగు కులజుండెవ్వఁడు । మచ్చికమదిరోయువాఁడె మాన్యుఁడు వేమా. 485

ఆ. ఉచ్చచెలమఁగోరి యున్నదిజగమెల్ల । పిచ్చిపట్టితిరిగి పెనఁగుచుండ్రు
తుచ్చసుఖము దీనిఁద్రుంపంగలేరయా । విశ్వ- 486

క. ఉచ్చనుబుట్టి నతనువట । హెచ్చేమియొ కొంచెమేమొ యేర్పడఁదెలియ
న్మచ్చరము మానిసత్యం । బచ్చుననిల్పినను బ్రహ్మమతఁడే వేమా, 487

క. ఉచ్చను బుట్టిన తనువిది। విచ్చలవిడి కులము మాని విజ్ఞానములో
కుచ్చితము మాని సత్యం। బచ్చు పడఁగ నిలిపె నేని నధికుఁడు వేమా. 488

ఆ. ఉచ్చలోనె పుట్టి యుచ్చలోనె పెరిగి । యుచ్చకాసపడుట యుచితమగునె
యుచ్చరోయువాఁడె యుత్తమయోగిరా । విశ్వ. 489

ఆ. ఉచ్చవచ్చుచుండు నిచ్చకుసరిగాను । మచ్చికైనమనసు మర్మమెఱిఁగి
హెచ్చుపదవియందు నేర్పడఁజూడరా । విశ్వ. 490

క. ఉచ్చసరితూగి పుట్టెడి । నెచ్చట నేమనుజుఁడైన నేర్పడభువిలో
నిచ్చటఁగులజుండెవ్వఁడు । విచ్చలవిడిఁదెలియవలయు వినరా వేమా. 491

తే. ఉజ్వలంబగు పరిపూర్ణ మొందఁగానె । కుంభగతదీప శోభానికుంభలీల
కుంభకంబునమదిఁజేర్చి కూడవలెను । గాక గాంభీర్యమూనిన ఘనత వేమ. 492

తే. ఉజ్వలంబైన పరిపూర్ణముపముఁజేసి । యాత్మజోతినిబెనఁగుచు నభినుతించి
మూర్తిసాధనమొందుట ముఖ్యపదవి । కాకతలయూపఁబనియేమికలుగు వేమ. 493

ఆ. ఉండఁడే సుశీలి యుండు నేకొన్నాళ్లె । యుండి యుండి యుండి యుండలేక
యుండవెరవుఁదెలిసి గండుదొంగలఁబట్టి । చెండిచెండి తావుఁ జేరువేమ. 494

ఆ. ఉండునుండుజ్ఞాని యుగములుచనినను । ప్రాణహానిలేదు ప్రళయమునను
ప్రాణహానియైనఁ బరమాత్మఁగలియురా । విశ్వ. 495

క. ఉడుగనె క్రతువులఁదపముల । నడవులఁదీర్థములఁ దిరిగినంత నెధరలో
నొడయునిఁ గనుఁగొనఁజాలఁడు । కడుధీ రతగురుఁడు సెప్పఁగలఁడిది వేమా. 496

ఆ. ఉడుముతోకఁబట్టి యురిదిగాలాగిన । నడుగువిడకపూని యానియుండు
మురికిపైనఁజేర ముదమందవలెవట్లు । విశ్వ. 497

ఆ. ఉత్తతిత్తిదీని పొత్తునజీవుండు । సత్యముగను జేరి సరసముగను
సుఖముదుఃఖములను సూత్రించుచుండురా । విశ్వ. 498

ఆ. ఉత్తతిత్తిదీని యుపయోగములుమాయ । తిత్తికొఱకుఁజెడును దెవులుగూడి
కత్తిమీఁదిసాము కడతేరఁబోదయా । విశ్వ. 499

ఆ. ఉత్తతిత్తిదీని యూపిరిచేఁగాక । పొత్తుమరవరాదు పుడమిలోన
మత్తుఁజూపినరుఁడు మార్కొనవలెనయా । విశ్వ. 500

క. ఉత్తమ మగుజ్ఞప్తికినై । సత్తమనిజరూపభావ సాదృశ్యములోఁ
బొత్తునఁ బారంగతుఁడై । హత్తెడునధ్యాత్మ విద్యననువుగ వేమా. 501

తే. ఉత్తమజ్ఞాననిలయమౌ నుపముచేత । భక్తిసాధించి పూర్ణతఁబడయవచ్చు
ముక్తికిరవగుగురునాజ్ఞ మొదటిదయ్యె । యదిలభించిన సర్వంబునబ్బువేమ. 502

ఆ. ఉత్తమశివయోగి యూహించిమదిమించి । సత్తమమునఁబోరి సరకుగొనఁడు
పొత్తుమఱచియుంట పూర్ణభావంబురా । విశ్వ. 503

ఆ. ఉత్తమాంశమూని యున్మహిలోఁజేరి । మత్తుమించినట్లు మరిగిరాక
సత్తమంబుమీటి సాధింపముక్తిరా । విశ్వ. 504

ఆ. ఉత్తమునికడుపున నోగుజన్మించిన । వాఁడుచెఱుచు వానివంశమెల్ల
చెఱకువెన్నుపుట్టి చెఱుపదాతీపెల్ల । విశ్వ. 505

ఆ. ఉత్తమోత్తముఁడగు నుర్వీఁదత్వజ్ఞుండు । మహిమఁజూపువాఁడు మధ్యముండు
వేషధారియుదర పోషకుఁడధముండు విశ్వ. 506

ఆ. ఉత్తమోత్తముఁడేటు లుత్పత్తిశూద్రుఁడే । తల్లిశూద్రయాయెఁ దరిచిచూడఁ
దానుబాపఁడన నధర్మమెసాక్షిరా । విశ్వ. 507

ఆ. ఉతుకలోనితలుపు నూగించినెట్టెడి । పదునెఱింగిలోనఁ బట్టుపట్టు
మతినిగూడిమించి మర్మంబుఁగానరో । విశ్వ. 508

ఆ. ఉదకమందుపాచి యున్నదిచూడరా । మదినినున్నమాయ మట్టుపడక
సదనమందుబ్రహ్మ సాక్షిగానెంచురా । విశ్వ. 509

ఆ. ఉదకమందుమొసలి యుబ్బియేనుఁగుఁబట్టు । మతకమేమెః బైట మసలఁబోదు
ఎఱుకగుడ్డుఁదెలిసి యేకమైయుండురా । విశ్వ. 510

క. ఉదకము లోపలితత్వము । వెదకియుఁదానగుటఁదెలిసి వేగమెమదిలో
నుదకమువలెఁ దాఁదత్వము । మదిఁదెలిసినవాఁడె తత్వమయుఁడౌ వేమా. 511

తే. ఉదధిలంఘించిదాటిన యుత్తముండు । మదినిరామాజ్ఞమీఱక మాయలడఁచి
హృదయమందును రామునిఁబదిలపఱచె । నౌరమారుతి తత్వజ్ఞుఁడగుటవేమ. 512

ఆ. ఉదయమందుశివుని నూహించిచూచిన । సుధయుఁబుట్టిపరము చూపుఁగాక
ముదముమించుమదిని ముప్పిరిగొనకున్నఁ । జేదుపుట్టిమాయ జెఱుచువేమ. 513

ఆ. ఉదయమందు శూద్రుఁడుత్తమోత్తముఁడెట్టు । సతికిశూద్రితనము సత్యమొకద
తల్లిశూద్రియాయెఁ దానెట్లుబాపఁడో । విశ్వ. 514

క. ఉదయాద్రికిఁ బైనుండెడు । సదయునిమదినిల్పిచూడ శక్యముగాఁగాఁ
గుదురుపడు జ్ఞప్తినిలిపిన । నదియేపరిపూర్ణసౌఖ్య మందురు వేమా. 515

తే. ఉదరపోషణకొఱకన్న నుబ్బరాఁడు । మదినిలోఁగుట్టువిడకయొ మర్మమూను
సదయహృదయుండుశివయోగిశాశ్వతుండు।ఉపముసాధించిమించెడినుర్వివేమ 516

ఆ. ఉద్ధరింపఁగలుగు నుత్తముండుకులంబు । మధ్యముండుదాని మాటఁగనఁడు
అధముఁడైనవాఁడ దడగించునొక్కఁట । విశ్వ. 517

ఆ. ఉన్నతావువదలి యూరూరుఁదిరిగినఁ । గన్నదేమినరుఁడు గ్రాసమునకుఁ
దన్నులోనఁజూడఁ దమమెల్లవీడును । విశ్వ. 518

ఆ. ఉన్నదన్నదెఱుక యూహాసురెట్టించి । మన్నుమిన్నునడుమ మాఱులేక
యున్నవాఁడెపరముఁ గన్నవాఁడగునురా । విశ్వ. 519

ఆ. ఉన్నదానినిగను మూపిరిబిగఁబట్టి । కన్నుమూసియేమి కానలేవు
విన్నదన్నదెఱుక విజ్ఞానమందురా । విశ్వ. 520

తే. ఉన్ననిర్వాణనిజచర్యఁ గన్నవాఁడు । తన్నుఁదనలోనఁజూచెడి తత్వమెఱిఁగి
సన్నుతించునుబరమాత్మ సమతమతిని । గన్నుగాననివాఁడేమి కాంచువేమ. 521

ఆ. ఉన్నయంతమనుజుఁడు పకారికాలేక । కన్నుగనకయెల్లగర్వములను
దీనులైనవారి దిగువాయిగాఁజూచి । పరముఁగనక నూఁతఁబడునువేమ. 522

ఆ. ఉన్నవారలెవరో చన్నవారెవ్వరో । కన్నవారలెవరో కానరారు
ఉన్న చన్న కన్న నొక్కఁడే చూడరా విశ్వ. 523

ఆ. ఉనికిమేరుశిఖర మున్నత్తతనుజూచి । కనియుఁగానఁబోవు కదలదదియు
వినియువినవుదాని విమలాంతరంగము । విశ్వ. 524

క. ఉపకారికి నుపకారము । నెపమెంత్రనిచేయునెంత నేర్పరియగునా
యపకారికి నుపకారము । కృపతోఁజేయుటయె శస్త్రకృత్యమువేమా. 525

క. ఉపజింపఁ బ్రాగ్దిక్కునఁ । ద్రిపుటికిమధ్యంబునందు దీపముతానై
జపియించు రామమెవఁడా । తపసినిగనుఁగొన్నవాఁడు ధన్యుఁడువేమా. 526

క. ఉపమరివై సత్యంబును । నెపములులేకుండనెంచు నెరజాణఁడవై
యుపవాస క్రియదాకెడు । తపమున నే తత్వరంబుదరికొనువేమా. 527

ఆ. ఉపముగలుగునాతఁ డూరకుండఁగరాదు । గురునితోడఁబొందు కూడవలయు
గురుఁడు సెప్పరీతి గుఱిమీఱరాదయా । విశ్వ. 528

ఆ. ఉపము చేతగురుని దపమునఁజూడక । జపము సేయువాఁడు చపలుఁడగును
నెపముపడకమించి నేర్పునఁజూడరా । విశ్వ. 529

ఆ. ఉపముతోడ గురుని నొప్పుగా సేవించి । జపముహృదిని జేయు జాడ లెఱిఁగి
తపముఁజేయువాఁడు తత్వజ్ఞుఁడగుయోగి । విశ్వ. 530

ఆ. ఉపముదోఁపనట్టి యుపవాసములలేదు । తపము చేయలేదు తగులరాదు
జపముఁలోనగుఱిని జపదాటకుండరా । విశ్వ. 531

ఆ. ఉపవసించినంత నూరఁబందిగఁబుట్టు । తపసియైదరిద్రతను వహించు
శిలకు మ్రొక్కనగును జీవముగలబొమ్మ । విశ్వ. 532

ఆ. ఉపవసించుచుండి యోగినీళ్లమునిఁగియుఁ । గూడువండి వేల్పుఁ గుడువుమనుచు
దానినోరుగొట్టి తా మెతిందురుగదా । విశ్వ. 533

ఆ. ఉప్పుఁగప్పురంబు నొక్కపోలికనుండుఁ । జూడఁజూడ రుచుల జాడ వేఱు
పురుషులందుఁబుణ్య పురుషులు వేఱయా । విశ్వ. 534

ఆ. ఉప్పుఁగప్పురంబు నొక్కరూపుననుండుఁ । దవిలిచూడవాని చవులు వేఱు
పురుషరూపములను బుణ్యాత్ములిట్టులె । విశ్వ. 535

ఆ. ఉప్పుచింతపండు లూరిలోనుండఁగాఁ । గఱవదేలవచ్చెఁ గాపులార
తాళకంబెఱుఁగరో తగరంబు నెఱుఁగరో । విశ్వ. 536

ఆ. ఉప్పు చేరునట్టులూహించిచూచినఁ । గప్పురంబుజ్యోతిఁ గలిసినట్లు
తుప్పటిల్లుమదినిదొలఁగక శివుఁడుండు । విశ్వ. 537

ఆ. ఉప్పుజెముడుపాలు నూర నేయుండంగఁ । గఱవుకఱవటందురి కాపులార
సత్తుపొత్తుచేసి సాధించిచూడక । విశ్వ. 538

ఆ. ఉప్పులేనికూర యొప్పదురుచులకుఁ । బప్పులేనితిండి ఫలములేదు
అప్పులేనివాఁడె యధికసంపన్నుఁడు । విశ్వ. 539

ఆ. ఉబ్బిగురునివేఁడి నిబ్బరపడువాఁడు । దబ్బరాడఁబోఁడు తత్తరమున
నిబ్బరంపుమదిని నిర్విష్టతనుగాంచు । విశ్వ. 540

ఆ. ఉబ్బిగుబ్బుఁజూచి యూహానురేకించి । నిబ్బరపడువాఁడు నిర్మలుండు
అబ్బరానిబయలు నందునుబొందును । విశ్వ. 541

ఆ. ఉయ్యాలందుఁజేర్చి యూహించినిద్రింప । నెయ్యమమరమదిని నిలిపినపుడె
దయ్యమంతబరిపెట్టి తన్మయమందురా । విశ్వ. 542

ఆ. ఉరిదిగానుగాలి యున్నతిగనుమింటఁ । దురితముగనువచ్చి తొలఁగుచుండుఁ
బురము పైననిల్పి పూనికఁజూడరా । విశ్వ. 543

ఆ. ఉర్విజనులుపరమ యోగీశ్వరునిఁజూచి । తెగడువారెకాని తెలియలేరు
అమృతమందురు చినిహస్తమేమెఱుఁగును । విశ్వ. 544

ఆ. ఉర్వివారికెల్ల నొక్కకంచముఁబెట్టి । పొత్తుఁగుడిపికులము పొలయఁజేసి
తలనుజేయివెట్టి తగనమ్మఁజెప్పరా । విశ్వ. 545

ఆ. ఉఱుముమెఱుమురీతి నొప్పెడుమదియందు । మరులుసేరిదాని మహిమఁజెఱచు
నరులుమరులఁదగిలి నరకమందెదరయా । విశ్వ. 546

క. ఉఱుము లటుటిమినయప్పుడు । శిరమునఁబిడుగ్రుంగునట్లు చిత్తముభ్రమయుం
ధరఁబడు గెక్కడఁబడినను । మఱియుచుఁగడచితి మటంబ్రమునుందుగవేమా. 547

ఆ. ఉసురులేనితిత్తి యుసుమంతయూఁదనే । పంచలోహములును భస్మమాను
పెద్దలుసురుమన్నఁ బెనుమంటలెగయవా । విశ్వ. 548

## ఊ

ఆ. ఊకయందుఁబుట్టి యున్నదియన్నంబు । ద్రమాఁకునందుఫలము మానితముగు
సోకుగాలిపట్టి శోధించుచుండురా । విశ్వ. 549

క. ఊకొనఁజెప్పిన వినదది । ప్రాకటముగ లోకములను బాలించెడునా
పాకము మదిలోబయలని । యేకాకృతినవిరతముగ నెన్నుమువేమా. 550

క. ఊకొని వినఁగావచ్చును । ప్రాకటముగఁగథలనెల్లఁ బలుతెఱఁగులుగా
నేకీభావము నందును । సోకుటదుర్లభము మదికిసుడిపడువేమా. 551

ఆ. ఊగియూగిలాగి యున్నదిగనఁగోరు । పాగలాగిపట్టు సాక్షిగాను
యోగమమరయుక్తి యోజించిమించరా । విశ్వ. 552

ఆ. ఊగిలాగిగాలి యున్నతిఁగనుఁగొని । సాగఁదోలి మనసు పైగఁ జేర్చి
వేఱులేకయుంట వేదవేద్యముసుమ్ము । విశ్వ. 553

ఆ. ఊగిలాగిగాలి యురువడిఁగనలేక । తోలుతిత్తియందుఁ దూగుచుందురి
పరమసరణిఁబట్టి పైకొనిచూడరా । విశ్వ. 554

ఆ. ఊడిగంబుఁజేసి యుబ్బించిగురువును । గూడిపొందవలెను గోర్కెలడఁచి
వేడిపరమపదవి వెలయంగఁజూడరా । విశ్వ. 555

ఆ. ఊడిగంబుఁజేసి యోదార్చిగురువును । వేడ్క మొక్కి గుఱుతు వెలయనొక్క
పాడియాడిముక్తిఁ బడయుటే మోక్షంబు । విశ్వ. 556

ఆ. ఊతకట్టఁబట్టి యురిదిగాఁబోవచ్చుఁ । గోతికొమ్మలందుఁ గుదిరినట్లు
జ్యోతియందుఁబొంచి సోహంబుఁగనవలె । విశ్వ. 557

ఆ. ఊనిలాగిలాగి యొనరఁగబిగఁబట్టి । పూనిగాలివిడిచి పురినిజేర్చి
మేనుమఱచియుంట మితిలేనిభావంబు । విశ్వ. 558

ఆ. ఊపఁబోయికొంత యూగించివిడిచిన । నూగుఁగానిగమ్య మొందలేదు
పట్టుపూన్కికొలఁదిఁ బనిసేయులక్ష్యంబు । విశ్వ. 559

క. ఊపిరిలోనికి లాగుచుఁ । బ్రాపుగలోనిలుపఁజూచి పనుపుగవిడుచుం
జూపోర్వని బయలందుచుఁ । గాపుగనీలోనెనిన్నుఁ గనవలెవేమా. 560

తే. ఊపిరున్నంతవఱకును గాపురంబు । చేసికడతేరలేకయె చిక్కుపడరె
పాపలోఁజూపుమించుటే పావనంబు । దానిమార్గంబె తెలియఁగాఁ దగునువేమ. 561

ఆ. ఊపిరున్నయపుడె యుపదేశమందుము । రూపుమాయునెపుడొ రూఢిగాను
బాపఁడైననేమి బడబాగ్నిమ్రింగునా । విశ్వ. 562

ఆ. ఊరకుంటఁదెలియ నుత్తమయోగంబు । మానసంబుకలిమి మధ్యమంబు
ఆసనాదివిధుల నధమయోగంబురా । విశ్వ. 563

ఆ. ఊరఁబందెఱుంగ దుత్తరావాచులు । చెడ్డనరకమెల్లఁ జెందుఁగాక
సాధ్విమహిమమెట్టు స్వైరిణియెఱుఁగురా । విశ్వ. 564

ఆ. ఊర్ధ్వలోకమందు నుచితక్రమంబున । రూపమేమిలేక రూఢినుండఁ
బరమయోగిచూచుఁ బరమాత్ముఁడితఁడని । విశ్వ. 565

తే. ఊర్జితానంద పరిపూర్ణయుక్తియందు । స్వార్జితంబగుగురుభక్తి సంతరించి
దుర్జయంబునుదూలించితొలఁగఁజేయఁ । గర్జముగముక్తిలభియించుఁగదరవేమ. 566

ఆ. ఊరుకాడుఁదిరిగి యున్నదికనలేక । పోరిగురులఁగనక పొందుపడక
తాలుమాలుగాను దత్తరపడనేల । విశ్వ. 567

ఆ. ఊరుకొండవీఁడిఁ కునికిపశ్చిమవీధి । మూగచింతపల్లె మొదటియిల్లు
ఎడ్డెరెడ్డికుల మదేమని తెల్పుదు । విశ్వ. 568

ఆ. ఊరుకొండవీఁడు నునికిపశ్చిమవీధి । మూగచింతపల్లె మొదటియిల్లు
అరసిచూడబయలు నదియుక్తి శివుఁడయా । విశ్వ. 569

ఆ. ఊరునడిమిబావి యుదకమ్ముఁదెలియక । పాదతీర్థములను భ్రమసినారు
పాదతీర్థమన్న ఫలమేమికద్దురా । విశ్వ. 570

ఆ. ఊరునూరుఁదిరిగి యున్నదిగనలేరు । మోరయెత్తిచూచి మొనయలేరు
పాఱఁజూచుటదియె పరబయల్గాదకో । విశ్వ. 571

క. ఊరులు పల్లెలుమానుక । వారకయడవింజరించు వాఁడరుదెంచు
న్వేరులుఁగూరలు మెసవెడు । వీఁడిఁకెటమోక్షపదవి వినరావేమా. 572

ఆ. ఊరువిడుపకుండు నుత్తమశివయోగి । పోరిచూచుమదిని పూర్ణసుఖము
దారిలోనినక్క తలపెట్టఁబోవునే । విశ్వ. 573

ఆ. ఊరిసేరియుండ నోగిసంతరింతురు । అడవియనుచునుండ నడలుచుండు
ఊరునడవిరెండు నొకటిగాఁజూచిన । నాతఁడుయోగి యతఁడువేమ. 574

ఆ. ఊసరిల్లిపిచ్చి యుపమునర సమును । జేర్చినూరిసతులు చెలువముగను
వశ్యమనుచుమగని వరియించిపెట్టంగ । రోగమమరినీల్గు రూఢివేమ. 575

## ఋ

ఆ. ఋగ్యజుస్సులెఱిఁగి యోగ్యతలేకున్న । విప్రుఁడైననెట్లు హితుఁడగును
భర్తగలిగియున్న భావించుసతివలె । విశ్వ. 576

ఆ. ఋణముపెంచియిచ్చి హీనుఁగానొనరించి । విడుచుతండ్రివైరి వీరుఁడరయ
అలవిగానియట్టి యాలునునట్టులే । విశ్వ. 577

ఆ. ఋణమొసంగునాతఁడినుఁడగు దొలుదొల్త । నదియుమరలనడుగ యముఁడనగు
అప్పుఁజేసితీర్చ నరయనివారికి । విశ్వ. 578

ఆ. ఋతమనృతమెఱుంగ నెవ్వరితరమగు । స్థితియుగతియుఁదెలియఁ దేటపడును
విన్నమాత్రముననె వివరింపఁగారాదు । విశ్వ. 579

ఆ. ఋతువుననుసరించి స్థితికాలముననొప్పు । గతినిబట్టిమనుజు మతియునొప్పు
స్వేచ్ఛఁబట్టియువిద చెల్లాటముననొప్పు । విశ్వ. 580

ఆ. ఋషికులంబునందు రూఢిగాజన్మించి । కులముగోత్రములను గొప్పలెరి
బ్రహ్మసంతతెట్లు బ్రాహ్మణులెట్లయిరి । విశ్వ. 581

ఆ. ఋషులటడవినుండి రుచులగోరుటరోఁత । నరులుకలిగి తినమినరయరోఁత
భార్యలనుచువారి భరియింపమియురోఁత । విశ్వ. 582

ఆ. ఋషులుగానుఁడింత్రి హీనులయట్టుల । వారిబోధపెద్ద మేరువంత
లోననున్నయట్టి జ్ఞానంబుమహిమరా । విశ్వ. 583

ఆ. ఋషులెఱుంగనట్టి విషయంబుభువిలేదు । వారుసెప్పినంత వరుసనగును
తెలియకనెడువారు దేబెలు నిజమయా । విశ్వ. 584

## ఎ

క. ఎక్కడ నెదకినఁదానై । మ్రొక్కనుదావెందులేక మూలముతానై
చక్కగనిర్భయుఁడగుచును । నిక్కమునిన్నంటియుండు నిజముగవేమా. 585

క. ఎక్కడిసుతు లెక్కడిసతు । లెక్కడిబంధువులుసఖులు నెక్కడిభృత్యుల్
డొక్కవడి పోవువేళలఁ । జక్కఁటికెవరునురారు సహజమువేమా. 586

ఆ. ఎక్కుడైనయాశ లినుమడియైయుండఁ । దిక్కుపట్టినరుఁడు తిరుగుచుండుఁ
గుక్కవంటియాస కూర్చుండనీయదు । విశ్వ. 587

ఆ. ఎక్కువయునుదక్కు వెటువంటివారికిఁ । దనువుసతముగాదు తధ్యమరయ
నెఱిఁగితిరుగలేరిఁ కేమనవచ్చును । విశ్వ, 588

ఆ. ఎక్కువెట్టిగుఱితిఁ కేకమైనంతట । సొక్కిసోలియుండు సూత్రముఁగను
ముక్కుసెవులులేని మూలమేపరమాత్మ । విశ్వ. 589

తే. ఎక్కువెట్టిన రూపము చిక్కవెట్టి । నిక్కఁ బట్టుము నిజముని సాక్షిమట్టి
చిక్కగనుబూర్ణమందుము చిక్కవెందు।గురునిబెడియకుపాయంబుఁగురవేమ. 590

ఆ. ఎక్కువెట్టిపరము నేకాంతమునుగోరి । ముక్కుకొననుజూడ్కి మొనయనిల్పి
సాక్షియుండుటదియె సోహంస్వరూపము । విశ్వ. 591

ఆ. ఎక్కువెట్టిమనసు నేకాంతమునఁజేర్చి । మొక్కువాఁడె పరముదక్కువాఁడు
నిక్కిచూచునపుడె నిర్భ్రాంతమబ్బురా । విశ్వ. 592

ఆ. ఎక్కువెట్టిమనుజుఁ డేకాంతమమరఁగ । దక్కఁగోరుచుండు ధన్యుఁడరయఁ
బ్రక్కనుండు నెఱుక పరిపూర్ణమందునా । విశ్వ. 593

ఆ. ఎంగిలంతవట్టు హితవుగా నెంచక । యొగ్గియుందురంత సుద్విజనులు
కన్నయెంగిలెంత కననెంగిలధికమా । విశ్వ. 594

ఆ. ఎంగిలెంగిలందురిలవేదశాస్త్రములఁ । చదువునట్టి విప్రజనములెల్ల
నెంగిలవుటయెఱిఁగి యెంగిలేకుడుతురో । విశ్వ. 595

ఆ. ఎంగిలెంగిలనుచు నీనోఁటితోడనే । వేదములనుజదువు వెఱ్ఱులార
యెంచిచూడనదియె యెంగిలిగాదకో । విశ్వ. 596

ఆ. ఎగువదిగువఁజూడ కేప్రొద్దుమదిలోనఁ । దగవులేనితలఁపుఁ దలఁచివలచి
నీల్గిచూచువెల్ల నెఱజాణవిద్యరా । విశ్వ. 597

ఆ. ఎగువదిగువఁజూడ నెఱుకగుణంబులు । తగిలినంత నెచ్చి తమముఁజూపు
నిగమగోచరుండు నివ్వటిల్లఁగఁజూడు । విశ్వ. 598

ఆ. ఎగ్గుసిగ్గులేని దేకమైతోఁపఁగా । మొగ్గిచూచువెల్ల మూలవిద్య
తగ్గియొగ్గకెపుడు తాకుటపరమురా । విశ్వ. 599

తే. ఎచటగుఱినిల్పిచూచిన నేమితోఁచు । నచటఁదన్మయగుఱినిష్ఠ నందవలెను
రుచిరమగుప్రత్యగాత్మయే రూఢిపదము । అదిలభించిన నానందమమరువేమ. 600

తే. ఎచటఁజూచినచ్చట నేమితోఁచు । నచటిదృశ్యము దృక్కగానంటిపట్టి
రచ్చఁజేయుటముక్తికి రాజపథము । సచ్చిదానందమపుడొప్పఁజాలువేమ 601

ఆ. ఎచటఁజూడ్కినిలిపి యెంతగఁజూచిన । నచటఁదోఁచు కళలనంపరాదు
అచలమైనవ్యక్తి నందుటమోక్షంబు । విశ్వ. 602

ఆ. ఎచటినుండివచ్చె నెచటికిఁదాఁబోవు । నిద్రచంద మెఱుఁగనేర్చె నేని
ఆత్మరాకపోకలతఁడెపో శివయోగి । విశ్వ. 603

ఆ. ఎంచియెంచిపూజ లెన్ని సేయఁగ నేమి । భక్తిలేనిపూజ ఫలములేదు
కన్నపూజసేయు కారణమెఱుఁగుడీ । విశ్వ. 604

ఆ. ఎచ్చుకులమునొంది యెన్నాళ్ళు బ్రతికినఁ । జచ్చిపుట్టు జన్మశతములగును
మెచ్చునట్టిపూజ మెప్పుగాఁ బూనరా । విశ్వ. 605

తే. ఎచ్చుగచ్చులు నుడివిన నేమిఫలము । ముచ్చువేషంబుఁ బూనిన మూలమేది
అచ్చుపడఁ దన్నెఱింగిన యతఁడె యోగి । సచ్చిదానందపూర్ణుఁడౌ జగతి వేమ. 606

ఆ. ఎట్టిజీవికైన నిలఁ గాంతభ్రాంతియె । తెలియరయ్య యెపుడుఁ దేటగాను
మనసుబుద్ధికన్న మతియొక్కటగునయ్య । విశ్వ. 607

ఆ. ఎట్టిమంత్రమైన నెంగిలిగాకుండఁ । బలుకవశము గాదు బ్రహ్మకైన
ఎంగిలెంగిలందు రీనోటితోడనె । విశ్వ. 608

ఆ. ఎట్టియోగికైన నిలమన్మథావస్థ । తెలియవచ్చు నేనిఁ దేటగాను
యోగమెల్ల నూడి జోగియై పాడగు । విశ్వ. 609

ఆ. ఎట్టిరూపుఁ గనిన నేర్పడు నీరూపు । నీదురూపుఁ జూడ నిలుచుఁ దెలివి
అట్టి తెలివిచేత నాత్మయే తోఁచురా । విశ్వ. 610

ఆ. ఎట్టివాఁడొ తానదెఱుఁగఁడు తొలిపుట్టు । నీచజీవనమున నీమమేల
ఎరుగుఁడయ్య లోకమీశ్వరమయమని । విశ్వ. 611

ఆ. ఎట్టివానికైనఁ బుట్టును మోహంబు । పుట్టుమోహమూర్చ్ఛ పూన్కి కలిగి
గట్టి చేసిచూడఁ గాన్పించు బ్రహ్మంబు । విశ్వ. 612

ఆ. ఎట్టిస్త్రీలఁ గనిన నింతంతయనరాదు । కాలవహ్నిలక్క కరిగినట్లు
ఇట్టి గాఢ మోహమెంతైనఁ జేయురా । విశ్వ. 613

క. ఎడపక క్రతువులుఁ దపములు । నడవులవాసంబు దీర్ఘయాత్రలుఁ జేయ
న్నొడయనిఁ గనుఁగొనఁ జాలఁడు । కడువడి గురునిష్ఠపరుఁడు కావలె వేమా. 614

తే. ఎడమకుడినాడులనడుమ నీడ్చుగాలి । తడవతడవకుబిగఁబట్టి తాల్మితోడ
విడిచిలాగుచు విన్నందివెలయుచుండ । నట్టిసాధనమునఁ గనునాత్మ వేమ. 615

ఆ. ఎడ్డెఁదెల్పవచ్చు నేడాదికైనను । మూనిఁదెల్పవచ్చు మాసముననె
మొప్పెఁదెల్పరాదు ముప్పదేండ్లకునైన । విశ్వ. 616

ఆ. ఎండ-చీకటులకు నిష్మయియుండెడు । నిండుకుండలోన నిద్రమఱచి
దండియైనఁబరమతత్వంబుఁ దెలియురా । విశ్వ. 617

ఆ. ఎండనీడచంద మెఱుఁగ నేరనియప్పు । డుండఁబోవఁడాతఁడుర్విలోనఁ
దిండిపోతునాఁగఁ దిరుగుచునుండురా । విశ్వ. 618

ఆ. ఎండనీడచంద మెఱుఁగ నేర్చినయోగి । యుండు నెల్లకాల ముర్విమీఁదఁ
దిండిపోతువశమె తెలియంగ జ్ఞానంబు । విశ్వ. 619

ఆ. ఎండనీడవన్నె యేకమౌనట్టుగ । నిండుకుండలందు నిలువఁజేసి
దండితత్వమెల్లఁ దలపోసిచూడరా । విశ్వ. 620

తే. ఎండమావులచాడ్పగు నీజగంబు । లుండుబరమాత్మయందును దండిగాను
నిండుమదిలోనశోధించి నెగడవలెను । మిధ్యయను నమ్మకము పుట్టిమీఱ వేమ. 621

ఆ. ఎండయనకతిరుగు నిరవెఱింగినయోగి । నీడనున్నవాని జాడవలెనె
ఎండనీడలున్నె యెఱిఁగినవారికి । విశ్వ. 622

ఆ. ఎండలోనఁజీక టేకమైయున్నట్లు । నిండుకుండనీరు నిలిచినట్లు
దండిగఁబరమాత్మ తత్వంబుఁదెలియరో । విశ్వ. 623

క. ఎండినమా నొక్కటడవి । నుండిననందగ్ని పుట్టి యూడ్చును జెట్లం
దండిగల వంశమెల్లను । జండాలుండొకఁడు పుట్టి చదుపును వేమా. 624

ఆ. ఎడ్లురెండు తిన్ననిహామునస్తంభించు । నెడ్లుమూఁడు తిన్ననిహామువిడుచు
ఎడ్లఁదెలియుమనుజుఁ డేర్పడుయోగిరా । విశ్వ. 625

ఆ. ఎంతకడుగనోటి యెంగిలిపోవునే । యెల్లకాలమందు నెంగిలితగు
అనుదినంబుఁజూడ నన్నృతమాడెడునోరు । నోరెపీతబొక్క తీరు వేమ. 626

ఆ. ఎంతకష్టముండు నంతపాపపుఁజింత । చింత చేతమిగులఁ జివుకుమనసు
చింతలేకయున్నఁ జెడనిసంపదఁగాంచు । విశ్వ. 627

తే. ఎంతకాలమొ వ్యర్థమైయంతపీలు । సంతసంబునఁజిక్కఁగా జలకమాడి
పాత్రఁబుష్పములిడికొనిపట్టుకొనియు । గుహాముఖముసొచ్చికనుఁగొంటిగురుని వేమ 628

ఆ. ఎంతకాలమందు నెఱుకలేకయెజీవి । చచ్చిపుట్టుచుండు సహజముగను
ఎఱుకమఱపుగలుగ నెఱుఁగునాబ్రహ్మంబు । విశ్వ. 629

ఆ. ఎంతచదువుఁజదివి యెన్నియోవిన్నను । హీనుఁడవగుణంబు మానలేఁడు
బొగ్గుపాలఁగడుగఁ బోవునా నైల్యంబు । విశ్వ. 630

ఆ. ఎంతనాఁటనుండి యెనసినమోహమో । చెలిమిచేతఁదల్లి చెల్లెలక్క
యన్నదమ్ములనెడి యాబ్రాంతి నేపడు । విశ్వ. 631

ఆ. ఎంతనేర్పుతోడ నేమేమిచదివినఁ । జింతలేనివిద్య చిక్కఁబోదు
పంతగించిమదినిఁ బరికించిచూడరా । విశ్వ. 632

ఆ. ఎంతభాగ్యమున్న నంతకష్టపుఁజింత । చింతచేతమనసు చివుకుమనును
చింతలేకయున్నఁ జెడనొనెసంపద । విశ్వ. 633

ఆ. ఎంతభూమిదిరిగి యేపాటుపడుచున్న । నంటనీకప్రాప్తి వెంటఁదిరుగు
భూమిక్రొత్తదైన భోక్తలుక్రొత్తలా । విశ్వ. 634

ఆ. ఎంతమాత్రమైన నెంగిలిగాకుండఁ । బలుకవశముగాదు బ్రహ్మకైన
నెవ్వరనినమాట యెట్టుతాఁబల్కును । విశ్వ. 635

ఆ. ఎంతవింతమదికి నేమేమితోఁచినఁ । జింతచేయరాదు చిక్కులెట్టు
వింతలోనిగుట్టు వివరింపఁదానగు । విశ్వ. 636

ఆ. ఎంతవేల్పునకును నెసఁగనైవేద్యంబు । వాసనఁగనకుండ వండలేరు
మీదిమీదియనుచు మ్రింగరేగ్రిక్కిళ్లు । విశ్వ. 637

ఆ. ఎంతసేవఁజేసె యేపాటువడినను । రాచమూకనమ్మ రాదురన్న
పాముతోడిపొందు పదివేలకైనను । విశ్వ. 638

ఆ. ఎంతక్షామమైన నెంగిలియన్నమ్ము । పరులకిడెడు ధర్మ పరులరయఁగ
నెంగిలుండు పుల్లలెప్పుడు నాకెడు । శ్వానములుగ బుట్టనౌను వేమ. 639

క. ఎందఱు కాంతలఁ గాంచిన । నెందఱుముద్దియల యెదుట నెసఁగంగనిన
న్సుందరు లెందఱఁ కేమన । నందరి నీతల్లులట్టులరయుము వేమా. 640

క. ఎందాఁక మనసునిల్పిన । నందాఁక నుబూర్ణసుఖమె యరుదుగఁ దోఁచుం
బొందిక మీఱిన బ్రహ్మము । సుందరమగు తన్మయంబుఁ జూడర వేమా. 641

తే. ఎదుటఁగాన్పించుదాని నెడ్డెంచరాదు । మదినిగుఱు పొందియుండుటమానితంబు
సదయ హృదయతసాక్షిగా సంతరించు । హృదయరంజకమపుడగు నెన్న వేమ, 642

తే. ఎదుట నిల్చిన చూపులో నేకమమర | నెఱిఁగిమఱిగినతోడనే యెంచరాదు
మదికిలో వెలిబయలగుమఱుఁగుఁజేరు | స్థిరతఁజిత్తంబునకుఁగూర్పఁదివురు వేమ. 643

ఆ. ఎదుటనున్న వాని నెప్పుడుఁగానక | కుదుటివాని వెదుకఁబదరు చుంద్రు
పదటఁగొడుకులకును భ్రమయేలఁ దీఱదో | విశ్వ. 644

ఆ. ఎదుటి కలిమిఁజూచి యేడ్చెడివారికి | భాగ్యమెటులఁగూర్చుఁ బరమగురుఁడు
తనదుపూర్వకర్మదైవమెఱుంగఁడా | విశ్వ. 645

ఆ. ఎదుటి తనబలంబు లెంచుకో నేరక | దీకొని చలమునను దీర్చె నేని
నెలుగు దివిటి సేవ కేర్పడుచందమా | విశ్వ. 646

ఆ. ఎద్దుకన్న దున్న యేలాగు తక్కువ | ఎఱుకలేక పోవఁదఱిగె విలువ.
నేర్పెఱుఁగని వాని నెర యోగియందురా | విశ్వ. 647

ఆ. ఎద్దుకన్నఁదెలియ నెనుబోతు తక్కువ | విపరమెఱిఁగిఁ చూడువృత్తియందు
నేర్పులేని వాని నెర యోధుఁడందురా | విశ్వ. 648

ఆ. ఎద్దునకును బుద్ధియేదాది చెప్పిన | మాటవినఁగ నేర్చు మర్మమెఱిఁగి
మూర్ఖుఁదెలుపరాదు ముప్పదేండ్లకు నైన | విశ్వ. 649

ఆ. ఎద్దుమొద్దువాని కేల శాస్త్రంబులు | ముద్దునాతి కేల ముసలిమగఁడు
చద్దిమిగుల నిల్లు సంసారమేలరా | విశ్వ. 650

క. ఎందును దలఁపఁగలేఁడట | పొందుగఁబరమాత్మయందుఁబొందుట యెల్లా
ముందుగఁ దనుఁ దా దెలిసిన | నందేపరమాత్మఁదెలియునవనిని వేమా. 651

తే. ఎందునెందును జూచినముందెయగును | బొందిపొందకతోఁ జేడి పోకలయము
ముందె యెఱుకనుమాయింపజెందుఁబరము | సందెచీకటినెఱపూపుసరణి వేమ. 652

ఆ. ఎందునెఱుక వాని కిహపరములు లేవు | ప్రాణహానిలేదు ప్రళయమునను
బ్రళయ కాలమైనఁ బరమాత్మఁగలియురా | విశ్వ. 653

క. ఎన్నగమున నేకారణ | మున్నిఁటికినిజూడఁజూడ నాత్ముఁడుతానై
యున్నంతకాల మిలలో | నన్నాయిదె తెలియవలయు నవనిని వేమా. 654

క. ఎన్నాళ్లిలఁదానుండెడి | నెన్నాళ్లిఁకఁదాను నేర్చి యెన్నిఁటవెలయుం
గొన్నాళ్లకుఁ దాజన్నను | మన్నొఁగదవిద్యలెల్ల మహిలో వేమా. 655

క. ఎన్నాళ్లు బ్రతికిచచ్చినఁ । దన్నెఱుఁగనిమర్త్యులకును దలఁగునుబరమా
పున్నమచంద్రుని విమలపు । వెన్నెలలోఁబతులుసేరి వెలయునువేమా. 656

క. ఎన్నాళ్లుబ్రదికి భువిలోఁ । గన్నెలవలపునఁజిక్కి కామాతురుఁడై
యున్ననుజచ్చిన నొక్కటె । తన్నెఱుఁగనియోఁగసచ్చు తరబడివేమా. 657

ఆ. ఎనిమిదక్షరముల నేర్పడనెఱిఁగియు । వినియుఁగనఁగరాక వెలయువానిఁ
దనువుమఱచి తెలియఁదత్త్వాత్ముఁడగునురా । విశ్వ. 658

క. ఎనిమిదిదిక్కులు బయలై । యెనిమిదిఁటికినారి కెన్న నెక్కుడుబయలై
వినరానిబయల నడచినఁ । గనరాయచ్చోటనన్నుఁ గలిసియువేమా. 659

ఆ. ఎన్నితనువులైన మృతికివడ్డముగావు । మృతినిగెలువలేని యెఱుకలేక
దొంగరీతిఁగాక దొరకునామోక్షంబు । విశ్వ. 660

ఆ. ఎన్నితపములేడ్చి యెన్నినోములునోచి । యెంతకష్టపడిన నేమిలేదు
గురునిబోధలేక దొరకదెందునుముక్తి । విశ్వ. 661

తే. ఎన్నిదినములుబ్రదికిన నేమిఫలము । పిన్నపెద్దలుచెలరేఁగి పేరులేక
యన్నదమ్ములునాప్తులు నందెచనిరి । మిన్నమార్గము తెలియక మెలఁగివేమ. 662

తే. ఎన్నిదైవతలైనను నీరహస్య । చిహ్నలనుబట్టి కనలేరుచిన్మయంబు
తన్నుఁదనలోనఁగనుటయేతన్మయంబు । చెన్నుమీఱంగనిదె మేటితెన్నువేమ. 663

ఆ. ఎన్నినాళ్లనుండి యొనసినమోహంబొ । చెలిమిచేతనుండి చెల్లలేక
తల్లిదండ్రిబిడ్డ దాయాదులనునట్టి । భ్రాంతిచేతఁజిక్కఁ బడియెవేమ. 664

ఆ. ఎన్నిఫలములున్న నేఫలంబెక్కుడు । అన్నిసుఖములందు నధికమేది
కన్నదికననిదయి కనుపించునారూపు । విశ్వ. 665

ఆ. ఎన్నిభూములఁగని యేపాటుపడ్డను । నంటనీకశనియు వెంటఁదిరుగు
భూమిక్రొత్తదైన భూమెలుకొత్తవా । విశ్వ. 666

ఆ. ఎన్నిమతములైన నేమంత్రమైనను । సత్యమింతలేక జాడవిడదు
సత్యముగలదేనిజగతిలో ద్విజుఁడగు । విశ్వ. 667

ఆ. ఎన్నియెన్నిపూజ లెన్నిచేసిన నేమి । భక్తిలేనిపూజ ఫలములేదు
భక్తిగల్గుపూజ బహుళకారణమురా । విశ్వ. 668

తే. ఎన్ని విద్యలు నేర్చిన నెఱుఁగరాదు । తన్ను నిర్గుణమును జ్ఞప్తిఁ దాకవలెను
నిర్ణయోనాస్తి యన్నది నిండియుండు । గురునిబోధకు నన్య మేకొలఁదివేమ. 669

ఆ. ఎన్ని వేషములకు నెఱుకయే మూలంబు । యమునిఁ గెలువవలెను సమయమెఱిఁగి
దొంగవసతిగాక దొరుకునా సౌఖ్యంబు । విశ్వ, 670

క. ఎనుబదినాలుగులక్షల । టనఁబరగిన జీవరాసులందును మునుఁదా
జనియించు విధముఁ దెలిసిన । మనుజుఁడెపో దారిఁ గాంచు మహిలో వేమా. 671

ఉ. ఎప్పుడుజూచిన న్నితర మేమియుఁ జూడక ముక్తినందఁగన్
రెప్పలుమూసిమూయకయు రేయుబవళ్ళొక రీతినుండఁగాఁ
దప్పులనొందఁజేయు యమధర్మునిపాలికిఁ జేరనేర్చునే
చెప్పఁగ నేమి వేమనకుఁ జెల్లును ముక్తినిధాన మన్నిటన్. 672

ఆ. ఎంబెరుమతమందు నెసఁగి మాంసముఁ దిని । మారుపేర్లు వెట్టి మధువుఁ ద్రావి
వావివరుసఁదప్పి వర్తించిచెడుదురు । విశ్వ. 673

తే. ఎమ్మెకాఁడనఁ దరుణుల కెచ్చరికగ । భ్రమఘటించుచుఁ దిరిగిన పాపితుదకుఁ
గ్రిమముగా యమభటకోటి గాసిపెట్టుఁ । దమకపడిపూర్వదుస్థితిఁ దలఁచు వేమ. 674

క. ఎరగోని యెఱుకను మఱచెదు । పురమందును జేరి గుఱిని బూర్ణాత్ముఁడవై
బిరబిరఁ గుంభకమందుము । పరిపూర్ణ సమాగమంబు పద్ధతి వేమా. 675

ఆ. ఎఱిఁగిన శివపూజ యెన్నఁడుఁ జెడిపోదు । మొదలఁబట్టు పట్టు వదలరాదు.
మొదలువిడిచి గోడ తుదిఁ బెట్టఁగల్గునా । విశ్వ. 676

ఆ. ఎఱిఁగి మనసుఁ బట్టి యేకాంతమునఁ జేర్చి । పరుగువిడక భావపరమునందు
తరముగానిబయలుఁ దాకుటపరమగు । విశ్వ. 677

తే. ఎఱిఁగిమఱగినఁ దోడ్తోడు నేమిలేదు । పోరిగుఱిమించి యుండుటే పూర్ణపదవి
యెందుఁ జూచినఁ బరిపూర్ణమందఁ గోరి । యందుకొని పూర్తిఁ జెందుమీ యవని వేమ. 678

ఆ. ఎఱిఁగి మరిగి తిరిగి యేకాంతమునుగోరి । పరుగులిడక యోగపథముఁ బట్టి
పరముఁ గోరి మించఁ బరిపూర్తిఁ జెందురా । విశ్వ. 679

ఆ. ఎఱుక కన్నను సుఖమే లోకమున లేదు । ఎఱుక నెఱుఁగ నెవని కెఱుకలేదు
ఎఱుకసాటి దెఱుకె యెఱుకయే తత్త్వంబు । విశ్వ. 680

ఆ. ఎఱుకగలుగునాతఁడే యోర్వనుండక । తిరిగి నేలఁదనదు దివ్యమైన
పండుపండవెనుక ఫలములేకుండునా । విశ్వ. 681

తే. ఎఱుకఁదోడొక్కనితత్త్వంబునెఱుఁగుటెట్టు। లెఱుకతొలఁగినఁదత్త్వంబునెంచరాదు
ఎఱుకమఱపులకందనియిరవుఁగనుమి । యెఱుఁగుచుండెడిదానినేయెంచివేమ. 682

క. ఎఱుకనుబుట్టును దనువులు । మఱికినిదామఱుగుఁ దనువుమోయుటగాదా
యెఱుకగల తనవునొందిన । మఱియునుజన్మించుటెట్లు మహిలోవేమా. 683

ఆ. ఎఱుకనెంచిచూడ నెఱిఁగించుచుండును । బరముఁదాకిచూడఁబట్టుపడును
గుఱికిబయలుఁజేర గుణరహితంబురా । విశ్వ. 984

ఆ. ఎఱుకనెఱిఁగనేని నెఱుకయేసాధించు । నెఱుకలేనియాతఁ డెఱుగలేఁడు
ఎఱుకలోనియెఱుక నెఱుఁగుటతత్త్వంబు । విశ్వ. 685

ఆ. ఎఱుకమఱపులందు నేమేమితోఁచిన । సరికిగుఱియెకాదు సత్యమునకుఁ
బరమనిర్గుణంబుఁ బాటించికనవలె । విశ్వ. 686

తే. ఎఱుకమఱపులుగానిది యెఱుఁగలేరు । పరమపరిపూర్ణసుఖమూనిపట్టలేరు
ఊరముబెదరనిగుఱిగని యుండలేరు । నిరుపమానందసంతృప్తినిలుపవేమ. 687

ఆ. ఎఱుకమాలుజీవి యెంతకాలంబున్నఁ । జచ్చిపుట్టుచుండు సహజముగను
ఎఱుకమఱచుచోటి నెఱుఁగుటబ్రహ్మంబు । విశ్వ. 688

ఆ. ఎఱుకమాలువాఁడికేమేమిచదివినఁ । జదివినంతసేపె సద్గుణియగుఁ
గదిసితామరందుఁ గప్పకూర్చున్నట్లు । విశ్వ. 689

ఆ. ఎఱుకయుండువాని కెఱుకయేయుండును । ఎఱుకలేనివాని కెఱుకలేదు
ఎఱుకలేనియెఱుక నెఱుఁగుటతత్త్వంబు । విశ్వ. 690

ఆ. ఎఱుకలేనివొరల నెన్నాళ్ళుకొలిచిన । బ్రదుకులేదు పట్టిభ్రాంతిగాని
గొడ్డుటావుపాలు గోకినచేపునా । విశ్వ. 691

ఆ. ఎఱుకలేనివార లేమేమిచదివినఁ । జదివినంతసేపె సద్గుణంబు
కదిసితామరందుఁ గప్పకూర్చుండదా । విశ్వ. 692

ఆ. ఎఱుకలోనిజగము నెందాఁకఁజూచిన । గుఱికిబయలఁబ్రాకి కోర్కెలడఁచి
సరికిబయలునంటి సంయమిగావలె । విశ్వ. 693

ఆ. ఎఱుఁగువానిఁదెలుప నెవ్వఁడైననుజాలు । నొరులవశముకాదిఁకోఁగుఁదెల్ప
నేఁటివంకఁదీర్ప నెవ్వరితరమయా । విశ్వ. 694

ఆ. ఎఱ్ఱదానిముఖము నేప్రొద్దుచూచిన । బమ్మకైనఁబుట్టు రిమ్మతెగులు
ఇట్టెనవ్వె నేనిఁ బట్టదాభూతమై । విశ్వ. 695

ఆ. ఎఱ్ఱనాడుదాని నేపారఁజూచిన । వేకిపుట్టిచాల వెఱ్ఱిపట్టుఁ
బల్లుఁదెరచినగినఁ బట్టుఁబెన్భూతంబు । విశ్వ. 696

ఆ. ఎలమినిధనవంతుఁ డెదిరిఁదన్నెఱుఁగక । కన్నుఁగానకిలను గర్వపడును
దీనుఁడైనవాఁడు దేబెయౌధనికుని । నడుగఁబోవఁ గష్టమగునువేమ. 697

ఆ. ఎలమిమతమటంచు నెల్లమాంసముఁదిని । మఱుగుపేరుచెప్పి మధువుఁద్రావి
వావివరుసలేక పర్తింత్రుమూఢులు । విశ్వ. 698

తే. ఎల్లకుక్కలయెంగిలి యిపుడు తెలిసెఁ । బడుచుకుక్కలయెంగిలి ప్రాప్తమాయెఁ
జెడిపెయెంగిలియంతయు శ్లేష్మమాయె । నిష్టమగువారి యెంగిలేయెచ్చువేమ. 699

ఆ. ఎల్లలోకమందు నేవస్తువున్నదో । తల్లిపిల్లసందు తగులునదియె
నిస్తరంగవార్ధి నియతిలోఁజూడరా । విశ్వ. 700

ఆ. ఎల్లినేఁడు నిన్న నేలాగుననుగాని । మనసు నిలుపు వాఁడు మంచివాఁడు
శివుఁడు భర్తకర్త చింతింప నేలరా । విశ్వ. 701

ఆ. ఎలుకతోలుఁదెచ్చి యేఁడాదియుతికిన । నలుపు నలుపెకాని తెలుపుగాదు
కొయ్యబొమ్మఁ దెచ్చికొట్టినఁ బలుకునే । విశ్వ. 702

ఆ. ఎలుఁగుతోలుఁ దెచ్చి యెంతగ నుదికిన । నలుపుగాక యేల తెలుపుగల్గు
కొయ్యబొమ్మఁదెచ్చి కొట్టిన గుణియౌనె । విశ్వ. 703

ఆ. ఎవరి కెవరుఁ గారిఁకెవ్వరురాఁబోరు । గవయఁగోరుహంసఁగదియ నొక్కి
శివుని రూపమూని సేవింప దొఱకొను । విశ్వ. 704

తే. ఎవ్వఁడుఁ జ్ఞాన తిమిరంబు నేపుమాపి । జ్ఞానమను వెన్నెలందొప్పఁబూను నేనిఁ
జంద్రుఁబోలిన గురునండ సాధకముగఁ । గూడిననుగానితీఱదుకోర్కె వేమ. 705

ఆ. ఎవ్వఁడే మెఱుంగు నిం పైన వస్తువు । దేహమే మెఱుంగు దివ్యబోధ
విధముఁదెలియఁ గోరవేదాంత మెఱుఁగుఁడీ । విశ్వ. 706

ఆ. ఎవ్వరిగుణ జాలమేమన్న మానదు । చక్క జేయరాదు కుక్కతోక
గడుసురాలు మగని గంపతో నమ్మురా । విశ్వ. 707

ఆ. ఎవ్వరెఱుఁగకుండ నెప్పుడు పోవునో । పోవుజీవమకట బొందివిడిచి
యంతమాత్రమునకె యపకీర్తి నెఱుఁగక । విఱుగఁబడును నరుఁడు వెఱ్ఱివేమ. 708

తే. ఎవ్వరెఱుఁగని తత్వంబు నెఱుఁగుటెట్లు । లోనుజూడంగఁజూడంగ లోకమగును
దలఁపు మఱపులు దాటుచేతన్మయంబు । నిత్యపూర్ణత సానంద నిరతి వేమ. 709

తే. ఎవ్వరెవరన నేనను నేమెఱిఁగియొ । తానెవండైన నెఱుఁగని మానవుండు
అడిగినప్పుడైన లక్ష్యంబు నమరఁజేయఁ । గొంత తెలిసెడిఁగాదె యావింత వేమ. 710

ఆ. ఎసఁగు వేత్త యనుచు నెఱుఁగరే యానరు । ల్వేయుమార్గములను వెలుపఱుఁడు
అవనిసృష్టికర్త యంతకు గురుఁడెన్న । విశ్వ. 711

## ఏ

ఆ. ఏకచక్రధరుఁడె యెల్లలోకంబులఁ । బాకమెఱిఁగి యేలుఁబ్రభుఁడు గాఁడు
రాకపోకలడఁచి రాజిల్లు మదిలోన । విశ్వ. 712

క. ఏకబ్రహ్మము నిత్యము । వైకృతములనంగఁదగిన వస్తువులెల్ల
న్నైకత్వంబని యెఱిఁగిన । జోకఁనంగలుగు ముక్తి సులభము వేమా. 713

క. ఏకంబే బ్రహ్మంబని । ప్రాకృత వైకృతులఁదెలిసి పరిశుద్ధుండై
యేకంబగు మదిఁదెలిసిన । శోకము మోహంబు లేదు సొరిదిని వేమా. 714

తే. ఏకమతమని నమ్మెడి పోకవిడక । తాకిపరమను బయలునఁదాను జేర
సోకినిండియుఁబండుచేసూటియగును । గాక పెరమార్గములనమ్మఁగాదు వేమ. 715

ఆ. ఏకమమరయుక్తి పాకంబు గమకించి । సోకింపదుటెల్ల సూటియగును
దాకితాకి మిగిలి తళుకొత్తవలెనయా । విశ్వ. 716

ఆ. ఏకమునను జూడ నెఱుక యేకంబౌను । భువిని సతిని గూడు పురుషుమాడ్కి
లోక కాంతునట్టు లోపల వెలుగును । విశ్వ. 717

ఆ. ఏకమైన దాని నెక్కడఁజూతురు । పాకమెఱిఁగి చెప్ప పరుఁడెవండు
లోకమాయఁజూడలో వెలినిండెరా । విశ్వ. 718

ఆ. ఏకమైన వర్ణమెఱిఁగిన యోగికిఁ । బరము నెఱిఁగి చూడభావమెందు
నాకృతులను జేరి యున్నఁటఁదానౌను । విశ్వ. 719

ఆ. ఏకరూపమమర నెందాఁకఁజూచినఁ । బోకయెఱుక వలనఁ బొందుపడదు
తాకిమదిని నిల్చి తత్తర మొందకు । నీవు నిహామపరము నెగడు వేమ. 720

ఆ. ఏకసమమునందు నెఱుకగల్గినయోగి । పరుల నెఱిఁగి చూడభావమందు
ఆశలేక మించి యున్నఁటఁ దానగు । విశ్వ. 721

క. ఏకాంతే మిరవుఁగన్గొని । లోకాంతముఁజేరఁబోయి లోబయలగునా
పాకంబుఁ బూని మించిన । నీకింపగు చిత్పరంబు నెలవగు వేమా. 722

క. ఏకాంత మిరవుఁ గన్గొను । శ్రీకాంతుని బ్రహ్మ మయునిఁజిన్మయుఁబరుని
న్నాకారరూపుసాక్షిని । జాకారమెపరమపదవి యారయ వేమా. 723

క. ఏకో బ్రహ్మమనంగా । వైకల్పిత మైజగంబు వారలకెల్ల
న్నాకారత్వముల్బుడిగిన । శోకము మోహంబు లేదు శుభమగు వేమా. 724

తే. ఏగతిని గోరి వేడిన నేమి సుఖము । రాగలోభ గుణంబుల బాగుపఱచి
యోగమందును నిల్పిన నొనరుముక్తి । ఓగులకు నెట్టులభి యించు నోరివేమ. 725

క. ఏగుణములాపదలనిడు । నాగుణములడంప వలయు నాసక్తుండై
యేగుణములు మేల్గొనరుచు । నాగుణములననుస రించి యలరుచువేమా. 726

క. ఏచిన పంచేంద్రియసుఖ । నీచవ్యాపారముడిగి నిజముగఁదాన్తై
లోచూపు చూడ నొల్లక । వాచాబ్రహ్మంబు వదలవలదుర వేమా. 727

క. ఏచవిదారికి నొల్లరు । వాచవికిని సతమటన్న వాక్యంబులచేఁ
జూచినఁ బడుచులు వెఱచిన । యాచందమె జగములన్నియాయెను వేమా. 728

క. ఏచవిదొరికిన నొల్లరు । వాచవికిని నిత్యమన్న వాక్యంబులచేఁ
జూచినఁజవ్యాన వెఱచిన । యాచందము లాయెజగములన్నియు వేమా. 729

క. ఏమూడ్కినిలిచి యుండునొ । యామూడ్కిని బట్టి మదిని నొఁగాదనకే
రేచక పూరక కుంభక । సూచన పరమ నెడు బయలు చూడుము వేమా. 730

క. ఏజనుఁడు గుణకదంబము । నీజగమునఁబట్టనేర్చునిమిడికపడఁగా
నాజనుఁడె ముక్తికర్తృఁడు । రాజిత పరిపూర్ణ హృదయ రంజిత వేమా. 731

తే. ఏడ్వ మదినోవ ఫలమేమి యేరునిన్నుఁ । దిట్టఁగా నేమి లేకనుతింప నేమి
కలుగుభువిలాభలోభముల్గాలమహిమ । మనుచుసరిపెట్టికోరాదెయరయవేమ. 732

ఆ. ఏడునైదు నారు నెనిమిది తొమ్మిది । యేమికట్టునుండి యెట్లుతిరుగు
వాడివాడి నంత వాడదేయదియేమొ । విశ్వ. 733

ఆ. ఏడునైదు నారు నెనిమిది యొక్కటి । యోడలోననుండి యోరసిల్లు
ఓడయెక్కితిరుగు నోడయఁడే తత్వంబు । నిశ్వ. 734

ఆ. ఏడుమతములందు నెనసి చూడఁగఁబోప । లింగమతము కన్న లేదుమతము
మతము మూలమెఱుఁగ మర్మంబు లేదయా । విశ్వ. 735

ఆ. ఏడుమార్గములను నేకాంతమునఁజేరి । యాడిపాడిముక్తిఁగూడివేడి
జాడలోన బయలు సాధించి మనవలె । విశ్వ. 736

ఆ. ఏండ్లు రెండు దిన్ననిలపైనిస్తంభించు । నేండ్లుమూఁడు దిన్న నిహము వెలయు
ఏండ్లు నరుఁడు దెలిసి యేయోగి గావలె । విశ్వ. 737

ఆ. ఏడెయక్షరముల నీయంద మొందిన । నందు నిందు ముక్తి యలరుచుండు
నందు నిందుఁ దెలియనదియె పోబ్రహ్మంబు । విశ్వ. 738

క. ఏతత్వమమరఁగోరెదో । యాతత్వము సరిగ నడపు మారసిస్వరముల్
ఖ్యాతిగ వర్ణము లెన్నక । యాతురతన్నిలుపు మదిని ననువుగ వేమా. 739

ఆ. ఏదికులమునీకు నేదిస్థలంబురా । పాదుకొనుముమదిని బక్వమెఱిఁగి
యాదరించుదాని నవలీలముట్టరా । విశ్వ. 740

తే. ఏదికోరిననీకోర్కె యెఱుకయగును । ఏదికోరకనిండెనో యిరవునగును
సాధువిద్యకు ధరలోనసమములేదు । కోవిదులకిది తెలిసిన గుఱుతువేమ. 741

తే. ఏదిదినకయు బ్రతికిననేమిగలదు । వాదునకుఁజిక్కఁదక్కని వరుసఁగనుము
భేదబుద్ధినిజూచినఁ బెనఁగఁబోదు । సమతగలవాఁడు యోగ్యుఁడుజగతివేమ. 742

తే. ఏదియేదని మదిలోనిపాదుఁదెలిసి । కాదుకాదనిపరికించి కనులుదెఱచి
ఆదిమూలముఁగనుచుండు నాత్మవేత్త । దాననేపరమానందమూనువేమ. 743

క. ఏదేవపూజను నెంగిలి । సాదమె నైవేద్యమగును జనువాసనచేఁ
బాదములమీఁదఁబడితల । మోడుకొనుచు మ్రొక్క నేమిముక్తి రవేమా. 744

క. ఏదేశము తిరిగినఁబని । లేదటతనమనసుకుదురు లేకుండినచో
నాధారంబికనింతియ । తాఁదెలియుట మనసుశుద్ధితత్త్వము వేమా. 745

క. ఏనాఁడుసుభిక్షముతన । కేనాఁడిరవయ్యె నచటికేగుమ్మృగఁబు
ల్లానున్న చోటువిసికిన । మానవులను జివుక నేలమహిలో వేమా. 746

క. ఏనెవ్వఁడనను తలఁపును । మానసమునఁబొడమనీక మనుజుండకటా
కానఁడుతమసంకల్పము । మానకననుఁ గనుటయెట్లుమహిలో వేమా. 747

క. ఏపాపమైనఁజక్కఁగఁ । బాపునుగురుమర్మ ఘుటికబహుజన్మతతిం
జూపట్టియడఁగఁద్రొక్కుచుఁ । గాపైమదిలోనవెలుగు ఘనముగ వేమా. 748

ఆ. ఏపుమీఱమదిని నెంచిమించుటగుట్టు । రూపముభ్రమలడఁచి రూఢిపడఁగఁ
గాపురంబుఁజేరి కడగండ్లుమానరా । విశ్వ. 749

ఆ. ఏమహాత్మునందునీజగంబులు పుట్టె । నామహాత్మ్ము భజన యనుపుమీఱ
నీమనిష్ఠ నెఱపి నెమ్మదిఁగనవలె । విశ్వ. 750

ఆ. ఏమికాని దానినెఱుఁగుటలక్ష్యంబు । సాముఁచేసినట్లు సాధ్యపఱచి
నీమనిష్ఠవదలి నిర్గుణమందరా । విశ్వ. 751

తే. ఏమికానిది పరతత్త్వమెఱుఁగలేక । సోమయాజులు పశువులఁద్రుక్కడంచి
సామమేర్పఁడజదివినఁ జావవేల । బాధకములగు దుర్గుణ పంక్తి వేమ. 752

ఆ. ఏమి కొంచు వచ్చె నేమితాఁగొనిపోవుఁ । బుట్టు వేళనరుఁడు గిట్టువేళ
ధనములెచటి కేగుఁ దానేగు నెచటికి । విశ్వ. 753

ఆ. ఏమిచదివి యేమి యెఱుక లేకుండినఁ । జదువులందుఁ బరమ సౌఖ్యమగును
మానసైక్యమున నెమఱిముక్తి కలుగురా । విశ్వ. 754

తే. ఏమిసాధనములనం ద నేమిఫలము । తామసాన్వితమగునుక్తిఁదగులఁబెట్టి
నీమనిష్ఠలుమదియందు నెరపవలెను । మనసునిలుకడఁ గనునట్లుమనఁగ వేమ. 755

క. ఏయడఁజూచిన బ్రహ్మము । నీయడనాయెడనుగలఁడు నిబిడముగాఁదా
డాయను వెలియై తోఁచెడు । శ్రేయంబగుబట్టబయలు స్థిరమగు వేమా. 756

క. ఏరాజీవికి దేహము । పోరాయెర ప్రొద్దుపోయెఁ బుణ్యముఁగనరా
మాజాడని మనుగడకుం । జేరెడువిధ మెఱిఁగిమించి జితపడు వేమా. 757

క. ఏరాళమైన పదవిని । మారకుఁడైచూచువాఁడు మహితుఁడుసుమ్మీ
చేరువఁజిత్తను మింటను । బోరినఁబరిపూర్ణమమరుఁ బొందిక వేమా. 758

క. ఏరికిదక్కని చిన్మయు । దారికిఁదోడ్పడెడు నెఱుక తనలోఁదానై
పోరుచుఁబైకొనుచుండును । సారెకుసమయింపఁజూడు సరసత వేమా. 759

ఆ. ఏరుదాటి మెట్టకేగినపురుషుండు । పుట్టిసరకుఁగొనక పోయినట్లు
యోగపురుషుఁడేల నొడలిఁబాటించురా । విశ్వ. 760

క. ఏరూప మెచటఁజూచిన । నీరూపమె కానుపించు నిలిపి తెలివియా
నీరూపమె తానెఱిగిన । ధారుణిలో నీశ్వరుండు తా నే వేమా. 761

క. ఏరూపు మదినిగోరిన । నారూపేతోఁచుభ్రమల నొఁగాదనమిం
ధారాళముగను బ్రహ్మము । కోరికలనుమించిచూడఁ గుదురును వేమా. 762

క. ఏరూపున నారూపము । లోరూపునఁజూచుచుండ లోకారాంధ్యం
డేరూపుఁ జూచువారికి । నారూపై కానుపించు నభవుఁడు వేమా. 763

క. ఏవంక మనసుగలిగిన । నావంకనునింద్రియంబు లన్నియు నేగు
న్నీవంకమనసు కలిగిన । నేవంకనునింద్రియంబు లేగవు వేమా. 764

క. ఏసూత్రము నాసూత్రము । శ్రీసూత్రంబదియుఁగాక సిద్ధముగాఁగ
న్నాసూత్రము శ్రీసూత్రము । నాసూత్రముఁదెలియు వాఁడు నాథుఁడు వేమా. 765

## ఐ

ఆ. ఐకమత్యమెన్న నాల్కగలనువాసి । మగనిబుద్ధియెల్ల మగువ నేర్చు
దానిరక్షణంబె వానిలక్షణమగు । విశ్వ. 766

ఆ. ఐకమత్యమొక్క టావశ్యకంబెప్డు । దానిబలిమి యెంత యైనఁగూడు
గడ్డివెంటిఁబెట్టి కట్టరేయేనుంగు । విశ్వ. 767

ఆ. ఐదుచక్రములను నాడినిబడవైచి । యైదుచక్రములకు నవల వెలసి
యైదుచక్రములను నడవిబైలైతోఁచు । విశ్వ. 768

ఆ. ఐదు నైదు నెన్న నైదింటి చేకూడు । మూఁడుమూఁటఁజేరి మురియు నొకటి
మురిసినసకలంబు మోహించియుండురా । విశ్వ. 769

ఆ. ఐదువర్ణములను నానందమెఱింగిన । నందెపొందుముక్తి యలరుచుండు
నైదుఁగోనఁదెలియుటదియె పోబ్రహ్మంబు । విశ్వ. 770

ఆ. ఐదువేళ్లబలిమి హస్తంబుపనిఁజేయు । నందొకండువిడ్డఁ బొందికచెడు
స్వీయుఁడొకఁడువిడినఁ జెడుఁగదాపనిబల్మి । విశ్వ. 771

ఆ. ఐనదానికింకఁ గానిదానికినైన । నాడువారిమాట లాడుమన్న
సాహసమున బెక్కు లూహాలుపెనుతురు । విశ్వ. 772

ఆ. ఐనవారలంచు నాప్తులటంచును । బందుగులనునమ్మఁ బాడిగాదు
తనకునైనవాఁడు తానెకాకింకేఁడు । విశ్వ. 773

## ఒ

క. ఒకచిన్న బిలముఁజొరఁగా । సకలంకుని తేజమందె సావరణంబై
నికరంబుగఁ జూపట్టును । సకలంబునుసమయఁజూడు సరగునవేమా. 774

క. ఒకటని రెండనియెన్నుచుఁ । బ్రకటితముగలెక్కపెట్టఁ బైకొనుచుండు
న్నికరముగ నెఱుకదాటిన । సకలేశునిఁగాంచుటదియె సరసమువేమా. 775

క. ఒకటను జ్యోతైధరవే । ఒకఁటనుదాఁగూడిమఱిగి యొకఁటనుదగునా
యొకఁటం బుట్టుటకాచుట । నొకటేసుఖమునయెయుండు ముర్వినివేమా. 776

ఆ. ఒకఁటరెంటమూఁట యోగీంద్రులనుగూడి । యుభయపర్వతంబు మొదలుగిరుల
క్రమమెఱింగియల్ల ఘనపట్టణములెల్ల । వీరుఁడొక్కఁడేలు వినరవేమ. 777

ఆ. ఒకటిక్రింద నొక్కటొగిగుణకముఁబెట్టి । సరగునగుణియింప వరసఁబెరుగు
నట్టిరీతినుండు నౌదార్యఫలములు । విశ్వ. 778

ఆ. ఒకటిలోనఁగొట్టి యొకటిలోననెపెట్టి । యొకటిలోనుజూడు మొకటెచూపు
ఒకటియందెచూడ నొనరంగముక్తిరా । విశ్వ. 779

క. ఒకదినమును నొకనెలయును । బ్రకటితముగనొక్కయేడు భావింపంగా
నికయుగముల కీలెక్కయె । సుకరంబగుజగములందుఁ జూడరవేమ. 780

ఆ. ఒకనిఁజెఱుతుమనుచు నుల్లమందెంతురు । తమకుఁగలుగుచేటుఁ దామెఱుఁగక
తమ్ముఁజెఱుచువాఁడు దైవంబుగాఁడొకో । విశ్వ. 781

క. ఒకపద్యంబును మదినిడి । ప్రకటితమగుగుట్టుదెలిసి పరికించినచో
సకలంబును శ్రుత్యర్థము । నికరంబగుగురురహస్య నిలయమువేమా. 782

క. ఒకబ్రహ్మాండముఁ దలఁచినఁ । బ్రకటింపఁగరానివనఁగ బహులోకంబు
ల్ప్రకటమ్ములై యెట్లుండునొ । యకటామీతాండవంబు లట్టివెవేమా. 783

ఆ. ఒకరికీఁడువేళ యొక్కరికియ్యఁడు । ఒకరిమేలు వేళయొకరికీఁడు
కీడుమేలువారు పోడిమిఁదెలియరు । విశ్వ. 784

ఆ. ఒకరినోరుగొట్టి యొకరుభక్షింతురు । వారినోరుమిత్తి వరుసఁగొట్టుఁ
జేపపిండుఁబెద్ద చేపలుచంపును । జనుఁడువానిఁబట్టి చంపువేమ. 785

తే. ఒకరియెంగిలినోటను నొనరనుడుపఁ । దారకబ్రహ్మమై యిలఁదనరుఁగాదె
యెందటోతలచిన యదియెంగిలనరె । యెంగిలెంగిలియన నేల నిఁకనువేమ. 786

ఆ. ఒక్కఘటములోనఁబెక్కురూపులునిల్చు । నెన్నియెన్నిరూపులెసఁగుచుండు
నవియుదొలఁగనేని నన్నియుఁబైకొను । నాత్మతత్వమిట్టు లౌరవేమ. 787

ఉ. ఒక్కఁడురోగియాయె మఱియొక్కఁడుఒక్కలభోగియాయె వే
ఱొక్కఁడుత్యాగియాయె నిటులొక్కఁడుచక్కవిరాగియాయెఁ దా
నొక్కఁడుజ్ఞానియాయె వినుమొక్కమహాత్మునిఁ గానమెచ్చట
న్నిక్కమివన్నిరూపములు నీకనుజెల్లుచు నుండువేమనా. 788

ఆ. ఒక్కతనువునకిలఁబెక్కు పాట్లనుబడి । పెక్కుదినములెల్లఁ బ్రేలిప్రేలి
అగ్నిలోనఁబడునొ యలనక్కపాలౌనొ । తెలియుమయ్యయిఁకను దీనివేమ. 789

ఆ. ఒక్కతోలుఁదెచ్చి యొనరుబొమ్మనుజేసి । యాడునట్లుచేసి యట్టివెచెఁ
దన్నుఁద్రిప్పువానిఁ దానేలఁగానఁడో । విశ్వ. 790

ఆ. ఒక్కనెంగిలిగను నొనరఁగాఁదలఁచిన । బ్రహ్మమెంగిలాయె బహుగతులను
ఇందటినిదలఁచిన దీనోరుగాదకో । విశ్వ. 791

ఆ. ఒక్కప్రొద్దుచేతఁ బ్రిక్కలెండునుగాని । చిత్తమల్లగురునిఁ జేరఁబోదు
మూలమెఱుఁగనతఁడు ముక్తుండుగాఁడయా । విశ్వ. 792

ఆ. ఒక్కప్రొద్దులుండి యోగినీళ్లమునిఁగియుఁ । గూడునండివేల్పుఁ గుడువుమనుచు
దానినోరుగొట్టి తామెల్లఁదిందురు । విశ్వ. 793

ఆ. ఒక్కప్రొద్దులున్న నూరఁబందిగఁబుట్టుఁ । బృధివిఁదపము సేయఁ బేదయగును
నిగిడి శిలకుమ్రొక్క నిర్జీవులౌదురు । విశ్వ. 794

ఆ. ఒక్కమనసుతోడ నున్నది సకలము । తిక్కఁబట్టినరులు తిరుగలేరు
ఇక్కనెఱిఁగినడవ నొక్కఁడె చాలురా । విశ్వ. 795

ఆ. ఒక్కయింటిలోనఁ బెక్కుకుండలునిల్ప । నన్నియన్నిరూపు లలరుచుండు
నవియుఁదొలఁగనేని నాయిల్లుబయలౌను । విశ్వ. 796

క. ఒంటరిగా నున్నప్పుడు । కంటికిమింటికినినడుమఁ గాపురముగనీ
యుంటనుగన్గొని పిమ్మట । జంటించు జితాత్మయుని జపమునవేమా. 797

ఆ. ఒంటికంబమందు నొనరఁగంకణమాను । ఆఱుకంకణముల నమరనిల్పి
అవలదాటిచూడ నదిపరమాత్ముఁడౌ । విశ్వ. 798

ఆ. ఒంటికంబమందు నొనరఁజూచెదుజ్ఞప్తిఁ । గూడియాడిపాడి కోర్కెదీఱ
మేడదాటిచూడ మితిమీఱుచుందురా । విశ్వ. 799

ఆ. ఒంటిమేడలోన నొనరంగఁజూచిన । మంటిమింటినడుమ మహితమగును
గంటిజ్యోతిమిగిలి కలియనెక్కుమహంస । విశ్వ. 800

ఆ. ఒట్టుమాటనాలిఁ బోలిమాటలచేటు । పోటుమాలుబంటు కూఁటిచేటు
పనికిమాలుతొత్తు భత్యంబుచేటయా । విశ్వ. 801

ఆ. ఒడలబూదిపూసి జడలుధరించిన । నొడయఁడగునుముక్తిఁ బడయలేఁడు
తడుకబిఱ్ఱుపెట్టఁ దలుపుతోసరియౌనె । విశ్వ. 802

ఆ. ఒడలిమెఱుఁగుఁజూచి నడసొబగునుజూచి । వంకకొప్పుఁజూచి వనితఁజూచి
విటులు కడుపులోన వెతనొందకుందురా । విశ్వ. 803

ఆ॥ ఒడలు సల్లనైన నోరుపుగల సతి । గుణము మేల్మిఁబట్టి కోటిసేయు
ప్రాతయెనుము పాలురోఁతన వచ్చునా । విశ్వ. 804

ఆ. ఒడలుఁ పెంచులంజె యుబ్బసంబుననైన ! నూగి విటుని మీఁద నొరిగనేని
పందికొక్కుమీఁద బండికల్పడ్డట్టు ।విశ్వ. 805

ఆ. ఒడలు బడలఁజేసి యోగులమను వారు । మనసుకల్మషమును మాన్పలేరు
పుట్టమీఁదఁ గొట్ట భుజగంబుసచ్చునా । విశ్వ. 806

ఆ. ఒడ్డుఁ బొడుగు గలిగి గడ్డముంబొడవైన । దానగుణములేక దాతయగునె
యెనుముగొప్పదైన నేనుఁగుఁబోలునా । విశ్వ. 807

ఆ. ఒడ్డెదెలుపవచ్చు నొకనాఁటికైనను । మానిఁదెలుపవచ్చుమార్గమునను
మొప్పెఁదెలుపరాదు ముప్పదేండ్లకునైన । విశ్వ. 808

క. ఒడ్డెయుపతి వలపెఱుఁగునె । జడ్డునఁ బడితిరుగు వాఁడు జాణండగునా
అడ్డము దిడ్డముఁదిరిగెడి । తెడ్డెఱుఁగునె పాలతీపు తెలియుము వేమా. 809

ఆ. ఒడ్డెవానికి గుఱుతోర్చి చెప్పినఁ గాని । తెలియబడ దదాత్మ తేటలేక
చెడ్డకొడుకు తండ్రి చెప్పిన వినఁడుగా । విశ్వ. 810

ఆ. ఒదిగి యొదిగి గురువు నొప్పగా నొప్పించి । మదినినిల్పి జాతి మమత విడిచి
కదియు చుండు మయ్య కలకాలమొకరీతి । విశ్వ. 811

ఆ. ఒరుల కొఱకు భూమి నొరపెడి వారలు నవని పతికి వశ్యులైనవారు
పాలవంటి కులము పన్ను వెట్టినవారు । వాక్కులుగరు కాపువారు వేమ. 812

ఆ. ఒరుల నొరులఁ గడవకుండఁగ బంధింప । లింగ మేమి దొంగిలించినాఁడు
దేహమందు శివునిఁ దెలియంగ నేరరో । విశ్వ. 813

ఆ. ఒల్లనన్నఁబోదిఁ గొల్లెనెన్నఁగరాదు । తొల్లిచేయునట్టి ధూర్తఫలము
ఉల్లమందు వగవకుండుట యోగ్యంబు । విశ్వ. 814

క. ఒల్లనిపతి నొల్లనిసతి । నొల్లని చెలికాని విడువ నొల్లని వాఁడే
గొల్లండుగాఁడెధరలో । గొల్లనికింగలవె వేలకొమ్ములు వేమా. 815

క. ఒల్లని సతి నొల్లనిపతి । నొల్లని చెలికాని విడువ నొల్లనివాఁడే
గొల్లఁడు గొల్లనికిని మది । నెల్లెడఁగొమ్ములును గలవె యెందును వేమా. 816

## ఓ

ఆ. ఓగునోగు మెచ్చు నోనరంగ నజ్ఞాని । భావమిచ్చి మెచ్చుఁ బరమలుబ్ధుఁ
బందిబురద మెచ్చుఁ బన్నీరు మెచ్చునా । విశ్వ. 817

ఆ. ఓగుబాగెఱుఁగని యుత్తమాధజనంబు । లిలసు ధీజనముల నెంచుటెల్లఁ
గరిని గాంచి కుక్క మొఱిగిన సామ్యమా । విశ్వ. 818

ఆ. ఓగుబుద్ధివిడిచి యోగిగావలెఁగాని । బోగమమరుయుక్తిఁబూనరాదు
సాగఁదోలి పిదపఁ జవిఁగొని చూడరా ! విశ్వ. 819

ఆ. ఓజ మాలుమగువ యోలి మాడల చేటు । పాటులేని మగఁడు కూఁటి చేటు
పనికిమాలు దాసి బత్తెంబు చేటురా ! విశ్వ. 820

తే. ఓటుపరులకుఁ గల్గించు నూహఁజెంది । కుచ్చితులతోడఁబనిఁబడఁ గూడికొన్న
నప్పుడెల్లైన వారల యాప్తతఁదన । గౌరవంబును మాపును గాదె వేమ. 821

ఆ. ఓడసత్యమెల్ల నోగిసముద్రములోన । బండి సత్యమెల్ల బైటనుండు
నాడుదాని సత్య మేడనోచూడరా । విశ్వ. 822

ఆ. ఓపగల్గుదునని యొక్కింత మినికిన । నున్న వానికూడ సున్నచుట్టి
మూలఊంకులాగి గేలిసేయుదురయా । విశ్వ. 823

తే. ఓరగంటను సుందరునొక్కమాఱు । కన్నఁ జాలును గామిని కాంక్షఁజెందుఁ
గాననన్యునిఁ గులసతి కానకుండ । రక్షణము చేయదగు నెల్లరకును వేమ. 824

తే. ఓర్పులేనట్టి వారల కోరుల యశము । విన్న కోలఁడిని బెంపొందు వెఱ్ఱితెవులు
దానిపరిహారమునకునై మానకెపుడు ! తమఘనంబును జాటింత్రు ధరణివేమ. 825

అ. ఓర్పులేని భార్యయున్న ఫలంబేమి । బుద్ధిలేని బిడ్డ పుట్టియేమి
సద్గుణంబులేని చదువదియేలరా । విశ్వ. 826

## ఔ

తే. ఔచితియె యున్నవాడెఁప్డు నర్హమయిన । గౌరవమ్మును బదవిని గనుచునుండు
సర్వజనులును బూజింప సంతతమును । దండిదౌ కీర్తి నార్జించుచుండు వేమ. 827

ఆ. ఔనటంచు నొక్కఁడాడిన మాటకుఁ । గాదటంచుఁబలుక క్షణము పట్టు
దానినిలుపఁదీయఁ దాతలు దిగ వలె । విశ్వ. 828

ఆ. ఔననంగ వచ్చునైనది కానిది । యన్యుఁడెదుట నుండి యడుగఁడేని
నిలిచి యడుగువాఁడు కలిగిన గెలువఁడు । విశ్వ. 829

తే. ఔను వేమన సెప్పిన యాత్మబోధ । తెలియ నేరని యజ్ఞానిదేబెల్లఁ
వలను బాసిన వెండ్రుకవలెను జూడ । భుక్తిముక్తులుగానరు భువిని వేమ. 830

ఆ. జారయాడుదాని నా బ్రహ్మ సృష్టించెఁ। బురుషుపాలిటి పెనుభూతమట్లు
దాని వలను జిక్కఁగాని వాఁడుండునే । విశ్వ. 831

ఆ. జారయెంత వారలల్లరి మానవుల్ । ప్రభువునైన గేలిపఱతు రెన్నఁ
దాఁ దెగించువాఁడు దండియౌ భువిలోన । విశ్వ. 832

ఆ. జారసుండె నీకు నౌరసుఁడౌఁగాక । వేశ్యయందుఁ బుట్టి విధవకొడుకు
నీవు పోయినపుడు నీరైన వదలునే । విశ్వ. 833

## క

తే. కంకణముఁగట్టి కైవల్య కర్జమంది । యంకురింపఁగ బరిపూర్ణ మభినుతించి
జింకతాలుపు వెలుగందఁజిన్మయంబుఁ । జేరనైనది యే ముక్తిదారి వేమ. 834

ఆ. కంకుభట్టనంగఁగాషాయములు గట్టి । కొలిచెధర్మరాజు కోరి విరటుఁ
గాలకర్మగతులు గని పెట్ట వలెనయా । విశ్వ 835

తే. కచముఁగక్ష్యంబు నోరునుగనులు మేను । నాభియును బాహుమూలంబు నాతికెపుడు
నోర్వఁదగనట్టి గాలుతో నొప్పుచుండు। నింత కేయేల నింతిపై భ్రాంతి వేమ.836

ఆ. కంచెడన్నముఁదినఁగా నేమి ఫలమయ్య । యాఁగకడుపు చొరఁగ నిముడఁబోదు
నూఱునోములొక్క మాఱుఅంకునఁజెడు । విశ్వ. 837

తే. కచ్ఛడము లేల బిగియించి కట్టవలెను । బుద్ధికుదిరిక యుండినబోలు గోచి
యేమిచేసెడి నది లేమి నెంతబిగియఁగట్టినను ఫలముండదు గాదె వేమ. 838

క. కచ్ఛడము క్షేత్రమయితగఁ। దచ్ఛనగాజగము పుట్టెఁదాతలనాఁడే
యిచ్చటఁగులజుండెవ్వఁడు । సచ్చరితులె యందఱునని చాటర వేమా. 839

తే. కట్టికొట్టనుజిక్కదు కర్మఫలము । ముట్టిదాటినమనుజుని ముఖ్యముగను
గుట్టుఁదెలసినవాఁడని కూడవలెను । రట్టతఁడు సేయఁగా వినురహీని వేమ. 840

ఆ. కంటిఁగంటిననుచుఁ గర్మాధికారంబు । వెంటఁగొనుచుఁజెడును వెఱ్ఱిజనుఁడు
బట్టబయటముక్తిఁ బాటించిచూడరో । విశ్వ. 841

ఆ. కంటికావరమునఁ గానఁడుమరణంబు । మదము చేతఁ దత్త్వమహిమఁగనఁడు
భోగవాంఛచేతఁ బురహరుఁగానఁడు । విశ్వ. 842

క. కంటికిమింటికి నడుమను । నొంటరిగాబయలుసేరు నొప్పుగలోనే
జంటించి మనస్సునొక్కిన ! మింటనునిన్నెఱుఁగవచ్చు మేలుగవేమా　　843

ఆ. కంటిదృష్టిచేతఁ గనువిశ్వమెల్లను । దర్పణంబుగల్గఁ దన్నుఁగనుచు
నాత్మతత్వమార్గ మారీతిఁగనవలె । నార్యదర్పణంబు నందువేమ.　　844

ఆ. కంటిమంటచేతఁ గామునిఁగాల్చియుఁ । బెంటిఁబాయలేఁడు పెద్దవేల్పు
వెంటిఁబాసినట్టి పెద్దలుగలరకో । విశ్వ.　　845

ఆ. కంటిమంటచేతఁ గామునిదహియించి । కామమునను గడకు గౌరిఁగూడి
నట్టిశివునితేజ మంటినంతనెచూడు । పూర్వకర్మఫలము పోవువేమ　　846

ఆ. కంటిలోనమిన్ను కలయికనగుముక్తి । నంటితిరుగువాఁడె యమలుఁడగును
వంటకంబుకొఱకు వాదాటిఁజూపరా । విశ్వ.　　847

ఆ. కంటిలోనివానిఁ గఱకంఠుఁడెఱుఁగును । గంటిలోనివాని మింటఁజూడు
కన్నుమిన్నుహృదయ కమలమందెఱుఁగుము । విశ్వ.　　848

ఆ. కట్టుబట్టఁజూచి ఘనతఁజెప్పఁగరాదు । కానరాదులోని కలిమితనము
జంగమైనపిదప జాతినెంచఁగరాదు । విశ్వ.　　849

ఆ. కట్టువారలేరి కట్టనివారేరి । కట్టికట్టలేని కర్మలేరి
గట్టిపఱచిలెస్స కనుగల్గిచూడరా । విశ్వ.　　850

ఆ. కట్టెపేరులోఁడి గట్టిచెప్పఁగరాదు । కానరాదులోని కలిమితనము
జంగమైనపిదప జాతినెంచఁగనేల । విశ్వ.　　851

ఆ. కట్టెపైననున్న కట్టెకుఘనమేమి । చెట్టుపైననున్నఁ జేరుఘనము
కట్టెచెట్టుగలిసె కటకటాదైవంబు । విశ్వ.　　852

ఆ. కట్టెయందునిప్పుఁ గాననిచందమీ । తనువునందునాత్మ తగిలియుండు
మఱుఁగుఁదెలిసిశివుని మాఱొక్కనిచూడరా । విశ్వ.　　853

ఆ. కడఁకతోననరుఁడు కామంబుఁగట్టిన । చిత్తమునను జికిలి చిత్రరూపు
కైవడినిలనుండు ఘనుఁడాతఁడేసుమ్మి । యడవియందొ పల్లెయందొవేమ.　　854

ఆ. కడఁకనఖిలమునకు నడినాళమందున్న । పేగుఁజుక్కవంటి వెలుగుదిక్కు
వెల్గుకన్నదిక్కు వేఱెవ్వరున్నారు. విశ్వ.　　855

ఆ. కడఁకనింద్రియములఁ గట్టివేయఁగలేక । చావువచ్చినపుడుసన్యసించు
నాత్మజితముగామి నందునామోక్షంబు । విశ్వ. 856

ఆ. కడఁగిగాలిలేని గగనంబుభంగిని । బలుతరఁగలులేని జలధిమాడ్కి-
నిర్వికారమునను నిశ్చలతత్త్వమునఁదా । నుండెనేనిముక్తి యొనరువేమ. 857

ఆ. కడఁగివట్టియాస కడతేఱనియ్యదు । ఇడుములందుఁబెట్టి యీడ్చుఁగాని
పుడమిజనులభక్తిఁ బొడమంగనియ్యదు । విశ్వ. 858

తే. కడఁగిసంకల్పములనెల్లఁ గట్టిపెట్టి । చిత్తముననేమి తలఁపకచిత్రరూపు
కైవడినినున్నాతఁడు ఘనుఁడుదలఁప । నడవియందునో పట్టణమందొ వేమ. 859

ఆ. కడలిఁజూడనలలు కడుఁజోద్యమైయుండు । మనసుఁజూడభ్రమల మరిగియుండుఁ
బరముఁజూడమనసు పడుపాటదట్టురా । విశ్వ. 860

క. కడలేని యాదికాలం । బెడఁజడమండఁగను జ్ఞానమెఱుఁగకయున్న
న్విడువుడు జడమతులనుమఱి । నడవుఁడిఘనులెల్లముక్తి నట్టుగ వేమా. 861

ఆ. కండకావరమునఁ గానఁడుమరణంబు । తనుమదమునఁగనఁడు తత్త్వమల్లె
భోగవాంఛచేతఁ బుణ్యంబుఁగానఁడు । విశ్వ. 862

ఆ. కండచక్కెరయును గలియుఁబాల్పోసినఁ । దఱిమిపాముతన్నుఁ దాఁకుఁగాదె
కపటమున్నవానిఁ గనిపెట్టవలెనయా । విశ్వ. 863

ఉ. కండలుశ్రాద్ధదేవునకుఁ గాలినయస్థులు భూమిదేవికో
వండినకూడు కాకులకు వానికిఁగప్పిన గుడ్డమాలకో
మెండుధనంబురాజులకు మేలగుభార్యలు మిండగాండ్రకే
నిండినప్రాణులందఱికి నిక్కముపాపమె దక్కువేమనా. 864

తే. కండలెముకలునెత్తురుఁ గలిగితనువు । మూత్రమలములతోనుండు ముట్టరాక
కాయజునిబాణమంచాస గల్గఁజెడును । ఆసఁబాపంగనీవిధ మరయువేమ. 865

ఆ. కండలెల్లఁగోయఁ గానీయఁజాలని । బండలోభికాస పడినఁగలదె
కొండక్రిందఁబసిడిఁ గోరినచందంబు । విశ్వ. 866

ఆ. కడుపుకేలమనస కళవళపడియెదు । కడుపుకేడఁదృప్తి కలుగుచుండుఁ
గడుపురాతిలోని కప్పకుఁ గలుగదా । విశ్వ. 867

ఆ. కడుపుకేలమీరు కళవళపడెదరు । కడుపుచల్లపడఁగఁగలదుభుక్తి
కడకురాతిలోని కప్పకులేదకో । విశ్వ. 868

ఆ. కడుపుకొఱకెనరులు కళవళపడుదురు । కడుపుకొఱకె యూళ్ల గహనములును
కడుపునకెటులయినఁ గలుగునుభుక్తిరా । విశ్వ. 869

ఆ. కడుపుచిచ్చుచేతఁ గామానలముచేతఁ । గ్రోధవహ్నిచేతఁ గుటిలపడక
యుక్తమనసుతోడ నుండినప్పుడెముక్తి । విశ్వ. 870

ఆ. కడుపునిండఁదవుడు గంపలోఁబెట్టినఁ । జన్నుముట్టనీక తన్నుబఱ్ఱె
వారకాంతలెల్లు వలతురోయూరకే । విశ్వ. 871

ఆ. కడుపునిండసుధను గ్రమముతోఁద్రావిన । పాలమీఁద నేలఁ బాఱుమనసు
తత్వమెఱుఁగువెనుకఁ దత్వంబులేఁటికో । విశ్వ. 872

ఆ. కడుపుబోరగించి కన్నులుముకుళించి । బిఱ్ఱబిగిసికొన్న బీదయోగి
యమునిబారిగొఱ్ఱె యతఁడేమిసేయును । విశ్వ. 873

ఆ. కడుపులోననున్న ఘనమైనపిండంబు । ముందుఁగష్టమెల్ల మొదటరోసి
యికనైనబుద్ధి యేర్పడిపుట్టునా । విశ్వ. 874

ఆ. కడుపులోనమలము కడమవియెముకలు । కలదుమాంసమింత కప్పఁదోలు
మలముసెత్తిమీఁద మాసెట్టుకగ్గెరా । విశ్వ. 875

ఆ. కడుపులోనమలము కడమెల్లనెముకలు । అరసిచూడఁబైది ముఱికితోలు
ఇట్టిదేహమునకు నేమిసంసారంబు । విశ్వ. 876

ఆ. కడుపులోనిమలము కష్టమైయుండఁగా । నన్నమేమికీడో యనితలఁచియె
ఉపమెఱిఁగినమనుజు లుపవాసముందురు । విశ్వ. 877

ఆ. కడుపులోనిరోఁత కడునోఁటియెంగిలి । కడుగవశమెబ్రహ్మ కొడుకునకును
సత్యమున్నఁగొంత జగతిపైసిద్ధించు । విశ్వ. 878

ఆ. కడుపులోనివానిఁ గానరానినరునిఁ । గష్టపడుదురింతె కానిజనులు
హీనమెఱుఁగనాతఁడిది యేలనెఱుఁగునో । విశ్వ. 879

క. కడుబెద్ద పరాశరుఁడఁట । చెడుమాలగతితకడుపునఁ జెలఁగిజనించె
నవ్వడిఁబెద్ద వ్యాసుఁడాచెం । బడిదాసికిజాతమయ్యెఁ బాడిగ వేమా. 880

ఆ. కడువిచిత్రమరయఁ గామునిమంత్రంబు । పువ్వుబోడిచుక్క బొట్టుఁగన్నఁ
గాంతిబెళుకుఁగన్నఁ గడుపొక్కపుట్టదా । విశ్వ. 881

ఆ. కంతకాశ్రయింత్రు కళకంతుఁడాదిగా । వింతగానుభ్రమసి విసుకరెపుడు
కంతరహితమైన కళకంతుఁజూడరా । విశ్వ. 882

క. కథలనఁగా మున్నైనవి । కథలెన్నియొచదివిచదివి కలవరపడఁగాఁ
బృధివిని మృతమిఁకనిక్కము । ముదమునబ్రహ్మంబునంట ముక్తిర వేమా. 883

తే. కదలకుండఁగమదినిల్పి కదిసిపట్టి । నిదురలోనిద్రఁ జూచుచు నేర్పుమిగిలి
పదరకుండెడువాఁడెపోబ్రహ్మనిభుఁడు । నిధియెసంతోషమున కెల్లనిజము వేమ. 884

క. కదలని జీవములందును । దుదమొదలుగనాఱురుచులు తొలఁగకయుండుం
గదలెడి జీవములందును । వదలవుకష్టంబుసుఖము వసుధను వేమా. 885

ఆ. కదలనియ్యకుండ గట్టిగాలింగంబుఁ । గట్టివేయనేమి కల్లచేయు
భావమందుశివుని భావించికానరో । విశ్వ. 886

ఆ. కదలిత్రూర్పునందు ఘనతశోభిల్లఁగాఁ । బరగవరకతారు పల్లెవెలసి
యచలనిష్ఠగూడ నమరియుండెదరయా । విశ్వ. 887

తే. కదిమిమదిలోనిసాగర గమనమెఱిఁగి । యీదిదాటెడుగురుశక్తి నేరుపఱచి
జపముచేతను దన్మయుఁజూడఁగనుము । మానసమునిల్కడనుగన్న నౌను వేమ. 888

ఆ. కదియఁబట్టిహంస కళలంటగమకించి । సదయహృదయమందు సంతరించి
విదితమైనబయల వెన్నంటిచూడరా । విశ్వ. 889

క. కదివాటి పాముకాటును । నదరఁగనాపిడుగుపోటు నలపులికాటు
న్విదితముగ రాము నేటును । బుధహితమగు శిల్పితిట్టుఁ బోల్పగు వేమా. 890

ఆ. కదురుమానమునకుఁ గల్పహారమునకుఁ । గాపుజగడమునకు ఖడ్గమట్టె
మూఁడు మొనలమీఁద ముజ్జగంబులునన । విశ్వ. 891

ఆ. కనకనగరమునకుఁ గారణకర్తలి । ట్లుండనగుచు నుభయులుండిరేని
గండపక్షియుగళ ముండినరీతియరా । విశ్వ. 892

ఆ. కనకపర్వతమునఁ గాపురంబుండిన । ననిమిషేశ్వరునకు నాసపోదు
కనకకుండలములు కర్ణునినడుగఁడే । విశ్వ. 893

ఆ. కనకమన్న మంచికాంతలఁటన్నను । వలచియుందురెంత వారలైనఁ
దోయజాక్షిఁబాయు దొరలెవ్వరునులేరు । విశ్వ. 894

ఆ. కనకమవలదాటి కడగండ్లుపడనేల । మనసునిలుపవలెను మర్మమెఱిఁగి
యినుముఁజేరియగ్గి యిమిడినచందమా । విశ్వ. 895

ఆ. కనకమృగముఁబట్టి కడుఁబోరిచంపిన । నరుఁడురాజరాజు నమ్మిచూడఁ
దరముగానికర్మ మరుగుఁదానంటెరా । విశ్వ. 896

ఆ. కనకమృగముభువిని గలుగదంచెఱుఁగరో । రాముఁడెఱుకగల్గు రాజుగాఁడె
చేటుకాలమునకుఁ జెడుబుద్ధిపుట్టెడు । విశ్వ. 897

ఆ. కనకమృగముభువిని గద్దులేదనలేక । తరుణివిడిచిపోయె దాశరథియుఁ
దెలివిలేనివాఁడు దేవుఁడెట్లాయెరా । విశ్వ. 898

ఆ. కనకమృగమువెంటఁ గలదులేదనుకొంచు । రమణివిడిచిపోయె రామవిభుఁడు
తెలివిమాలినతఁడు దేవుఁడెట్లాయెనో । విశ్వ. 899

ఆ. కనకమున్నఁబోడుఁ గాముఁడుభీముఁడు । మిగులదేజమంది మెలఁగుచుండు
విత్తహీనుఁడైన వెఱ్ఱులలోనేటు । విశ్వ. 900

ఆ. కనఁగసొమ్ములెన్నొ కనకంబదొక్కటె । పసులవన్నెలెన్నొ పాలొకటియె
పుష్పజాతులెన్నొ పూజయొక్కటెసుమీ । విశ్వ. 901

క. కనరానిది పరతత్త్వము । వినరానిదిగురునినింద వినికనియునుదా
ననరానిది పెద్దలగతి । మనరానిదిమానహాని మహిలోవేమా. 902

ఆ. కన్నపుత్రునాస కనకంబుపైనాస । పిన్నపెద్దతనము లెన్నఁబోదు
వాసుదేవువిడిచి వసుదేవునెంతురా । విశ్వ. 903

ఆ. కన్నపుత్రునాస కనకంబుపైనాస । స్త్రీలమీఁదియాస చిత్తమెడసి
భ్రమలువిడువకున్న బ్రహ్మంబుఁగాంతురే । విశ్వ. 904

ఆ. కనియుఁగానకుండుఁ గడుతీవితోడను । వినియువినకయుండు విస్మయముగ
సంపదగలదేని సన్నిపాతముపూను । విశ్వ. 905

ఆ. కనియుఁ గానలేఁడు కదలింపఁ డానోరు । వినియు వినఁగలేఁడు విస్మయమున
సంపదగలవాఁడు సన్నిపాతక మది । విశ్వ. 906

ఆ. కనియుండి కానలేరట వినియుండియు వినఁగలేరు విస్మయమే మో
కనుగ్రుడ్డి వినెడు చెవుడం । చనునది నిజమయ్యె జగము నందును వేమా. 907

క. కనుచాటు తప్పకాగుటి । మననంబునఁ జేరనొక్క మాఱొక్కనినంత
న్వినుచుండుఁ బ్రణవరవళిని । గనిదాటున నిర్గుణంబు గతియగు వేమా. 908

తే. కనులచూడ్కి నిజెదరక గట్టినొక్కి । తనువుపైయాసవిడిచిన తావుఁబట్టి
యున్న మనుజుఁడె శివుఁడయా యుర్విలోన । నతని కేఁటికి సుఖదుఃఖవితతి వేమ. 909

ఆ. కనుల చూపు నిలిపి కాంతి నిగమనించి । కాంచవలెను జిత్రి కళలు దాటి
కోటకొమ్మఁ జేరి కోర్కెలడంపరా । విశ్వ. 910

ఆ. కనులఁ జూడఁబడని కలుషవిదూరుని । మనమునందుఁ జేర్చి మరులుకొనక
తనకు ముక్తి లేదు తలఁపులు మెండైన । విశ్వ. 911

ఆ. కనులు పోవువాఁడు కాళ్లు పోయినవాఁడు । ఉభయులరయఁ గూడి యుండినట్లు
పేద పేదఁ గూడి పెనఁగొనియుండును । విశ్వ. 912

ఆ. కనులు రెంటి నడుమఁ గాసంత నిలిపిన । బొమలు మీఱి చూడ్కిఁ బొందఁజేయుఁ
గ్రమము మెఱింగి లోనఁ గాంతి నిబట్టరా । విశ్వ. 913

ఆ. కన్ను మిన్ను చేసి కాంతి నిగమకించి । తన్ను నిలిపిచూచి తలఁపువదలి
యున్నవాఁడు పరముఁ గన్నవాఁడేయగు । విశ్వ. 914

ఆ. కన్నులందు మదము గప్పి కానరు గాని । నిరుడుముంద లేదు నిన్న మొన్న
దగ్ధులైనవారు తమకంటెఁ దక్కువా । విశ్వ. 915

ఆ. కన్నెతోడ వరుఁడు కామించి గడియంగ । నొక్కమాఱు పిండ ముద్భవించె
నచటఁ గులజుఁడేడి యరయహీనుండేడి । విశ్వ. 916

ఆ. కన్నెదాని మేను కస్తూరి వాసన । ముసలిదాని మేను ముఱికి కంపు
వయసుదాని మేను వర్ణింపశక్యమా । విశ్వ. 917

ఆ. కన్నెపడుచుఁ గాంచి కదలనీకుండిన । యాసఁబట్టియొక్క మూసఁబెట్టి
కఱగఁబెట్టి దాని కడముట్టఁ జేయరా । విశ్వ. 918

ఆ. కన్నెమీఁదనాస కనకంబుపైనాస । లేనివాఁడు పుడమిలేనివాఁడు
గలిగెనేనతండు గానంగరాఁడయా । విశ్వ. 919

క. కన్నెల నవలోకింపనె । చన్నులపైదృష్టిపాలు సహజంబిలలోఁ
గన్నుల కింపగుదృష్టిని । దన్నెరుగుట ముక్తికిరవు తపమగువేమా. 920

ఆ. కన్నెవరుఁడుజేరి కదియంగనొక్కపు డుచ్చయందుఁబిండ ముద్భవించు
హెచ్చుకులజుఁడేడి హీనుఁడెవ్వండురా । విశ్వ. 921

ఆ. కపటముడిగిగురుని కైదండయొనరించి । యుపముతోడభక్తి యునికిఁజేసి
తపమెఱింగినంత ధన్యతవొడమును । విశ్వ. 922

ఆ. కపటమైనపనులు కడఁబెట్టిచూడక । తత్వమెట్లుతనకుఁ దగులువడును
దగులఁబడినఁగాని తనకుసాధ్యముగాదు । విశ్వ. 923

ఆ. కపటవేషమూని కడగండ్లుపడనేల । విపినభూమిఁదిరిగి విసువనేల
నుపముతోనెముక్తి యున్నదికనవలె । విశ్వ. 924

క. కప్పయుఁ బామునుబోరం । గప్పనుసర్పంబుమ్రింగు కైవడిమెఱయం
గప్పను వెడలంద్రోసెడి । యొప్పుననాచొప్పుఁదెలిసి యుండరవేమా. 925

ఆ. కప్పురంపుమనసుఁ గాంక్షించుయోగికి । జ్ఞానదీపశిఖయుఁ దానటించుఁ
గానవచ్చునాత్మ క్రమమాణమైయెప్డు । విశ్వ. 926

ఆ. కప్పువిడినమనసు కాంక్షింపదెద్దియు । జ్ఞానతపమునూని కదలకుండు
మెచ్చునాత్మక్రమము మిన్నంటియుండురా । విశ్వ. 927

ఆ. కఫముమీఱిమఱియుఁ గనులుమూఁతలుపడి । బుద్ధితప్పిచాలఁ బుడమిపొఱచు
వేళలందునిన్ను వెదకుటసాధ్యమా । విశ్వ. 928

ఆ. కబ్బమొకటిపూని గడగడఁజదివిన । లోనియర్థమెట్టు తానెఱుంగు
నెరుకమాలు చదువికేఁటికో తెల్పరా । విశ్వ. 929

ఆ. కంబముననుజొచ్చి కడతేఱిపోయెడి । తెరువెఱుఁగకయుండెఁ దిరిగివచ్చి
తెరువుఁదెలిసిదాట దేవుఁడందురుగదా । విశ్వ. 930

ఆ. కంబళములుగట్టి గంతలగజ్జల । బోడితలలసొంపు పొల్పుమీఱఁ
గడుపుకొఱకుఁదిరుగ ఘనులౌదురా వారు । విశ్వ. 931

సీ. కమలభవాండంబు కరవటంబదియెంత । దానిలోపలజగ త్త్రయమదెంత
దానినాల్గవపాలు ధారుణీస్థలమెంత । దీననేడవపాలు దీవియెంత

యుండుదోఁష్మిదవది యగుతునియయదెంత । యాతునియలభాష లమితమయ్యె
నట్టిభాషలతోడ ననువుమీఱఁగఁగడుఁ । బొలుపారుచున్నట్టి భూములెన్ని
యట్టిభూములేలెడువార లమితనృపులు । ఘనులు పెక్కండ్రుకలరని కడకు నెఱిఁగి
యొకరిదయచాలఁగానమ్మి యుండుమనుజు । విభవమేమనవచ్చురా వెఱ్ఱివేమ. 932

క. కమలభవాండము లెల్లను । విమలులు సుజ్ఞానులెల్ల వీక్షింతురయా
యమలంబౌ మనమునఁదగ । సుమహితపిండాండ మెపుడుఁ జూడరవేమా. 933

ఉత్సాహ. కమలభవుఁడువార్ధియఁ దుడువ గర్తయందురందఱుం
గమలభవునిశిరము శంభుకరముఁజేరు టెఱుఁగరో
కమలభవునిసుదుట విశ్వకర్తయొకఁడె్రవాసెరా
కమలజాండగురుఁడతండె ఘనమిదెఱుఁగువేమనా. 934

ఆ. కమలభవుఁడు సేయుఁ గడుసృష్టియందురు । హరిభరించుఁ జంపుహరుఁడటండ్రు
మూర్తులింద్రైన మూల మెక్కండెరా । విశ్వ. 935

ఆ. కమ్మరీనిదుడుకు కార్యవినాశంబు । వడ్లవానిదుడుకు వారపిడుగు
కాసివానిదుడుకు కాకుస్థబాణంబు । విశ్వ. 936

క. కలికంఠుని కోపమువలె । వరగౌతముశాపమట్లు వర్ణింపంగాఁ
జిరకష్ట జీవులైతగు । నరులును మదినొచ్చితిట్ల నాశమెవేమా. 937

ఆ. కలుగఁగలుగఁబుట్టుఁ గనకంబునకుపన్నె । పెనగఁబెనగఁబుట్టుఁ బ్రేమసతికి
ముదియముదియఁబుట్టు మోహంబు లోభంబు । విశ్వ. 938

ఆ. కరణమధముఁడైనఁ గాపులందఱుఁగూడి । యొడ్డియందురు సుఖమెచ్చోనేని
బిరుదుకరణమున్న బిత్తలీయనరకో । విశ్వ. 939

ఆ. కరతలంబునెత్తి కాలి నదిమిపట్టి । యూర్ధ్వదృష్టిచేత నొనరనిల్పి
సర్వమైతనరుటఁ జాల నాయువుకల్గు । విశ్వ. 940

ఆ. కరమురములయందు గంగాధరునిఁగట్టి । తీర్థములకుఁబోయి తిరుగువారు
చేతవెన్నయుండ నేతికేడ్చెడివారె । విశ్వ. 941

చ. కలవులు గండములక్కలిగి కష్టపుజీవిత మేర్పడంగనే
గరిమను జీవరాసులకు గట్టిగనాయువు కల్గియుండునో

మఱి వగవంగ నేలనిల మాకిఁక లేదన నేల మాఢ్యమా
యరయదయాళుఁడైన పరమాత్ముఁ డొకండగుదిక్కు వేమనా. 942

ఆ. కర్కకాయలు దిని కాశలు బిగఁగట్టి । కాంతలను విడుచుట కానిగుణము
పేని గడ్డిఁగట్టి నేనుఁగు నిలుచునా । విశ్వ. 943

ఆ. కర్మగుణములన్ని కడఁ బెట్టి నడవమిఁ । దత్త్వమెట్లు తన్నుఁ దగులుకొనునో
నూనెలేక దివ్వె నూవులవెల్గునా । విశ్వ. 944

క. కర్మజ్ఞానేంద్రియములు । నిర్మల హృదయమును జేర్చి నిర్గుణ మతితో
ధర్మంబని వివరించుట । మర్మంబధ్యాత్మయోగ మహిమము వేమా. 945

క. కర్మనివృత్తైనప్పుడు । నిర్మలుఁ డని భవుఁడు వానినిక్కమెఱుంగుం
గర్మము తీఱెడువేళను । ధర్మమెతన దేవుఁడనుచుఁ దలఁతురు వేమా. 946

ఆ. కర్మఫలములన్ని కపటంబుగాఁ జూచి । ధర్మఫలములన్ని తగిలియుండి
ధర్మమర్మములను దాటుటేముక్తిరా । విశ్వ. 947

ఆ. కర్మమధికమైనఁ గడచి పోవఁగరాదు । ధర్మరాజు గొల్చె తగనిచోటఁ
గంకు భట్టనంగఁ గటకటా యేమన । విశ్వ. 948

ఆ. కర్మమయుఁడు గాక కర్మంబుఁ దెలియఁడు । కర్మజీవి మేలుఁ గానలేఁడు
నీరుసొరకలోతు నికరము తెలియదు । విశ్వ. 949

క. కర్మముజ్ఞానికి దవ్వగుఁ । గర్మమునకు జ్ఞానిదవ్వు కలనిజమిదెయౌఁ
గర్మజ్ఞానములుడిగిన । నిర్మలునకుఁ గలుగు ముక్తి నిజముగ వేమా. 950

ఆ. కర్మమునను బుట్టి కర్మంబులోఁ జేరి । కర్మ మేరుపడుటఁ గానలేరు
కర్మ బంధముననె కడతేఱలేరయా । విశ్వ. 951

తే. కర్మవశమున సంసారకష్టములను । జెంది మోహాతిశయమునఁ జెడును నరుఁడు
కర్మరహితత సుజ్ఞాన కలితతయును । జెంద మోహాదు లేటికిఁ జేరు వేమ. 952

క. కర్మాకర్మముల కొఱకు । నర్మిలి నొకఁ డుండులోననాత్మయుఁ గర్తై
ధర్మాధర్మములకునది । నిర్మలమతియైనవాఁడు నిలుచును వేమా. 953

క. కర్మాకర్మము లెఱుఁగని । మర్మంబులు నింద్రజాల మహిమలు విద్య
లక్కర్మముమర్మముప్రాణులు । నిర్మలమతిఁ దెలియవలయు నిజముగ వేమా. 954

క. కర్మాకర్మము లోకకోటి । కర్మవినోదునకుఁదత్వ ఘనునకుఁదెలియుం
ధర్మాధర్మము లేర్పడ । నిర్మలమతిఁదెలుపవలయు నిచ్చలువేమా. 955

తే. కర్ణములుమూసుకొనిఁ జెవులునుగట్టనేల । నిర్ణయంబగుప్రణవంబు నేర్పుమీఱ
ఘనచిదానందప్రజ్ఞలో వినఁగనగును । మనసునిలుకడమాత్ర మేమఱకువేమ. 956

ఆ. కర్ణుఁడే మునుపును ఘనులెవ్వరునులేక । దానశీలుఁడనంచుఁ దలఁపఁబడెను
మేలుసేయనతని మెఱుఁగెవ్వఁడెఱుఁగురా । విశ్వ. 957

ఆ. కర్ణుఁడొకఁడెకాని ఘనులెవ్వరునులేరు । దానశీలుఁడనఁగ ధరఁబరగెను
ఓగునెంచఁబోవ రుపకారముండిన । విశ్వ. 958

క. కలలోని సంపదెల్లను । గలఁగని మేల్కాంచినతోడఁ గనఁబడకేగుం
బలుభోగ భాగ్యగణములు। కలరీతిగ నమ్మవలెను ఘనముగ వేమా. 959

ఆ. కల్పమనఁగనగును గారణబీజంబు । కల్పమనఁగశివుని కల్పితంబు
అల్పుఁడేమియెఱుఁగు నానందభోగంబు । విశ్వ. 960

ఆ. కల్పమారగించి కన్నులుమూసుకొని । బిఱ్ఱబిగిసియుండు బీదయోగి
మేకపోతువలెను మెఱమెచ్చులకునయి । విశ్వ. 961

ఆ. కల్మషంబుపోక కనుపింపదెందును । రూపమెవ్వరికిని రూఢితోడఁ
దామసంబుడిగినఁ దగఁగల్గుజ్ఞానంబు । విశ్వ. 962

ఆ. కల్లగురుఁడుగట్టు నెల్లకర్మంబుల । మధ్యగురుఁడుగట్టు మంత్రచయము
ఉత్తముండుగట్టు యోగసామ్రాజ్యంబు । విశ్వ. 963

ఆ. కల్లటికెకుభూతి గట్టిగాఁబెట్టిన । నందులోనికంపులడఁగనట్లు
మెడనుద్రాఁడువేయ మెఱపుతోద్విజుఁడౌనె । విశ్వ. 964

ఆ. కల్లనిజముచేసి కఠినభావముఁజెంది । ప్రల్లదంబులాడు భక్తిలేక
మాయలాడువాఁడు మహితాత్మసాటియా । విశ్వ. 965

ఆ. కల్లనిజముఁదెలిసి గాలిభూతములోసి । యింటిమీఁద నాస యేలవిడరో
నీటిమీఁదబుగ్గ నిలుకడకాదయా । విశ్వ. 966

ఆ. కల్లనిజము రెండు కఱకంఠుఁడెఱుఁగును । నీరు పల్లమెఱుఁగు నిజముగాను
దనయునిజన్మంబు తల్లిదానెఱుఁగును । విశ్వ. 967

ఆ. కల్లయైనజగముఁ గను టెల్లనిజమని । నమ్మిభ్రమనుజిక్కి నాతిఁగూడి
యెల్లజనులుమఱతు రేకాంతుఁడగుహరి । విశ్వ. 968

ఆ. కల్లలాడలేమి కానకిచ్చినమనుఁ । గలిమిలేములందు వెలసియుండుఁ
నేటికాల్వచూడ నెక్కితగ్గెడురీతి । విశ్వ. 969

ఆ. కల్లలాడుకంటెఁ గష్టంబుమఱిలేదు । కష్టమెపుడొ కీడుఁగలుగఁజేయు
ద్విజుఁడననుటచూడ దిమ్మరితనమది । విశ్వ. 970

ఆ. కల్లలాడుదురిల కంసాలిదొంగని । యతనిసొమ్ముకెట్టు లతఁడుదొంగ
మన్నుబంగరుగను మఱిచేసిపెట్టఁడా । విశ్వ. 971

అ. కల్లలాడువాని గ్రామభర్తయెఱుంగు । సత్యమాడువాని సామియెఱుఁగుఁ
బెక్కుతిండిపోతుఁ బెండ్లమెఱుంగురా । విశ్వ. 972

క. కల్లలుపలికెడు నరులకుఁ । దెల్లముగా బ్రహ్మవిద్యఁ దెలుపుటయెల్లం
జల్లయుబాలునుగలిసిన । చల్లకుఁదోడంటినట్లు సహజము వేమా. 973

ఆ. కలిగిధర్మమీయఁ గానివారును । కలిగితినకచాలఁ గ్రాగువారు
కలిమినెచటఁజూడఁ గానకచెడుదురు ।విశ్వ. 974

ఆ. కలిగినట్టులుండుఁ గలుగకయుండును । మఱియులేకయుండు మఱియుఁగలుగు
నాశకొలఁదినిశివుఁ డందించుచుండును । విశ్వ. 975

ఆ. కలిగినట్లెయుండుఁ గలుగకయుండును । మఱియులేకపోవుఁ దిరిగికలుగుఁ
గలిమినెచటఁజూడ గారడియనవచ్చు । విశ్వ. 976

ఆ. కలిగినమనుజుండు కాముఁడైసోముఁడై । మిగులఁదేజమునను మెఱయుచుండు
విత్తహీనుఁడైన నుత్తసన్యాసిరా । విశ్వ. 977

ఆ. కలిగిపెట్టెనేని కర్మజీవులకెల్ల । తిరిపెమునుదొరకదు దీనులార
తెలియఁజూచుకొనఁడు దృష్టాంతమెపుడైన । విశ్వ. 978

ఆ. కలిగియుఁడినలేక కష్టించురోగికి । నాడువారిమీఁద నాశగలదె
అన్నమదముతోడ నఖిలమదంబులు । విశ్వ. 979

ఆ. కలిగియున్నవానిఁ గనిపట్టెయిచ్చిన । మనువుఁబొంగు పాలుమరిగినట్లు
లోన నిగిరి కలిమి లొట్టపోకుండునా । విశ్వ. 980

ఆ. కలిమిగలయతనికిఁ గన్యకనిచ్చుచో । మురియుచుంద్రు వెఱ్ఱిమూఢజనులు
పూజఫలమెకాని పూనికల్నిల్చునా । విశ్వ. 981

ఆ. కలిమిగలయతనికిఁ గానుకనిచ్చుట । బావినీరునదికి పాఱ్చినట్లు
జమ్మకునిలరాశి నీరెత్తినట్లుండుఁ । పేదకియ్యమనువు పెఱుఁగు వేమ. 982

ఆ. కలిమిగల్గనేమి కరుణలేకుండినఁ । గలిమితగునె దుష్టకర్ములకును
దేనెగూర్చునీఁగ తెరువునఁబోవుఁదా । విశ్వ. 983

ఆ. కలిమిఁగలిగియుండి కఠినభావముఁజెంది । తెలియలేరుప్రజలు తెలివిలేక
కలిమివెన్నెలగతిఁ గానంగలేరయా । విశ్వ. 984

ఆ. కలిమిగలిగెనేనిఁ గాముఁగాఁజూతురు । లేమిచేతఁజిక్కి లేమలధిపు
మదనువంటివాని మాలఁగాఁజూతురు । విశ్వ. 985

ఆ. కలిమిగలుగసకలకులములకెక్కువ । కలిమిభోగభాగ్యములకునెలవు
కలిమిలేనివానికులమేమికులమయా । విశ్వ. 986

ఆ. కలిమిచేతమగనిఁ గలిసియుండునుగాంత । కలిమిలేనివేళఁ గసరుచుండుఁ
గలిమిసతముకాదు కానంగలేరయా? । విశ్వ. 987

ఆ. కలిమిఁజూచియియ్యఁ గాయమిచ్చినయట్లు । సమునకియ్యనదియు సరసతనము
పేదకిచ్చుమనువు పెనవేసినట్లుండు । విశ్వ. 988

ఆ. కలిమినాఁడునరుఁడు కానఁడుమదమున । లేమినాఁడు మొదలెలేదుపెట్టఁ
గలిమిలేమిలేని కాలంబు గలుగునా । విశ్వ. 989

ఆ. కలిమినాఁడు మగనిఁగామించిచూచును । లేమిఁజిక్కునాఁడు లేవకుండు
మనినమగనినైన మడియంగఁజూచును । విశ్వ. 990

ఆ. కలిమిబలిమిఁజూచి కనకమునాసించి । కన్యనియ్యఁబూర్వగతులవెట్టొ
పేదకనువుమీఱుఁ బిల్లనిచ్చినవానిఁ । జెప్పనేలఁ బరమశివుఁడు వేమ. 991

తే. కలిమి సుఖదుఃఖములకును గారణంబు । సంపదలుగల్గ నెవరికిశాశ్వతంబు
తెలివిసంపదగలవాఁడె దేవసముఁడు । నిత్యమదిహర్షదాయిని నిజము వేమ. 992

ఆ. కలియుగంబునందు ఘనతకునైచ్యంబు । ఘనతనైచ్యమునకుఁగలుగుచుండు
శ్రద్ధభక్తిలేక జనులుండ్రుగావున । విశ్వ. 993

ఆ. కలియుగమునఁబుట్టి కడ తేఱఁగాలేక । యొడలు బడలఁజేసి యుగ్రతపము
తమరు చేసి యేమితత్త్వంబుగన లేరు । విశ్వ. 994

ఆ. కలియుగముననున్న కాపుకులమునకు । వేమన తనకీర్తి విక్రయించె
నున్నధర్మమెల్లనుర్విలోనరులకు । కోరువెట్టెఁబరముఁ గోరి వేమ. 995

ఆ. కలుగుచింతలన్ని కడఁకతోఁ దాటఁగ । వెలుగుఁ జంద్రకాంతి వేడుకలర
నివ్వటిల్లఁ గోరు నిర్గుణ యోగిరా । విశ్వ. 996

తే. కలుగుచుండెడి కర్మముల్కాలఁద్రొక్కి । నిలిచి నిర్గుణ పథమూని నెల వెఱింగి
పలుకకుండెడువాఁడెపో పరమగురుఁడు । నిత్యసంతోషనిధియగునిజము వేమ 997

తే. కలుగు దోషము లెల్లనుగాలఁ ద్రొక్కి । వెలుగునకు నావలను వెల్గువెలుగుఁజేరి
నిలిచి నిర్గుణ మందుటే యిలసమాధి । చెలఁగు నేనట్లతఁడె పరశివుఁడు వేమ. 998

ఆ. కలుగు సుఖములెల్లఁగల్లగా రోయుచు । మెలఁగుచుండు వాఁడు మిహిరుపగిదిఁ
దిరుగు నేర్పుచూడ ధీరుఁడె యగునయా । విశ్వ. 999

ఆ. కలుపుఁదీసి నరులు కాపాడి పయిరులఁ । బెంచు పేర్మి వలెను బెనిచిమదిని
ద్రుంచి దృశ్యములను దెంపు గానుండరా । విశ్వ. 1000

ఆ. కలువపూలవంటి కన్నులుండిన నేమి । చిలుకపలుకులట్లు పలుక నేమి
తెలివి బలిమి కలిగి తేజరిల్లఁగ నేమి । తులువ గామి నలరు నెలఁత వేమ. 1001

ఆ. కలుష మానసమునఁ గాన్పింపఁగారాదు । అసలులోన భానుఁడడఁగినట్లు
తేఁటనీరు పుణ్య దేహమట్లుండురా । విశ్వ. 1002

తే. కలుషములనెల్ల ఖండించుగతి నెఱింగి । చిన్మయానంద పట్టాభిషిక్తుఁడైన
వానినెన్నంగఁదరమె యీవసుధయందుఁ । బరశివుండనివర్ణింపఁబడును వేమ. 1003

ఆ. కలుషమెన్ని కొనఁగ గౌరవహానియే । యరయఁదత్త్వమెన్న నాత్మఘుటిక
తెలిసినంతఁదాను స్థిరుఁడు గావలయురా । విశ్వ. 1004

ఆ. కలుష మెల్లఁదెలియఁదల వంపులకు మూల । మరయఁదత్త్వ మెల్ల నాత్మఁబుట్టుఁ
దెలిసినందునకునె ధీరుండు గావలె । విశ్వ. 1005

ఆ. కలుష మొక్క యింతకాన్పింపదెందును । జూడనెవరికైన సొంపుమీఱఁ
దామసంబడంగఁదా వెల్గుజ్ఞానంబు । విశ్వ. 1006

ఆ. కల్లుకుండ కెన్ని ఘనభూషణము లిడ్డ । నందులోని కంపు చిందు లిడదె
తులువ చదివి కొన్నఁ దొలిగుణ మేమగు । విశ్వ. 1007

ఆ. కల్లుఁద్రాగునరులఁగై పెక్కియుండెడి । వారిసుఖముఁదలఁప వశముగాదు.
ఒడలుమఱచి యోగముల్లసిల్లెడు యోగి । త్రుళ్లిపడక మఱచి తూగు వేమ. 1008

ఆ. కల్లుఁద్రాగు వాని కల్లుమ్రుచ్చనరాదు । కల్లలాడు వాఁడె కల్లుమ్రుచ్చు
కల్లుఁద్రాగుకంటె కల్లలాడుటె కీడు । విశ్వ. 1009

ఆ. కల్లునకిడునట్లు చల్లకీయఁగలేరు । కొల్లకట్టు లీరు గురువునకును
బూయికిచ్చినట్లు పుణ్యాని కీయరు । విశ్వ. 1010

ఆ. కల్లునీళ్లుద్రాగి కడుఁబెద్ద వారితోఁ । జేరవిడిచి తిరుగు సిద్ధురాలు
పనులు దీఱు వెనుకఁ బాతలు గట్టురా । విశ్వ. 1011

ఆ. కళవళంబుమాని నిలువరించినవాఁడు । తొడరిబయలుదాకి తుప్పటిలుచు
నక్షయంబునంది యగ్గించుచుండును । విశ్వ. 1012

ఆ. కష్టజీవిబ్రతుకు కాష్టముపాలగు । నిర్దయాత్ము బ్రతుకు నీటఁగలియుఁ
గ్రూరకర్ము బ్రతుకు చోరుల పాలౌను । విశ్వ. 1013

తే. కష్టమున కోర్చి దమయింతి కాదు సొచ్చె । దుష్టకైరాతకునిఁజూచి ధూళిఁజేసె
వ్యష్టియై సత్యవై భవమందెగాదె । నిష్ఠమదిఁగల పతిభక్తి నియతి వేమ. 1014

ఆ. కష్టమైన మనసు గాంక్షించియోగికి । జ్ఞానదీప శిఖయుఁదానటింపఁ
గానవచ్చు నాత్మక్రమమైనజ్ఞప్తితో । విశ్వ. 1015

ఆ. కష్టమైన మలము కడుపులోనుండంగ । నంతకంటెఁజెడెడి దన్నరసము
ఊపములేని జనము లుపవాసముందురు । విశ్వ. 1016

ఆ. కష్టలోభివాని కలిమికి నాసించి । బడుగువాఁడు దరిగి పరిణమించుఁ
దగరు వెంట నక్క తగిలిన చందంబు । విశ్వ. 1017

ఆ. కసవుదినును గాదె పసరంబు లెప్పుడు । చెప్పినట్టు వినుచుఁజేయుఁబనులు
వానిపాటియైన మానవుఁడొప్పఁడా । విశ్వ. 1018

ఆ. కసవు నేరి తినెడి పసరముతినువాని । మాలయండ్రు గాదె మహిని జనులు
పందిఁగోడిఁదిన్నఁబాపులందురు సుమీ । విశ్వ. 1019

ఆ. కసిగలిగియుఁ బాపకర్ములఁబీడింతు । రెల్లప్రభులు యముని నల్లభటులు
వృశ్చికంబుఁగన్న విడుతురే చంపక । విశ్వ. 1020

ఆ. కసురులు దినువాఁడు ఘనఫలముల రుచిఁ । గానలేఁడు గాదె వాని యట్లె
చిన్నచదువరులకు మిన్నజ్ఞానము రాదు । విశ్వ. 1021

ఆ. కసువుఁబసికిఁజేసె గాలిఫణికిఁజేసె । మన్నెరలకుఁజేసె మరవకెట్లొ
కుంభిని జనులకును గూడట్లుచేసెరా । విశ్వ. 1022

ఆ. కస్తురి యటు చూడఁ గాంతినల్లగనుండుఁ । బరిమళించు దానిపరిమళంబు
గురువులైన వారి గుణము లీలాగురా । విశ్వ. 1023

ఆ. కస్తురి వలవేల గజరాజమునకెన్నఁ । దనదు మదపుధార తావిగాక
యోగికేల రంభ యోగసౌఖ్యంబుండ । విశ్వ. 1024

ఆ. కాకిగూఁటనాడు కోకిల తనబిడ్డఁ । బెట్టిపెనుపఁజేయు గుట్టెరుగుఁడి
యాడువారి మోసమపుడైనఁ దెలియునో । విశ్వ. 1025

ఆ. కాకిగూటిలోనఁగోకిల మనినట్లు । భ్రమరమగుచుఁ బురువుబ్రతికినట్లు
గురునిఁగొల్చు వెనుక గురుపుత్రానౌనయా । విశ్వ. 1026

ఆ. కాకిపక్షులందుఁ గడుహీన మందురు । కాకిపెండ్లి నెవరుఁగనరు భువిని
గాకికన్నుముంచి కాళ్లకు మ్రొక్కరే । విశ్వ. 1027

ఆ. కాఁగలపను లెల్లఁగాకెట్లు పోవును । గానిపనులు కానెకావు భువిని
మహిమ వేఱెయుండ మనతోడనున్నదా । విశ్వ. 1028

ఆ. కాంచనంబుపైనఁ గాంతలపైనను । బమ్మకైనఁ బుట్టురిమ్మతెగులు
తోయజాక్షివిడుచు దొరయెవ్వఁడును లేఁడు । విశ్వ. 1029

ఆ. కాంచనంబుఁబోఁడి కాంక్షమోహముఁగప్ప । విడువలేరుప్రజలు విశ్వమునను
గాంక్షగలుగువారు కానంగలేరయా । విశ్వ. 1030

ఆ. కాచఁగానఁబుట్టుఁ గనకంబునకు మేల్మి । కడియఁగదియఁ బ్రీతికలికికగును
ముదియముదియమీఱు మోహంబునరులకు । విశ్వ. 1031

ఆ. కాడుసేరియున్నగతిలోననున్నను । వీఁటినడుమనున్న విధములొకటె
ఝాడవిడనిమదినిఁ జర్చించిచూడరా । విశ్వ. 1032

ఆ. కాంతకుంకరైనఁ గానికులంబైనఁ । బాయలేకవిటుఁడు భ్రమసియుండు
పురిగిగ్రుడ్డికుక్క మాంసంబుఁగొన్నట్లు । విశ్వ. 1033

ఆ. కాంతపైని ప్రేమస్వాంతము రంజించుఁ । జింతదీఱుఁదరుణి చిక్కనప్పుడె
వింతయమరఁబోదు విశ్వసాక్షినిగూడ । విశ్వ. 1034

ఆ. కాంతమీఁదియాశ కనకంబుపైనాశ । లేనివాఁడు పుడమిలేనివాఁడె
కభరుణేలఁజెప్పఁగాన్పింపఁ దెలియురా । విశ్వ. 1035

క. కాంతముభస్మముఁజేసిన । శాంతులకదిజ్ఞానసాంఖ్య సంజీవియగుం
గాంతలఁదలఁపకయుండిన । శాంతముగలదైవమగును జగతిని వేమా. 1036

ఆ. కాంతమేనుచూచి కలవరపడెదరు । కడుపులోని రోఁతఁగానలేక
యింతరోఁతచేత కీదేహమేలరా । విశ్వ. 1037

ఆ. కాంతసింధురంబు కడుఁబిత్తరోగికి । నోనరమధువుతోడ నోసఁగినంతఁ
దనరుదేహబలిమి ధన్యుఁడైగట్టెక్కు । విశ్వ. 1038

క. కాదనఁడెవ్వరితోడను । వాదాడఁగఁబోఁడు వెఱ్ఱివానివిధమున
న్భేదాభేదమెఱింగియు । వేదాంతరహస్య మెఱిఁగి వేమనుఁడుర్విన్. 1039

ఆ. కాననంబుఁజేరికడు శ్రమనొందిన । నానలుండురాజ్య మందెమరల
బుద్ధినొక్కయెఱుక పోకార్చుటయెముక్తి । విశ్వ. 1040

తే. కాననముసొచ్చితిరుగుట మానవలెను । బూనిమదమత్సరాళిని బొలియఁజేసి
మాననిజకేళిదరిఁ జేరుమాన్యుఁడరయ । ధ్యానధారణ యోగముల్పూనివేమ. 1041

క. కాననసమమగుజ్ఞానముఁ । బూనకతన్నెఱుఁగఁ దరమెభువిలో నెపుడుం
దాననియెఱుఁగుటతత్త్వము । నేననివర్ణించువాఁడె నేర్పరివేమా. 1042

ఆ. కానరానిబయలు గనుటయేక్షేమంబు । మేనుమఱచినిద్రమెలఁగినట్లు
తానుదానుగాను దలఁపుమఱపుదాటు । విశ్వ. 1043

ఆ. కానలేకభువిని గాలారఁదిరిగినఁ । బూనిమదినినిలుపఁ బూనుటరుదు
మేనుమఱచినిద్ర మెలఁగెడిపైవడిఁ । దానకంబు మఱచితగులువేమ. 1044

ఆ. కానలేఁడునుదురు కర్ణముల్వీపును । నెఱులఁగానలేఁడునెత్తిమీఁదఁ
దన్నెకానలేఁడె తత్త్వమేమెఱుఁగును । విశ్వ. 1045

ఆ. కానలేరుగాని కలియుగంబుననున్న । మనుజులందఱికిని మాన మొకటె
దార్ఢ్యముగలవారు తమవలెఁజూడక । పరులఁదూల నాడుదురుర వేమ. 1046

ఆ. కానవచ్చువానిఁ గనుపించువానితోఁ । గాపుచేయనలుక కరుణతోడఁ
గానరానివాని కరుణేమికందురో । విశ్వ. 1047

ఆ. కానికులముదైనఁ గంటికింపైనప్డు । విటుఁడుదలఁచెనేని విడువలేఁడు
మరగి గ్రుడ్డికుక్క మాంసంబుఁదిన్నట్లు । విశ్వ. 1048

ఆ. కానివానిచేతఁ గాసువీసములిచ్చి । వెంటఁదిరుగు తెల్లవెఱ్ఱితనము
పిల్లపుట్టఁగోడిపిలిచినఁ బలుకునా । విశ్వ. 1049

ఆ. కానివానితోడఁ గలిసిమెలఁగుచున్న । హానివచ్చునెంతవానికైన
నీఁగకడుపుఁజొచ్చి యిట్టట్టుసేయదా । విశ్వ. 1050

ఆ. కానివానితోడఁ గలిసివర్తించెనే । హానివచ్చునెంతవానికైనఁ
ద్రాఁటికిందఁ బాలుద్రాగినచందమా । విశ్వ. 1051

ఆ. కాపుబలిమియున్నఁ గరణమునకుబల్మి । కరణముబలిమెల్లఁ గాపుబలిమి
కాపుసంతసంబె కరణముసంతోషు । మరసిచూడ లోకమందు వేమ. 1052

ఆ. కాపులుఁగరణాలుఁ గంసాలిభక్తులు । కట్టకడపరకును గష్టపడఁగఁ
బరగిగుఱ్ఱములకు బాపలకునుదక్కు । విశ్వ. 1053

ఉ. కాముఁడైనవాఁడు ధనకాంక్షవహించినవాఁడు మత్తుఁడుం
బామరుఁడైనవాఁడుఁ బరిపాటినెఱుంగనివాఁడు మూర్ఖుఁడు
న్సోమరసేయువాఁడు మఱిముక్తినిగాంచునె యెన్నిభంగుల
న్వేమనవాక్యమొక్కటియు వీసరపోవునెదారిఁ దప్పినన్. 1054

ఆ. కామచింతఁజిక్కి కనుఁగాననేరవు । నీమనిష్ఠలఁదగి నియతిమీఱి
తామసంబునడఁచి తన్మయమందరా । విశ్వ. 1055

ఆ. కామమోహములను గలిగియుండునరులు । ఇష్టదేవగురుల నెఱుఁగలేరు
ఇష్టమెఱుఁగునతఁడె యిలమంచిబుధుఁడౌను । విశ్వ. 1056

ఆ. కామిగానిఘనుఁడు ఘనుఁడుగాఁడాయెనేఁ । గామిగాఁడె కృష్ణసామిముందు
కామిగానిఘనుఁడు గణపతిగాఁడకో । విశ్వ. 1057

ఆ. కామిగానివాఁడు కవిగాఁడురవిగాఁడు । కామిగానిమోక్ష కామిగాఁడు
కామియైనవాఁడు కవియగురవియగు । విశ్వ. 1058

ఆ. కామియైయుఁగాకఘనుఁడు ఘనుండగుఁ । గామికృష్ణుఁడరయ ఘనుఁడుగాఁడొ
కామిగానిఘనుఁడు గణపతిగాఁడొకో । విశ్వ. 1059

ఆ. కాముఁడైననరుఁడు కాయసిద్ధివహించి । కామిగాకబ్రహ్మ కాముఁడయ్యెఁ
గాముఁడైన బ్రహ్మకల్పంబుతలకెక్కె । విశ్వ. 1060

ఆ. కాయకంబైన పరిపూర్ణకల్పమంది । స్థాయిపడఁగాంచి మించెడుస్థానమందు
మోక్షసుఖతత్వపూర్ణంబు ముట్టవలెను । బరమశివుఁడనివర్ణనఁ బడయవేమ. 1061

అ. కాయఁగాయఁగాల్చి కనకంబుఁజూడరా । కాయయనఁగబ్రహ్మకాయమందుఁ
కాయఁదెలియునతఁడె కౌస్తుభధరుఁడౌను । విశ్వ. 1062

ఆ. కాయగూరలుదిని కాషాయవస్త్రము । లోబ్బడినెత్తి కలిగి కూడుచుంద్రు
తలలుబోడులంట తలఁపులుబోడులా । విశ్వ. 1063

ఆ. కాయమీఁదబ్రమాను ఘనముగానుండును । మాఁనుమీఁదఁదీగ మొలయుచుండుఁ
తీఁగమీఁదబ్రవేళ్ళుత్రిపుర తాండవమాడు । విశ్వ. 1064

ఆ. కాయముఁదగఁగూడికడఁగి యోగిగనున్నఁ । గాయమిలనుబడిన ఘనుఁడుగాఁడు
కాయమునను ముక్తి గతికేగవలెనయా । విశ్వ. 1065

ఆ. కాయము గడఁగియుఁగనక యావలనున్న । కాయమును విడచినఁగాఁడుయోగి
కాయమందు ముక్తిగతి కేగ వలయురా । విశ్వ. 1066

ఆ. కాయమున్న యప్డె కామాధులను ద్రోసి। జ్ఞానమార్గమునకుఁగడఁగవలయు
జాగుచేయఁగాయ మేగిన నేమగు । విశ్వ. 1067

క. కాయము విడిచెడు వేళను । న్యాయంబుగ బుద్ధినొక్కి నమ్రతతోడన్
జ్ఞేయంబగు పరిపూర్ణము । చాయనుగని పరిణమించుఁజయ్యన వేమా. 1068

క. కార్యంబు తినఁగ నేరరు । ద్వారమునడఫంగలేరు తోనుండెడి సం
సారంబె యీద నేరరు । వీరులునరులందు రెంతవెఱ్ఱియొ వేమా. 1069

ఆ. కార్త వీర్యువంటి ఘను లెవ్వరును లేరు । వీరిశౌర్యమునను విఱ్ఱవీఁగి
పరశురాముచేత బాధలుపడి చచ్చె । విశ్వ. 1070

క. కార్యగురుసేవఁజేసిన । ధైర్యంబగు బోధఁజెప్పిదము మొసఁగఁడురా
స్థైర్యంపు గురుని వేడన । వార్యంబగు బయలుఁజేర్చు వడిగా వేమా. 1071

ఆ. కారుకారుగురులు కాగుణితముఁజెప్ప । శాస్త్రపాఠములను జదివి చెప్ప
ముక్తిదారిఁ జూపు మూలమంత్రముగదా । విశ్వ. 1072

ఆ. కాలకంఠునెదిరి ఘనముగాఁబోరిన । యర్జునునకువశము కర్జమైన
పాశుపతము గలిగె పగతులఁదునుమాడ । విశ్వ. 1073

క. కాలగతి యెంతవారికి । వాలాయముచులకఁదనము వచ్చుట యరుదా
వ్రేలగిరి నెత్తు కృష్ణుఁడు । తేలఁడెవట పత్రమందుఁదెలియర వేమా. 1074

ఆ. కాలచక్రిమెఱుఁగఁగా లేక యెప్పుడు । సంధ్యజపముచేయు జాణలార
సంధ్యజపములోను జాడలెట్లుండును । విశ్వ. 1075

ఆ. కాలచక్రమెల్లఁగల వారముననెల్ల । సాగితిరుగుచుండుఁ జంచలించి
చక్రగతిని విడువ స్తంభించుమనసప్డు । విశ్వ. 1076

ఆ. కాలధర్మ మెఱిఁగి కపట వృత్తులుమాని । యాలుపిల్లలందు నాశవదలి
మేలుగాను శివుని మేల్కొని పూజించు । విశ్వ. 1077

క. కాలముఁ దెలియక చాలఁగ గాలముగలదంచునున్న కాలమునందుం
గూళఁడు తనఁదాఁదెలియక । కూలెడు తొలిజామునందు గొబ్బున వేమా. 1078

క. కాలముల మహిమఁదెలియక । వాలాయము నిత్యమనుచు వరలుదురింతే
యేలనో కాలముఁదెలియరు । వాలాయము చాటుమయ్యెవసుమతి వేమా. 1079

ఆ. కాలవశముఁబట్టి కర్మజీవులపిండు । మత్తులగుచును మద మత్తులైరి
మత్తులైన జనుల మన సేఁటి మనసయా । విశ్వ. 1080

క. కాలకొలమ్ములనక । మేలుగ తానొక్కరీతి మితిమీఱఁగఁదాఁ
గాలునెదుర్కొను జ్ఞప్తిని । వాలాయము శివుని గూడి వర్ధిలు వేమా 1081

ఆ. కాలిసంకెలయగు గరిమతోఁడన భార్య । చేతివిఱిచికట్లు శిశువులెల్ల
సరిపడు చెరసాల సంసార కూపంబు । విశ్వ. 1082

ఆ. కాలుఁగాలుఁగూడి కాయంబులునుగూడి । తోలుఁదోలుఁగూడి దొమ్ములాడి
జిడ్డుజిడ్డుఁగూడి జీవంబులాయెరా । విశ్వ. 1083

ఆ. కాలుఁగాలుఁబెనఁచి కరమునఁజన్నంటి । చన్నుపొడిచి చాలఁజప్పరించి
పాలుద్రాగువాఁడు పతియౌను సుతుఁడౌను । విశ్వ. 1084

ఆ. కాలుచేయిలేదు కంచుకంబుగలదు । కొమ్ములేక యురికి చిమ్మువేఁగ
గరిడి లేక చంపుఁగడుఁబెద్దచోద్యమా । విశ్వ. 1085

ఆ. కాలునికినిజిక్కి కక్కసపడ నేల । మేలుగాను గురుని మెప్పువడసి
ప్రాలుమాలకుండ పరమార్థమందరా । విశ్వ. 1086

తే. కాలునెదిరింప నేర్చిన ఘనునిఁజూడ । మేలుమేలగు మదియందు మెలఁగువ మరి
యేలుచుండును సుఖమును నిరవుఁజేరి । వానిమార్గ మనుసరింప వలయువేమ. 1087

ఆ. కాలుచేయి వంచి గాలినిండఁగఁజేర్చి । నేలవ్రాలి కొన్నినిలిచి కొన్ని
యాసనముఖ విద్యలభ్యాసవిద్యలు । విశ్వ. 1088

ఆ. కాళ్లముంద రేరు కడకీద గాలేక । ముగ్గురీతగాండ్రు మునిఁగినారు
నరుఁడె యీదునన్న నగుఁబాటు గాదకో । విశ్వ. 1089

ఆ. కాళ్లుకెలు వంచి కష్టంబునను నోర్చి । నిలిచి కూర్చునుండి నిగిడియుండు
ఆసనముల నెన్న నధమ యోగములురా । విశ్వ. 1090

ఆ. కాళ్లుచేతులుండ గర్మలుచేయక । యోగిననుచు సాకదొకటిపన్ని
మానియైననన రె మాయలమారని । విశ్వ. 1091

ఆ. కావవలయు మగఁడు కాంత నెల్లప్పుడు । కావలేనివాఁడు చావవలయు
కాపులేవిదాని కాపుర మగడురా । విశ్వ. 1092

ఆ. కావిపంచెఁగట్టి కడుయోగివలెనుండి । వెలికిఁగోర్కెలెల్ల విడిచిపెట్టి
తొరగితిరుగువాఁడు దొంగసన్నాసిరా । విశ్వ. 1093

ఆ. కావిబట్టఁగట్టి ఘనయోగివలెనుండి । వెలయురాత్రిగాఁగ విడిచిపెట్టి
తొడరితిరుగువాఁడు దొరకోలుసన్నాసి । విశ్వ. 1094

ఆ. కావుకావుమనుచు కరుణకైయేడ్చుచు । శిశువుతుత్తుచేతఁ జిక్కిచొక్కఁ
బాలనిచ్చునట్టి పడఁతికిఁబుణ్యంబు । విశ్వ. 1095

ఆ. కావుకావుమనుచు కాళ్లుండిపలికెడి । కాకికరణిఁబల్కి కానరారు
బాపలైనవారు బ్రహ్మము నెఱుఁగంగ । విశ్వ. 1096

ఆ. కాశికాశియనుచుఁ గడువేడ్కతోఁబోదు । రందుఁగలుగు దేవుఁడిందులేఁడె
యొందునందుఁగలఁడు హృదయంబులైనైన । విశ్వ. 1097

ఆ. కాశికిఁజనువాని కర్మమేమనవచ్చుఁ । దిరుగ నేలకాళ్లు తీఁటగాని
కూలికైవనితలు కొన్నినీళ్లుమోయరా । విశ్వ. 1098

ఆ. కాశికిఁజనువారి కర్మమేమనవచ్చుఁ । జావహేతువుండి చచ్చెనేని
మనసుకాశిఁజేరు మఱిముక్తిలేదురా । విశ్వ. 1099

ఆ. కాశికిఁజనెదనని గంతఁగట్టుఁగ నేలఁ । గాశితీర్థమునకు గాసియేల
దోషకారులకును దొరుకునాయాకాశి । విశ్వ. 1100

ఆ. కాశికిఁజనెదనని గంతఁగట్టఁగ నేలఁ । గాశితీర్థమునకు గాసియేల
దోషకారులకును దొరకునాయాకాశి । విశ్వ. 1101

ఆ. కాశికేగుదునని కడఁగట్టఁగా నేల । వాసితీర్థములను వగవనేల
దోషకారికెట్లు దొరుకురాయాకాశి । విశ్వ. 1102

ఆ. కాశికేగుదుమని కష్టపడఁగ నేల । సిగ్గెరుగరుసుమ్మి సృష్టివారు
శిల్పిపదముసోకు శిలవేల్పుకాదకో । విశ్వ. 1103

ఆ. కాశికేగునట్టి కష్టమేమనవచ్చు । చేరబోయివిగత జీవుఁడైన
నెలఁతకుసగమిచ్చి నెలనీళ్లుమోచురా । విశ్వ. 1104

ఆ. కాశికేగునతఁడు కడఁగివేడుకతోడ । వెరవెఱింగి మేను విడిచెనేని
నెలఁతకుదనువిచ్చి నెలనీరుమోయఁడా । విశ్వ. 1105

ఆ. కాశినీళ్లుమోసి కాళ్లుమొగమువాచి । యొందుసుఖములేక నెండియెండి
చచ్చివెనుకముక్తి సాధింపఁగలరకో । విశ్వ. 1106

ఆ. కాసిమధురకాంచి గయప్రయాగయునేతు । వాసతోడవీని నాత్మఁజూచి
వాసననుదెలియదు వట్టివెట్టివిధంబు । విశ్వ. 1107

ఆ. కాశియాత్రకేగి గంగస్నానముఁజేసి । కష్టపడిరిముక్తి గానలేక
యెనుముదిరుగుచుండు నెనుబోతువెంబడి । విశ్వ. 1108

ఆ. కాశియాత్రఁజేసి గాసిఁజెందఁగ నేల । రోసిగుణవికార రూపమడఁచి
మోసపోకయొఱుకమూలంబుఁగనువాఁడు । గాసిజెందఁబోఁడుఘనుఁడువేమ. 1109

ఆ. కాశియాత్రఁజేసి గాసిపడుటె కాని । మోసమగునుదాన ముక్తిలేదు
పాశముడుగఁబూను ఫలమెయా కాశిరా । విశ్వ. 1110

క. కాషాయ మమరఁగట్టియు । వేషములకుఁజిక్కి బువ్వ విరివిగ దొరకున్
గోషాయి క్రియలఁదనువును । బోషించుటముక్తిగాదు పూనకు వేమా. 1111

క. కించిన్మాత్రము మదికిఁ । జంచలమునఁబుట్టనీక జాగ్రతతోనా
నంచితమగు గురుభక్తిని । మించినపరిపూర్ణమూని మెలఁగుము వేమా. 1112

ఆ. కిటుకెఱుంగనీక కేవలనిష్ఠతో । మౌనముద్రనుండు మాయయోగి
ఉన్నదెల్లఁజెప్ప నుత్తమయోగిరా । విశ్వ. 1113

ఆ. కీలకములడంచి బైలెఱింగినవాఁడు । సింధుపుత్రిమాయఁ జిక్కనతఁడు
శౌరియంతవాఁడె జనులకుశక్యమా । విశ్వ. 1114

ఆ. కీలుఁదెలిసిమదిని కేవలాత్మనుగూడి । భావమందుసాక్షి బయలుఁదాకి
చేరియుంటముక్తిఁ జెందంగఁబూనరా । విశ్వ. 1115

ఆ. కుక్కగఱచెనేని కూయనీయకపట్టి । ప్రక్కవిఱుగఁదన్ని పండఁబెట్టి
నిమ్మకాయఁదెచ్చి నెత్తినిరుద్దినఁ । గుక్కవిషముదిగును గుదురు వేమ. 1116

ఆ. కుక్కగోవుకాదు కుందేలుపులిగాదు । దోమగజముగాదు దొడ్డదైన
లోభిదాతగాఁడు లోకంబులోపల । విశ్వ. 1117

ఆ. కుక్కఁజూచిసామి గొలుచుట నేర్చుకో । కాకిఁజూచిహితుల కలయికఁగను
గాడిదెఁగనియోర్పుఁ గడుపడిఁదెలియరా । విశ్వ. 1118

ఆ. కుక్కతోకఁదెచ్చి గొట్టంబుఁజేర్చినఁ । గ్రోవిచెంతనుండుఁ గొంతతడవు
ఎంతచెప్పఁజెడుగు పంతంబుమానునా । విశ్వ. 1119

ఆ. కుక్కఁదినెడివాఁడు గురులింగజంగంబు । పందిఁదినెడువాఁడు పరమయోగి
యేనుఁగుఁదినువాఁడిఁ కెంతసుజ్ఞానియో । విశ్వ. 1120

ఆ. కుక్కనందలమునఁ గూర్చుండఁబెట్టిన । నొక్కమనసుతోడ నుండఁబోదు
ఆత్మనిలుపలేని యజ్ఞానియునునట్టె । విశ్వ. 1121

ఆ. కుక్కమనుజుకంటె గుణమెంతకలిగిన । మనుజుగుణముసాటి మర్త్యమేది
కుక్కకంటెఁజెడుగు గుణహీనుఁడగువాఁడు । విశ్వ. 1122

ఆ. కుక్కయేకతంబుఁ గొక్కెరధ్యానంబు । గాడ్దెరాగమెన్నఁ గప్పమునుక
ఆత్మనెఱుఁగుభావ మదియేలఁజేయరో । విశ్వ. 1123

ఆ. కుక్కయేమెఱుఁగును గురులింగదేవర । నక్కపోతెఱుఁగునె యొక్కప్రొద్దు
మొక్కలంచుటవలె మోక్షమందఁగనౌనె । విశ్వ. 1124

ఆ. కుక్కయేమెఱుంగు గురులింగజంగంబుఁ । బిక్కయొడసి పట్టిపీకఁగాక
సంతపాకతొత్తు సన్న్యాసినెఱుఁగునా । విశ్వ. 1125

క. కుక్కలనఁగఁబసిబాపలు । నక్కలబూజించి నారు నాగేశునకై
చొక్కముగజీవహత్యలు । మిక్కుటముగఁజేసెదమని మించిరి వేమా. 1126

ఆ. కుక్కుటమననంబు కొక్కెరధ్యానంబు । యతుల నొసఁట నొనరు నట్లు వ్రాసెఁ
గొల్లిచేసినట్టి దోషంబుతగిలెనో । విశ్వ. 1127

ఆ. కుక్కుటవ్రతంబు కొక్కెరధ్యానంబు । ఖరముధూళి పూఁతకప్పమునుక
చిత్తశుద్ధిలేక చేయుజపముసాటి । విశ్వ. 1128

క. కుటిలమగు ఋషికులంబునఁ । బటుతరముగఁబుట్టినట్టి బాపనవార
ల్కుటిలంబుఁగానలేకయె । యటు బ్రహ్మకులంబనంగ నమరునె వేమా. 1129

ఆ. కుంటికుక్కకేలఁగుందేటి పరువులు । పిరికిబంటుకేల బిరుదు గొడుగు
ముసలిముండ కేల ముసిముసి నగవులు । విశ్వ. 1130

ఆ. కుండఁగుంభమన్నఁగొండఁబర్వతమన్న । నుప్పులవణమన్న నొకటికాదె
భాషలిట్లె వేఱు పరతత్వ మొక్కటే । విశ్వ. 1131

ఆ. కుండ చిల్లిపడిన గుడ్డదోఁపఁగవచ్చుఁ । బనికిపీలుపడఁగ బాగుగాను
గూలఁబడిన కుండ కుదురుటయరుదయా । విశ్వ. 1132

ఆ. కుండపగిలెనేని క్రొత్తది గొనవచ్చు । భూతలంబునందుఁబొందుగాను
గూలఁబడిననరుఁడు కుదురుటయరుదయా । విశ్వ. 1133

క. కుండలియోగముఁ దెలిసిన । బండారము యోగికేల బాలికఁబొందం
దండిగ నాతను వొందను । మెండుగ నొకముక్తికాంత మెలఁగుర వేమా. 1134

ఆ. కుడువఁగూడు లేక కూడఁబెట్టఁగలేక । విడువముడువలేకగడనలేక
నడవ సాఁగియున్న నడపీనుగందురు । విశ్వ. 1135

క. కుదురుఁగుదగుహ్యాంబుల । మృదునాభిని హృదయ రంగ మేళనపరుఁడై
పదిలముగ బ్రహ్మరంధ్రముఁ । బొదలఁగ మదినెఱుఁగువాఁడె పూర్ణుఁడు వేమా 1136

ఆ. కుమ్మరవానికి జ్ఞానము । నెమ్మది గాఁదెల్పవలదు నిరసించు సుమీ
బమ్మను నేనన్నప్పుడు । దిమ్మరియై చెడును గాకతిరుగదు వేమా. 1137

ఆ. కులముగలుగు వారు గోత్రంబుగలవారు । విద్యచేత విఱ్ఱవీఁగువారు
పసిడిగల్గువాని బానిసకొడుకులు । విశ్వ. 1138

ఆ. కులము నీఱుచేసి గురువును వధియింపఁ । బొసఁగ నేనుఁగంత బొంకుబొంకెఁ
బేరుధర్మరాజు పెనువేఁపవిత్తయా । విశ్వ. 1139

ఆ.కులములేనివాఁడు కలిమిచేవెలయును । కలిమిలేని వాని కులము దిగును
కులముకన్న నెన్నఁగలిమి ప్రధానంబు । విశ్వ. 1140

ఆ. కులములోన నొకఁడు గుణహీనుఁడుండినఁ । గులముచెడును వానిగుణమువలన
నెలమిఁజెఱకు నందు వెన్ను పుట్టినరీతి । విశ్వ. 1141

ఆ. కులములో నొకఁడు గుణవంతుఁడుండినఁ । గులమువెలయు వానిగుణముచేత
వెలయువనములోన మలయజంబున్నట్లు । విశ్వ. 1142

ఆ. కులమువలనఁగొంత బలము వలనఁగొంత । కలిమివలనఁగొంత గర్వమొదవ
ఱంకుచదువుజడివి ఱంకునఁ జెడుదురు । విశ్వ. 1143

ఆ. కులము హెచ్చు తగ్గు గొడవలు పనిలేదు । సానుజాతమయ్యెసకలకులము
హెచ్చుతగ్గుమాట లెల్లెఱుంగఁగవచ్చు । విశ్వ. 1144

ఆ. కులుకు గుబ్బఁజూపి గొబ్బున వలపించి । చేతికాసులెల్లఁ జేరఁదీయు
నతను చేతి కత్తు లమరంగఁగాంతలు । విశ్వ. 1145

ఆ. కులుకఁజనులఁజూపి గొబ్బున మరిగించి । చేతికాసులెల్లఁ జేరఁదీసి
యలఁతిఁజేసికొందు రిలవారకాంతలు । విశ్వ. 1146

ఆ. కుళ్లుబోతు నొద్ద గూడిమాటలాడిన । గొప్పమర్మములను జెప్పరాదు
పేరుతీరుఁదెల్ప నూరెల్లముట్టించు । విశ్వ. 1147

ఆ. కూటపరవశంబుఁగోర్కెలు లేకుండ । నాటవలెను బుద్ధినయముగాను
చోటుకనని వెలుగుఁ జొచ్చుటే మోక్షంబు । విశ్వ. 1148

క. కూటము చిన్మయరూపము ! పాటింపను దరముగాదు పదరకమదిలోఁ
జోటెఱిఁగి నిండినంతట । వాటంబగుపూర్ణమది యెవశమగు వేమా. 1149

ఆ. కూటవాసియగుచు గుణములఁ బచరించి । నీఁట నీడవలెను నిలిచియుండు
నుదకఘటముఖములనుపరిఁజూచినఁగాని।సూర్యుఁడొకఁడుగాఁడెచూడు వేమ.1150

ఆ. కూఁటికి గతి లేక కూర్చున్నవానికి । నాడుదానిమీఁద నాసగలదె
అన్నమదము చేత నన్నిమదంబులో । విశ్వ. 1151

ఆ. కూఁటికి నెడఁబాసి కూర్చున్నమనుజుఁడు । వెలఁదులఁగనుఁగొన్న వెతలఁజిక్కుఁ
శెలఁగియగ్నిఁజూచుశలభంబు చాడ్పున ।విశ్వ. 1152

ఉ. కూఁటికి లేనివానివలెఁగోపములేకయు నెల్లతావుల
న్మాటకు మాటకుందగిన మంచివి నీతులు పద్యపద్ధతి
న్ధాటిగఁబూని చెప్పుచును ధారుణిలో శివరూపధారివై
మాటుగనున్నయోగివి సమానులిఁకెవ్వరు నీకు వేమనా. 1153

ఆ. కూడదేమి సేఁసె గాలమేమి చేసెను । భూమి యేమిచేసెఁబొంది కట్టె
నరుఁడుపడెడు పాట్లు నగుబాట్లు చూడఁగా । విశ్వ. 1154

ఆ. కూడుఁగుడిచి లెస్సకూర్చున్న వాఁడైన । నాడు దానిఁగన్ననట్టైతగులు
నన్నసార మొదలి కలిమదంబిడుసుమీ । విశ్వ. 1155

ఆ. కూడుఁ జీరఁబాసిగుళ్లపంచలఁబడు । నట్లు వ్రాసె బ్రహ్మయతులనుదుఁటఁ
దోయజాక్షిఁజేర దోషంబులంటురా । విశ్వ. 1156

ఆ. కూడుఁబెట్టకున్నఁగుక్షిలో జఠరాగ్ని । భక్షణంబుఁజేయుఁ గుక్షిమలముఁ
గూడువిడిచి మలముఁగుడుచురా యుపవాసి । విశ్వ. 1157

ఆ. కూడువిడిచియు శతకోటి పడగలెత్తి । మాటు పఱచి దాని మంటఁగలిపి
కాఁటికేగు వేళఁగూఁటికిమోసమై । దాటి పోదురు జనుదరికి వేమ. 1158

ఆ. కూరయుడుక వెనుకఁ గూడునాకసవేర । నెఱుకగలిగి మునుపె యేరవలయు
స్థలము తప్ప వెనుక ధర్మంబుపుట్టునా । విశ్వ. 1159

ఆ. కూరలేని తిండి కుక్కతిండను పించు । మాఱులేనితిండి మాలతిండి
ధారలేనితిండి దయ్యపుఁదిండిరా । విశ్వ. 1160

ఆ. కూర్మిద్రుపద పుత్రికొప్పఁబట్టీడ్చిన । సింహబలునిచావుఁజెప్పఁదరమె
మోహభ్రమను జిక్కి మొనగాఁడునీల్గఁడా । విశ్వ. 1161

ఆ. కూలకూళ్లుమేయు గుణమంతచెడనాడు । నెట్టివారు మెచ్చరట్టివానిఁ
గొయ్యదూలమునకుఁగుదురు సుజ్ఞానము । విశ్వ. 1162

ఆ. కూలినాలిఁజేసి గుల్లాపుఁబనిఁజేసి । తెచ్చిపెట్టనాలు మెచ్చుచుండు
లేమిఁజిక్కువిభుని వేమాఱుఁదిట్టును । విశ్వ. 1163

ఆ. కూళఁగూళ మెచ్చుగుణవంతుఁజెడనాడు । నట్టిహీనుమెచ్చ రెట్టివారు
మ్రానుదూలమునకు జ్ఞానంబు దెలియునా । విశ్వ. 1164

ఆ. కూళతొత్తు పొందుగుల్లాముకే కాక । సజ్జనునికిగాదుసమ్మతంబు
పేడదిన్నపురుగు బెల్లమే మెఱుఁగురా । విశ్వ. 1165

ఆ. కేవలాంతరాత్మ జీవుండునిజమని । పట్టివాదులాడు నట్టివారిఁ
ద్రొక్కిపట్టినాల్కతుదఁగోయవలయురా । విశ్వ. 1166

ఆ. కైకపుట్టిచెఱిచెగాకుస్థపట్టంబు । సీతపుట్టిలంకజెఱిచెమున్ను
చెప్పరాదుగాని చిత్రాంగి చెఱిచెరా । విశ్వ. 1167

ఆ. కైకపుట్టిచెఱిచెఁ గారాముపట్టంబు । సీతపుట్టిలంక చెఱిచెఁగాదె
కౌరవులనుజెఱిచెఁగా ద్రౌపదియుఁబుట్టి । విశ్వ. 1168

తే. కైకవల్లను రాముఁడుకాటికేగి । సీతఁగోల్పోయి దశకంఠుసేతలడఁచి
తిరిగిపట్టాభిషిక్తుఁడై తేజరిల్లె । రామకథకెల్లఁగైక కారణమువేమ. 1169

ఆ. కైపుమీఱువేళఁ గడనుజేరఁగరాదు । అనువుఁదప్పి మాటలాడరాదు
సమయమెఱుఁగనతఁడు సరసుండుగాఁడయా । విశ్వ. 1170

ఆ. కైపువస్తువులను గాంక్షించిసేవింపఁ । గానిపనులొనర్చు మేలెఱుఁగక
అట్టివానువారి నధములందురుసుమీ । విశ్వ. 1171

ఆ. కొంకణంబుసేరఁ గుక్కసింహముగాదు । కాశికేఁగఁబంది గజముగాదు
వేఱుజాతివాఁడు విప్రుఁడుగాఁడయా । విశ్వ. 1172

ఆ. కొక్కుధ్యానముమఱి కుక్కయేకాంతంబుఁ । బిల్లిగురగురనుచుఁ బెనుచుస్మరణ
ఆత్మెఱుఁగనిజపము లవియేమిలెక్కరా । విశ్వ. 1173

క. కొంచెపు నరసంగాతం । బంచితముగహానిఁదెచ్చు నదియెట్లనఁగా
నించుకనల్లియె నొక్కిన । మంచమునకుఁజేటువచ్చు మహిలోవేమా. 1174

ఆ. కొట్టఁదిట్టనైన గట్టిమాటాడిన । నూరకున్నయట్టి యోర్మికాఁడు
వాఁడెపరమశివుఁడు వర్ణింపశక్యమా । విశ్వ. 1175

క. కొట్టినఁదిట్టిన గట్టిగఁ । గట్టిబిగించినను గాని కరకరిచేయం
గట్టడిపని యనకుండును । దిట్టముగశివునిఁదలఁచు తీర్పరివేమా. 1176

ఆ. కొండపుధరమన్నఁ గుండభాండంబన్న । నుప్పులవణమన్న నొక్కటెకద
భాషలెన్నియైనఁ బరతత్వమొక్కటే । విశ్వ. 1177

ఆ. కొండగుహలనున్నఁ గోవెలలందున్న । మెండుగాను బూదిమెత్తియున్న
దుష్ట మానవులకు దుర్బుద్ధిమానునా । విశ్వ. 1178

ఆ. కొండమీఁద జ్యోతి కొమరుదీపింపఁగా । నిండిపూర్ణముండునిబిడముగను
అండఁ జేరకున్న నంటఁగ రాదయా । విశ్వ. 1179

ఆ కొండముచ్చు పెండ్లి కోఁతి పేరంటాలు । మొండివాని హితుఁడు బండవాఁడు
రండరాజునకును గొండఁడు దళవాయి । విశ్వ. 1180

ఆ. కొండరాళ్లు దెచ్చి కోరికఁ గట్టిన । గుళ్లలోనఁ దిరిగి కుళ్లనేలఁ
బాయరాని శివుఁడు ప్రాణమైయుండంగ । విశ్వ. 1181

ఆ. కొండరాళ్లవెంట గోడు కుడువనేల । పట్టిరాళ్లఁగూర్చి పనఁట లేలఁ
బాయరాని శివుఁడు ప్రాణమేయగుఁగదా । విశ్వ. 1182

ఆ. కొండదండి మామ కొండకూతురె యాలుఁ । గొండ మేటి విల్లుఁ గొండయిల్లుఁ
గొండవంటి దొరయు గుండయిపోయెనా । విశ్వ. 1183

ఆ. కొండలెల్లమోయు మెండైన కపులను । దండుఁ జేసె రామధరణివిభుఁడు
లంక ముట్టడించి లావరులను జంపె । విశ్వ. 1184

ఆ. కొడుకుగలిగెనేని గునిసియాడఁగఁబోరు । కూతురొకతెపుట్ట గునియుచుండ్రు
తనకుఁగొమరుఁడైనఁ దనువెల్లదోఁచునో । విశ్వ. 1185

ఆ. కొడుకునుబ్రదికించు కొనలేదుశంభుండు । కొడుకునుబ్రతికించు కొనఁడుశౌరి
దేవతాంతరములు దీననెకనుపించె । విశ్వ. 1186

ఆ. కొడుకుననువరియింపఁ గోరివచ్చినదానిఁ । దండ్రి పెండ్లియాడ ధర్మమగునె
తప్పనితెలియకయుఁ దాఁ జేయుపాపంబు । తప్పదెపుడు భువిని దగులు వేమ. 1187

ఆ. కొండెకాఁడుచావఁ గొంపవాకిటికిని । వచ్చిపోదురింత వగపులేక
దూడవగచునె భువిఁ దోడేలుసచ్చిన । విశ్వ. 1188

ఆ. కొండెగాఁడుచావఁ గొంతదనుకఁబోవు । వంతుకింతె కాని వగపులేదు
కొంకనక్కచావ గొఱ్ఱెలేమిఁటికేడ్చు । విశ్వ. 1189

ఆ. కొంపలోననున్న కోర్కెలు భేదించి । పరగహృదయమునై పదిలపఱచి
గృహమునిల్పువాఁడు బహుతత్త్వవేదిరా । విశ్వ. 1190

ఆ. కొంపలోనమఱుఁగు కోకలోనమఱుఁగు । కన్నతల్లిమఱుఁగు కడుపుమఱుఁగు
ఇన్నిమఱుఁగులందు నీశుండుమఱుగురా । విశ్వ. 1191

ఆ. కొప్పుసొగసుఁగన్నఁ గుచకుంభములుగన్నఁ । జెప్పరానితావు చెలిమిఁగన్న
నుప్పిరిగొనుచుండు మునికైనమోహంబు । విశ్వ. 1192

ఆ. కొమ్మద్రిమ్మరైన ద్రిమ్మరులవలచు । సరసవిటుల నేల సమ్మతించుఁ
బేడఁదిన్న పురుగు బెల్లమేమెఱుఁగురా । విశ్వ. 1193

క. కొమ్ములుగొరి జెలుఁదోలును । సమ్మతిగాఁ గాళ్లఁ గడుపుఁ జంకలుఁ బిక్క-
ల్నమ్మికమగు ననుబంధము । లిమ్మహిఁ గోమటికి గోత్రమేర్పడ వేమా. 1194

ఆ. కొయ్యముండఁబట్టి కొంకకజ్ఞానాగ్ని । చేతఁగాల్చిబూది చేసెనేని
అంతముక్తుఁడౌ నిఁకానందభరితుఁడౌ । విశ్వ. 1195

ఆ. కొలుచుగురునిఁగొసరి కొంగచాడ్పునఁబోరి । చేపలెల్లఁబట్టి చేర్చిపెట్టి
శివునికొసఁగువాఁడె శివయోగియందురు । విశ్వ. 1196

ఆ. కోటకోటతిరుగుఁ గొమ్ములేనుఁగుగాదు । త్రాఁటిపట్టెసందు తగిలియుండుఁ
బోటుబంటునైనఁ బొర్లింపకవిడఁడు । విశ్వ. 1197

ఆ. కోటికళలమించు కూటమునకవలి । యుదధిదాటవలయు నూర్జితముగఁ
జెనకమించువాఁడు చిన్మయానందుఁడు । విశ్వ. 1198

ఆ. కోటిదానమిచ్చి కోపంబునొందెనేఁ । బాటిసేయరతనిఁ బ్రజలుమెచ్చి
సాత్వికగుణముల నుసర్వజ్ఞుఁడౌనయా । విశ్వ. 1199

క. కోటులు సంపాదించినఁ । గూటికె సరిపోయె బ్రిదుకు గుంపులుకూలె
న్నేఁటికి నీసంసారము । చోటుననినుఁగన్న నాఁడెసుదినము। వేమా. 1200

ఆ. కోఁతిఁబట్టి తెచ్చి కొత్త పుట్టముఁ గట్టి । కొండ్రముచ్చులెల్లఁ గొలిచినట్లు
నీతిహీను నొద్ద నిర్భాగ్యులుందురు । విశ్వ. 1201

ఆ. కోపమునను ఘనత కొంచమైపోవును । గోపమునను మిగుల గోడుఁ జెందుఁ
గోపమడఁచె నేనిఁ గోరికలీడేరు । విశ్వ. 1202

ఆ. కోపమునను నరకకూపముఁ జెందును । కోపమునను గుణము కొఱఁతపడును
గోపమునను బ్రదుకు కొంచెమైపోవును । విశ్వ. 1203

ఆ. కోమటికిదురాశ కొండలువాములు । చందనంబుసోన చంద్రికళలు
ఆశకుమితిలేదిఁ కక్కడగతిలేదు । వచనశుద్ధిలేని వాఁడు వేమ. 1204

ఆ. కోమటినిజనిష్ఠ గుఱికిరాదెన్నఁడు । లోభిగుణముచేత లోనకడఁగుఁ
బలియు దాసరికిడఁ బోలుపడుచందమా । విశ్వ. 1205

ఆ. కోమటిమదిఁగోరు క్షామమే యెల్లెడ । వైద్యుఁడోరుల కెపుడు వ్యాధిఁగోరు
వారపనితధనికుఁ జేరఁదీయఁగఁ గోరు । విశ్వ. 1206

సీ. కోరికవలరాజు, కుడిచివేసిన పుల్లె । పద్మనాభుఁడు మోయు, పసిడిదట్టి
వేడ్కతోజనులెల్ల, విప్పవట్టిభరిణె । గారవముల కెల్లఁ, గప్పుచిప్ప
ఆజుఁడు దినముదప్పి, కారగించెడుగిన్నె । రాజులుపట్టిన, గాజుకుప్పె
చుక్కకప్పెరశివు, సొగసు కిరీటంబు । మహిమనింద్రునిసొక్క, మందుబుఱ్ఱ
పాడఁజదువనేర్చు, పరికించిచూచిన । నాడనేర్చుఁదాను, నాడనేర్చు
నింతకంటెజెట్ట, యిఁక నేమికావలె । విశ్వదాభిరామ, వినురవేమ. 1207

క. కోరినకోరికలెల్లను । మీఱంగాజరుగునటర మెచ్చరుభువిలోఁ
గారణకర్మప్రకారము । కోరినకోరికలుజరుగు గొబ్బునవేమా. 1208

ఆ. కోరిమదినిగురునిఁ గొలువు జేయుటమేలు । గారవమునఁ దెలుపు గహనవిద్య
దూరదృష్టినిలిపి తొడరుటమోక్షంబు । విశ్వ. 1209

క. కౌండిన్యుఁడుముండకొడుకు । నూండవ్యుఁడు కప్పకఫుడు మహిలోఁబుట్టెం
జండాలి మతంగమునిని । బిండంబుగఁ బెట్టలేదె పృథివినివేమా. 1210

తే. కౌతుకాన్వితమైయొప్పు కడిమియెలుకఁ । గఱపుచుండెడి కైరాసగతులమీతి
యంతరంగమునదు మటనచలవృత్తి । కలితమొందుచునుండును ఘనుఁడు వేమ 1211

ఆ. కృష్ణపర్వమందుఁ గృత్తికలైదుండుఁ । గృత్తులైదుపట్టి కృష్ణమ్రింగె
వెలయుకృష్ణలైదు వేమనమ్రింగెరా । విశ్వ. 1212

క. క్రమమున దేహత్రయముల । విమలజ్ఞానంబుచేత వివరించినచో
నమలంబగు నస్తోకము । కొమరొప్పఁగ జాగ్రతందుఁగూడును వేమా. 1213

ఆ. క్రతువుచేసితనుచుఁ గడువిఱ్ఱవీగుచుఁ । గడుపునిండనేయి కుడిచిత్రేఁపి
రాగమెత్తురేల ఛాగాంతకులనక । విశ్వ. 1214

ఆ. క్రిమియుమట్టియగ్గి గృధ్రకాకంబులుఁ । గుక్కనక్కలెల్లఁ గుల్లిపడిన
యొడలిదినఁగఁజూతె యొడలేలఁబెంతురా । విశ్వ. 1215

ఆ. క్రొత్తకుండఁదెచ్చి కోరివంటలుసేసి । కాకులకుని డెదరు కర్ములార
పెంటఁదినెడికాకి పెద్దయేలాగయ్యె । విశ్వ. 1216

ఆ. క్రొత్తసుద్దులైన గురుబోధచేవిన్నఁ । గర్మయుక్తియాగకాండతతులు
ప్రాతసుద్దులైనఁ బాయునాపాపంబు । విశ్వ. 1217

ఆ. క్రొవ్వుపట్టుపోరలుఁ గ్రూరకర్మలపోర । ల్నొవ్వఁజేసినట్టి రవ్వపోరల
వెవ్వరైననేమి యినజువాకిటఁగాని । యవ్వలికినిబోవు నటర వేమ. 1218

## ఖ

ఆ. ఖగములందుఁజూడఁగా ముచ్చటగనుండు । తెగలుగన్నైనఁదేటపడదె
దేవుఁడీనిసొగసు దేబెనీకేలరా । విశ్వ. 1219

ఆ. ఖచరవరులభూమిఁగనఁబడరందువు । కానవచ్చినంత గౌరవింతె
తల్లిదండ్రిగురులు తత్సములేమైరొ । విశ్వ. 1220

తే. ఖండకమ్ములధరియించి యుండునట్టి । వారలందఱుయోగులైనారెజ్ఞాన
సాధనంబున్ననేకాని సాధువగునె । కాకతగుఁబిచ్చి వాఁడనఁగాను వేమ. 1221

తే. ఖండపరశువుఁబూజింప దండిదోవి । భూతినిచ్చునుగావున నీతిగలిగి
శివునిఁబ్రార్థించుతజె ననుభవమునందఁ । జేయునైశ్వర్యమిచ్చుటచేత వేమ. 1222

ఆ. ఖనులఁబుట్టులోహ గణమునందెల్లడఁ । బనికివచ్చునొక్క యినుమెచాల
నైనజులుకపఱతురజి యెచ్చుగానుంట । విశ్వ. 1223

ఆ. ఖరముపాలుదెచ్చి కాచి చక్కెరవేయ । భక్ష్యమగునె యెన్నభ్రష్టుఁడట్లె
యెంతలంకరించి యొసఁగింపఁబోఁసఁగునే । విశ్వ. 1224

ఆ. ఖలులతోడిపొందు కలుషంబుఁగలిగించు । మానదెంత మేటి మానికైన
వారిఁజేరఁదీయ వలవదు చెడుదువు । విశ్వ. 1225

ఆ. ఖలులు తిట్టిరంచుఁ గలవరపడ నేల । వారితిట్ల నేమి వాసిచెడును
సజ్జనుండుతిట్ట శాపం బడౌనురా । విశ్వ. 1226

## గ

గీ. గగనచిత్తదృష్టిగద్దియపైఁజేర్చి । యనువరైనయాతఁ డచలమంటి
యుజ్వలాంశమందు నూహించుఁదత్వము । విశ్వ. 1227

తే. గగనమగు బ్రహ్మభావముఁగాంచుటరుదు । జగముమఱచెదుగుటెఁగనుజాణలరుదు
నిగమతత్వనిరూఢులై నిల్చుటరుదు । సగుణనిర్గుణతపమాని చాటువేమ. 1228

ఆ. గంగగోవుపాలు గంటెడైననుజాలుఁ ।గడవడైన నేమి ఖరముపాలు
భక్తిగలుగుకూడు పట్టెడైననుచాలు । విశ్వ. 1229

ఆ. గంగపాఱుచుండుఁ గదలనిగతితోడ । ముఱికియేఱుపాఱు మ్రోతతోడ
దాతయోర్చునట్లధముఁ డోరువగలేఁడు । విశ్వ. 1230

ఆ. గంగపాఱునెపుడుఁ గదలనిగతితోడ । ముఱికివాగుపాఱు మ్రోతతోడఁ
బెద్దపిన్నఁదనము నేరిమియీలాగు । విశ్వ. 1231

ఆ. గంగస్నానమాడి ఘనమైనవారెల్ల । భంగపడిరి పెక్కుబాధలంది
గంగనీటికన్న గయాతీర్థములకన్న ! నెన్నవేమతీర్థ మెచ్చువేమ. 1232

క. గంగాధరుడే దైవము । సంగీతమె చెవులకింపు సర్వజ్ఞులకు
న్బంగారమె యుపభోగం । బంగజుఁడే మృత్యుహేతు వరయగ వేమా. 1233

క. గంగాయమునలనడుమను । బంగారుబొమ్మవోలె బాలికయుండు
న్సంగతిగఁజెలిమిఁజేసిన । భంగము లేకుండముక్తిపరమగు వేమా. 1234

క. గంగాస్నానముచేసిన । బంగారముకొల్లవెట్టి పలువరికీయ
న్సింగారమె పరవనితా । సంగమపాపంబొనర్చు జనునకు వేమా. 1235

ఆ. గట్టిచదువుచదివి గప్పాలుగొట్టిన । చట్టమైనచదువు చదువలేక
వట్టిమాటలాడ వ్యర్థులేకారొకో । విశ్వ. 1236

ఆ. గట్టిసాధువిద్య కాసంతెయనుకొని । గాఢవిద్య నేర్చి కన్నఘనత
సాధుసజ్జనముల సాంగత్యమెఱుఁగక । బాధపడుదురకట బడల వేమ. 1237

ఆ. గట్టుమీఁదనున్నఁ గాన్పించుసర్వము । తెలివి తేటపడినఁ దెలియు నెల్ల
లోకవిషయములును లోనిరహస్యముల్ । విశ్వ. 1238

ఆ. గట్టుమీఁది మన్ను చట్టు పెఁదగురాయి । పుట్టలోనివాని బుసుగుతోడుగు
గట్టిగాను మూఁట గనకము పుట్టురా। విశ్వ. 1239

తే. గట్టురాచూలి పతియైన గంగధరుని । గుట్టుమదిలోనఁ దెలిసినఁ బట్టువిడక
చట్టువలె మనమందుటశాశ్వతంబు । దిట్టయగునట్టియాతఁడె తెలియ వేమ. 1240

ఆ. గట్టురాళ్లఁ దెచ్చి కాళ్లచేతులఁ ద్రొక్కి । కాసియులుల చేత గాసిఁ జేయు
మొఱకురాళ్లకెరఁగు మొప్పెల నేమందు । విశ్వ. 1241

ఆ. గట్టురాళ్లుదెచ్చి కాలుచేతులమర్చి ! యురము శిరముగాను నొనరఁజేయ
మొఱకురాళ్లకెరఁగు మొప్పెల నేమందు । విశ్వ. 1242

ఆ. గట్టువాయి జారకాంత కాదనవచ్చు । గుట్టుదాఁపలేక కూతలిడును
మగని మాత్రమెపుడు నగడుచేయును సుమీ । విశ్వ. 1243

తే. గట్టువిలుకాని మదిఁజేర్చు గుట్టుఁదెలిసి । నట్టివానిని వెన్నంటియలరునాతఁ
డట్టివాఁడిల మోక్షంబునందు నెపుడు । కామముఖశత్రుతతి నెల్లఁగడచి వేమ. 1244

క. గడనగలపురుషుఁ గనుగొని । యడుగులకును మడుగులిడుదు రతివలుధరలో
గడనవిడు పురుషుఁగనుగొని । నడపీనుఁగు వచ్చెనందురు నాతులు వేమా. 1245

ఆ. గడ్డ టంచుఁ దెలిపిఘనమంత్రమునుజెప్పి । డాబు పంచెకట్టుఁ డంబసామి
చిన్నెలింతె కాని శ్రీవైష్ణమతంబు । విశ్వ. 1246

ఆ. గండికోటలోనఁ గత్తి బట్టినయంత । రాజుగారి దొడ్డ రౌతుగాఁడు
ఎంతవారినైన నెత్తినఁ గొట్టునా । విశ్వ. 1247

తే. గణనకెక్కుడునవి యెల్లఁగదియనొక్క । జడియుటేలను బరిపూర్ణజలధిదాటి
తడవతడవకుఁ దన్మధ్యదనరవలెను । సాదనంబునఁ దలపడసాగు వేమ. 1248

ఆ. గతముచేసినట్టి కర్మబంధములన్ని । పరిసిపోవుసత్యగురుని వలనఁ
గుమ్మరికొకయేఁడు గుదియకునొకనాఁడు । విశ్వ. 1249

ఆ. గతముఁ జాతమున్నఁగలఁ గన్న యర్థంబు । నడుచుకాలమేమి నమ్మరాదు
క్షణములోని బ్రదుకు సంసారవిభ్రాంతి । విశ్వ. 1250

ఆ. గతికి మతియటంచు గమకించినంతలో । మఱికిగతియుఁ గల్గుమహితముగను
సతికి సుతులు వుట్టి సంతుష్టిఁ జేయరా । విశ్వ. 1251

ఆ. గద్దెగణము నిద్రకలలు గోరికలును । ముద మొసంగు శకునములును జెలఁగు
ప్రశ్నలు పదివేలు పరికించిచూడంగ । విశ్వ. 1252

ఆ. గంపెడంత తవుడు గంపలోఁబెట్టక । చన్నుపట్టనీదు కొన్నబర్రె
వారకాంతలేల వలచెదరూరక । విశ్వ. 1253

తే. గమనగమ్యనిరాలయగతిని మనసు । సమరసత్వంబుగా నెంచి సాక్షియగుచు
భ్రమలడంచినబ్రహ్మంబుబట్టబయలు । క్రమమెఱుంగమిలో నెల్లఁదమమెవేమ. 1254

తే. గమనగోచర నిర్గుణగమ్యమూని । దమముమీఱినధ్యానంబుఁ దత్పరంబుఁ
దెమలకందుట మోక్షంబుతెరువుగాదె । విమలసుజ్ఞానమబ్బిన వెలయువేమ. 1255

తే. గమనగోప్యనిరాలయఘట్టమందు । విమలనిర్మల నిష్కళవేదిఁ జేరి
తన్నుఁగనిచింత చేయులే తత్పదంబు। గురుకటాక్షములభియింపఁగుదురు వేమ. 1256

ఆ. గమనమమరజాడిక్కఁ గనుబాటనిక్కించి । నిలిపిచూడఁజూడ నిలుచుసుఖము
సుఖములోనివరుస సూత్రింపబ్రహ్మంబు । విశ్వ. 1257

తే. గమ్యమగుజ్ఞానమందుట గగనవిద్య । జ్ఞానముదయించిమించఁ బ్రజ్ఞానమమరుఁ
బరగుప్రజ్ఞానమందు లేబ్రహ్మపదవి । పరశివుండగునిదియండ్రు ధరనువేమ. 1258

సీ. గయుడంబరీషుండు, ఘనశశిబిందువు । రుచిరుఁడుబృథుఁడు, మరుద్వతుండు
భరతసుహోత్రులుఁ, బరగుశ్రీరాముండు । నాదివపసగరు, లవనిమఱియు
భార్గవుఁడుయయాతి, పరగభగీరథుఁ । డలశిబిమాంధాత, లనఁగనొప్ప
నిటువంటియధిపతు, లేడ్గురుతొమ్మండ్రు । పదునాఱ్వురధిపులై, ప్రబలిరవని
నిట్టినృపవర్యులెందరో, గిట్టిరహహ । చూడఁజూడంగ నీమాయ, చోద్యముకద
విశ్వమందునుసర్వమ, శాశ్వతంబు । తెలిసియును గార్యములగానరిలను వేమ. 1259

ఆ. గర్భచిహ్నగలిగి ఘనబాధలేర్పడఁ । దగిలికష్టపడునుతల్లికట్టి
పిండముదయమైనఁ బ్రియముగాఁజూపెడి నండజనులకాపె యరయువేమ. 1260

ఆ. గర్వమింద్రియములఁ గట్టివేయఁగలేక । చావువచ్చునపుడె సన్యసింప
నాత్మజయములేదె యంటునా మోక్షంబు । విశ్వ. 1261

ఆ. గరుడసేవఁజేసి ఘనతతో భుజియింప । వలెనటంచునరులు వాంఛదీఱఁ
బలుకుచంద్రుగాని భావంబుగానరు । విశ్వ. 1262

ఆ. గాజుకుప్పెలోనఁగడఁగుచుదీపంబ । దెట్టులుండుజ్ఞాన మట్టులుండుఁ
దెలిసినట్టివారి దేహంబులందును । విశ్వ. 1263

ఆ. గాడిదెతనువందు గంధంబుఁబూసిన । నేమియెఱుఁగఁజాల కెగసితన్ను
నీడుగానివారి యిష్టమీలాగురా । విశ్వ. 1264

ఆ. గాడ్దె మేనినిండ గంధంబుఁబూసిన । బూదిలోనఁబడియుఁబొరలుమరల
మోటువారిసొగసు మోస్తరీయదిసుమీ । విశ్వ. 1265

ఆ. గాడ్దెయేమెఱుంగు గంధంబువాసన । కుక్కయేమెఱుంగు గొప్పకొద్ది
యల్పుడేఁమెఱుంగు హరునిఁగొల్చువిరక్తి । విశ్వ. 1266

ఆ. గాలిగాలిఁగలిసె గగనంబు గగనంబు । మన్నుమన్నుగలిసె మంటమంట
నీరునీటఁగలిసె నిర్మలంబైయుండె । విశ్వ. 1267

ఆ. గాలిగాలిగూడి గండిగండినిగూడి । తోలుఁదోలుఁగూడి దొమ్మిఁజేసి
జడ్డు జిడ్డుఁగూడ జీవుండిటాయెరా । విశ్వ. 1268

ఆ. గాలిఫణికిఁజేసెఁగసవుఁబసికిఁజేసె । మంటి నెరకుఁజేసె మఱవకిలను
బుడమిలోజనులకు బువ్వట్లు చేసెరా । విశ్వ. 1269

ఆ. గాలిఁబాము తిన్నఁగప్పలదినకున్నె । దుష్టబుద్ధియున్న దుండగమున
మనుజుఁడరయనిట్లె మాంసంబుఁదినుసుమీ । విశ్వ. 1270

ఆ. గాలియందెపుట్టి గాలియందెపెరిగి । గాలిఁదెలియలేరు గాదెనరులు
గాలియందెయాత్మ కలదదెతత్వంబు । విశ్వ. 1271

మత్తకోకిల. గాలిరాకలుఁబోకలుండెడు కాలమే బ్రదుకాయెరా
లీలతోఁబరమాత్మ నెంచఁగ లేనిమాయలఁగంటిరా
చాలనమ్మియు నాత్మకీలును సాధనంబునఁగానరా
మేలుగానిక నీవునీయెడ మేళగింపర వేమనా. 1272

తే. గాలి రేచకపూరక గతులెఱింగి । కీలుకొని కుంభకంబునఁ గేరుచున్న
నీలకంఠుని ప్రత్యక్ష నిలయమదియె । బాగుగా వదికన్న నే యోగివేమ. 1273

ఆ. గాలిలేని దీప కలికచందంబున । నలలుసుళ్లులేని జలధిరీతి
నిశ్చలాత్మ యెన్న నిర్వికారంబున । నుండెనేని ముక్తి యతఁడు వేమ. 1274

తే. గాలిలోనికిలాగెడు గతి నెఱింగి । పూని విడిచెడు మర్మంబు పోకఁ గనుచు
హంసలో నెంచి కుంభించు ననుదినంబు । యోగసాధకమాసించు యోగివేమ. 1275

అ. గాసిఁజెంద నేల గతికామమును మించి । వాసిగా నుభక్తి వరుసఁ దెలిసి
మోసపోక యెఱుక మురియుటఁ గానరా । విశ్వ. 1276

తే. గాసిఁబడఁబోను మాయచేఁ గట్టుఁబడను । గలిమిగలవారి నెప్పుడుఁ గానఁబోను
నీదు పంచాక్షరంబుల నియతముగను । దలఁచుచుండెద శివ చూడు దయను వేమ 1277

ఆ. గింజ చెడఁగ నాడు కీడుతో నేతాకు । గింజ చెడక యున్న కీడు లేదు
గింజగలుగు వారి లంజెపంచనె యుండి । కందకుందురి జగతిఁ గడఁగి వేమ. 1278

ఆ. గీము విడిచిపెట్టి గిక్కురుమనకుండ । జీవుఁడుడుగు వేళ శివునిఁ దలచు
మనసుగొల్పక యును మాయచేఁ బొరలెడు । పాపజనుల కెచటి పరము వేమ 1279

తే. గుట్టు గురుభక్తిలో ముట్టి మిట్టిపడక । జెట్టివలెఁ బోరిలో మర్మమిట్టివనుచు
నట్టుపడఁజూచి మించు టే నాటకంబు । పిట్టకథరులచే నేమిగిట్టు వేమ. 1280

ఆ. గుడులు దేవతలని గుళ్లులు గావింత్రు । ముష్టిబాపలనుచు మూల్గ నేల
మొప్పెలకును దారిఁ జెప్పిరి ప్రాజ్ఞత । విశ్వ. 1281

ఆ. గుడ్డువచ్చి పిల్లగోరఁడాలాడిన । విధముగా నెఱుఁగక వెఱ్ఱిజనులు
జ్ఞానులైనవారిఁ గవ్వింతు రూరక । విశ్వ. 1282

ఆ. గుణగణంబులెల్ల గుచ్ఛితమును బొందఁ । దగిలి భ్రమలఁ జిక్కి దండధరునిఁ
దోడి తెచ్చుఁగదర తొలగింపకున్నను । విశ్వ. 1283

అ. గుణములుగలవాని కులమెంచఁగా నేల । గుణము గలిగెనేని గోటి సేయు
గుణములేనివాని కులమెంత గొప్పైన । నెంచవలదు నీచుఁడెన్న వేమ. 1284

ఆ. గుణము గల్గి యున్నఁ గులసతి నెవ్వారు । నిందఁ జేయలేరు నీతిఁ జూచి
గుణములేక యున్నఁ గులహీనురాలయా । విశ్వ. 1285

ఆ. గుణయుతునకు మేలు గోరంత చేసినఁ । గొండయగును వాని గుణముచేతఁ
కొండయంత మేలు గుణహీనుఁ డెఱుఁగునా । విశ్వ. 1286

ఆ. గుణవతిగలగృహము గోమునొందించును । చీకటింటదివ్వె చెలఁగునట్లు
దేబెయున్నకొంప దివ్వెనిల్పినయట్లె । విశ్వ. 1287

ఆ. గుణవతియగు యువతిగుటి చక్కగానుండుఁ । జీకటింటదివ్వె చెలఁగురీతి
దేవియున్నయల్లు దేవార్చన గృహంబు । విశ్వ. 1288

తే. గుణవికారంబులను ద్రొక్కిగుట్టుఁదెలిసి । ధణధణాన్విత ప్రణవంబుదాటగానె
తృణముసర్వంబటంచును దృష్టిగలిగి । గణుతిఁజేయునుమిన్నక ఘనుఁడు వేమ. 1289

ఆ. గుణవిహీనజనుని గుణమెంచఁగా నేల । బుద్ధిలేనివాని పూజయేమి
మనసులేనివాని మంత్రంబులేమయా । విశ్వ. 1290

ఆ. గుణరహితుఁడు మేలు కోరి తాఁబొందియు । నెంచఁడెపుడు దానియెచ్చుఁగనఁడు
గుణయుతునకు మేలు గోరంత చేసినఁ । గొండగాఁజూచుకొనును వేమ. 1291

ఆ. గుణికిజ్ఞానమహిమగోరంత చెప్పిన । గొండయగును వాని గుఱుతుచేత
గుణవిహీనునకిలఁ గొండంతజ్ఞానంబుఁ । జెప్పవానిగుణముచెఱుచు వేమ. 1292

ఆ. గుణికివిద్యభువిని గోరంతయబ్బినఁ । గొండయగును వాని గుణముచేతఁ
గొండయంతవిద్య గుణహీనుఁ డెఱుఁగఁడు । విశ్వ. 1293

ఆ. గుమ్మయెట్టిదైన ద్రిమ్మరివలచును । సరసవిటు బికేలసమ్మతంబు
పేడఁదినెడు పుర్వు బెల్లమే మెఱుఁగురా । విశ్వ. 1294

ఆ. గుఱ్ఱమునకుఁ దగినగుఱుతైన రౌతున్న । గుఱ్ఱములిలనడచు గుణముగాను
గుఱ్ఱములిలనడచు గుణమేలఁ దెలియరో । విశ్వ. 1295

ఆ. గుటికిరావు జగతిఁ గోమటినిష్ఠలు । లోభితనముచేతలోనికడఁగుఁ
బులియుదాసరికిడుపొలుపగు చందమా । విశ్వ. 1296

క. గుటిగానలేక మర్త్యులు । పరిచితశాస్త్రములవాదపద్ధతిఁ గనర
గ్గుటిగురువుజ్యోతినీయను । ధాత్రిఁ దెలిసినవాఁడె యోగి ధరలో వేమా. 1297

ఆ. గురుచరణముఁ బట్టఁగుక్కలుగఱచునా । గురుచరణము విడువఁ గుక్కగఱచుఁ
గుక్కకున్నగుణము గురునకులేదురా । విశ్వ. 1298

క. గురుఁడగునాత్ముఁడు శిష్యుఁడు । పరగంగాజీవుఁడనుచుఁ బరికించుచునీ
గురుశిష్యపరమయోగం । గురుతరముగఁ గూర్చువాఁడు యోగిర వేమా. 1299

క. గురుఁ డనఁగ ధేనువైతగు । వరశిష్యుఁడు వత్సమగుచు వర్తింపంగాఁ
దఱిగలిగి నప్పుడొసఁగును । నిరుపమలక్ష్యామృతంబు నిజముగ వేమా. 1300

క. గురుఁడనఁగాఁ బరమాత్ముఁడు । పరగంగా శిష్యుఁడవఁగఁ బటుజీవుఁడగుం
గురుశిష్యజీవసంపద । గురుతరముగఁ గూర్చునతఁడెగురువగు వేమా. 1301

క. గురుఁడనఁగా మొదలంతకు । గురుశిష్యులనంగ నెల్ల కొమ్మలు గానం
గురువును గానఁగఁజాలరు । ధరలోపలమనుజులెల్లదలఁపఁగ వేమా. 1302

ఆ. గురుఁడుశిష్యుఁడనఁగఁ గొనయెట్టి మొలెట్టి । గురువుశిష్యుఁడనెడి గుఱుతులెట్లు
గురునకుండఁ దగినపరువె లేకుండిన । విశ్వ. 1303

ఆ. గుఱుతుగాను జెప్పగురు వెవ్వఁడును లేఁడు । గుఱుతెఱుంగు శిష్యనరుఁడు లేఁడు
గురుఁడుశిష్యుఁడనుట గ్రుడ్డెద్దుచేనెరా । విశ్వ. 1304

ఆ. గుఱుతుగూడుచేసి గుణమువ్రత్తిగఁజేసి । సరవిఁగర్మసమితిఁజముఱుఁజేసి
మూలనొక్క జ్యోతి ముట్టించిచూడరా । విశ్వ. 1305

ఆ. గుఱుతు తిథులవలనఁ గులమెల్లఁజెడిపోయె । స్త్రీలనడతవలన సిగ్గుపోయె
నేహ్యపల్వలముల నిలయెల్లఁజెడిపోయె । జాళ్లవలనబ్రతుకు సమయు వేమ. 1306

ఆ. గుఱుతుతీరులేక కులమెల్లఁజెడిపోయె । స్త్రీలనడతవల్ల సిగ్గుపోయె
చౌటినేలవల్ల జలమెల్లఁ జెడిపోయె । విశ్వ. 1307

ఆ. గుఱునితోడఁబొందు కూడియుండినవాఁడు । చేరిబ్రహ్మమంటి చెలఁగియుండు
మఱుఁగుతెలిసెనేని మర్మంబులేదయా । విశ్వ. 1308

ఆ. గుఱునినిందఁజేసి గుట్టెఱుంగనివాఁడు । యమునిబాధనొందుఁ గ్రమముగాను
దేనెలోనియీఁగ తెఱఁగగుఁగానంగ । విశ్వ. 1309

ఆ. గురునిపరమగురుని గుఱుతుగాఁదెలియక । గురువుగానుదలయ గ్రుడ్డిరీతి
గురునకు గురువైన గురుఁడుప్రాణేశుండు । విశ్వ. 1310

ఆ. గురునిశిష్యునియతి గుఱుతుగామదిలోనఁ । గానలేఁడుభ్రాంతి మానలేఁడు
గురునిశిష్యుఁడెంచు గుఱియదెజ్యోతిరా । విశ్వ. 1311

తే. గురుపరంపర నీవిద్యగూఢమెఱిఁగి । పరమపరిపూర్ణుఁడుండుట పరవశతర
నిరుపమానంద సుఖకేళి నెరపవలెను । బరశివుండన భాసిల్లధరను వేమ. 1312

ఆ. గురుబృహస్పతియును గుణమించుకయులేక । చందమామకిచ్చె శాపమపుడు
గురుఁడుకోపమూనఁ గూడదెప్పటికైన । విశ్వ. 1313

సీ. గురుబోధఁ దెలియని, కుటిలశాస్త్రంబులు । పరికింపఁగా నేమి, ఫలముగలుగు
నాత్మైక్యమెఱుఁగక, యఖిలయోగంబులు । సాధింపఫలమేమి, సాధ్యమగును
దన్మయత్వంబును, దానెఱుంగనివాని । సేవఁ జేసిన నేమి, సిద్ధిగలుగుఁ
దుదిచేటెఱుంగక, చదువులు పెక్కులు । చదివినఫలమేమి, సత్యముగను
ననుచుసద్గురుబోధగా, ననవరతము । వేయినోరులఁ జెప్పిన, మాయజగము
వానినేచేయఁజూతురు, వాస్తవంబు । మదినిదెలియంగలేరీశు, మహిమ వేమ. 1314

తే. గురుముఖంబున నెఱిఁగిన గుఱుతువిడక । నిస్తరంగసముద్రంబు నియతిమనసు
నిలిపియపరోక్షమందుట నిర్గుణంబు। దానఁబరిపూర్ణ సంతోషమూను వేమ. 1315

ఆ. గురువుగలుగునాత్మ గుఱుతెఱిఁగెదమని । కాలమెల్లరిత్త గడిపిరయ్య
గురువుదొరకునపుడు కూలునీదేహంబు । విశ్వ. 1316

ఆ. గురువుచిల్లగింజ కుంభమీదేహంబు । ఆత్మకలుషపంక మడుగుఁబట్టఁ
దెలిసినిలిచెనేని దివ్యామృతము తేఱు । విశ్వ. 1317

ఆ. గురువుతానయినను హరునిదాఁజూపును । బ్రహ్మలోకమతఁడు పొరఁజూపు
శిష్యుసరసిపట్టి చీకటిఁబాపురా । విశ్వ. 1318

ఆ. గురువునకునుబుచ్చ కూరైననీయరు । అరయవేశ్యకిత్తురర్థమెల్ల
గురుఁడువేశ్యకన్న గుణహీనుఁడేమకో । విశ్వ. 1319

ఆ. గురువులేకవిద్య గుఱుతుగాదొరకదు । నృపతిలేకభూమి తృప్తిగాదు
గురువువిద్యలేక గురుతరద్విజుఁడౌనె । విశ్వ. 1320

ఆ. గురువుశిక్షలేక గుఱుతెట్లుకల్గునో । అర్జునికైనవాని యబ్బకైనఁ
దాళపుఁజెవిలేక తలుపెట్లులూడురా । విశ్వ. 1321

ఆ. గురువువచ్చుచున్నఁ గూర్చుండిలేవని । తుంటరులకునెట్లు దొరకుముక్తి
మగనిలెక్కఁగొనని మగువకాగతిపట్టు । విశ్వ. 1322

తే. గురువుసెప్పినయుక్తులు గూడిమిగిలి । మఱపులేదని నిజమూని మహితుఁడగుచు
నెరపుచుండునుశివయోగి నేర్పుతోడఁ । బరముసాధింపనతని కేర్పడువేమ. 1323

ఆ. గురువుసెప్పువిద్య గుఱుతునఁదెలియును । గుఱుతుమీఱునికి గురుఁడెఱుంగు
గురువుమహిమపరమ గురునకేతెలియును । విశ్వ. 1324

ఆ. గురువుసేవఁజేసి గుఱితోడభుజియింప । వలెనటంచునరులు వాంఛదీఱఁ
బలుకు చంద్రుగాని భావంబుఁగానరు । విశ్వ. 1325

ఆ. గువ్వకొఱకు మేను కోసియూశిబిరాజు । వార్తవిడువరాక కీర్తికెక్కె
నోగునెంచఁబోవ రుపకారినెంతురు । విశ్వ. 1326

తే. గుహలయందుండ్రుగురులని కొనుటకంటె । మహితగుణుఁడగు సర్వేశుమదినినిలిపి
గుణములన్నియుసరిజేసి కొన్నయపుడె । గుఱుతునిలుచునుదావచ్చు గురుఁడువేమ.

ఆ. గుహలలోనఁజొచ్చి గురువులవెదకంగఁ । గ్రూరమృగమొకండు తారసిలిన
ముక్తిదారియదియె ముందుగాఁజూపురా । విశ్వ. 1328

తే. గుహలుపదివేలుసొచ్చిన గుణముపోదు । నియతగురుభక్తికావలె నేర్పుమీఱ
మహితపరతత్వభావంబు మధురమగును । దానిసాధింపనేమఱి పూనువేమ. 1329

ఆ. గూబచేరగృహము గునిసిపాడుగఁబెట్టి । వెళ్లిపోదురెంత వెఱ్ఱివారొ
గూబగృహములేమి కూర్చురాకర్మంబు । విశ్వ. 1330

తే. గూబవలెగ్రుడ్లుద్రిప్పిన గుణమురాదు । లోభమోహములుడుగంగ లాభమగును
దబ్బలైభిక్షమెత్తుట తీర్పదెపుడు । డాబుసేసిన లక్ష్యమడంగువేమ. 1331

తే. గెంటియెఱుకను జిత్తనుమంటఁగలిపి । కంటికింపగుగురుశక్తి మింటఁజేర్చి
జంటఁబాసినఘనుఁడెపో జాణఁడరయ । బంటుతనమదిపరమందుఁబనికివేమ. 1332

ఆ. గొడ్డుటావుఁబితుకఁ గుండఁగైకొనిపోవఁ । బండ్లుటూడఁదన్నుఁ బాలనీదు
లోభివానినడుగ లాభంబులేదయా । విశ్వ. 1333

ఆ. గొప్పపిరుదుఁగన్నఁగుచకుంభములఁగన్నఁ । జెప్పరానిచోటి చేవఁగన్న
ముప్పిరిగొనునయ్య మొనసినమోహంబు । విశ్వ. 1334

తే. గొఱ్ఱెగుంపులఁదోడేలు కొదవదీఱఁ । జొచ్చిపట్టునుగొఱ్ఱెలఁ జొరవగాను
గుక్కగనుఁగొని గొల్లనిఁగూసిలేప । యదరిచియుఁదోలుఁదోడేలునతఁడు వేమ. 1335

ఆ. గొఱ్ఱెలుపదివేలు కూడియుండినచోటఁ । దల్లి నెఱిఁగివచ్చు దానికొదమ
పరమయోగి నెఱిఁగి భక్తుండువచ్చురా । విశ్వ. 1336

ఆ. గోగణముల నెల్ల గొల్లఁడైపోషించి । కృష్ణుఁడనఁగ నెగడె గృతముఖుండు
కృష్ణవలువలడుగఁ గేక చేవేలిచ్చె । విశ్వ. 1337

ఆ. గోచిపాతఁబెట్టి కోరితామునినంచు । మనసులోనియాశ మానలేఁడు
ఆకృతెన్న వేఱెఁ కాశయన్నఁగ వేఱు । విశ్వ. 1338

ఆ. గోచియాడెననుచుఁ గోఁతియాటలనాడి । వెఱ్ఱియోగి నూరువెడలుమంద్రు
ఎవరిగోచులూడ వీఁప్రొద్దుగ్రుంకిన । విశ్వ. 1339

ఆ. గోచివిడుచుయోగిఁ గోఁతిగనాడించి । వెఱ్ఱివానిఁజేసి వెతలఁజిక్కఁ
జేయునయ్యలేమి చేసెదరోరేల । విశ్వ- 1340

ఆ. గోపబాలుఁడగుచు గోవర్ధనంబును । లేవనెత్తి నిలిపెలీలతోనె
మురళిగానలోలు ముదమందజూఁడరా । విశ్వ. 1341

ఆ. గోపురంబు ప్రహారికో నేరు తేరులు । పూలతోటగుడులు పొందుగాను
దేవరనుచుబోఁగ దిగఁబట్ట్రిమింగెరా । విశ్వ. 1342

ఆ. గౌతమర్షి తిట్టు కలికంతుకోపంబు । దీనజనుఁడురోసి తిట్టునదియు
స్వర్ణకారుతిట్టు సరగునఁదాకురా । విశ్వ. 1343

ఆ. గృహముగూడుగుణముఁ గెరలు వ్రత్తిగఁజేసి । సత్యమనెడుకర్మచమురుపోసి
మూలమనెడుజ్యోతి ముట్టించిచూడరా । విశ్వ. 1344

ఆ. గృహముదేహముండెఁ గేవలగుణముండె ! దానినిలిపికొనియు దీనిఁదీర్పఁ
గానరాదెనీకు నానందసుఖమది । విశ్వ. 1345

క. గ్రామము భూములుసూనియుఁ । బ్రేమయు దయయింతలేక భీకరమతులై
భామలసుతులనువదలక । బాములఁబడ నేలనడవి పట్టున వేమా. 1346

ఆ. గ్రాసమింతలేక కడుఁగష్టపడుచున్న । విద్యయేలనిలుచు వీలుగాక
పచ్చికుండనీళ్లు పట్టిననిలుచునా । విశ్వ. 1347

## ఘ

ఆ. ఘటముఁగాన్గఁజేసి ఘనగుణమెద్దుగాఁ । దవిలి కర్మములను నవులఁ జేసి
తెలిసిగానుగాడుఁ దిలకారకాత్మము । విశ్వ. 1348

ఆ. ఘటముఁ గాన్గఁ జేసిస్ఫుటమైన యెద్దును । నిర్గుణాంశమదిని నిలిపి గతులు
తెలిసిగానుగాడది వ్యాప్తమృతముపుట్టు । విశ్వ. 1349

ఆ. ఘటముజలములందు గగనంబుకాన్పించు । ఘటముజలములేమి గగనమేది
ఘటములోన జ్యోతిక్రమమునఁ దెలియుఁడీ । విశ్వ. 1350

ఆ. ఘటము నింద్రియములఁగట్టివేయఁగఁలేక । చావువచ్చునపుడుసన్యసించు
ఆత్మశుద్ధిలేక యందు నా మోక్షంబు । విశ్వ. 1351

ఆ. ఘటములోననున్న గతులన్నియునుగోసి । డిటవుచేసి మనసు తేట పఱచి
ఘటమునిల్పువాఁడు ఘనతత్వయోగిరా । విశ్వ. 1352

ఆ. ఘటములోని దీపకళికచందంబునఁ । గుదురు గలుగు నిండు కుండరీతి
నిశ్చలత్వమమరి నిర్వికారంబునఁ । నుండినంతముక్తిఁగందు వేమ. 1353

క. ఘంటారవమును మదిలో । వింటే న్నెగంటఁగంటె విమలపుఁగాంతి
న్వెంటాడకబ్రహ్మంబును । గంటినిదగ కాదు నన్నుఁగనుఁగొనవేమా. 1354

క. ఘనచిత్రనీపసామ్యము । మనసుననిర్గుణము దాకిమ సలకత్వానై
వినికనివివఱమెఱుంగక । మనవలెలోగుట్టుమరిగిమహిలో వేమా. 1355

తే. ఘనచిదాకాశమైనట్టిగతి నెఱింగి । యనిలరేచకపూరకంబనువుకాను
బనుపడఁగలాగికుంభించిపాటుపడర । మనెడుసుజ్ఞానమమర నేమరక వేమ. 1356

క. ఘనసారమగ్ని దరికొనఁ । గనసారంబగునుగా నెకారణవిద్యా
ఘనసారము విద్యాగ్నికి । ఘనసారమె కంటకంబుగలుగుర వేమా. 1357

## చ

ఆ. చక్రధరునివేడిజలధిదాటఁగవచ్చు । వికృతమైనబుద్ధి వెతలబెట్టు
నక్రమెన్నగజము నయమార భక్షించు । విశ్వ. 1358

ఆ. చంద్రసూర్యగతులఁ జర్చించివేగమె । రంధ్రమునను జొచ్చిరంగుమీఱఁ
జంద్రశాలఁ జేరిచైతన్యమందరా । విశ్వ. 1359

ఆ. చంద్రసూర్యనాడి సందులోగాలిని । ముందులాగివిడిచి మూలమెఱిఁగి
కమలకుండఁబట్టి కుంభించికానరా । విశ్వ. 1360

తే. చంద్రసూర్యాగ్ను లేర్పడ్డ చంద్రశాలఁ । జేరిపరశివు నార్తితోఁ జింతచేసి
చిన్మయానందమునఁ జేరఁదన్మయంబు । ముక్తి మూలంబిదే జనములకు వేమ. 1361

తే. చంద్రసూర్యులగతిలోనె చక్కఁబెట్టి । కుంద కెప్పుడు గురునాజ్ఞఁ జెందఁగోరి
యెందుఁ జూచినఁ బ్రత్యక్షమెన్నుచుండు । దాన నేర్పడు నిత్యముదంబు వేమ 1362

ఆ. చంద్రునంతవాఁడె శాపంబుచేతను । గళలహీనమొందఁగలిగెఁ గదర
పుడమిజనులకెల్ల బుద్ధులట్లుండురా । విశ్వ. 1363

ఆ. చంద్రునీడను నిచి చక్కఁగా రవిమీఁద । నుండఁ జూచి కొంత యుండఁ జేసి
వెన్నెలం గలియు వెలయంగ ముక్తిరా । విశ్వ. 1364

తే. చపలచిత్తములోనున్న జాడ లెఱిఁగి । యపరిమితమన్మయాకృతి ననుసరించి
తపము నెఱవేర్చు నతఁడె పో తత్త్వవిదుఁడు । హర్షనిలయుండుఁ బరశివుఁడగును వేమ 1365

ఆ. చలపచిత్తవృత్తి జయమందిగమకించి । నిపుణుఁడైయు యోగనియతిమీఱి
తపముఁ జేయువాఁడు తత్త్వాధికుండురా । విశ్వ. 1366

ఆ. చపలచిత్తవృత్తి సాధించి నిలిపిన । త్రిపుటి బిలముఁ జేరుఁ దెంపుగలిగి
జపములో నిజపము జైత్రుఁడై సాధించు । విశ్వ. 1367

క. చపలాత్ములగుచుఁ గొందఱు । విపరీతపు గోర్కెలూని విడువఁగలేకే
నిపుణులమను కొనుచుంద్ర । య్యపవర్గంబైనబయలునందరు వేమా. 1368

క. చరణంబులుపదితోకలు । పరగంగన్నాడు తలలు బైట నెతిరుగు
న్వరభూమితల్లడిల్లఁగ । నిరవొందఁగ దీనిఁ దెలియుమిలలో వేమా. 1369

తే. చర్చమీఱిన జ్ఞానంబు సంతరించి । మూర్చఁ జెందినయట్లున్న ముక్తిగలుగుఁ
గూర్చి మెచ్చఁడె గుఱి దాటికోవిదుండు । తీర్చు గురుదరి జేరంగఁ దివిరి వేమ. 1370

ఆ. చర్మమునకు స్వర్శసరవితోఁ దెలియుఁడు । కర్మములు పాసఁగుటఁ గానలేరు
చర్మకర్మములివి జగతిలో నరులకు । విశ్వ. 1371

ఆ చర్మమెపుడు జీవ సౌఖ్యంబు గోరును । జీవికర్మములను జేరుఁ గాక
జీవికర్మమెల్లఁ జెడరోయఁ దత్త్వమా । విశ్వ. 1372

ఆ. చిక్కిదక్కబోదు చిగురించు మదిలోన । నిక్కఁబట్టి గుఱుతు నెఱయఁ జూచి
సొక్కియున్న ఘనులు సూత్రాత్ములగుదురు । విశ్వ. 1373

ఆ. చిక్కియున్నవేళ సింహంబునైనను । బక్కకుక్కమీఱి బాధసేయు
బలిమిలేనివేళఁ బంతముల్సెల్లవు । విశ్వ. 1374

ఆ. చిగురుఁజెట్టుమీఁద చింతపువ్వులుపూచి । నిమ్మపండుపండు నిమిషమునను
దౌరుచెడకమునుపె దానినిదినవలె । విశ్వ. 1375

ఆ. చిత్తమందుశివునిఁ జింతించిచూచిన । హత్తుకొనునుబదవి హానిలేక
పొత్తుమెఱవఁగానె పొందురాసుఖకేళి । విశ్వ. 1376

ఆ. చిత్తమనెడువేరు శిథిలమైనప్పుడె । ప్రకృతియనెడుచెట్టు పడునుబిదపఁ
గోర్కులనెడుపెద్ద కొమ్మలెండునుగదా । విశ్వ. 1377

తే. చిత్తమవ్వలఁజేర్చెడు చిన్మయుండు । మత్తతయులేక పరమాత్మమహిమఁగూడి
యున్నదన్నదికన్నది యెన్నఁబోక । నిత్యవస్తువెగుఱుతింప నేర్చువేమ. 1378

ఆ. చిత్తముగలయోగి శివునివలెనెయుండు । మిథ్యయోగియుండు మిడుతవలెను
నిత్యుఁడైనయోగి నీవలెనుండురా । విశ్వ. 1379

క. చిత్తము బుద్ధియుమనమును । హత్తునహంకారగుణము నాత్మకులోఁగా
మొత్తముఁజేయఁగ నేరని । మత్తులకును లేదుముక్తి మహిలో వేమా. 1380

క. చిత్తరువు ప్రతిమకైవడిఁ । జిత్తమ్మును కల్పమడఁచి చిరతరబుద్ధిం
జిత్తునఁదెలిసినవాఁడే । యెత్తినసుజ్ఞానియందు రిహమునవేమా. 1381

తే. చిత్తవృత్తులుమదియందుఁ జేరనీక । రిత్తబయలునగుఱిమించి రేబగళ్లు
మత్తుఁడైయుండువాఁడెపో మాన్యుఁడరయ। సత్తఁదెలిసియొఁదరిజేరసరవివేమ 1382

ఆ. చిత్తవాజినెక్కి శిక్షింపనేరక । తత్తరపడినంతఁ దరలనేల
వారణాసితనకు వైయాసిగాఁబోలు । విశ్వ. 1383

ఆ. చిత్తశుద్ధికల్గి చేసినపుణ్యంబు । కొంచెమైననదియుఁ గొదవగాదు
విత్తనంబుమఱ్ఱి వృక్షంబునకునెంత । విశ్వ. 1384

ఆ. చిత్తశుద్ధియొకటి శ్రేష్ఠలాంఛనమగు । నిఖిలపుణ్యకార్య నిర్వహణము
నద్దిలేకచేయ ననువుగానొప్పదు । విశ్వ. 1385

ఆ. చిత్తశుద్ధిలేక సీమలుదిరిగినఁ । గష్టమానసుండు కానులేఁడు
భక్తిగలుగువాఁడె పరమగురుండౌను । విశ్వ. 1386

ఆ. చిత్రదీపములవలెఁ జింతలదిగఁద్రొక్కి । మిత్రముగను మనసు మెలఁగ వెఱిఁగి
శత్రుగుణములెల్ల సాధించుటయె ముక్తి । విశ్వ. 1387

ఆ. చిత్రమంత్రమహిమ సిద్ధికిఁజిన్నది । పుత్రినిభువిఁగనెను బూర్వమందుఁ
దండ్రిలేనిసుతుఁడు ధాత్రినినేలెరా । విశ్వ. 1388

ఆ. చింతచెంతనుండుఁ జేమంతిపూబంతి । కాంతఁజూడఁదలఁచుఁ గౌఁగలింప
నంతమంతనమున నానందకేళిరా । విశ్వ. 1389

తే. చింతనామృతపాన విశేషమత్త । చిత్తమపరిసఘనులందుఁ జిన్మయంబు
వినుతికెక్కినపరిపూర్ణ విద్యయగును । అట్టివారల గురులఁగానరయు వేమ. 1390

ఆ. చింపండురాగి చిలుమూడఁగొట్టెడు । నట్టియోగియులను గట్టివాఁడు
ఉప్పమూసనుంచి యూదితాఁజెడనేల । విశ్వ. 1391

ఆ. చింతపారఁద్రోలి చెవియొగ్గివినఁగనె । కొంతహితువులమరి కోర్కెఁదీర్చుఁ
గాంతఁజేరిమరిగి గమకించిచూడరా । విశ్వ. 1392

ఆ. చింతమానికొనను జేరిననలకాంతి । వింతఁజూపిచనును విడువరాదు
పంతగించిదానిఁ బట్టిననేమేలు । విశ్వ. 1393

తే. చింతవలదయ్యె గురువరమంతనమున । నంకితంబుగనామంబు నమరఁజేసి
నాదుభక్తినిమీయందుఁ బాదుకొల్పి । చెప్పసాగితిఁబద్యముల్ క్షితినివేమ. 1394

క. చిన్నదియెలప్రాయంబునఁ । గన్నది పతిలేకసుతునిఁ గడుఁజిత్రముగా
నెన్నఁ డురతిసుఖమెఱుఁగదు । చన్నియ్యక పెనిచెనార జగమునవేమా. 1395

ఆ. చిన్ననాఁటనుండి చేసినకర్మంబు । పిన్నపెద్దలమను బెఱిగివచ్చు
మంటిమింటినడుమ మదినిల్పిచూడరా । విశ్వ. 1396

ఆ. చిన్మబిలముఁజేరి చిన్మాత్రుఁడవుకమ్ము । పన్నెమిగిలినంత కన్నెవచ్చి
చన్నుగుడిపినిన్ను మిన్నందఁజేసెడి । నెన్నరానిమహిమ మెఱుఁగువేమ. 1397

క. చిన్మయరూపుని మదిఁగల । తన్మయపురియందుఁజూచి తగులకయున్నం
జన్మముల దాటవచ్చును । సన్మనమునఁబూర్ణమమల సారమువేమా. 1398

తే. చిన్మయానందపురి నడిసీమఁ జేరి । తన్మయుం డైన పరశివ తత్త్వవేత్త
మన్మయంబగు రాజ్యంబు మరిగియుండు । జన్మరాహిత్యమందు నిజమ్ము వేమ. 1399

క. చినుకులు పడఁగా మొలచిన । ఘనతరమగు సస్యమందుఁ గాచిన కొలుచు
ల్మనుజులు దినఁగా నప్పుడు । కన నింద్రియములకు భ్రాంతిగలుగును వేమా. 1400

ఆ. చినుగుబట్ట కాదు చీనాంబరముగాని । ముఱికియొడలు గాదు ముక్తి కాని
పరమయోగి మహిమ పరికింప నరుదురా । విశ్వ. 1401

ఆ. చిన్నెలంతె కాని సృష్టి లౌకికమగు । నందు వల్ల నేమి యాశ కద్దు
ఒక్కఁడైన వాఁడె యుత్తమ పురుషుండు । విశ్వ. 1402

ఆ. చిప్పలోనుబడ్డ చినుకు ముత్యంబాయె । నీటఁబడ్డచినుకు నీళ్లఁగలిసెఁ
బ్రాప్తముగలచోట ఫలమేలఁదప్పురా । విశ్వ. 1403

ఆ. చిఱుతనాఁడు నీవు చేసిన కర్మంబు । మఱతువేమొ మదిని మల్లడించి
తిఱిమిముట్టుఁ జావు తలపడి నప్పుడు । విశ్వ. 1404

ఆ. చిలుక గర్భమందుఁ జెలఁగి శుకుఁడు పుట్టె । మఱియొకండు పుట్టె ఖరమువలన
నిట్టిఋషికులంబు నెంచంగఁ బనిలేదు । విశ్వ. 1405

ఆ. చిలుకగర్భమందు శ్రీశుకుఁ డుదయించి । మునివరేణ్యులందు ముఖ్యుఁ డయ్యెఁ
బ్రత్తికాయఁ జిత్రపటములు పుట్టవా । విశ్వ. 1406

ఆ. చిలుక నోరు గొట్టి చిత్తజు మెడఁగట్టి । కచ్ఛడంబు బిగియఁ గట్టుకొన్న
మనసు వశముగాదె! మహి నేమి పాపమో । విశ్వ. 1407

ఆ. చీకటింటఁజేరఁ జేదివ్వెలేకయె । రూకగానరాదు రూఢిగాను
రాకపోక లడఁచి రవములో విని సొక్క । విశ్వ. 1408

ఆ. చీకటింటఁజేరి చింతింపఁబనిలేదు । రాకపోక లెఱిఁగి రంగుమీఱ
నేకతేజ మంటి యిలఁద్రొక్కి చూడరా । విశ్వ. 1409

ఆ. చీకటింటఁబుట్టఁ జీకటిఁ బెరిగినఁ । జీకటిమఱుఁగున నె చిక్కనేలఁ
జీకటిఁదెలిసిన సృష్టికాన్పింపదా । విశ్వ. 1410

ఆ. చీక టెచటదాఁగు సిగ్గెచటను దాఁగు । నాక లెచటదాఁగు నాత్మలోన
నిద్రదాఁగుచోట నిజ మని తెలియరో । విశ్వ. 1411

ఆ. చీమకట్టె నేని జివు కనుపించును । జీమ యెంత దాని జీవమెంత
చీమవంటి గురునిఁ సృష్టిలో నెఱుఁగరా । విశ్వ. 1412

ఆ. చీమగారు పంటఁ జెదలు పట్టెడి యింటఁ। బురుగు ముట్టుగుంటఁ బుసులకంట
బిడ్డచీకు చంట బిగియుండ నేర్చునా। విశ్వ. 1413

ఆ. చీమ నెత్తురులును జిందు తొమ్మిదిపుండ్లు। కైన మందు నొకటి నందుకొంటిఁ
బాపనాశకుఁ డగు పరమేశు పదభక్తి। విశ్వ. 1414

ఆ. చీరఁగట్టి రాత్రి సిగ్గున నోరగును। బగలు చీరవిడుచుఁ బనుల యెడలఁ
జేడెగాదుర యిది చేవాడికత్తెరా। విశ్వ. 1415

క. చీలలుగ నైదవుండినఁ। జాలుగఁ దను వనెడి రథము జగములఁ దిరుగుం
జీలయొకటి యూడిపడిన। వేళను దను వనెడి రథము వీడును వేమ. 1416

క. చెట్టందు విత్తు పుట్టెను। జెట్టును విత్తందె పుట్టెఁ జెలిమిదలిర్పం
జెట్టును విత్తును రెండుం। బుట్టినవిధిఁ దెలియ వలయు భువిలో వేమా. 1417

ఆ. చెట్టు చేమఁగొట్టి చుట్టుగోడలఁబెట్టి। యిట్టు నట్టు పెద్దయిల్లు గట్టి
మిట్టిపడును నరుడు మీఁది చేటెఱుఁగక। విశ్వ. 1418

ఆ. చెట్టునందుఁబుట్టి చెలరేగు కాయలు। దనరు కాంతి తోడఁ దగిలి పండ్లు
పండువానిఁ దింద్రు వర్ణంబుఁ దెలియుఁడీ। విశ్వ. 1419

ఆ. చెట్టుపాలు జనులు చేదందు రిలలోన। నెనుము గొడ్డు పాలె యెంత హితవొ
పదుగు రాడఁగానె పాటియై ధరఁ జెల్లు। విశ్వ. 1420

ఆ. చెట్టు మొదటి పాలు శివుని కంటను దీసి। చెట్టు మొదటఁబోశి శివునిఁ గొలిచి
చట్టువలెనె యున్నఁ జా వెట్లు కల్గురా విశ్వ. 1421

ఆ. చెట్టు మొదలు లేదు చెలఁగి కొమ్మలు నాల్గు। బట్టబయట మ్రాను పండ్లు పండుఁ
దినఁగనె చవిలేదు తీపులు మెండయా। విశ్వ. 1422

ఆ. చెట్టు వెనుక చెట్టు చేలోకువై యుండు। నంత త్రాఁడుగట్టి యగడు గొందు?
ఆడువారి కింతె యడిగినఁ జెప్పెద। విశ్వ. 1423

ఆ. చెడ్డవాని మిగులఁ జెఱచును దైవంబు। అడ్డపడఁడు వాని కాపదైనఁ
జెడిన చేను జూచి యెడయఁడు మెచ్చునా। విశ్వ. 1424

ఆ. చెడిన మానవులను జేపట్టి రక్షించి। కడకుఁజేర్చ నట్టి ఘనులు తలఁప
విడని పుణ్య మగుట విశ్వేశు సన్నిధి। నెడతెగకయ యుండు రెపుడు వేమ. 1425

ఆ. చెడుగుణంబు లెల్లఁ జేపట్టి శిక్షించి। పరమపదవి సిద్ధిపడఁగఁ జూపు
నట్టి గురుని వేడి యపరోక్ష మందరా। విశ్వ. 1426

తే. చెంది చెందని చూడ్కిలోనందుకొనుచు । నెందుఁ జూచినఁ దన్మధ్యమెఱిఁగియున్న
సుందరాకార కాంతిలోఁ జూడ్కి తగిలి । పొందరానట్టిబయలందిపొందు వేమ. 1427

తే. చెప్పవచ్చును దా నెంతొ చేసినట్లు । ముప్పుత్రిప్పలు దలఁగను మూలమేది
చెప్పుమాటలు తనమది సేత లగునె । యొప్పికొనువారికే యవి గొప్ప వేమ. 1428

క. చెప్పియుఁ జూపఁగరానిది । మెప్పుగ మదిలోనఁ జూచి మెలకువతోడం
ద్రిప్పలు పడకయె చూచిన । నొప్పుగ జగమెల్ల నిండియుండును వేమా. 1429

ఆ. చెప్పులోనిరాయి చెవిలోని జోరీఁగ । కంటిలోని నలుసుఁ గాలిముల్లు
నింటిలోని పోరు నింతంత కాదయా । విశ్వ. 1430

ఆ. చెఱకుతోఁటలోనఁ జెత్తను ప్పండినఁ । గొంచెమైన దాని గుణము చెడదు
యెఱుకగలుగు చోట నెడ్డవాఁ డున్నట్లు । విశ్వ. 1431

ఆ. చెఱకు తీపి లేమిఁ జెత్తనాఁ బడునట్లు । పరగు గుణము లేని పండితుండు
దూఱుపడును గాదె దోషము టుండఁగ । విశ్వ. 1432

ఆ. చెఱకులోన నైనఁ జెడ్డగుణం బున్నఁ । దీసి వేయకున్నఁ దినఁగఁబొసఁగ
దంతిపురపు ద్రోహి యాతఁ డెట్లుండురా । విశ్వ. 1433

ఆ. చెలిమితోడ ముందు చింతించి గగనంబు । బలముతోడఁ బ్రాకి భావ మూని
ఫలవిహీన మైన భావచిన్మయ మంది । విలయ మొందువాఁడు విభుఁడు వేమ. 1434

ఆ. చెలిమి మీఱ మదిని జింతలు విడనాడఁ । బిన్న పెద్దలకును బెఱిఁగి వచ్చు
మంటి మింటి నడుమ మదినిల్పి చూడరా । విశ్వ. 1435

ఆ. చెవిని నిల్లుగట్టి చెప్పెను వేమన । బట్టబయల నుండు బ్రహ్మ మనుచు
బుద్ధిగలిగి యందుఁ బొంది సుఖింపుఁడీ । విశ్వ. 1436

ఆ. చెవులలోను బుట్టురవమె యాకాశంబు । కన్నులఁ గనునదియె కళలజ్వాల
ముక్కులోని గాలి ముక్తికిఁ ద్రోవరా । విశ్వ. 1437

ఆ. చెవుల విన్నయట్టి రవమును వివరించి । మనస దెఱిఁగి నపుడు మరులు కొనును
చెవులు శబ్దమునను జెడ రోయ ముక్తిరా । విశ్వ. 1438

సీ. చెవులు గోరును మంచి జిలిబిలి పాటలఁ । దియ్యని మాటలఁ దెఱఁగు వినఁగఁ
జర్మంబు గోరును సరవితోడుత శీత । మృదుల సంపర్కసంపదల నెపుడుఁ
గన్నులు గోరును గమనీయ వర్ణంబు । లైనట్టి రూపంబు లనువుతోడ
నాలుకగోరును నయముతోడను దీపు । నొగరుఁ గారమ్ముఁ జే దుప్పుఁబులుసు

ముక్కుగోరును సద్గ్రంథములను దెలఁగి । చెవులుఁ జర్మంబుఁ గన్నులు జిహ్వ ముక్కు
నిన్నియునుగూడినటువంటియింటిరోసి । తన్నుఁ గనుఁగొని సుఖియింపఁదగును వేమ. 1439

క. చేకొని పరోపకారం । బేకొఱగా మహిమ లెల్ల నెఱిఁగెదు విధిమై
ధీకాదికమును జెప్పెను । సాకారముగాఁగఁగాని యంత్యము వేమా. 1440

ఆ. చేకొనుచును దమకుఁ జేసాచి సంతలోఁ । జెడిన ప్రజలరక్ష సేయలేని
తనదు సాగులేమి తన తను వదియేమి । విశ్వ. 1441

ఆ. చేటువచ్చువేళఁ జెడనాడు దైవంబు । మేలువచ్చునేని మెచ్చుకొనును
గరిమ మేలు కీళ్లు కానటికుండలు । విశ్వ. 1442

ఆ. చేటువచ్చెనేనిఁ జెడనాడు దైవంబు । మేలువచ్చెనేని మెచ్చుఁదన్ను
చేటు మేలుఁ దలఁపఁ జేసిన కర్మముల్ । విశ్వ. 1443

క. చేతస్సంకల్పంబున । నీతిగ వర్తించినపుడె నిర్మలపదవుల్
ప్రీతింబొందకయుండును । భూతలమున నధిక యోగపురుషుఁడు వేమా. 1444

క. చేతస్సంకల్పంబులు । నీతిన్వర్జించి నపుడె నిర్మల పదవుల్
ప్రీతిగఁబొందు నటందురు । భూతలమునఁ బరగు యోగ పురుషుఁడ వేమా. 1445

ఆ. చేయఁ దగినవేళఁ జేసెడి కార్యంబు । వేగపడి యొనర్ప విషము దౌను
బుడమకాయ చేదు ముదిసినఁ దీపెయు । విశ్వ. 1446

క. చేయవలెను సంసారము । చేయఁగఁ దాఁ జెరుపకుండు జిత వెఱుఁగ నగుం
జేయక చెఱుపక యెఱిఁగిన । మాయకులోబడక యుండు మహిలో వేమా. 1447

తే. చేరి యష్టాక్షరములెంచి దారిమిగిలి । కోరికలులేని మోక్షాధికారి యగుచుఁ
బోరి చిత్పర మందినఁబొంచిమించు । దారి విడనాడుటను ముక్తి తలఁగు వేమ. 1448

తే. చోరులకుఁ జిక్కిపోయిన తీరెయగును । నోటగుణియించుమంత్రంబు నీటఁగలియు
మాటలందును బరమాత్మ మరిగిరాడు । చిత్తమునస్వస్థతయులేమిఁ జెడుగు వేమ. 1449

## చ

ఆ. చక్కగాను మదిని జర్చించి కనవలె । ముక్కుతుదిని మించి మురిపెముగను
దృక్కు బ్రహ్మ మనుచు మ్రొక్కనంతనె ముక్తి । విశ్వ. 1450

ఆ. చక్కగాను మదిని సాధించి కనవలె । నిక్కిచూచు నెఱుక నేర్పుమీఱ
ముక్కుతుదిది చూపు ముదమందఁ జూడరా । విశ్వ. 1451

ఆ. చక్కఁజేసి మదిని సాధింపనేరమి । ముక్కుమీఁద దృష్టి మొనయుటరుదు
నిక్కమైన జ్యోతి నిన్నంటియుండురా । విశ్వ. 1452

ఆ. చక్కఁదనములేల సంపత్కరములేల । విద్యలేల భూమివిరివి యేల
పుత్రపదవికన్నఁ బుట్టునా పదవులు । విశ్వ. 1453

క. చక్కని పూనికతోడను । ముక్కుతుద న్నిలిపి మనసుమూలముఁ గనమి
న్దక్కదు నిత్యవినోదము । దృక్కగునా బయలు సేర దృఢమగు వేమా. 1454

ఆ. చక్కని సతియైన సరసురాలైనను । మే యొరులను గాననీయకున్న
సందె గ్రుంకినంత సయ్యాటలాడదా । విశ్వ. 1455

ఆ. చక్కనైన వాని మక్కువఁ గన్నంతఁ । దక్కవగను జూచుఁ దనదువిభుని
ఆడుబుద్ధికంటె నపరబుద్ధి యిఁకేది । విశ్వ. 1456

క. చక్కెరఁగలిపి తినంగా । ముక్కిన తవుడైన లెస్స మోహాముగదుర
స్వెక్కుడు బానిసయైన । న్మక్కువగను దివ్యభామ మహిలో వేమా. 1457

ఆ. చచ్చిపడిన పశువుచర్మంబుఁ గండలుఁ । బట్టి పెఱికి తినును బరగ గ్రద్ద
అదియె మేలుర పతి బ్రదికుండఁ బెఱికెడి । విశ్వ. 1458

ఆ. చచ్చువార లెవరు చావనివా రేరు । చచ్చి బ్రదికియుండు జనము లెవరు
విచ్చలవిడిగాను వివరించిచూడరా । విశ్వ. 1459

ఆ. చచ్చువారిఁ జూచి చావని పుట్టని । తత్వమెల్ల నాత్మఁ దలఁపుఁజేసి
యరసి చూచినట్టి యతనికే మోక్షంబు । విశ్వ. 1460

ఆ. చచ్చువారిని గని చావు నిశ్చయమని । తత్వమెల్లనాత్మఁ దలఁచి తెలిసి
నదురు బెదురులేని నడగల్గ ముక్తుఁడు । విశ్వ. 1461

ఆ. చచ్చెఁ జచ్చె ననుచుఁ జా వెంచి వగచెదు । దీననరుల వెఱ్ఱిఁ దెలుపరాదు
ప్రాణమునకు మృత్యు బంధంబు లుండునా । విశ్వ. 1462

ఆ. చందమామనీడఁ జక్కఁగాఁ దనలోన । నుండఁ జూచి కేల నూదిపట్టి
వెన్నెలల బయటను వెదకినంతనె ముక్తి । విశ్వ. 1463

ఆ. చందమామ వెలుఁగుఁ జక్కఁగాఁ బరికింపు । వెన్నెలఁ దలరెడి వెలయు బయట
దానిరూపుఁ దెలియఁగానె ముక్తిఘటిల్లు । విశ్వ. 1464

ఆ. చదివిచదివి కొంత చదువంగఁ జదువంగ । జదువుచదివి యింకఁ జదువు చదివి
చదువు మర్మములను జదువలేఁ డాయెరా । విశ్వ. 1465

ఆ. చదివి చదివి చదివి చావంగ నేఁటికిఁ । జావులేనిచదువుఁ జదువవలయుఁ
జదువులేక కోటిజనులు చచ్చిరిగదా । విశ్వ. 1466

ఆ. చదివి చదివి చదివి సారముఁ గనలేక । తిరిగి తిరిగి తిరిగి దిమ్మ రాయె
మరిగి తిఱిగి మొఱిగి మత్తిల్లి చచ్చెరా । విశ్వ. 1467

క. చదివిన దొరకదు మోక్షము । కుదురుగ మదినిలిపి గుఱ్తు కొనసాగిన యా
చదువును మదిలోఁజదివిన । చదువే పరిపూర్ణబోధసారము వేమా. 1468

ఆ. చదివి నతనికన్నఁ జాకలిసతి మేలు । కులము వేల్పు కన్న గుక్క మేలు
సకల సురలకన్న జారభామిని మేలు । విశ్వ. 1469

ఆ. చదివినయ్యకన్న ముదుస లయ్యే మేలు । గృహము వేల్పుకన్న గేదె మేలు
బాపనయ్య కన్న బైనీఁడు మేలయా । విశ్వ. 1470

ఆ. చదువరి మతికన్న సాధకుమతి మేలు । వేదములను లేదు వాదములను
ఒడలు శుద్ధిఁజేసి యొడయునిఁ జూడరా । విశ్వ. 1471

ఆ. చదువు చదువుకున్న సౌఖ్యంబులును లేవు । చదువు చదివెనేని సరసుఁడౌను
చదువుమర్మ మెఱిఁగి చదివినఁ జదువురా । విశ్వ. 1472

ఆ. చదువు చదువ నేల సన్యాసికా నేల । షణ్మతములఁ జిక్కి చావ నేల
నతని భజనఁజేసి యాత్మలోఁ దెలియుఁడీ । విశ్వ. 1473

ఆ. చదువురాదటన్న సామాన్యత యిఁకేల । బుద్ధికుదిరి కున్న పొంది కొకటి
గురుని గూర్చ ముక్తి కరతలామలక మా । విశ్వ. 1474

క. చదువుల కందఁగరానిది । ముదమున వదరంగ నేల మ్రుచ్చిలి యుక్తుల్
విదితములుగ మదిలోపలఁ । గుదిరిచి బ్రహ్మంబు నెంచి కూడుము వేమా. 1475

ఆ. చదువులందు లేదు శాస్త్రంబులను లేదు । వేదములను లేదు వాదములను
బయటనుండు ముక్తి పాటించి చూడరా । విశ్వ. 1476

ఆ. చదువులందు లేమి శాస్త్రంబులను లేమి । వాదములను దైవ భేదములను
బయట నున్నముక్తిఁబాటింప లేరయా । విశ్వ. 1477

ఆ. చదువులందుఁ బాడి మొదవు లందును స్త్రీల । పెదవులందు రాజ్యపదవు లందు
నాశ లుడిగి నట్టి యయ్యలుగల రొకో । విశ్వ. 1478

ఆ. చదువులందు రాజపదవు లందును బాడి । మొదవులందు స్త్రీల పెదవు లందు
నాశ లుడుగునట్టి యయ్యలు ముక్తులు । విశ్వ. 1479

ఆ. చదువులన్ని చదివి చాల వివేకియై । కలుషచిత్తుఁ డైన ఖలుని గుణము
దాలిగుంటఁ గుక్క దలఁచిన చందమా । విశ్వ. 1480

ఆ. చదువు లన్ని చదివి చాలవివేకింపఁ । గపటి కెన్నఁడైనఁ గలదె ముక్తి
నిర్మలాత్మునకె నిర్వికల్ప సమాధి । విశ్వ. 1481

ఆ. చదువు లన్ని చదివి చాలవివేకియై । మగిడి తన్నెఱుఁగక మందజనుఁడు
విసుగుచదు వటంచు వెఱ్ఱియై చెడిపోవు । విశ్వ. 1482

క. చదువులు చదివెడి యయ్యలు । పదవిని బొందంగలేరు పరమార్థమునం
బెదవులు గదలకయుండ । న్మదిలో నిది రాజయోగమార్గము వేమా. 1483

ఆ. చదువు లెల్లఁ జదివి సర్వజ్ఞులై యుండి । బ్రహ్మ విద్య లెల్ల పదటఁగలిపి
పడఁతిఁదలఁచు నంత బరమయోగము మాను । విశ్వ. 1484

ఆ. చనఁగఁ జనఁగఁ దాకుఁ జనుత్రోవలోఁ గాశి । వినఁగ వినఁగఁ బ్రణవవిభవరవళి
కనఁగఁ గనఁగఁ బుట్టుఁ గారణమాయరా । విశ్వ. 1485

ఆ. చనుఁ గుడిచిన శిశువు సరస నిద్రింపంగ । స్వప్న మందుఁ జొచ్చి సరగఁబాడె
నగవు నేడ్పుగాఁగ జగమున జనులెల్ల । వింతఁజూతు రపుడు వెఱ్ఱి వేమ. 1486

క. చనువా రెల్లను జనులం । జనిపోయినవారి పుణ్యసత్కథ లెల్ల
న్వినవలెఁ గనవలె మనవలె । ననిమిషులకుఁ దెలుపఁగూడ దంత్యము వేమా. 1487

క. చన్నుగవరీతి సంపద । కొన్నాళ్లకు వ్రేగుఁజూపి గొబ్బున వ్రాలు
న్వెన్నెల చీకటి సరియగు । నన్నాశివలింగమాయ లన్నియు వేమా. 1488

ఆ. చన్నుఁగుడిచి పెరిగి చన్నునకాశించి । చన్ను వల్లముక్తి చప్పనాయెఁ
జన్ను విడుచువాఁడు సర్వదా యోగిరా । విశ్వ. 1489

క. చన్నులు గుడిచియు మనుజులు। చన్నులపైఁగాంక్షదగిలి చత్తురె భువిలోఁ
జన్నులు మాంసపు ముద్దలు । చన్నుల యం దేమికలదు సారము వేమా. 1490

క. చన్నులు పరసతి కొప్పినఁ । గన్నులకును బాపదృష్టి గదియకమునుపే
యెన్నిక మునుఁ దాగుడిచిన। చన్నులుగాఁ జూడవలయు సత్యము వేమా. 1491

క. చన్నులు పరసతి కొప్పిన । వన్నియుఁగానంగ మదిని వలవదనికొన
న్మున్నొకఁటఁదాను గుడిచిన । చన్నులెయని తలచునతఁడె సాధువు వేమా. 1492

క. చంపఁగూడ దెట్టి జంతువునైనను । జంపవలయు లోకశత్రుగుణము
తేలుకొండిఁ గొట్టఁదే లేమిచేయురా । విశ్వ. 1493

ఆ. చంప దగిన యట్టి శత్రుఁడు తన చేతఁ । జిక్క నేనిఁ గీడు సేయరాదు
పొసఁగ మేలుఁ జేసి పొమ్మనుటే చాలు । విశ్వ. 1494

ఆ. చంపఁ దలఁచురాజు చను వగ్గలంబిచ్చుఁ । జెఱుప నున్నఁ బగఱఁ జెలిమి సేయుఁ
గఱవ నున్న పాము నెఱి దాఁచుకొని యుండు। విశ్వ. 1495

క. చంపినఁ బాపము వచ్చును । జంపినఁ బుణ్యంబు వచ్చు సర్వజ్ఞులకుం
జంపఁగ మనుపఁగఁ జెఱుపఁగ । నంపిన యావిధికె తెలియ నౌరా వేమా. 1496

ఆ. చమురు గలుగు దివ్వె సరవిగా నుండును । చమురు లేని దివ్వె సమసిపోవుఁ
దనువుతీరె నేనిఁ దలఁపుఁ దోడనె తీఱు। విశ్వ. 1497

ఆ. చమురుగల్గుదివ్వె సంతోషముగ వెల్గు। ధనము గలుగువాని తలఁపు జెలఁగు
ధనము తీఱఁ దలపుఁ దనుదానె తీఱును । విశ్వ. 1498

ఆ. చమురు రాచికొన్నఁ జర్మంబు మెఱు గెక్కు । సాము చేయ మేన సత్తు వెక్కు
జ్ఞానమార్గ మెఱుఁగఁ గడ తేఱు జన్మంబు । విశ్వ. 1499

ఆ. చలము పట్టి మదిని జనియించు గుణముల । తతిని ద్రుంచి వేగఁ దమక ముడిగి
యుతముగాను బుద్ధి నూహింప నదె ముక్తి । విశ్వ. 1500

క. చాకలిదానికిఁ బుట్టెను । జేకొనియన నారదుండు చెప్పఁగ వలెనా
లోకాలోకము లన్నిఁట । నేకముగా రూఢికెక్కె నెఱుగుము వేమా. 1501

ఆ. చాకి కోక లుదికి చీకాకుపడవేసి । మైలఁదీసి లెస్సమడిచినట్టు
బుద్ధిచెప్పువాఁడు గ్రుద్దిన మేలయా । విశ్వ. 1502

ఆ. చాకివాఁడు కోక చీకాకుపఱచియు । మయిలఁ బుచ్చి మంచి మడుపుఁజేయు
బుద్ధిసెప్పువాఁడు గ్రుద్దిన నేమయా । విశ్వ. 1503

ఆ. చాడికానిమాట చావిడిలో నిక్కు । వేటఁబో శునకము వెలయనిక్కు
వెలఁదిఁ జూచునపుడు విటకాఁడు నిక్కురా । విశ్వ. 1504

ఆ. చాయపోనిచాయ చక్కఁగాగు త్రెంచి । కోయవలెను భ్రమలఁ గొంకులేక
మాయ మాయమౌను మహిఁ దత్వ మందురా । విశ్వ. 1505

ఆ. చాలదయ్యాయింక చార్వాకమతరీతి । శక్తి శైవ మనుచుఁ జాలనమ్మి
సరణి మిగిలి చెడదె చండాల సేవచే । విశ్వ. 1506

ఆ. చాలు చాలు నిలను జననమరణములు । మేలుగాని మాయ మొలఁకు వెఱఁగి
ప్రాలుమాల కిలను భక్తి చేఁ బూనుము । విశ్వ. 1507

ఆ. చాలుఁ జాలులేర చార్వాకమతసంజ్ఞ । తిరిగి తిరిగి మేలు తెలియలేక
మలముమూత్రి మాని మంటిపాలైరోకో । విశ్వ. 1508

ఆ. చావుఁదెలియువాఁడు సన్యసించునదెట్లు । కడపలందుఁ గులముఁ జెడినయట్లు
పాపమొకటెమీఁద ఫలమేమిలేదురా । విశ్వ. 1509

ఆ. చావు నేఁడొ రేపొ జతపడివచ్చును । పెక్కునాళ్లు కూడఁ బెట్టనేల
ననుచు నాశలుడుగునంతటివారెరి । విశ్వ. 1510

ఆ. చావు వచ్చినపుడు సన్యసించు నదెల్లఁ । గడను మొదటికులముఁ జెడుటకాదె
పాప మెప్పు వేఱె ఫల ముండఁ బోదయా । విశ్వ. 1511

క. చా వెద్దియొ పుట్టువునదె । చా వన భయమంద నేల జన్మింపకము
న్జీవికి దేహములే దను । భావములో గుఱుతునిలిపి బ్రదుకుము వేమా. 1512

ఆ. చుక్కలిన్నియనుచు లెక్కవెట్టఁగవచ్చు । సూర్యమండలమును జూడవచ్చు
ఆత్మనాథుతోడ నాటలాడు టరుదు । విశ్వ. 1513

క. చుట్టుకొని యున్న మాయను । నెట్టుముగురు భక్తిమీఱి నియతాత్ముఁడవై
ముట్టుము తత్పరతను మన । మట్టిట్టును జెదరకుండ ననువుగ వేమా. 1514

ఆ. చుట్టుగోడఁ బెట్టి చెట్టుఁ జేమయుఁ గొట్టి । యిట్టుసట్టు పెద్దయిల్లుగట్టి
మిట్టి పడును మీఁద పట్టెల నెఱుఁగఁడో । విశ్వ. 1515

ఆ. చుట్టు పరిజనంబు సుఖలీల చెలువంబు । నడుమ నాయకతయు నర్తనంబు
బ్రహ్మపదముమీరు బ్రదుకుఁడు జనులార । విశ్వ. 1516

ఆ. చూచి యనఁగఁదగును సూచనకనరాదు । చూడరాని దెది చూడరాదు
చూడఁ దగినదైనఁ జూడంగవలయుం । విశ్వ. 1517

క. చూచెడు వఱకే సాధన । మాచిన మదియందుఁ దోఁచి సులభంబగు నా
తోఁచెడిమర్మము నీ వని । కాచుకొనియు గురునిఁగోరి కనవలె వేమా. 1518

ఆ. చూచువారికెల్లఁ జూడ వేఱైయుండుఁ । జూపుఁ జూచి తెలియఁ జూచువారు
చూచినట్టి చూపు చూపు తా మగుదురు । విశ్వ. 1519

ఆ చూపు కొంచెమైనఁ జుక్కలు కాన్పింపఁ । బ్రాపు వెలుగులేదు పరువుగాదు
జ్ఞానదీపమువలెఁ గన్నులకుసుదోఁచు । విశ్వ. 1520

తే చూపు చెదరని వృత్తిలోఁ జూడిక్కనంటి । యేపుమీఱిన మదియందు రూపుమాపి
తన్నుఁదాఁగాంచుచుండును తత్వవేత్త । నిర్వికారుండు నా భువి నెగడ వేమ .1521

క. చూపున ముద్రలుగనుఁగొను । చూపేగుఱి మననసంజ్ఞ చుల్కన యగు నా
చూపునఁ దోఁచెడియుక్తికిఁ । బ్రాపగు భవు నెంచి మదిని బనుపడు వేమా. 1522

తే. చూపురూపుల రెంటిని జూచిదాని । యన్నియును గాక తన్నుఁదాఁగన్నదాని
నిర్మలంబుగ మది నెంచు నిర్మలుండు । నిర్గుణబ్రహ్మమర చేత నిలుపు వేమ. 1523

తే. చూపురూపుల రెంటిని జూచుదాని। నిరుకుఁ దెలియంగ మదినుంచ నేర్పుఁగనుచుఁ
గాపురంబగు కైవల్య కర్జ మూను । నిర్మలజ్ఞాని పనిఁ బూని నిజము వేమ. 1524

క. చూపులఁ జూపైతోఁచెడి। రూపములకు రూపమదియె రూపము గాకే
చూపై లోపల వెలుపలఁ । గా పగు పరిపూర్ణ మూని కనవలె వేమా. 1525

తే. చూపులోఁ జూపువెలిచూపు చూడనేల । నాదియంత్రము లేనట్టి దచలమగును
వేదగురుమూర్తి మదినుంచు వేగముగను । సాధకంబెల్లనలవడు సరగ వేమ. 1526

ఆ. చూపులోనిచూపుఁ జూడంగఁ జూడంగఁ । దెలివిలోని తెలివి వెలుగుచుండు
నిద్రలోని నిద్ర నిజ మని తెలియరో । విశ్వ. 1527

ఆ చూపులోని చూపుఁ జూడఁగాఁ జూడఁగాఁ । జూపులోనె బ్రహ్మచూడఁబడును
పెరుఁగుఁ దరువఁగాని తరివెన్న రాదయా । విశ్వ. 1528

ఆ. చూపులోనిచూపుఁ జూడనేర్చినవాఁడు । చూపులోననుండి చూచువాఁడుఁ
జూడఁజూడఁ దన్నుఁ జూచు నిక్కంబురా । విశ్వ. 1529

ఆ. చూపులోని చూపు సుజ్ఞానదాయిని । మనసులోనిమనసు మాయతప్పులు
ఎఱుకలోనియెఱుక పరమయోగంబురా । విశ్వ. 1530

ఆ. చూపులోని చూపు సూక్ష్మమౌఁ దెలియంగఁ। జూపులోనిచూపు శుభ్రమగును
జూపులోని చూపు సురవరగమ్యమ్ము । విశ్వ. 1531

ఆ. చూపువెలయఁ జేసి సూక్ష్మపు వ్రత్తిచేఁ । జిత్తమనెడుదివ్వె చెన్ను పఱచి
పాపమనెడు తిమిర మేపాఱఁబాపని । పాపజాతిగురుఁడు పశువు వేమ. 1532

ఆ. చూరఁగొనుము దొరకు సుజ్ఞానమెల్లను । బారవేయు మెల్ల పాపగుణము
దారిఁ దెలియ బుధులదాపున మెలఁగురా । విశ్వ. 1533

ఆ. చాలువలనఁబుట్టు సుఖదుఃఖములు రెండు । పతికి సతికిఁబుట్టుఁ బరగ సుతుఁడు
సతికి సుతునివలన సౌఖ్యంబు కలుగును । విశ్వ. 1534

ఆ. చొక్కమైన పరముచుఱుక రివైచూడ్కి | ముక్కుతుదను గూర్చిముదముతోడ
దక్కఁ జూచినంత దగ్గఱైయుండురా | విశ్వ. 1535

## ఛ

ఆ. ఛత్రమున్నఁ దగిన ఛాయ యేర్పడియుండు | శాస్త్రమెఱుఁగఁ దగిన జ్ఞానమొదవు
నబ్బియున్నవాని కండయున్నట్టులే | విశ్వ. 1536

ఆ. ఛదము భంగిఁ గంద్రు సాధువు మూఢులు | తానువారినట్లె కాననగును
దీని కెంత దవ్వొ దానికి నది యంతె | విశ్వ. 1537

ఆ. ఛంద మెఱిఁగి మాట చక్కఁగాఁ జెప్పిన | నెవ్వఁడైన మాఱికేలఁ బలుకు
ఛంద మెఱుఁగ ముందు సందర్భ మరయును | విశ్వ. 1538

ఆ. ఛర్ది పుట్టినప్డు సాపడఁజెపదు | నాతిఁ గన్నయప్డు నీతితగదు
చేటుమూడినపుడు మాటలు దోఁపవు | విశ్వ. 1539

ఆ. ఛాగములను గోసి జన్నంబులను జేసి | పడయు దేవలోక ఫల మదేమొ
జంతుహింస పాప మింతనరాదురా | విశ్వ. 1540

ఆ. ఛాత్ర ధర్మమెఱిఁగి చక్కనిభక్తితో | గురుని సేవఁ జేయఁ గుదిరినపుడె
సర్వమర్మములను జక్కగా విడిపోవు | విశ్వ. 1541

ఆ. ఛాయ నొసఁగుఁ జెట్టు సాధువు బోధట్టు | లడఁగిదరిని జేరఁ బడయవచ్చు
నట్టునిట్టు దాట నది పోవదదిరాదు | విశ్వ. 1542

ఆ. ఛిద్ర మెన్నువాఁడు శిష్యుఁడు తానౌనె | ఛిద్ర మెఱుఁగువాఁడు శిష్యుఁడగును
ఛిద్రమెఱిఁగి విడువ భద్రంబు చేకూఱు | విశ్వ. 1543

ఆ. ఛురికతోడఁ గోయఁ జొప్పడు నేకాని | దానిపిడినిగోయఁ దరమెనీకుఁ
దెలివిలేక మేని బల మేమి పనిచేయు | విశ్వ. 1544

ఆ. ఛేద్య మైనదానిఁ జేపట్టినాఁడని | మూలవస్తువెట్టి కేలఁబట్టు
దాని నూనఁ గలుగు దార్ఢ్యంబు లేకున్న | విశ్వ. 1545

## జ

క. జగ మరయ నింద్రజాలము | జగ మనఁగా మాయసుమ్ము జన్మాదులకు
న్భగవంతుఁ డగును బ్రహ్మము | నిగమాగమ నిర్వికారనిపుణుఁడు వేమా. 1546

క. జగమున గురుఁ డుదయించిన | జగమునఁ గలజనులు శరణు శరణన రాకో
జగ మెఱిఁగి మ్రొక్కఁ జూచెడి | జగదీశ్వరువిశ్వవిభుని శరణను వేమా. 1547

ఆ. జగము నందు లేదు జలము లందును లేదు। నిగమవేద్యమైన నిజపదంబు
సగుణ నిర్గుణముల సాధించి చూడరో। విశ్వ. 1548

ఆ. జగమునను జనులకుఁ దగినట్టి దగు లింగ। ముండ రాతి లింగ మొండ నేల
రాతిలింగ మేమి రక్షించునో సృష్టి। చేయ నేర దయ్య క్షితిని వేమ. 1549

క. జగములు యుగములు భ్రమింగెడు। జగదాత్ముఁడు నిత్యుఁడగును జపతపములలో
నిగమాంతరార్థవేద్యం। బగణితముగ బ్రహ్మబయలు నందును వేమా. 1550

ఆ. జంగమాఖ్య భక్తిసంధి వేఱుగ లేదు। సగుణభావ మిదియు శాస్త్రవిధియు
నిర్గుణంబు వీడు నెర వేది యెఱుఁగఁడు। విశ్వ. 1551

ఆ. జంగమైన వెనుక జాతి నెంచ వలదు। జాతిలోననుండు నీతు లన్ని
జాతిమతము విడిచి చనియోగి గావలె। విశ్వ. 1552

ఆ. జఠరమందు జ్యోతి చాలదే దీప్యము। కానలేరు నరులు కలుషమతులు
కన్నువిచ్చిచూడఁగా దేవుఁ డున్నాఁడు। విశ్వ. 1553

ఆ. జడధి నీది దాటి సంభ్రమింపఁగవచ్చుఁ। గడవరాద బెఱుక గతుల నెంచి
తడయు చెల్లపోని తన్మయ మూనరా। విశ్వ. 1554

ఆ. జడలుగట్ట నేల సన్యాసికా నేల। నొడలు విఱుచుకొనెడి యోగ మేల
ముక్తికాంతఁబట్టి ముద్దాడ నేకదా। విశ్వ. 1555

ఆ. జంత్రమంత్రమహిమ జాతవేది యెఱుఁగు। మంత్రవాది యెఱుఁగుఁ దంత్రమహిమఁ
దంత్రిణీకమహిమఁ దెనువాఁ డెఱుంగురా। విశ్వ. 1556

ఆ. జతుకమంటురీతి జాబిల్లి వెలుగంది। ప్రతిఫలింప మణిని బరిణమించి
వెదుక పలెను మదిని వేదాంతమర్మంబు। విశ్వ. 1557

ఆ. జంతురాసులందు జనియించి జనియించి। దిమ్మపట్టినట్టు తిరిగి తిరిగి
తనువు నిత్యమనుచుఁ దలపంగ నవ్వరో। విశ్వ. 1558

ఆ. జననకాల మందు జందెపుఁ ద్రాళ్లేవి। తనకు లేవు తనజననికి లేవు
నడుమ జందె మేయనగుఁ బాటు గాదకో। విశ్వ. 1559

ఆ. జననమరణములకు జంగమనులు సుమ్మి। జనని జనకు లిలను జలధిరీతి
వినుతిఁజేసి గురుని వెన్నంటి చూడరా। విశ్వ. 1560

ఆ. జననమరణములకు సస్వతంత్రుండు గాడు । మొదటఁగర్త గాఁడుతుదను గాఁడు
నడుమఁ గర్త ననుట నగుఁబాటు గా దకో । విశ్వ. 1561

ఆ. జననమరణము లనస్వప్న సుషుప్తులు । జగములెల్ల నిండి జనములుండు
నరుఁడు జంగ మనుట నగుబాటు కా దొకో । విశ్వ. 1562

ఆ. జననమరణములన స్వప్నసుషుప్తులు । జగములందు నెండ జలము లుండు
నవనిలో జనంబు లరయంగలే రయా । విశ్వ. 1563

ఆ. జననమరణములను జంధ్యపుఁబ్రాఁడున్నె । జంధ్యమిడఁగ లేదు జనని కెపుడు
తల్లిశూద్రురాలు తా నెట్లు బాపఁడో । విశ్వ. 1564

ఆ. జననమరణవేళ స్వాతంత్ర్యమాలేదు ! తేగలేదు మున్ను పోగరాదు
నడుమఁగర్త ననుట నగుబాటు కాదొకో । విశ్వ 1565

తే. జననమరణసుషుప్తులు తనకు నెపుడు।జరుగు చుండఁగ నరుఁడు తా జంగమనుట
తెలియ నజ్ఞాన మగుఁగాక కలుగనగునె।బుద్ధిగలవార లనుకొంౘెపుడమి వేమ 1566

ఆ. జననమునకు మున్ను జననిగర్భములోన । మునుపు చేసినట్టి ముష్కరంబు
ననుభవించి వెడలి యాశను విడలేరె । విశ్వ. 1567

ఆ. జనన మెట్టు కలిగె జాతి యెయ్యది యయ్యె । జననమరణములకు జాడ లెఱుఁగ
వినఁగ వినఁగ దీని వివరించికానరో । విశ్వ. 1568

తే. జన్మమరణాద్యవస్థలజాడ మీఱి । మన్మయంబగు పరిపూర్తి మఱుఁగుఁజేరి
తన్మయాకృతి నొందుటే తత్పదంబు । నిర్వికారుని కిది కల్గు నుర్వి వేమ. 1569

క. జన్మము నెత్తిన మనుజుఁడు । మన్మయపరిపూర్ణమార్గ మహిమం బెఱుఁగం
దన్మయత నొంద నేర్చును । జిన్మయుఁబర మేశు మదిని జేర్చిన వేమా. 1570

ఆ. జన్మము లనిఁ కెన్నిజన్మంబు లెత్తునో । కర్మధర్మములకు గణన యెంతో
కర్మధర్మములను గడ తేఱలే రయా । విశ్వ. 1571

ఆ. జన్మవదలి వేఱు జన్మంబు లెత్తంగఁ । గర్మధర్మములకు గణనగలదె
కర్మధర్మములను గడ తేఱవచ్చునా । విశ్వ. 1572

తే. జన్మసాఫల్యమును గోరి జయము నొందఁ । దన్మయుండైన గురుఁజేరి తలఁపునిలిపి
మన్మయానంద పరిపూర్తి మఱుఁగుఁజేరు।చిన్మయాకృతి కాన్పించుఁజెలఁగి వేమ. 1573

ఆ. జన్మరక్షలయము సల్పఁగా భువి కెల్లఁ । గర్తల మని విశ్వకర్త లందు
పుట్టి పెరిగి గిట్టి పోదురే యేలనో । విశ్వ. 1574

ఆ. జనుఁడు తెలివినొందఁ జంచలింపదు మది । దైవమును దెలిసినఁ దగులు బుద్ధి
తివురు భానుఁ జూచి తిమిరంబు నిలుచునా । విశ్వ. 1575

క. జపతపమార్గములన్నియు । నుపవాసక్రియలఁగూడి యుండును జూడం
జపలత్వ! మడఁపఁజాలక । యుపమరి వైగుణము లడఁచి యుండర వేమా. 1576

ఆ. జపము బాహ్యపూజఁ జాలఁగాఁజేసియుఁ । గపటము విడలేక కష్టనరులు
ముక్తినొంద లేమి మునిఁగిరి తమమున । విశ్వ. 1577

క. జపములు సేసినఁ జిక్కదు । విపినములం దున్నఁగాని విడుచునె భ్రమ లా
జపమాలమంత్రసిద్ధికి । నెప మెన్నని మోక్షపదవి నిలుచుర వేమా. 1578

ఆ. జయము భయము దాటి చలపట్టి యుండును। దయను బాత్రుఁ డగును ధర్మపరుఁడు
నయముగాను గురుని నమ్మి నెమ్మదివేఁడు । విశ్వ. 1579

క. జలములు పుణ్యస్థలములు । గలవీ లోకములయందుఁ గడుదూరముగా
వెలసిన తీర్థస్నానం । బలమటగద మోక్ష మేది యలసట వేమా. 1580

క. జహాద జహల్లక్షణముల । బహువిధముల గుఱుతు లంది బాహాటముగా
గుహఁజేరి పొందుపడఁగను । దహనున కర్పించి యెఱుకఁదలఁగుర వేమా, 1581

క. జాగ్రత్స్వప్నసుషుప్తులు । దగ్రగతి న్నించువాఁడె ధన్యుఁడు భువిలో
నాగ్రహములవి దెవరికి । స్వాగ్రంబుగఁదెలియవలయు నఖిలము వేమా 1582

ఆ. జాగ్ర తనఁగ నేమి జన్మ మనఁగ నేమి । జన్మమునకు నరయ జాగ్ర తాయె
జన్మజాగ్రతలను సాధింపరా ముక్తి । విశ్వ. 1583

ఆ. జాతికులము లంచు జనులెల్ల బద్ధులై । భావపరము నందుఁ బ్రాలుమాలి
చచ్చిపుట్టు చుండ్రు జడమతులై భువి । విశ్వ. 1484

ఆ. జాతినీతివేఱు జన్మం బదొక్కటి । అరయఁదిండ్లువేఱె యాక లొకటి
దర్శనములువేఱు దైవమా నొక్కటి । విశ్వ. 1585

ఆ. జాతిభేద మెంచి జన్మము తెలియక । ముక్తిఁగానలేరు మూర్ఖజనులు
జాతు లెంచ నేల జన్మంబుఁ దెలియరో । విశ్వ. 1586

ఆ. జాతి మతము విడిచి చని యోగిగా మేలు । జాతితోనె యున్న నీతి వలదె
మతముఁబట్టి జాతి మానమంట కొఱంత । విశ్వ. 1587

ఆ. జాతిమతము విడిచి చను యోగికా మేలు । జాతితోడ నున్న నీతిలెస్స
మతము లన్ని పాపు మనుజుఁ డొక్కఁడు లేఁడు । విశ్వ. 1588

ఆ. జాతిలోన నెట్టి జాతిముఖ్యం బంచు । నెఱుఁగలేక తిరుగ నేమి కలదు
యెఱు కెఱిఁగినవాని కేజాతికా నేమి । విశ్వ. 1589

ఆ. జాతివార లెల్ల జాతివిద్యలు నేర్చి । జాణలైరి మీఱి జగతిలోన
బ్రాహ్మణులనువారు బ్రహ్మము నెఱుఁగక । విశ్వ. 1590

ఆ. జాతివేఱులేక జన్మక్రమంబున । నెమ్మదిని నభవుని నిల్పె నేని
నఖిలజనులలోన నతఁడు ఘనుం డయా । విశ్వ. 1591

ఆ. జాతిసూతకములు సత్యమైయుండఁగ । నంటినంత నెట్టు లంటు కలుగు
వితముఁగానలేరు వెలయంగ జీవులు । విశ్వ. 1592

ఆ. జాతు లందు నరసి జాతిముఖ్యత నెన్న । నెఱుకగల్గువారె యెచ్చుగారె
ఎఱుకలేనివార లేజాతియైనను । మాలకంటెఁ జెడుగు మహిని వేమ. 1593

ఆ. జాతులందు నెట్టిజాతి ముఖ్యమొ చూడు । మెఱుకలేక తిరుగ నేమిఫలము
ఎఱుకగలుగు మనుజుఁ డేజాతిగలవాఁడొ । విశ్వ. 1594

ఆ. జాతులందు మిగుల జాతియే దెక్కుకో । యెఱుకలేక తిరుగ నేమిఫలము
యెఱుకగలుగువాఁడె యెచ్చైన కులజుండు । విశ్వ. 1595

ఆ. జారపురుషునకును జాజిపూవులతోడఁ । బాన్పువేయునయ్య పారితలంజె
సొంతమగనిమీఁదఁ జింతనిప్పులు సల్లు । విశ్వ. 1596

ఆ. జారపురుషుమీఁద సద్భక్తి నిలుపుచుఁ । బతికి నిచ్చకముగఁ బరగు భంగిఁ
బరముకొఱకు యోగి పాటించు దేహంబు । విశ్వ. 1597

ఆ. జారుపైని బ్రేమ జలజాక్షి యుంచెడి । తీరుగాను మదిని దెలివిగలిగి
గురునిగోరి పొందుఁ గూడుట ముక్తిరా । విశ్వ. 1598

క. జిత్తులమారు లనందగు । తొత్తులతోఁ గూడ నేమి తుష్టికలుగురా
చిత్తమున బ్రహ్మ మరయుము । సత్తా నీ కప్పు డొప్పుఁ జాలఁగ వేమా. 1599

క. జిలిబిలిమాటలు పలికెడు । కులటల నమ్మంగరాదు కుహనయ దోఁగా
తెలివిగ నవమానించును । దొలిప్రియమును జూపఁబోదు తొలఁగర వేమా. 1600

ఆ. జిహ్వారసమునల్ల జీవంబు పోషించు । బ్రహ్మ మన్న రసముఁ బడయలేరు
రసముఁద్రాగినట్టి రాజులు సావరే । విశ్వ. 1601

ఆ. జిహ్వరుచులఁగోరు జీవించునంతకు । సతియుఁ బతియుఁగోరు సుతధనముల
హావ్యవహుఁడు చూడ నన్నిఁటిఁ గోరురా । విశ్వ. 1602

ఆ. జిహ్వాలంపటంబుజీవనంబైయుండు । జిహ్వాలంపటంబె జీవపోవ
జిహ్వచేత నరులు చిక్కి నొచ్చిరిగదా । విశ్వ. 1603

క. జిహ్వాసురుచులనె కోరును । జిహ్వకు మతియొక్కటఁగలుగు చింతేడనయా
జిహ్వకుఁ జింతలు దొలఁగవె । జిహ్వన్నే బ్రహ్మనన్నఁ జెల్లునె వేమా. 1604

ఆ. జీవకోటి మేన జీవాత్ముఁడున్నట్టి । చోటినిగనలేక సుఖమువిడిచి
స్థిరమటంచునమ్ము జీవాత్మతిరుగును । స్థిరముజీవముక్తిఁజెందు వేమ. 1605

ఆ. జీవగుణముగలుగు జీవుండు బ్రహ్మంబు । సాటివచ్చుటెట్లు సరవిఁదెలియ
నూరి కుక్క సింగమొక్కటియగునొక్కొ । విశ్వ. 1606

ఆ. జీవనముఁదెలిసినఁ జెలఁగి మదిచలించు । దైవముగపడినను దగులు బుద్ధి
దీప్త భానునిఁగని తిమిరంబు నిలుచునా । విశ్వ. 1607

క. జీవంబగు జీవేశుఁడు । జీవునికొకయిల్లు చూపఁజింతలదొంగై
కావరమున గర్వించుచు । భావములో శివునిమఱచి భ్రమఁగొను వేమా. 1608

ఆ. జీవభావమెఱుఁగఁ జెడదెన్నఁటికి మతి । దైవమును నెఱుంగఁ దనరు బుద్ధి
తేజముదయమందఁ దిమిరంబునిలువదు । విశ్వ. 1609

ఆ. జీవభేదమెఱిఁగి చెడిపోనివారలు । బ్రహ్మభావమొంది పఱచుచుంద్రు
నీరుముత్యమైన నీరుగా మాఱునే । విశ్వ. 1610

ఆ. జీవముండు చోటుస్థిరముగాఁ దెలియక । తిరుగునస్థిరమగు దేహమందుఁ
దిరుగనేల ననుచుఁ దెలియలేఁడ జ్ఞాని । విశ్వ. 1611

ఆ. జీవమునను నాత్మ స్థిరతనుగానక । తిరుగున స్థిరమును గుఱిగనమ్మి
స్థిరము నస్థిరమును దెలియు జీవికి ముక్తి । విశ్వ. 1612

క. జీవము శాశ్వతరూపము । భావమునను నిలిచి లోనె పరుఁడై యుండుం
గేవల నిర్గుణ మదె యగుఁ । గావరమును కడకుఁ ద్రోసి కనవలె వేమా. 1613

ఆ. జీవ మేడ నుండు భావ మెక్కడ నుండు । కాపురంబు లేదఁ గదిసి యుండుఁ
దనరుచున్న రెంటి స్థలమేలఁ దెలియరు । వి. 1614

ఆ. జీవలింగపూజ జితపడు వారికి । శిలల లింగములకుఁ జింతయేలఁ
జక్కెరఁ దినునోరు చవి గొనునే చేదు । వి. 1615

ఆ. జీవలింగపూజఁ జేసినవారికి । శిలలరూప మందుఁ జింతయేలఁ
జెలఁగి మధువుఁ గ్రోలఁ జేదు రుచించునా । వి. 1616

ఆ. జీవవశమురీతిఁ జిన్మాత్రతను మించి । భావమమత నమరు పట్టుఁబట్టి
కలియు హంస మదిని గర్మసన్న్యాసివై । వి. 1617

ఆ. జీవసంజ్ఞఁగలుగు జీవతత్వంబును । జీవపరుని గురునిఁ జెందఁజేసి
తనువు నిలుపువాఁడు తాను దాసైయుండు । వి. 1618

క. జీవాత్మఁ దెప్పు డుండెడి । తావునుదాఁ దెలియలేక తగనస్థిరము
న్భావమున నమ్మి తిరిగెడి । జీవికి ధరముక్తి గలుగఁ జెల్లునె వేమా. 1619

క. జీవాధారము నీరము । జీవాధారంబు గాలి చెలఁగుచు నుండుం
గావలసిన నవి యొక్కరి । యీవిని గోరకయ చిక్క నిలలో వేమా. 1620

క. జీవాధారుఁడు రుద్రుఁడు । సేవార్చన పరుఁ డటగుచు స్థిరమతి వెలగు
న్భావాతీత పరంబుగఁ । గావించును మనసు బయలు ఘనముగ వేమా. 1621

క. జీవికి జన్మమె బంధము । భావంబున నెఱుకమాటి బయలై నంతం
ద్రోవగు బ్రహ్మానందము । సేవయె హంసోహ మదియు స్థిరమగు వేమా. 1622

* ఆ. జీవిఁజంపు టెల్ల శివభక్తిఁ దప్పట । జీవు నరయ నిజము నీవెఱుఁగవె
జీవుఁడు శివుఁడగుట సిద్ధంబు సిద్ధంబు । వి. 1623

ఆ. జీవి జీవిఁజంప శివునిఁ జంపుటె యగు । జీవుఁ డరసి తెలియ శివుఁడె కాదె
భావ మందు వేఁగఁ బరికించి చూడరా । వి. 1624

ఆ. జీవి జీవిఁ జంపి జీవికిఁ బెట్టంగ । జీవి దాన బలిసి చెలఁగుచుండు
జీవహింసకులకుఁ జిక్కునా మోక్షంబు । వి. 1625

క. జీవిని దెలియక వేఱుగ । దేవుని భ్రమఁ దిరుగు నరుఁడు దేవుని నెఱుఁగం
జీవుండని వివరించిన । భావింపఁగ జీవి బట్ట బయలగు వేమా. 1626

క. జీవిని దెలిసిన దనుకను । దేవుని భ్రమ మొలఁగు నరుఁడు దేవుం డనఁగా
జీవుఁడె యని వివరించిన । భావింప న్ముక్తి బట్టబయలుర వేమా. 1627

ఆ. జీవిదొలఁగకుండ జీవనౌషధమిచ్చి । జీవి నిలుపవలయు జీవనముగ
జీవి తొలఁగు నేని జీవవస్తువు లేల । వి. 1628

ఆ. జీవియందు భ్రమలు చేరియుంటయె కద్దు । జీవి భ్రమల యందుఁ జిక్కు నెపుడు
జీవి జీవి యైనఁ జిన్మాత్రమగు బయల్ । వి. 1629

ఆ. జీవిలోననుండు స్థిరమును గానక । తిరుగునస్థిరమునె వరుసనమ్మి
స్థిరము నస్థిరమును దెలియ జీవికి ముక్తి । వి. 1630

ఆ. జీవిఁ జంపుటెల్ల శివభక్తిఁ దప్పటే । జీవు నరసి కనుఁడు శివుఁడె యగును
జీవుఁడు శివుఁడనుట సిద్ధంబు తెలియరా । వి. 1631

ఆ. జీవుఁ డనఁగ మీరు చిక్కులుపడ నేల । వాయు వాకసంబు వహ్నికూడి
దేహి యనఁగఁ బరగె దేహంబులం దొప్పి । వి. 1632

ఆ. జీవుఁ డిలను నిండి సృష్టిలో నుండంగ । శివుని వెదకఁబోవు జీవుఁ డరయ
జీవుఁడు శివుఁ డనెడి చిహ్నంబుఁ దెలియక । వి. 1633

ఆ. జీవుఁ డుండు నెప్పుడు శిరము కంఠములందు । ఫాలమందు నుండుఁ బరమమాత్మ
చిక్కఁ గనులయందు జీవాత్మ పరమాత్మ । వి. 1634

ఆ. జీవుఁడె యగసాలి క్షితిలోనఁ దెలియంగ । భావమైన తానె పరమ శివుఁడు
వాయు వనెడి యతఁడె వసుధ బ్రహ్మము గాదె । వి. 1635

ఆ. జీవులెల్ల ముందు జీవాత్మ పరమాత్మ । జత లెఱుంగఁ బాపజలధిఁ బడరు
నావఁ గడపువాఁడు నట్టేట మునుఁగునా । వి. 1636

ఆ. జెట్టి సాముఁ జేసి క్షితిలోనఁ బేరెత్తి । దుష్టబుద్ధి చేతఁ దొలఁగుఁ దెలివి
కష్ట మొకటె కాని కడతేఱు టేలేదు । వి. 1637

క. జెండా వేయఁగ వచ్చును । గొండలు పెకలింపవచ్చుఁ గుదిరిన మదిలో
నిండారఁగఁ బరిపూర్ణముఁ । జెండాడఁగ ముక్తి త్రోవ చెలఁగును వేమా. 1638

ఆ. జ్యోతియందె పుట్టె సొంపైన నాదము । బిందు వమరె నాదమందుఁ దెలియ
బిందు వందుఁ బుట్టెఁ బృథివి యాకాశముల్ । వి. 1639

—ం

## జ

ఆ. జక్కినెక్కి వీధిఁ జక్కఁగా వెలువడఁ । గుక్క తిన్న వెంటఁ గూయఁదొడఁగు
ఘనున కోర్వలేని కాపురుషులు నిట్టె । వి. 1640

ఆ. జంకులేని మదిని జగదీశు నుంచిన । మంకు బుద్ధిమాని మట్టు పడును
బంకమందుఁ బురువు పడి పొర్లు చుండదా । వి. 1641

ఆ. జడలు దాల్చుటెల్ల జగము నీ యనుటెల్ల । నొడలు విఱుచుటెల్ల యోగమెల్ల
ముక్తికాంత దయకు మూలమా ననికాదె ।వి. 1642

ఆ. జన్మములను మఱియు జన్మియల ననేక । ముల నొసర్చియున్న ఫలముగాన
రాకయుండు నీతి లేకున్నమాత్రాన । వి. 1643

ఆ. జల్లిమాట లనుచు జగమునఁ దిరిగెడు । కల్ల గురుఁడు గట్టునెల్లకర్మ
పల్లు పురుగునేరి పలవింపఁజేయదా । వి. 1644

క. జవదాటనేల గుఱిగా । భవహర మగు భక్తిఁ బూని పరిపక్వముగా
ధ్రువమైన బయలుఁ జేరఁగ । శివమన్మయ చిన్మయంబు చేకుఱు వేమా. 1645

ఆ. జవ్వనమ్మునందు జవరాండ్రతోఁ బొందుఁ । గోరకుండు నాతఁ డూర లేఁడు
కాన దానిఁ గోరకయె యున్న ఘనుఁడురా । వి. 1646

తే. జాగుసేయక గురుసేవజరిపి దాన । యోగ యోగాంగముల నేర్చి యోగు లగుచు
నాశలను మానుటనె కాదె యచలతపము।సిద్ధినొందును ముక్తికిఁ జేర్ప వేమ. 1647

తే. జాడగల గుఱిమేడలో జోడుగూడి । వేడి యష్టాక్షరములందు విధ మెఱింగి
కూడి యాడెడువాఁడెపో కోవిదుండు । సత్వసంసిద్ధిఁ బడయంగఁ జాలు వేమ.

ఆ. జాణఁడైనయట్టి చపలాయతాత్ముఁడు । తలఁపు లరసి చూడ వలసెఁగాక
కష్టజీవియైనఁ గాన్పించునా వ్యాప్తి । వి. 1649

ఆ. జాణల మనియనెడు చపలాత్ము లగువారు । తెలియలేరు తమ్ముఁ దెలియలేరు
కష్టమైన యడవిఁ గాట్పడియున్నారు । వి. 1650

ఆ. జాణ లైనయట్టి చపలాయతాక్షుల । తలపు లరసిచూచి భ్రమయనేల
బయలి రూపులెల్లఁ బరికింపఁగానేల । వి. 1651

తే. జారు చనుదోయిఁ బైకెత్తి చేరబిగియఁ । గంచుకముఁ గట్టు కామినీ కపట వేష
ధారిణుల వలఁబడి నీవు దగులుకొనకు । తలఁగు మది నరకముఁ జేర్చు దారివేమ.

ఆ. జాలలోననుండి స్త్రీల వీధులవంకఁ । జూడనీయరాదు సుమ్ము వినక
చేతురేనియట్లు చేటులు మూడురా । వి. 1653

ఆ. జాలి నొందరాదు జవదాటి కనరాదు । ఆడిమూలమైన యాత్మనెఱుఁగు
పోరి చేరి పొంది పూర్ణము నందరా । వి. 1654

ఆ. జోకనలముఁదిన్న మేఁకజాతుల కెల్లఁ । గాక యేలఁబోయెఁ గాయశుద్ధి
లోపులు మఱివేడ్కఁ బోకలు పోదురా । వి. 1655

## ఝ

ఆ. ఝకట మాడుచుండుఁ జాడీల కోరెప్డు । సాధుజనుల మీఱి బాధపెట్టు
యముఁడుతప్ప వెఱతు రందఱు వానికి । వి. 1656

ఆ. ఝకటమునకుఁబోదు జారిణి యెప్పుడు । మాయజేసి పురుషు మమతఁబెట్టుఁ
గాని మాటలాడు గయ్యాళి సతతము । వి. 1657

ఆ. ఝరము జేనెడుండు సాగఁగా నదియయి । క్రోశమాత్ర మింక గొప్పయు నగు
సారమొప్ప మొదలు సాధించుకోవలె । వి. 1658

ఆ. ఝరము వెలయ దాన సాగును బెదయేరు । భక్తినుండి తెలివి ప్రబలు నట్లె
మూల మేరుపడిన ముక్తికి మార్గమా । వి. 1659

ఆ. ఝషము నీరు వెడలఁ జచ్చుటే సిద్ధము । నీట నుండెనేని నిక్కపడును
అండలోలఁగఁ గలుగ నందఱిపని యట్లె । వి. 1660

ఆ. ఝషము వలను జిక్కి జలమందె యుండిన । బ్రదికియుండుఁ గాని ప్రతిభఁగనదు
తరుణి విడువకుండు గురువుల చందాన । వి. 1661

## జ్ఞ

ఆ. జ్ఞాత యైనవాని నేతగా భావించి । నీతు లెఱుఁగవలయు నియతిగలిగి
జ్ఞానులున్న లాభ మూను నే తెలియుమి । విశ్వ. 1662

ఆ. జ్ఞాననిష్ఠఁబూని మేనుమఱచువాఁడు । కామిగాఁడు మోక్షకామిగాఁడు
నీమనిష్ఠ లుడుప నిర్గుణ మందురా । విశ్వ. 1663

ఆ. జ్ఞానభావపరముఁ గనుఁగొన కున్నను । మానరాదు మనసు మమతఁదగిలి
పూనిజన్మములను బొందురా భువిలోన । విశ్వ. 1664

ఆ. జ్ఞానముద్రచేతఁ గనఁగవచ్చెడి తళు । కదియె మదిక్రేష్ఠ మనుచు మునులు
పలికి రద్దె తెలియఁ బరమార్థ మగునయా । విశ్వ. 1665

ఆ. జ్ఞానమెన్న గురువు జ్ఞానహైన్యముబుద్ధి । రెంటిసందు రిమ్మ ఱేచునపుడు
రిమ్మఁదెలిసెనేని రెండొక్కరూపెరా । విశ్వ. 1666

ఆ. జ్ఞానవంతుఁజూచి సరికర్మబుద్ధులు । వెఱ్ఱియంద్రు ప్రకృతి విడువలేక
వెఱ్ఱి కవనిఁ బ్రకృతి వెదకినఁ గల్గునా । విశ్వ. 1667

తే. జ్ఞానసుజ్ఞానగతు లొప్పు జాడలెఱుఁగ । నగును దైవజ్ఞు లగువార లరసిరేనిఁ
బాలునీరును భేదింపఁ బరగుహంస । లట్టిసామర్థ్య మొప్పు వా రవని వేమ. 1668

క. జ్ఞానికిఁ గర్మం బేఁటికి ! జ్ఞానికిఁ గర్మంబువలదు సత్పురుషులకున్
జ్ఞాన మెకర్మం బైనను । మానవులకుఁ గర్మముక్తి మహిలో వేమా 1669

ఆ. జ్ఞానియనెడువాఁడు ఘనతేజ మందును । బూని సుఖముఁజెంది పుట్టబోఁడు
తానెతానుగాను దనలోనె వెలుగును । విశ్వ. 1670

ఆ. జ్ఞానియైనవాని మానకపూజించు । మనుజుఁ డెప్డుఁ బరమునను ముదంబు
సుఖము నందుచుండు సూరులు వర్ణింప । విశ్వ. 1671

ఆ. జ్ఞానులమనియెంచి చపలాత్ము లగువారు । తెలివిలేమిఁ దమ్ముఁ దెలియలేక
కష్టగహన మందు గర్వించియున్నారె । విశ్వ. 1672

## ట

క. టక్కరులఁగూడి తిరుగుచు । నెక్కుడుకాలంబు జ్ఞాన మెఱుఁగఁగలే కే
నొక్కవెలయాలిపొందే । మిక్కిలిమోక్షమ్మటంచు మెలఁగితి వేమా. 1673

ఆ. టక్కరులనుగూడి యెక్కసక్కెము లాడ । నిక్కమైనఘనుని నిరుకుచెడును
ఉల్లితోఁటఁ బెరుగు మల్లెమొక్కకరణి । విశ్వ. 1674

ఆ. టంక మదుక కున్నఁ బొంకంబుగారాదు । స్వర్ణభూషణంబు జగమెఱుఁగు
భటుఁడువెంటలేక ప్రభుఁడుశోభింపఁడు । విశ్వ. 1675

ఆ. టంకుయోగి యెంత టాటోటుచేసిన । వివర మరసి నంత వెగటుపడును
పరమునందు నరకబాధయు సిద్ధంబె । విశ్వ. 1676

ఆ. టంకువానిఁదుదకు అంకులంజెయుఁ జేర్చ । దింక నేలఁ జెప్ప నితరఘనుల
మంకుపను లొనర్ప మర్యాదవాయురా । విశ్వ. 1677

క. టాటోటు నమ్మఁగూడని । మాటలె యెల్లపుడుఁ బలుకు మహిలో వానిం
గూటమునకుఁ దగడంచును । జాటించిన మేలుసుమ్మి జనులకు వేమా. 1678

ఆ. టిప్పణములుసేసి చప్పనిమాటలఁ । జెప్పుచుందు రన్ని స్మృతులు శ్రుతులు
విప్పిచెప్పరేల వేదాంతసారంబు । విశ్వ. 1679

ఆ. టీఁకవ్రాసిన ట్లనేకులు పెద్దలు । లోకమందుఁ జెప్పి రేకమతమె
కావు లట్టిజనులు కానరా మర్మంబు । విశ్వ. 1680

ఆ. టాకిచేసిచెప్పనే కొలందిరయొ చూడు । గుఱుతురూఢిచేసి కొనుచు నమ్ము
కర్మ మనుభవింపు కానివిచేయకు । విశ్వ. 1681

ఆ. టెక్క మెత్తిచెప్ప నొక్కఁడే దేవుఁడు । నిక్కముగను లోన నిలిచియుండుఁ
జక్కఁజూచు నతని సంతోషమున నుంచు । విశ్వ. 1682

## ఠ

ఆ. ఠక్కుమాట లాడి చిక్కులఁబెట్టిన । నిక్క మెఱుఁగు నతఁడు నిర్వహించుఁ
జక్కనైన జ్ఞానసారంబుఁ దెలియరా । విశ్వ. 1683

ఆ. ఠావుఁ దెలిసినతఁడు తా.వీలువెంబడి । నేవిధమున నైన నిరవుసేరు
భావ మెఱుఁగ కున్నఁ బర మందు టొట్లురా । విశ్వ. 1684

ఆ. ఠింగణాలు బలిసి నింగికి నెరినఁ । జెట్టుచివరపండు చేతఁబడునె
పుస్తకములు సదువఁ బొందునా మోక్షంబు । విశ్వ. 1685

ఆ. ఠీవిమిగులఁ గలుగఁ డెక్కెమ్ము లెత్తించి । యూరువేల పచ్చనుడిగినపుడు
మంచితోవ కొఱకె మహినియత్నింపరా । విశ్వ. 1686

ఆ. ఠీవిలే దటంచు డెందంబులో నెంచి । జ్ఞాని నెఱుఁగలేని మానవుండు
డాంబికునకు లొంగి డయ్యురా కడపట । విశ్వ. 1687

ఆ. ఠేవలేక యున్న డిల్లపోఁ డెన్నఁడు । నిక్కమైనజ్ఞాని నిలుకడఁగను
ఎంత లాపదలు నిఁకెన్నడు నెన్నఁడు । విశ్వ. 1688

## డ

ఆ. డగ్గఱకుము పాపడాంబికులను నీవు ! మోసపుత్తు రయ్య దోస మనక
క్రూరమృగములట్టి వారురా నమ్మకు । విశ్వ. 1689

క. డంబములు పలుకువాని ని । జంబుగదా నమ్మునట్టి జనుఁ డరయఁగ జ్ఞా
నంబిసు మంతయులేని మృ । గంబని యెంచుటకు నడ్డుకలదా వేమా. 1690

ఆ. డంబమేల నీజగంబున నెవరెట్లు । చూడ నేమినిన్ను నాడనేమి
అరయఁ బరమునకును హాని యాడంబము । విశ్వ. 1691

ఆ. డాగుపడినపండు బాగులే దందురు । అట్టిడాగు తమది యరయలేరు
తమ్ము నెంచువారు తమ డాగు కానరే । విశ్వ. 1692

ఆ. డాగుపడినవెనుక డాలుకొనఁగలేవు । అరసి చేయుమయ్య యన్నిపనులు
తెలియకున్న నడుగు తెలిసినవారిని । విశ్వ. 1693

ఆ. డిందుపడినవాని నెందును లెక్కింప । రిందు నందుఁగాన నెట్టు లయిన
మందమతివిగాక మహిమనుచుండరా । విశ్వ. 1694

ఆ. డింభకులను దిద్ది తేవగాఁ గైసేయఁ । బట్టరాని గర్వపటిమఁగంద్రు
అజ్ఞులకును దెలుపు నాత్మబోధయు నిట్లె । విశ్వ. 1695

ఆ. డీకొనంగఁదగదు డెంద మెఱుంగక । అడుగవచ్చి కొంత యనినవానిఁ
జెప్పు నంతవినియు మెప్పుగాఁ బలుకుమీ । విశ్వ. 1696

ఆ. డెందమందుఁ దలఁచు డెప్పరమెప్పుడు । నోర్వలేనిహీనుఁ డొరునికట్టె
తనకుమూఁడునుమ్మి తప్ప దెన్నఁటి కైన । విశ్వ. 1697

ఆ. డొక్కలెండిపోయి డొక్కుతానైయును । మమతమానలేఁడు మానవుండు
ఎల్లితానుజావ నెవ రుద్ధరింతురో । విశ్వ. 1698

## త

క. తక్రముతో నుద్భవమై । తక్రమ్మునఁ దేలు వెన్నతరబడి సంసా
ర క్రమమునఁ బుట్టియు ఘన । చక్రముఁ గుత్తింప నగును జతురత వేమా. 1699

ఆ. తగదుతగ దటంచుఁ దగువారుచెప్పిన । విననివాఁడు చెడును గానకునిజము
మనుజులు చెప్పు ధర్మములమీఱ నింతెరా । విశ్వ. 1700

ఆ. తగవుతీర్చువేళ ధర్మంబుఁదప్పిన । మానవుండు ముక్తిమానియుండు
ధర్మమేనె పలికిన దైవంబుతోడయా । విశ్వ. 1701

ఆ. తగినకులజుఁ డైనఁ దనయెత్తు ధనమైన । లెక్కఁగొనక చెప్పు నిక్కమొకఁటఁ
బరమసాధ్విచూడఁ బరుల నంటదుసుమీ । విశ్వ 1702

ఆ. తగినసతియుఁ బతియు ధర్మంబుగాఁ గూడఁ । గడు బలుండుపుట్టు ఘనతతోడఁ
బురుషుఁడు బలుఁడైనఁ బుత్రుఁడు ప్రబలును । విశ్వ. 1703

ఆ. తట్టునెక్కి తిరుగ నట్టె నేటయ్యెనా । యెపుడో క్రిందఁబడిన నేదో విఱుగు
చెల్లియుండియోర్పుఁ జెందిన భూపింత్రు । విశ్వ. 1704

ఆ. తండ్రికన్న సుగుణితనయుఁడై యెప్పెనా । పిన్నపెద్దఁదనము లెన్నరెవరు
వాసుదేవువిడిచి వసుదేవు నెంచిరా । విశ్వ. 1705

ఆ. తండ్రి ధనముగలిగి తనయులులేకున్న । పుత్రవాంఛచేతఁ బొరలు చుండుఁ
బుత్రులుగలిగినను భూమిమీఁదను బుణ్య । పురుషుఁడందు రనెడిబుద్ధి వేమ. 1706

ఆ. తండ్రిమాటలువిని తల్లినిదెగటార్చి । పరశురాముఁ డేమి ఫలముఁగనెర
నిలువ నీడలేక కులగిరిఁ జేరఁడా । విశ్వ. 1707

ఆ. తండ్రిసొమ్మదైన దాయాది సొమ్మైనఁ । బరులసొమ్ము లైనఁ బ్రాప్తధనము
దయను దీనులకును దాన మిచ్చినవాఁడె । బహుళపుణ్యజనుఁడు పరగ వేమ. 1708

ఆ. తంత్రమంత్రములను దారకమబ్బునా । యంత్రబలము గురుని మంత్రమూని
చింతఁజేయు నపుడె చిన్మయ మందురా । విశ్వ. 1709

ఆ. తంత్రివాదు లెన్న దఱచుగా నున్నారు । మంత్రవాదు లరయ మహినిలేరు
జంత్రగానిబొమ్మ చందంబె యాయెరా । విశ్వ. 1710

తే. తత్పదమునెన్నఁ బ్రత్యగాత్మమ్ముసుమ్మి । త్వంపదమ్మన బ్రహ్మరూపమ్మె కదర
అసిపదమ్మునలక్ష్యము నైక్యముఁగన । సోహ మేర్పడుఁదెలియంగఁజూడు వేమ. 1711

ఆ. తత్వము తిరమైన తావులవెదకుచుఁ । దానుదత్వ మగును దత్వయోగి
తలఁపులన్నియుడుగఁదా నెపో తత్వంబు । విశ్వ. 1712

తే. తత్వములలోనఁ బరమాత్మ తత్వమెఱిఁగి । నిత్య నిర్ముక్త పరిపూర్ణ నిలయమంది
సరిపరబ్రహ్మమయమందు సంచరించు । నతఁడెపో పరశివుఁడన నగును వేమ. 1713

ఆ. తత్వమెఱుఁగువాఁడు దైవంబునెఱుఁగును । సర్వసారములను జానఁజేయుఁ
గదళిమ్రింగువాఁడు గరళంబు మ్రింగునా । విశ్వ 1714

ఆ. తత్వవాదు లుండ్రు ధరనెందఱైనను । దత్వవేదిఁ జూడు ధరణిలేఁడు
కలిగెనేనివానిఁ గానంగరాదురా । విశ్వ. 1715

ఆ. తత్వహీను లుండ్రు తఱచుగా భువిలోనఁ । దత్వమెఱుఁగువారు తఱచులేరు
కలిగిరేనివారు కాన్పింపరారయా । విశ్వ. 1716

ఆ. తథ్యమైన పూర్ణతత్వము నీలోన । మిథ్యమడఁపఁగానె మిత్రమగును
సత్యనిత్యకర్మసాక్షి బ్రహ్మంబురా । విశ్వ. 1717

క. తనకర్మముతీఱంగా । మనమునసద్భక్తిగల్గు మహి నెట్లనఁగా
నినుఁ డుదయింపఁగఁ జీకటి । ఘనముగఁ జనునట్టె చనును గర్మము వేమా. 1718

క. తనకాంతియె బయలెల్లను । దనకాంతియె యడుగుమడుగు ధరపై నెన్నం
దనకాంతియె శుద్ధాంతము । తనకాంతియె తలఁపువలని తగులగు వేమా. 1719

ఆ. తనకుఁగలుగు పెక్కు తప్పు లటుండఁగాఁ । బరుల నేఱుచుండు నరుఁడు తెలియ
నోడ లెఱుంగఁ డనుచు నొత్తి చెప్పఁగవచ్చు । విశ్వ. 1720

ఆ. తనకుఁజేయు మేలు తాఁదెలియఁగ నేర్చు । నెలమితోడఁగుక్క యెఱుక భువిని
దనకుఁజేయు మేలు తాఁదెలియఁగలేని । మనుజుఁ డెంతఖలుఁడో మహిని వేమ. 1721

ఆ. తనకునొప్పిపుట్టి తనువెంతబడలిన । కూళవిటుఁడుఁ యువతిఁ గూడుసుమ్మి
పండ్లుపడినఁగుక్క పసరంబుఁ గఱవదా । విశ్వ. 1722

క. తనప్రాప్తి తనకు నుండఁగఁ । దనదుఃఖము తనకెకాక తగులునె యొరులం
దనచేయుమంచితనకే । యనుకూలించెడిని జేర దన్యుల వేమా. 1723

ఆ. తనకుఁబ్రాప్తి లేక దానముచిక్కమి । దైవనింద వెఱ్ఱితనముగాదె
కర్మజీవు లేలఁ గర్మంబుఁ దెలియరో । విశ్వ. 1724

ఆ. తనకుఁబ్రాప్తి లేదు దాత యిచ్చునె యంచు । నొరుల దూఱు టెల్ల నోగుబుద్ధి
కలిమి లేమి కతనఁ గష్టమె తోఁచురా । విశ్వ. 1725

ఆ. తనకుఁ బ్రాప్తిలేమి దాతలియ్యకయున్న । దోషబుద్ధిచేత దూఱు రెల్ల
ముక్కు వంకఁ జూచి ముకురంబు దూఱుట । విశ్వ 1726

ఆ. తనకుఁ బ్రొద్దువోని లక్షణం బదైనచో । వినకతీర దధికవిద్య లైనఁ
బొలఁతివినదె ప్రియుని కొఱకుఁ గాకధ్వని । విశ్వ. 1727

ఆ. తనకుభాగ్య మున్నఁ దక్కువలేకుండఁ । గలుగు భాగ్యమెల్లఁ గల్లయనుచు
నమ్మకముగఁ జూచు నరుఁడగు యోగిరా । విశ్వ. 1728

క. తనకుల గోత్రము లాకృతి । తనసంపద కలిమిబలిమి తనకేల నయా
తనవెంటరావు నిజ మిది । తనసత్యమె తోడవచ్చుఁ దనతో వేమా. 1729

ఆ. తనకు లేనినాఁడు దైవము దూఱును । తనకుఁ గలిగెనేని దైవమేలఁ
దనకు దైవమునకుఁ దగులాటమే శాంతి । విశ్వ 1730

క. తన కేనాఁడును భిక్షము । తన కేనాఁడును భగంబు తనరవలయుఁ నం
చును దనదశకై యెల్లెడ । మన సందునఁ జివుకుచుండు మనుజుఁడు వేమా. 1731

క. తనగుణము తనకు నుండఁగ । నెనయంగ నొరునిగుణము నెంచును మదిలోఁ
దనగుణము తానుదెలియక । వనరి యొరుని ననెడువాఁడు భ్రష్టుఁడు వేమా. 1732

క. తనతల్లిలోప మెఱిఁగిన। మనుజుఁడు చింతిల్లు నెప్పుడు మానస మందుం
దనయాలిలోప మెఱిఁగిన । ఘనుఁడైనను దానికిఁడుచుఁ గదరా వేమా. 1733

క. తన దారాపుత్రులయెడ । ననురాగముఁ జూపవచ్చు నన్యాయముగాఁ
దనగతులు చెఱిచికొని వా । రిని బెనుపఁగ నుద్ధరింత్రె ఱేపట వేమా. 1734

ఆ. తనది సగము తనువు తరుణియ భ్రమఁ జిక్కి । చిక్కిపోవునరుఁడు చింతచేతఁ
గడకుఁ దేఱలేఁడు కటకటా దైవంబు । విశ్వ. 1735

ఆ. తనదుకర్మ చేతఁ దాను లోకములోనఁ । దనదు తల్లిగర్భమునను బుట్టెఁ
దన్ను మఱచి యింకఁ దగనివి చేయునే । విశ్వ. 1736

ఆ. తనదుతల్లిలంజె తనయాలుమాదిగె । శ్రీపతికి గురువు వసిష్ఠుఁ డగయఁ
దపముగలుగ ద్విజుఁడు తర్కింపఁ గుల మెట్లు ।విశ్వ. 1737

ఆ. తనదుదాన మవనిఁ దనబిడ్డసమమగుఁ । దండ్రిదానమెల్లఁ దనకుఁదోడు
అన్యు లిచ్చుదాన మది తల్లివంటిది । విశ్వ. 1738

ఆ. తనదు దేహమందుఁ దనకున్న పరివార । మందఱినిభిగించి హర్ష మెసఁగ
నెల్లచావు లెఱిఁగి యిందందు యోజించి । నడప మేటి వర్తనమురవేమ. 1739

ఆ. తనదు దేహమందుఁ దత్వార్థ మెన్నుచు । మందబుద్ధి కాక మహితుఁ డయియు
లోనిగుట్టుఁదెలిసి లోకంబునందును । మెలఁగువాఁడుజ్ఞాని తెలియ వేమ. 1740

ఆ. తనదు నాత్మయందు దైవంబువెలయఁగఁ । దీర్థయాత్రల కిలఁ దిరుగునరుఁడు
గంధపుఁదునుకలను గాడ్దె మోసిన యట్లు । విశ్వ. 1741

ఆ. తనదునృపతితోడఁ దనయాయుధముతోడ । నగ్నితోడఁ బరుని యాలితోడ
హాస్య మాడు టెల్ల నగును ప్రాణాంతమ్ము । విశ్వ. 1742

ఆ. తనదు నీడ శిశువు తాఁ జూచుచున్నట్టి । తనదునీడఁ జూచి తన్నుమఱచి
పనులొనర్చు నెపుడు భ్రాంతుల నేమందు । విశ్వ. 1743

ఆ తనదుబాగుఁగోరి ధర్మంబుఁ జెప్పినఁ । దిట్టుచుండు నధముఁ డెట్టయెదుట
గడ్డివేయ పోట్లగొడ్డు కొమ్మాడించు । విశ్వ. 1744

ఆ. తనదు భ్రాతలెల్ల దానంబు సేయంగఁ । దనకు ఫల మటంచు మినుకరాదు
తనదు కాలిఁ గోయఁ దనతమ్ముఁ డేడ్చునా । విశ్వ. 1745

ఆ. తనదుభ్రాతృవరులు ధర నేలుచుండఁగాఁ । దనకు నుండు నందురి వెనుకవారు
తనదు కాలుగోయఁ దమ్ముఁడు నొచ్చునా । విశ్వ. 1746

ఆ. తనదుమనసు చేతఁ దగ్గించి జ్యోతిష । మెంతఁ జేసె నను న దెంచిచూడఁ
దనయదృష్టమెల్ల దైవంబ యెఱుఁగును । విశ్వ. 1747

ఆ. తనదు రూప మెల్లఁ దనలోనఁ జూచియుం । మసను దీపముగను మమతవిడిచి
యనుదినమును గాంచు నతఁడెపో బ్రహ్మంబు । విశ్వ. 1748

ఆ. తనదులోని జీవతత్వముఁ దెలియక । వే ఱటంచుఁ దలఁచి వెదకు టెల్ల
భానునరయ దివ్వెపట్టి వెదకురీతి । విశ్వ 1749

ఆ. తనదుసతి నధర్మమునఁ దానె చూనుపఁగా । సాటిపూరుషుండు పాటిఁదెలుప
నెఱుఁగలేనినరుఁడు నరమాత్రుఁడునుగాఁడు । విశ్వ. 1750

ఆ. తనదు సోత్తొరునికి దానంబుగా నిచ్చి । చూడ కనుభవింపఁ జోద్య మిలను
దొడరి యాలినమ్మి తొత్తునుగొన్నట్లు । విశ్వ. 1751

ఆ. తనదుసొమ్ముఁ జూడ దానమియ్యఁగవచ్చు । నవని దొడ్డుగా ద దెవరికైన
నదరు బెదరులేక యన్యుల సొమ్ముల । దాన మిచ్చు టేఁటితగవొ వేమ. 1752

క. తన నిజరూపముఁజూడం । గను దగుమార్గంబుఁ దెలియఁగావలె నన్న
న్ఘనగురునియండఁజేరక । యొనఁగూడునె సాముఁజేయ నుర్విని వేమా. 1753

క. తనమతమునె తా నెఱుఁగఁడె । మనమునఁ దలపోయ నెపనిమార్గం బగునో
యనయము నీజాలంబును । గని మెలఁగుట ముక్తి కిరవు గదరా వేమా. 1754

క. తనమదిఁ గపటముగలిగినఁ । దనవలెనే కపట ముండుఁ దగజీవులకుం
దనమది కపటము విడిచినఁ । దన కెవ్వఁడుఁగపటిలేఁడు ధరలో వేమా. 1755

క. తనయా లన్యుని గను నను । ననుమానము కలుగు ననుచు నంతకుముందే
పనిఁబూని చక్కఁపఱచిన । మనుజుండా వ్యధనుగనఁడు మదిలో వేమా. 1756

తే. తన్మయాకారవృత్తిలోఁ దగిలిమెలఁగఁ । జూపులోఁ జూపునంటుచు సొంపుగాను
భానుకోటిప్రకాశమౌబయలుఁజేరి । పరమపరిపూర్ణభావుఁడై పరగు వేమ. 1757

ఆ. తనయుఁ డెవ్వఁడేనిఁ దనతండ్రికంటెను । పేరుఁదెచ్చునట్టి పెద్దయైన
జనకుహీనపఱప సాహసించినఁ జేటు । మూఁడు నిహపరముల ముందు వేమ. 1758

ఆ. తనయుఁడోదవె ననుచుఁ దాఁ బొంగుచుండును । వాఁడు దుష్టుఁడైనగోడుఁగూర్చుఁ
దులువవాండ్రఁగూడి మెలఁగ నీరాదురా । విశ్వ. 1759

ఆ. తనయులఁబరిజనులఁ దనసతిందన్నును । దీర్పుచేసికొనుచుఁ దెలివిగలిగి
జగమునకును మేలు తగునంతగాఁజేయు । నతఁడె యిహపరముల నలరు వేమ. 1760

క. తనలోపల సకలంబును । దనరం దా నగుట నెఱిఁగి తారక మాత్మం
గనుఁగొనుచుఁ బరిణమించిన । మనజునకును ముక్తిగలదు మహిలో వేమా. 1761

క. తనలో సర్వం బుండఁగఁ । దనలోపల వెదకలేక ధర వెదకెడి యీ
తనువుల మోసెడునెద్దుల । మనములఁ దెల్పంగవశమె మహిలో వేమా. 1762

ఆ. తనవలెనె యపియును ధరఁ బుట్టినవికావె । పరగఁదన్నుఁబోలి బ్రతుకఁగాదె
జ్ఞాని జ్ఞానిఁ జంపఁ గారణ మేమిరా । విశ్వ. 1763

ఆ. తనవిపత్తుఁ దెలియఁ దప్పించుకొనఁ జూచు । నెట్టిమనుజుఁడైన నెట్టులైన
నరకబాధవినుచు నరయఁడే ధర్మంబు । విశ్వ. 1764

ఆ. తన విరక్తియనెడి దానిచేతనె చిక్కి । మిగిలి వెడలలేక మినుకుచున్న
నరుని కేడ ముక్తి ధరలోన లేదయా । విశ్వ. 1765

క. తన సంరక్షణకొఱకై । మనమునఁ గార్యంబుఁబూని మనుజులఁ జెఱుపం
దనదినముఁగడఁగుచుండెడి । మనుజాధముఁడే యసురుఁడు మహిలో వేమా. 1766

ఆ. తనివి తీఱ గురుని ధ్యానించి మదిలోనఁ । గనువు మఱచు గురుని దాకినపుడె
తనరుచుండు బ్రహ్మ తన్మయదృష్టిలో । విశ్వ. 1767

క. తనుదానై బయ లందుచు । ననుమానములేక తానె యచలుం డగుచు
న్వినయవిధేయత లొందిన । మనమే యానందరూప మౌనను వేమా. 1768

క. తనుఁ దాఁ దెలియుట తత్త్వము । తన కన్యులు బోధసేయ ధరలోఁగలరే
తనుఁ దాఁ దెలియకయుండినఁ । దన కెవరును దెలుపలేరు తథ్యము వేమా. 1769

ఆ. తనుభరించు నతనిఁ దనయాయుధమ్మును । అగ్ని నింకఁ బరునియాలి నెన్న
సరసమునకుఁ గొనఁగఁ జావె సిద్ధించురా । విశ్వ. 1770

ఆ. తను వ దెవరిసొమ్ము తన దని పోషింప । ధన మ దెవరిసొమ్ము దాఁచుకొనఁగఁ
బ్రాణ మెవరిసొమ్ము పాయకుండఁగ నిల్ప । విశ్వ. 1771

ఆ. తను వనఁబడు నింటఁ దగు శత్రుమిత్రులఁ । దెలియలేనివాని తెలి వ దేలఁ
దెలిసి చక్కఁబఱప దివ్యామృత మ్మదే । విశ్వ. 1772

క. తనువలచినఁ దా వలచును । దనువలవక యున్న నెవఁడుఁ దావలవఁ డీలం
దనదు పటాటోపంబులుఁ । దనమాయలుఁ బనికిరావు ధరలో వేమా. 1773

ఆ. తనువుతను వటంచుఁ దపియింత్రు జనులార । తనువు లస్థిరమని తలఁపరాదె
తనువు కానఁబడమిఁ దగులునా మోక్షంబు । విశ్వ. 1774

ఆ. తనువు తా ననుకొనుఁ దనకు వాసనఁబట్టి । జననమరణములను జక్కఁజిక్కి
పొలుపునం దెఱుఁగక పొర్లాడు చుండెడి । భ్రాంతి జీవి కేఁటి పరము వేమ. 1775

ఆ. తనువు నడవిఁ జేసి తనలోనె కూర్చుండి । తపముచేయలేని తపసు లెల్ల
నడవియందుఁ జేరి యలజడిపడెదరు । విశ్వ. 1776

ఆ. తనువునందు నగ్ని దరికొనికాలంగఁ । గాల్చుకొనుట యేమి కర్మమునకొ
కాల్చుకొన్నయంత ఘనుఁడు తా నాయెనా । విశ్వ. 1777

ఆ. తనువు నస్థిర మింక ధనము నస్థిరమని । తెలుప నేర్చు తాను దెలియ నేర్చు
పాత్రుఁ డైనయోగి పరమాత్ముఁడే సుమ్ము । విశ్వ. 1778

ఆ. తనువుపోవువేళ ధనమును బాంధవు । లెవ్వరంటరారు నిజము వెఱ్ఱులార
తనువు విడిచిపోవఁ దనకుఁ దోడౌ గుణి । విశ్వ. 1779

ఆ. తనువు లస్థిర మని ధనము లస్థిర మని । తెలుపఁగలఁడు తాను దెలియలేఁడు
చెప్పవచ్చుఁ బనులు సేయుట కష్టమౌ । విశ్వ. 1780

ఆ. తనువులోనవెదకి దైవంబు మొనఁజేసి । ముందుకర్మములను మూలఁద్రోసి
మనసు నిజముజేసి మమతలన్నియుఁ రోసి । మోక్షగామినిలుచు మొనసివేమ. 1781

ఆ. తనువులోని యాత్మ తత్త్వ మెఱుంగక । వేఱె కల దటంచు వెదక నేల
భానుఁ డుండ దివ్వెఁబట్టి వెదకురీతి । విశ్వ. 1782

ఆ. తనువు విడిచితాను దరలిపోయెడివేళఁ । దనదు భార్యసుతులుఁ దగినవార
లొక్క రైన నేగ రుసురు మాత్రమెకాని । తనదు మంచితోడు తనకువేమ. 1783

క. తనుసంరక్షణకొఱకై । మనమునఁ గార్యముల నెంచి మనుతత్త్వముచే
దినదినముఁ దిరిగితిరిగియుఁ । దనువునఁ గనుఁగొన్న నాత్మ తథ్యము వేమా. 1784

ఆ. తన్నుఁగన్నయట్టి తల్లి వంటిదిసుమ్ము । అన్యకాంత న్యాయ మరసిచూడఁ
గన్నదానిజనులు కానంగ లేరయా । విశ్వ. 1785

ఆ. తన్నుఁజూచి యొరులు దగ మెచ్చవలె నని । సొమ్ము లెలమిఁబెట్టు నెమ్మిమీఱ
నొరులకొఱకు దాన యుబ్బుచునుండును । దన్నుఁ దెలియలేఁడు ధరణివేమ 1786

ఆ. తన్నుఁదాఁదెలిసినఁ దానెపో బ్రహ్మంబు । తనువులోనియుక్తిఁ దలిగియుండుఁ
దన్నెఱుఁగనివాఁడు తా నెట్టిబ్రహ్మంబు । విశ్వ. 1787

ఆ. తన్నుఁ దాఁ దెలిసిన దైవంబుమఱిలేదు । తానె దైవమంచుఁ దత్త్వయోగి
తలఁచుచుండు నెపుడు ధరలోన నరయంగ । విశ్వ. 1788

ఆ. తన్నుఁదా నెఱుఁగడు తా నెవ్వరికి నేర్పుఁ । బ్రాలుమాలి తిరుగు పశువుకొడుకు
కాసులకొఱకైనఁ గర్మము లక్కట్టురా । విశ్వ. 1789

ఆ తన్నుఁదెలియ కున్నఁ దగవేదములువెఱ్ఱి । సర్వసంపదల ముసాబువెఱ్ఱి
ఆరుశాస్త్రములు నిఁకాపురాణములును । జబ్బులనుచు జగతిఁ జాటువేమ. 1790

ఆ. తన్నుఁదెలియు నట్టి దైవజ్ఞు లెన్నంగ । నిన్నుఁ దెలియలేని నిలువ రైరి
మాయఁదెలియ కున్న మంటిపాలైరయా। విశ్వ. 1791

ఆ. తన్ను వెదకిచూడఁ దానెయగు జీవుండు । తత్వ మరయ నగును దానెయాత్మ
మన్ను మిన్ను లేదు మాయయులే దయా । విశ్వ. 1792

ఆ. తన్నెఱుఁగని వాఁడు తానె తానైయుండుఁ । దన్నెఱుంగువాఁడు దానెతాను
దనువు లేనివాఁడుఁ దానె తానౌసుమ్మి । విశ్వ. 1793

ఆ. తన్నెఱుంగువాఁడు తానె తానైయుండుఁ । దన్నెఱుఁగనివాఁడుఁదానెతాను
దనదు లోనివాఁడుఁ దానెతా నవునయా । విశ్వ. 1794

ఆ. తపములేల యరయ ధాత్రిజనులకెల్ల । నొనరశివునిఁ జూడ నుపముగలదు
మనసు చెదరనీక మదిలోనఁజూడరా । విశ్వ. 1795

క. తప మేర్పడ నష్టాక్షరి । జపమునఁ బరితృప్తి నొంది జైత్రుం డైన
న్నెపములు తోఁపని నిర్గుణ । తపమే పరబయల టంచుఁ దలఁపుము వేమా. 1796

ఆ. తప్పునొప్పుఁదెలిసి దైవసంకీర్తన । ల్సేయుఁవారు వారికి సేవకాళి
నీ తెఱుఁగక తాము నిందింపరా దయా। విశ్వ. 1797

ఆ. తప్పుపలుకువలికి తాటోటుఁజేసినఁ । గూడియున్న లక్ష్మి కుంగిపోవు
నోటికుండఁ నీర మొనరంగ నిలుచునా । విశ్వ 1798

ఆ. తప్పులెన్నువారు తండోపతండము । లుర్వి జనులకెల్ల నుండుఁదప్పు
తప్పు లెన్నువారు తమతప్పు లెఱుఁగరు । విశ్వ. 1799

ఆ. తప్పువేసమూని ధరలోనఁ దిరిగెడు । నేతలెల్ల మిత్తిఁ జేరుటకునె
కడుపునిండ నింత కష్టంబు లేలరా । విశ్వ. 1800

ఆ. తప్పుసాక్ష్య మిచ్చి ధర్మంబుపడఁగొట్టి । పట్టి నిందఁబెట్టు వాజగొట్టు
అట్టివారికెల్ల ననుభవం బుండురా । విశ్వ. 1801

క. తమకించిన విషమించును । దమకించినఁ దల్లియైనఁ దగఁ దెగఁ జూచుం
దమకింపఁ గార్యహా నవుఁ । దమకించిన ప్రాణభయము తప్పదు వేమా. 1802

ఆ. తమకుఁ గలుగు పెక్కు తప్పు లటుండఁగా । నొరుల నేర మెంచు నో గెపుడును
జక్కలంబుఁ జూచి జంతి కేరిన యట్లు । విశ్వ. 1803

ఆ. తమకు బంధు వనుచుఁ దానె తోడుకవచ్చి । కలిమి బలిమి వయసు కలిమిఁ జూచి
దక్షిణను నొసంగి తరుణి నిచ్చిన మేలు । విశ్వ. 1804

ఆ. తమకు సాటి యండ్రు దైవజ్ఞులగు నరు । ల్వరగ గూఢ భావ మెఱుఁగలేక
ఇట్లు మాయఁబడిన నెట్లు తెలియును మాయ । విశ్వ. 1805

సీ. తమ తలంపులలోనఁ, దత్వశిఖామణిఁ । దలఁచిన వారెల్లఁ, దత్వవిదులు
ఘనమైన నిబిడాంధ, కారంబునను జ్యోతి । ననువునఁ జూచిన, నతఁడె యోగి
శివునిలో జీవుని, జీవునిలో శివు । నొనరఁ దెలియువాఁడు, యోగదృక్క-
సాంఖ్యయోగంబున, సర్వంబు శివుఁడని । నిశ్చయించినవాఁడు, నిర్మలుండు
ఇట్టి జాడఁగాన నెందఱైనను నేమి । పుట్టు కాలశివుని, బట్టఁగలరె
పొట్ట జీవుఁబాసి పోయి, తానుబ్బునా । విశ్వదాభిరామ, వినురవేమ. 1806

క. తమమునఁ జచ్చిన మనుజుఁడు । మమతను దాఁ బుట్టుచుండు మరణము తొలఁకే
శ్రమఁ దీఱ్చు గురుని వేడిన । భ్రమమూల మిదంజగత్తు బయలగు వేమా. 1807

ఆ. తమము మించిన ధ్యానంబు తత్పద మగు । విమలసుజ్ఞానమను ప్రజ్ఞ విడిదిఁగనుచు
నిర్ణయంబును గనుచుండు నేర్పు తోడ । విశ్వ. 1808

ఆ. తమ్ముఁ డెదురుపడియుఁ దలపడి తిట్టిన । నరక ఫలమె కాని నగవు గాదు
తమ్ముఁడు శివబంటు తనకన్న నల్పుఁడా । విశ్వ. 1809

ఆ. తఱచు కల్లలాడు ధరణీశు నిండ్లలో । వేళ వేళ లక్ష్మి వెడలిపోవు
నోటికుండలోన నుండునా నీరము । విశ్వ. 1810

ఆ. తఱచు చదువుఁ జదువఁ దర్క-వాదమె కాని । దివ్యమైన తెలివి తేటపడదు
పసిరికాయ పురుగు పగిదిని జెడిపోవు । విశ్వ. 1811

ఆ. తఱచు తమముఁ బాసి తరితోఁ దను మఱచి । పరమునందు మనసు పదిలపఱచి
కదియ నున్న యట్టి ఘనులెందఱున్నారొ । విశ్వ. 1812

ఆ. తఱచు తనువుఁ బాసి తరితోఁదను మఱచి । తాను నే ననఁదగు తలఁపు మఱచి
యుండు నాతఁడు గద యుత్తమయోగియా । విశ్వ. 1813

చ. తరుణిని బెండ్లియాడి తగు తమ్ములు నన్నలు బావ యంచన
న్వరుసలఁ జిక్కి- సొక్కి-మతి వాంఛల చేతనె తేనెయీఁగయై
సరవి మునింగి నాతనికి సత్పథ మబ్బునె నిన్నుఁ గానకే
ధరణిని లేదు ముక్తి యిఁక దాఁపక చెప్పము వెఱ్ఱి వేమనా. 1814

ఆ. తరుణి పుణ్యవతిగ వరుని బట్టియె యగు । పాపి యగును మగనిఁ బట్టియె యిల
భర్త వర్తనంబె పడఁతికి గ్రాహ్యంబు । విశ్వ. 1815

ఆ. తరుణి యంగమెల్లఁ బురుషుఁడెఱుంగును । బురుషునవయవములు పొలఁతియెఱుఁగు
చీరఁ గట్టుకున్న సిగ్గౌనొ యెగ్గౌనొ । విశ్వ. 1816

ఆ. తరుణియన్నఁ గన్నఁ దనయుని జూచిన । మరుని కళలు మించి మనసు పాఱుఁ
బాపజాతి మనసుఁ బట్టంగ రాకుంట । విశ్వ. 1817

ఆ. తరుణి సుతులు ధనము ధాన్యముల్ సంపద । లెంత చుట్టుకొనిన నంత చేటు
పసిరికాయపురుగు పద్ధతిఁ గానరో । విశ్వ. 1818

ఆ. తరుణి సొగసు కానిఁ దనయుని గన్నను । మరునికళల మించి మనసుపాఱుఁ
బాపజాతి మనసుఁ బట్టంగ రాదయా । విశ్వ. 1819

ఆ. తరువఁ దరువఁ బుట్టుఁ దరువునం దనలంబుఁ।దరువఁ దరువఁబుట్టు దధిఘృతంబుఁ
దలఁపఁ దలఁపఁ బుట్టుఁ దనువునఁ దత్వంబు । విశ్వ. 1820

క. తలఁగని మది దృఢతను గుతి । గలిగెడు ప్రత్యక్షపదవిఁ గైకొనినంత
న్విలయమగు పరము బయలని । తెలియుము చిన్నభము జేరి తిరముగ వేమా. 1821

క. తలఁచినఁ దత్వంబగునే । తలఁపక తానూరకున్నఁ దత్వం బగునే
తలఁచుట తలఁపమి రెండును । దలఁపక తానుండెనేనిఁ దత్వము వేమా. 1822

క. తలఁచిన నిరతను మదిఁగల। తలఁపే సిద్ధించు ధాత్రిఁ దత్వజ్ఞానకుం
దలఁపుం బటిమను కొలఁదని । దలఁపకయే ముక్తి గలుగుఁ దథ్యము వేమా. 1823

క. తలఁచినను శూన్యతత్వము। తలఁపక యుండినను శూన్య తత్వం బదియౌఁ
దలఁచినఁ దలఁపీడేరును । దలఁపక యుండినను దానె తత్వము వేమా. 1824

క. తలఁదాకినపుడు తలఁతురు । తలకిందై పడినయపుడుఁ దలఁతురు శివునిం
బలుగాకు లిలను సాజము । కలనాఁడెన్నరె యదేమి కర్మమొ వేమా. 1825

ఆ. తలను జేయివెట్టి తా నభయంబిచ్చి । దర్పణం బొసంగి తన్నుఁ జూపి
మంగళంబుసేయు మంగలి హీనుఁడా। విశ్వ. 1826

ఆ. తలను బాగ పైని దగు పచ్చడము బొజ్జ। చెవులపోగు లరసి చేరు నర్థి
శుద్ధపశువు లనుచు బుద్ధిలో నెఱుఁగక । విశ్వ. 1827

ఆ. తలను వ్రేలవేసి తాలి మించుకలేక । యోగి తెఱచుఁ గన్ను మూగయగుచు
జ్ఞాన మది యె టౌను గష్టపు దేహ మా । విశ్వ. 1828

ఆ. తలనెఱకలు నెరసి తనువెంత వదలినఁ । గూళవిటుఁడు యువతిఁ గూడుఁ జూడు
పండ్లు పడ్డకుక్క పసరముఁ జీకదా । విశ్వ. 1829

చ. తలఁపఁగ మూలమందుఁ బరతత్వముఁ దెల్పఁగ వాసిగాదు లో
బలిమి నిఁ కాత్మగుట్టు మది భావము నెంచఁగ బ్రహ్మకల్పమై

కలుగును ముక్తి జీవులకుఁ గావున నాత్మనిదానదృశ్య మీ
సలలితశక్తిరూప మని సన్నుతి వేమన చేసెఁ గల్పముల్. 1830

ఆ. తలఁప వశముగాదు తత్వంబు బ్రహ్మంబు । తెలియలేఁడు బ్రహ్మదేవుఁడైన
నిసుకబావి త్రవ్వ నెవ్వరి వశ మయా । విశ్వ. 1831

ఆ. తలఁపుచేతఁ గల్గుఁ దారకబ్రహ్మంబు । తలఁచిచూడఁ దానె తత్వమగును
దలఁపులోని తలఁపు తానె తన్నెఱిఁగిన । విశ్వ. 1832

ఆ. తలఁపుఁదలఁపఁ గూలి తగ నేయకీయఁడు । వలపు దీఱనీయఁ గలుగురూక
ముక్తినీని గురుఁడు ముచ్చుల కొడుకయా । విశ్వ. 1833

ఆ. తలఁపునందు శివుని దలపోయఁగాలేక । తలఁ పదెల్ల బయటి తలఁపుఁజేసి
తలఁపుతాన యైనఁ దత్వజ్ఞుఁ డగు సుమీ । విశ్వ. 1834

తే. తలఁపు మఱపులు లేవందుఁ దాకినపుడె। తాను బ్రహ్మంబులోఁజేరి తలఁగ కుండుఁ
దత్పదంబును మరిగిన తానె బ్రహ్మ । జ్ఞాన మిద్దెఱిఁగినఁ గల్గు ఘనత వేమ. 1835

ఆ. తలఁపులోని తలఁపుఁదలపోసి తెలియరా । తలఁపు లెల్ల విడిచి తగినభంగి
తలఁపులోని తలఁపె తత్వంబు నాత్మరా । విశ్వ. 1836

ఆ. తలఁపులోని మరులు తలఁ పెఱుంగఁగ లేమిఁ । దలలు బోడులైన ఫలములేదు
తలలు బోడులైనఁ దలఁపులు బోడులా । విశ్వ. 1837

ఆ. తలఁపులోనె కల్గుఁ దారకబ్రహ్మంబు । తలఁచిచూడఁ దానె తత్వమౌను
తలఁపులోని తలఁపు తానె తన్నెఱిఁగిన । విశ్వ. 1838

ఆ. తలఁపులోనె కలుగుఁ దా దైవ మేప్రొద్దు । తలఁచి చూడ నదియుఁ దత్వమౌను
ఊగకుండ నేర్చు నుత్తమయోగిరా । విశ్వ. 1839

క. తల యెదుగఁ బెట్టి దీక్ష । కలితుండై ముక్కుమూయ ఘనమా యిలలో
పల నిట్టు ముండచేసినఁ । దలఁచెదరె సువాసిని యని దానిని వేమా. 1840

తే. తలవరులకైన నొక్కప్పు ధర్మ మొప్పు। సామియానన నె యొనరించి తా మెఱుఁగమి
గురులహితబోధ మీఱెడి కూళలకును। నరకకూపంబె శరణమా నరయ వేమ. 1841

ఆ. తల్లి కెదురుకొనుట తండ్రికెదురుకొంట। యన్న కెదురుకొనుట యరయ మూఁడు
పాతకము లటంచు పర్వింపు మెఱుకతో । విశ్వ. 1842

ఆ. తల్లిఁగన్నతల్లి తనతల్లి పినతల్లి । తండ్రిఁగన్నతల్లి తాతతల్లి
యెల్లశూద్ర లైరి యేఁటి బ్రాహ్మణుఁడు తా । విశ్వ. 1843

ఆ. తల్లిగర్భమందుఁ దా జనియించియుఁ । దనదుభోగసతికిఁ దానె పుట్టఁ
దల్లి రిరువు రైయుఁ దనువొక్క టాయెరా । విశ్వ. 1844

ఆ. తల్లిగర్భమందుఁ దాఁ బుట్టినప్పుడు । మొదలబట్టలేదు తుదకులేదు
నడుమబట్టఁ గట్ట నగుఁబాటు గాదటో । విశ్వ. 1845

ఆ. తల్లిగర్భమందుఁ దాఁ బుట్టినప్పుడు । అఱుత లింగ మేది యరసి చూడ
నడుమ లింగ మూన నగుఁబాటు గాదటో । విశ్వ. 1846

ఆ. తల్లి గౌరియగును దండ్రియగు శంభుండు । ప్రమథగణము లఖిల బంధువితతి
తనకుఁ బుట్టినిల్లు తనరు కైలాసంబు । విశ్వ. 1847

ఆ. తల్లిచంటిపాలుఁ దనజంటపాలును । రుద్రవీర్యమునను భద్రపఱచి
దానిభూతిఁజేసి తామ్రింబుపైఁ జల్లు । విశ్వ. 1848

ఆ తల్లితండ్రిగలరు తగజన్మజన్మలఁ । దనకుఁ దెల్పువానిఁ గనఁగ లేరు
నాద మేపరమని నమ్మినవానికి । నిహమునందును బర మొసఁగు వేమ. 1849

ఆ. తల్లితండ్రిచావఁ దనయుఁడు తా నేడ్చు । మగఁడు చావ నాలు పగచు చుండుఁ
గార్యవశమెకాని కలుగదు మోహంబు । విశ్వ. 1850

ఆ. తల్లితండ్రిచావఁ దా నాలితోఁ గూడి । యిల్లుగట్టుకొన్న యింపులెల్లఁ
గొఱతమాలి దొంగ కూడడిగిన యట్టు । విశ్వ. 1851

ఆ. తల్లితండ్రి పూజ దారిఁ గనక కొంత । పాపకూప మందుఁ బడుటయేల
దానధర్మములకు దైవంబు తానాయె । విశ్వ. 1852

ఆ తల్లిదండ్రిమీఁద దయలేని పుత్రుండు । పుట్టనేమి వాఁడు గిట్టనేమి
పుట్టలోనఁ జెదలు పుట్టవా గిట్టవా । విశ్వ. 1853

ఆ. తల్లిదండ్రి యన్నదమ్ము లాత్మసఖులు । నెలమి బంధుభృత్యు లెల్ల జనులుఁ
గలిగి వర్ధిలంగ ఘనత మీఱెడి నూర । విశ్వ. 1854

ఆ. తల్లితండ్రి హితులుఁ దగినచుట్టములెల్ల । నేటి కోరి బాలు నెగుపుఁజూచి
పడుచు నిత్తు రంతె భాగ్యమియ్యఁగ లేరు । విశ్వ. 1855

ఆ. తల్లి తొలుత లంజె తనయాలు మాదిగ । తాను బ్రాహ్మణుఁడనఁ దగెను జగతి
తపముచేత ద్విజుఁడు తర్కింపఁ గులమేది । విశ్వ. 1856

ఆ. తల్లితో రమించెఁ దండ్రి యజ్ఞముజేసి । తనయుఁ డట్లె రంభఁ దనరఁ గూడెఁ
దల్లిని రమియింత్రు దబ్బర విప్రులు । విశ్వ. 1857

ఆ తల్లిఁదండ్రిఁబాసి తన యాలితోఁగూడి । యిల్లుపట్టియున్న యింప దెల్లఁ
గొత్తికాడి దొంగ కోరినచందంబు । విశ్వ. 1858

ఆ. తల్లిదండ్రు లందు దారిద్ర్యయుతు లందు । నమ్మిన నిరుపేదనరుల యందుఁ
బ్రభువులందుఁ జూడ భయభక్తు లమరిన । నిహముఁ బరముఁ గల్గు నెసఁగ వేమ. 1859

ఆ. తల్లిదండ్రు లనెడి తత్వంబు నెఱుఁగరు । యోనిలింగముల న టుద్భవించి
విష్ణు వరయఁ దల్లి వెలయు రుద్రుఁడె తండ్రి । విశ్వ. 1860

## మత్తకోకిల.

తల్లిదండ్రులు నన్నదమ్ములుఁ దాత బంధుగు లేలరా
మళ్లి జన్మములేని సద్గురు మర్మభావము నందరో
పుల్లయైనను రాదు వెంటను భూమిదాటి య టేగఁగాఁ
గల్లభ్రాంతిని వీడి వేమన కారణంబును గానరా. 1861

## సీసమాలిక.

తల్లిదండ్రులు సేరి, తగు రతిసల్పఁగాఁ । రాగంబు మించును, రమ్యముగను
దగ నైదునాళ్లలో, దధి చింతపండులు । చేర్చికలిపినట్లు, చెలఁగుచుండుఁ
బదివారముల గట్టి, పడియుండి యండమై । నిలచుఁ బదేనింట, నిండుగాను
నెలకును శిరముదా, నెగడ నేర్పడు రెండు । నెలలకుఁ బదకర, ములు వెడలును
మూఁడవనెలఁ గుక్షి, మొనయనాల్గింటను । నడుముఁ బార్శ్వంబు లే,ర్పడుఁదెలియఁగ
నైదవనెల కప,యువములు గల్గు న । టారఁట నేత్రంబు,లమరుఁగాని
యేడవనెల జీవ, మెచ్చుగాఁ బ్రభవించు । నెనిమిదింటను దెల్వి, యొనసినిల్చుఁ
దొమ్మిదవ నెలందుఁ, దొడరి ధ్యానముఁజేరు । దొలఁగక తన పూర్వఁ, దుఃఖమెల్లఁ
బదినెలలకుఁ బిండ, పరిపూర్ణమై ధరఁ । బుట్టునపుడు తాను, బుద్ధిమఱచి
పంచములఁబడి తనమూత్ర, మలములందుఁ । బొరలుచున్నట్టి యీమావి, పుట్టువులకు
గతులు గల్పించి వారిని,గరుణఁ జూచి । వెతలుదీర్చెడి వేదాంతి, వినరవేమ. 1862

ఆ. తల్లిదండ్రు లెన్నఁ దన మొదలి గురులుఁ । బార్వతీభవులును బరమగురులు
కూలివాండ్ర జగతి గురులన ద్రోహంబు । విశ్వ. 1863

ఆ. తల్లిదండ్రు లెంద ఱల్లజన్మము లెన్ని । తిరిగి యెఱుఁగ నట్టి దిక్కు లెన్ని
స్థిరము నస్థిరంబుఁ దెలియలేఁ డజ్ఞాని । విశ్వ. 1864

ఆ. తల్లిదండ్రు లెవరో తనకు జన్మము లెన్నొ । తిరిగి యెఱుఁగనట్టి దిక్కు లెన్నొ
స్థిరము నస్థిరమునుఁ దెలియఁడే యజ్ఞాని । విశ్వ. 1865

ఆ. తల్లిబిడ్డలకును దగవు పుట్టించెడి । ధనము సుఖముఁ గూర్చు నని గడింతు
కాని యెల్లయెడల ఘనదుఃఖకర మది । విశ్వ. 1866

ఆ. తల్లియాలు నయ్యెఁ దగఁ గోడలును నయ్యెఁ । గోడలిని గనంగఁ గూతు రాయె
మాయ విడువ ముక్తి మహిలోనఁ గల్గును । విశ్వ. 1867

ఆ. తల్లి యున్నయపుడె తనదు గారాబం బ । టామెపోవఁ దన్ను నరయు రెవరు
మంచికాల మపుడె మర్యాద నార్జింపు । విశ్వ. 1868

ఆ. తల్లి యేడ్వ వినక తనయాలు వగచిన । జాలి పడెడు వాఁడు జడుఁడు సుమ్మి
తారతమ్య మెఱుఁగ నేరని పశు వగు । విశ్వ. 1869

ఆ. తల్లి యొకతె భువిని దండ్రియు నొక్కఁడు । నెల్లలోకములను నెంచి చూడఁ
గల్లగాదు గౌరి కఱకంతులే సుమీ । విశ్వ. 1870

ఆ. తల్లి సంతలంజె తండ్రి కుండుఁడు గోళుఁ । డాలును సుతు లెల్ల నట్టివారె
చెలఁగు చుట్టములకు సిగ్గేల లేదొకో । విశ్వ. 1871

క. తల్లీ యనుచును మునుఁగుచు । నిల్లాలా యనుచు లేతు రింపుగ ధరలోఁ
గల్లరిమనుజుల గుణములు । చెల్లుంబోఁ జూడ నిదియె చిత్రము వేమా. 1872

ఆ. తళుకు బెళుకుఁజూచి ధరలోని జను లెల్ల । కద్దు లే ద టండ్రు ఘనత గాను
ఇదిగొ యదిగొ యనుచు నిఁక నెక్కడందురు । విశ్వ. 1873

ఆ. తవుటి కరయఁబోవఁ దండులంబుల గంప । శ్వాన మాశ్రయించు సామ్యముగను
వైశ్యవరుని సొమ్ము వసుధ నీచుల కబ్బు । విశ్వ. 1874

ఆ. తాఁటికల్లుఁ దెచ్చి తాళకంబును వండి । కూటికింతయేల గుఱుతు మీఱ
కాటిమహిని వండి కడతేఱ లేఁడయా । విశ్వ. 1875

ఆ. తాతఁ గన్నతల్లి తమ తండ్రిఁ గనుతల్లి । తన్నుగన్నతల్లి తల్లితల్లి
తల్లి శూద్రురాలు తా నెట్లు బాపఁడో । విశ్వ. 1876

ఆ తాత చేసి నట్టి ధర హింస కెల్ల ని । ష్ఠాప్తి యుండినట్టి యుత్తముండు
సకలజనుల యందు సత్యవంతుం డయ్యె । విశ్వ. 1877

ఉ. తాత జనించెఁ గన్యకకుఁ దండ్రిలుఁ దామును గుండగోళకు
ల్మాత పరానుకూలినియె మక్కువ ద్రౌపది భర్త లేవురే
నీతులు సెప్పఁ బాండవుల నీమము లిట్టి వటంచు నెన్నుచు
న్ఖ్యాతలమందు నెంతయును బూమెలఁ జేసిరి వెట్టివేమనా. 1878

ఆ. తాత తల్లి తండ్రి తర్లిపోవఁగఁ జూచి । జాతి కులము లనెడి చపల తేలఁ
దాను దానయైనఁ దలఁపంటి యుండరా । విశ్వ. 1879

క. తా నగుట యెఱిఁగి సర్వముఁ । దా నగుటయుఁ దెలిసి యేకతత్వము తాఁ గాఁ
దా నెఱిఁగి పరిణమించిన । మానవునకు ముక్తిగలుగు మహిలో వేమా. 1880

తే. తాన తానైన బయలునఁ దనరి బుద్ధి । పూనికను నిల్చునప్పుడే పూర్ణమందు
నిర్గుణయో నాస్తి సర్వత్ర నిండునదియె । దాని గాంచిన బ్రహ్మణ్యుఁ డౌను వేమ. 1881

క. తాననఁగ నెవ్వఁ డయ్యెనో । యేనన నెవ్వండు గలఁడో యెఱుకగు దానిం
దానని మనమున నెఱుఁగక । పూనెదు జీవుండు జడుఁడు బొంకరి వేమా. 1882

ఆ. తాననంగ నెవఁడో తనవారలన నేరో । తెలిసి తెలియ లేరె తిక్కనరులు
అరిది పిసినికాయ పురుగు పద్ధతి గాఁగ । విశ్వ. 1883

క. తాననెడి యహంకారము । మానక తనుఁదానె చెఱుచు మైమఱపించు
న్నేనని పలికెడి వారికి । మానునె దుష్కర్మఫలము మహిలో వేమా. 1884

క. తానవుటఁ దెలిసి మదినొక । తానును లేకుండు టెల్లఁ దనుదానె యనం
దా నెఱిఁగి పరిణమించిన । మానవులకు ముక్తి గలదు మహిలో వేమా. 1885

ఆ. తాను గుడువలేక తగ వేది యాప్తులఁ । జేరనీయఁడట్టి చెనటి పశువు
చేనిలోన బొమ్మఁ జేసి కట్టినయట్లు । విశ్వ. 1886

ఆ. తాను జన్మమెత్తి దానధర్మము లీయఁ । గర్మగతిని యముఁడు కష్ట పఱచుఁ
గర్మధర్మములను గడఁ ద్రోయ బ్రహ్మంబు । విశ్వ. 1887

ఆ. తానుదానె యనెడి తత్వంబులోఁ గల । యన్వయంబుఁ దెలియ డబ్బతోడు
తాను దానెయైనఁ దల్లడం బేలరా ।విశ్వ. 1888

ఆ. తాను దనువటంచు ద్వయమని పలికిన । మోహవార్ధిలోన మునుఁగు నరుఁడు
గాన లేఁడు మోక్షగతి యెట్లుసిద్ధించు । విశ్వ. 1889

ఆ. తాను దినక తగిన ధర్మముఁజేయక ।కొడుకులకని ధనముఁ గూడఁ బెట్టి
తెలియఁజెప్పలేక దీటిపోయిన వెన్క । సొమ్ము పరులఁజేరుఁ జూడువేమ. 1890

ఆ. తాను దిరుగు భూమి క్షామడాంబరమైనఁ । బరగు దేశమునకు జరుగ వలయుఁ
గొల నెండిపోవఁ గొక్కెర లుండునా । విశ్వ. 1891

ఆ. తాను నింద్రియములఁ దనర జయించినఁ । దత్వమరసి చూడఁ దానయగును.
రాజయోగి యిట్లు తేజరిల్లుచునుండు । విశ్వ. 1892

ఆ. తానునిర్మలుఁడుగఁ దనరు గుణములన్ని । చెయ్యలేనిగురుడు చెడుగురుండు
గుడ్డితట్టు నెక్కఁ గునుకు నటౌనురా । విశ్వ. 1893

క. తానును జనులేమనికొనఁ । బూనుదురో దాని నరసి పొందిక చెడనీ
రానిపథంబున నడచిన । దానని ధర్మాత్ముఁ డండ్రు తన్నిల వేమా. 1894

క. తానును నేనని వేఱుగ । మానసమునఁ దలఁచునట్టి మానవుఁడెటులుం
గానఁగ నేరఁడు తత్వము । మానులతోఁ డిరిగియైన మహిలొ వేమా. 1895

క. తానును నేర్పరియైనను । దానకములఁ దన్నుఁ దానె తప్పించుకొనుం
దా నెన్నివిధములనుమఱి । తా నే పరమాత్మయనుచుఁ దలఁపర వేమా. 1896

క. తానును సమస్తభువనము । లోనను వెలయంగఁదెలిసి లోన వెలుపలం
బానై వెలుగఁగ నేర్చిన । మానవునకు ముక్తిగలుగు మహిలో వేమా. 1897

ఆ. తాను నే ననియెడు తత్వభేదంబును । మాని యల వివేకమహిమఁ దనరి
యూరకున్న వాఁడె యుత్తమోత్తముఁడురా । విశ్వ. 1898

ఆ. తానుపుట్టుచోటిఁ దాఁ జూచి పలికినఁ । దాను దిరుగుబుద్ధి ధరణిలోనఁ
దానుబుట్టుచోటు తత్వంబు తలపోయ । విశ్వ. 1899

ఆ. తానుమెలఁగుచోటఁ దనరంగనుండెడు । జంగమయ్యను గని సరగఁగఱచు
కుక్కబుద్ధియాయె గుణమేల మానురా । విశ్వ. 1900

ఆ. తానువిమలుఁడైన తనగుణమంతయు । శివునికీని గురువు చెడుగుగురువు
గ్రుడ్డిగుడ్డి మెక్కి గుడిఁ జొట్టినట్లౌను । విశ్వ. 1901

ఆ. తానువెలయుభూమిఁ దనరంగఁ దిరిగెడు । జనులఁగాంచి పొంచి సరగఁగఱచు
కుక్కబుద్ధియంట గుణమేల మానురా । విశ్వ. 1902

ఆ. తానుసకలమాటఁ దనలోని సకలంబు । తనదులోనివెలుఁగుఁ దానె యెఱిఁగి
యున్నమానవునకు నొనరంగముక్తిరా । విశ్వ. 1903

తే. తాను సంకల్పరూపుఁడై తమక మొందుఁ । దాను సంకల్పరహితుఁడైతగులుముక్తి
ముక్తియనఁ జిత్తశూన్యంబు మోక్షమదియ। దీని నిక్కంబుఁ గనువాఁడె మౌనివేమ.

ఆ. తానెతత్త్వమనుచుఁ దలపోయఁగాలేక । మాయఁదత్త్వమనుచు మరుగుచుండుఁ
గర్మఫలములేక కలుగునా తత్త్వంబు । విశ్వ. 1905

ఆ. తానెతత్త్వమయ్యుఁ దన్నెఱుంగఁగలేక । మాయఁ దత్త్వమనుచు మరుగుచుండు
ధర్మకర్మములను దారోయఁ దత్త్వమా । విశ్వ. 1906

ఆ. తానె తాననియెడి తత్త్వంబులందును । నన్యమెఱుఁగకుండ నబ్బుతోడు
తానెతానయైనఁ దల్లడం బేలరా । విశ్వ. 1907

క. తానే నేర్పరియైనను । మానినిఁదగు మెలఁకు వెఱిఁగి మహి నేలుఁ జుమీ
దానిని స్వేచ్ఛగ విడిచెడు । హీనుఁడు తానైనఁ దుదకు నేడ్చుర వేమా. 1908

క తానైన శుద్ధుఁడౌనట । మేనెన్నఁగ విమలమంట మేనో తానో
పూనుకొని చేయుతీర్థ । స్నానంబిఁక నెవరికన్న నగరా వేమా. 1909

క. తానొకటిఁ దెలియునన్నది । తానుమెయిన్నేక యెల్లతాపులుఁ దానై
తానెఱిఁగి పరిణమించిన । మానవునకు ముక్తి కలదు మహిలో వేమా. 1910

క. తామరపాకుననీళ్లుగ । వేమఱుఁ జరియించుబుద్ధి వెదకరు శివుని
న్నీమహి నమ్మఁగరాదని । దీమసమునఁ దెలియలేరు దేవునివేమా. 1911

క. తామరపైఁ దగునీరన । వేమరు జరియించుచుండు వెదకుచు శివుఁదా
మీమాయ నమ్మఁగారా । దీమసమునఁ దెలియ నేర రీశుని వేమా. 1912

ఆ. తామసంపుఁబనులు తగవెందులకునైనఁ । దామసంబు నుడుగఁ దగు సుజనుఁడు
తామసంబునెంచు ధరలోన నధముండు । విశ్వ. 1913

తే. తామసంబంటుబుద్ధిని దగులఁబెట్టి । నియమనిష్ఠలు మదియందు నిగుడఁజేసి
కామవర్గము జయమందఁ గనును ముక్తి । యామహాత్ముని సేవింపనగుర వేమ. 1914

ఆ. తామసించిచేయఁ దగ దెట్టికార్యంబు । వేగిరింప నదియు విషమమగును
పచ్చికాయఁదెచ్చి పడవేయ ఫలమౌనె । విశ్వ. 1915

ఆ. తాముకన్నవారుఁ దముఁగన్నవారును । జచ్చుటెల్లఁ దమకు సాక్ష్యమొకద
బ్రదుకుటెల్లఁ దెలియ బ్రహ్మకల్పంబులా । విశ్వ. 1916

ఆ. తాముగడనసేయు ధనమెల్లఁ దమదని । నమ్మియుందు రెట్టినరులు భువిని
తా మొరులకొసంగఁ దమ కదియేకల్లు । విశ్వ. 1917

ఆ. తాముఁదినక యటులె ధర్మముఁజేయక । కొడుకులకని ధనముఁ గూడఁబెట్టి
తెలియఁజెప్పలేక తీఱిపోయినవెన్క । సొమ్ము పరులఁజేరుఁ జూడు వేమ. 1918

ఆ. తామునిలుచుచోటఁ దైవములేఁడని । పామరజనులు తిరుపతుల కరుగ
జోగువేడి చేతిసొమ్మెల్లఁబోఁజేసి । చెడియుగృహములఁ జొరఁబడరె వేమ. 1919

ఆ. తాము బలిమిఁబెట్టఁ దమకుబల్మినిగల్గు । నడుగనిడినఁ దాము నడుగఁగలుగు
నిందు నీనివాని కెందునుగల్గదు । విశ్వ. 1920

ఆ. తామువెలయు నూర తాపంబువాటిల్ల । నట్టియూరువిడిచి యవలఁబోరె
కొలఁకులెండినంతఁ గొక్కెరలుండునా । విశ్వ. 1921

ఆ. తారకంబుఁజూచు దారివేఱుగఁగద్దు । సమముగానుజూడఁ జక్కఁబడును
వెఱ్ఱిగానుజూడ వెలుగెల్లఁబాయురా । విశ్వ. 1922

క. తారకము మోక్షపదవికి । నారదజపమంత్ర రామనామం బనుచుం
గూరిమిఁ దలఁపఁగ నేరరె । ధారుణిఁ బామరులు దాని ధన్యత వేమా. 1923

ఆ. తాఱుమాఱుగాక తత్వదర్శనమాని । మేరుశిఖరమెక్కి మెలఁగువాఁడు
గేరియెఱుకలోనె గీఁటడఁగించురా । విశ్వ. 1924

ఆ. తాళకంబుఁదెచ్చి తాఁటికమ్మరసాన । వండునిపుణతెఱఁగ వెండియగును
గల్లగాదునిజము కఱకంఠనీయాన । విశ్వ. 1925

క. తావరముల భక్షించును । భావింపఁగ జంగమములు బహువిధరుచులం
గావరమున నంతుండక । తీవరముగఁ దమ్ముఁదామె తిందురె వేమా. 1926

ఆ. తావసించుచోటఁ దగనల్లడాయెనా । సౌఖ్యమున్నదరికి జరుగవలయుఁ
గొలఁకు లింకనేనిఁ గొంగలందుండునా । విశ్వ. 1927

ఆ. తావుఁదప్పకుండఁ దనమనంబున నిల్పి । తావుఁజేరునట్లు తంత్రపఱచి
తానుదావుఁజేరి తావుఁదానేకమై । తానుదానెకాఁగఁ దనరు వేమ. 1928

ఆ. తావులేనిచోటఁ దావుతానైయుండుఁ । దావుగలుగుచోటఁ దానులేఁడు
తావుతానైయెనఁ దత్వంబుఁదెలియరా । విశ్వ. 1929

ఆ. తిట్టికొట్టిరేని తిరిగిమాఱాడక । యూరకున్నఁజూడ నుర్విమీఁద
వాఁడగుఁ బరమాత్మ వర్ణింపశక్యమా । విశ్వ. 1930

ఆ. తిట్టికొట్టిరేని తిరిగిమాఱాడక । యట్టునిట్టుచూచి యదరిపడక
తన్నుఁగానియట్లు తత్తరపడకున్న । నట్టివాఁడె బ్రహ్మ మౌర వేమ. 1931

ఆ. తిట్టెనేని మొట్టు మొట్టినం గొట్టును । గొట్టెనేని యముఁడు కొద్దిపఱచుఁ
గోపమెంచఁజేర్చుఁ బాపపునరహత్య । విశ్వ. 1932

ఆ. తిత్తిలోనిశివుని స్థిరముగాఁదెలియక । తిక్కపట్టినరుఁడు తిరుగుచుండుఁ
దిక్కుఁదెల్ప గురుఁ డి టొక్కఁడులేఁడురా । విశ్వ. 1933

క. తిన్నగఁద్రిపుటిని గుఱిఁగని । యున్నను నాదంబు వినఁగ నూహింపుములో
మిన్నకని నిన్నుమఱతువు । వెన్నెలలో బయలుసేరు వెరవున వేమా. 1934

ఆ. తిరిగ తిరిగి తిరిగి త్రిమ్మరిగానేలఁ । దీర్ఘయాత్రలనుచుఁ దెలివిమాలి
తెలివిలోనిగురునిఁ దెరపిగాఁజూడరా । విశ్వ. 1935

ఆ. తిరిగితిరిగినరుఁడు ద్రిమ్మరికాఁగానె । యందువల్లనేమి యధికమొప్పు
నంతరంగ మెఱిఁగినప్పుడే శివుఁడౌను । విశ్వ. 1936

ఆ. తిరిగితిరిగినరుఁడు మరులుకొనుటెకాక । యందువలననేమి యాసలేదు
అంతరాత్మ నిల్ప నతఁడెపో బ్రహ్మంబు । విశ్వ. 1937

ఆ. తిరిగితిరిగి యింకఁ దిరుగంగఁ దిరుగంగఁ । దిరిగితిరిగికొంత తిరిగితిరిగి
తిరుగనట్టి త్రోవఁ దిరుగలేఁడాయెరా । విశ్వ. 1938

ఆ. తిరిగివచ్చువేళ మరలిపోయెడివేళ । వెంటఁదేరు ధనము నంటఁబోరు
తా నెటకునుజనునో ధనమెందుఁబోవునో । విశ్వ. 1939

ఆ. తిరిపగాఁడయినను దిరిపమెత్తినయట్టి । తిరిపమందెతాను దిరిపమిడిన
తిరిపముతిరిపమున దిగఁ బడి పోవురా । విశ్వ. 1940

ఆ. తిఱ్ఱివానిమిగుల దీవింపఁగారాదు । వెఱ్ఱివానిమాట వినఁగరాదు
వెఱ్ఱికుక్కఁబట్టి వేటాడవచ్చునా । విశ్వ. 1941

ఆ, తిరుగవలయుమనసు తిరిగినవఱకును । దిరుగునట్టిమనసు విఱుగవలయుఁ
దిరిగివిఱిగెనేని దేవుఁడుతానయా । విశ్వ. 1942

ఆ. తిరుపతికినిబోవఁ దురక దాసరిగాఁడు । కాశికేగఁ బంది గజముగాదు
వేఱుజాతివాఁడు విప్రుండుగాఁడయా । విశ్వ. 1943

ఆ. తిరుమలకునుబోవఁ దురక దాసరిగాఁడు । కాశికేగఁ బంది గజముగాదు
కుక్కసింహమగునె గోదావరికిఁబోవ । విశ్వ. 1944

ఆ. తివిరిలేమియుంటఁ దెరువ రేమెఱుఁగును । మొట్టఁబెట్టినెత్తి మొత్తుఁగాని
పతితధర్మమెన్నఁబడు చెట్టులెఱుఁగురా । విశ్వ. 1945

ఆ. తీపికల్లఁదీపి తెలియంగఁబ్రాణంబు । ప్రాణవితతికన్నఁ బసిఁడితీపి
పసిఁడికన్నమిగిలి పడఁతిమాటలుతీపి । విశ్వ. 1946

ఆ. తీర్థయాత్రకనుచుఁ దిరుగఁబోయినవాఁడు । పామరుండుగాక భక్తుఁడగునె
తీర్థయాత్రిచేత దివ్యుండుగాఁడయా । విశ్వ. 1947

ఆ. తీర్థయాత్రలకును దిరుగుచు జనులెల్ల । మొనసి తీర్థములను మునుఁగనేల
దోషకార్లకెట్లు దొరకురా యాకాశి । విశ్వ. 1948

ఆ. తీర్పనార్పలేని తీర్పరితనమేలఁ । గూర్పవిప్పలేని నేర్పదేల
పెట్టిపోయలేని పట్టిబీరములేల । విశ్వ- 1949

ఆ. తీర్పకట్టినేనిఁ దెలియ భారద్వాజి । కూర్చినట్లుపనులు కూడునెట్లు
జౌను గాకపోవు నవనిలో శకునముల్ । విశ్వ. 1950

ఆ. తీవ్రకోపమునను దీర్థయాత్రకుఁబోయి । ముఱికిదేహ మందు ముంచిముంచి
పలువకుక్కలేమి ఫలముఁగన్నారయ్య । విశ్వ. 1951

ఆ. తుంటవింటివాని తూఁపులఘాతకు । మింటమంటనడుమ మిడుకఁదరమె
యింటియాలివిడిచి యెట్లుండవచ్చురా । విశ్వ. 1952

ఆ. తుమ్మచెట్లముండ్లు తోడనెపుట్టును । విత్తులోననుండి వెడలునట్లె
మూర్ఖునకును బుద్ధి ముందుగానేపుట్టు । విశ్వ. 1953

ఆ. తురుసుకారములును దూముపైపీరము । పఱచి దాన దుష్టపాలు వోసి
కఱగిరాగిపైని గ్రమముగా నుంచరా । విశ్వ. 1954

క. తూలాట యింట నేర్పడ । వాలాయముగఁ జెడు నరుఁడు వసుమతిలోన
న్లోలాక్షి విడిచిచనినను । మేలిమిగాఁబ్రదుకవచ్చు మేదిని వేమా. 1955

ఆ. తెరలమఱుఁగునఁగల తేజమంతయుఁజూచి । మఱియు బ్రహ్మమందు మనసునిలిపి
గరిమ నున్న యట్టి ఘను లెందుఁ గలరయా । విశ్వ. 1956

ఆ. తెరువు ముక్కుచాయఁ దేఁగలిగినమీఁద । నందుఁగనఁబడునదెఁ యరయలేరె
అరసిచూడ బయలెయల్లదేముక్తిరా । విశ్వ. 1957

సీ. తెల్లవారకముందు, తిన్నగా వారింటి । చెంతదాగితిఁ జింత, చెట్టుమీఁద
సరగున నతఁడేగి, స్నానసంధ్యలుతీర్చి । కుసుమాళిచేకొని, గుహను జొచ్చి
యందున్న యోగికి, వందనంబులునేసి । ముందున్న రామయ్య, మోముఁజూచి
మంత్రోపదేశము, మఱునాఁడు చేయంగ । వేగరమ్మని శిష్యు, యోగిపలుక
వింటినంత యతని వెను,వెంటదాగి । పదినఁబ్రార్థించి మాయన్న,యదబుచేత
నాపి రామయ్యశివయోగి, దాపుఁజేర । నాఫలంబేను గననయ్యె,నపుడు వేమ 1958

ఆ. తెలియఁదనదు భార్య తెరఁబారుసంకెల । చిన్నశిశువులెల్లఁ జీలలరయ
నరసిచూడఁ దనువె యులచెఱసాలరా । విశ్వ. 1959

ఆ. తెలియభాగవతులె తెలివిగలారింక । నంద జెట్టులగుదు రకట భువిని
నయిన వారిని గన నతఁడెపో శివయోగి । విశ్వ. 1960

తే. తెలివి తేజమ్ము విజ్ఞాన దృష్టియగును। భద్రమగుజ్ఞప్తి లోఁగల భావపరము
నిర్గుణాకారమై యొప్పునిజముఁగనుము ! తెలియనీవాదు మేటి వీయిలను వేమ 1961

తే. తెలివినందెడు గురు సంజ్ఞ తేటఁబడఁగ । నిందునందును బరిపూర్ణ మేరుపడుటఁ
బరమసుఖమందఁగోరునుభవ్యయోగి।మాయఁజిక్కఁడుతక్కఁడుమహిమ వేమ 1962

ఆ. తెలివి నిలిపిచూడు దీపించునాకళల్ । కళ లుడుపక చూడు కలుగు బయలు
బయలు నంటిచూడు బ్రహ్మంబుఁగాంచెదు । విశ్వ. 1963

ఆ. తెలివియనఁగఁబడెడి తిరమును దెలియక । తిరుగు నస్థిరుఁడగు దేహి జగతిఁ
దిరుగనేల ననుచుఁదెలియఁడే యజ్ఞాని। విశ్వ. 1964

ఉ. తెలిసిన మూర్ఖరావణుఁడు ధీరజనంబులకై వడిన్ధర
న్వలచియె తెచ్చు సీతకయి బాంధవకోటులతోడఁజచ్చె దాఁ
దెలియఁగ లేమిచేతనని తెల్పిన లోకుఁ లికెందఱుండినం
దెలిసియు మాయలోఁబడమిఁ దెల్పితి రేబగలుండు వేమ సా. 1965

ఆ. తెలుపఁబడ్డవాఁడు దేవతాభక్తుండు । మాటలేనివాఁడు పోటుబంటు
కాసులేనివాఁడు కడుబ్రహ్మచారియా । విశ్వ. 1966

ఆ. తెలుపుమాయఁజేసి దిట్టఁదనంబునఁ । దెలుపుభస్మమగును దేటపఱచు
విధముకన్నఁబరస వేదియు లేదురా । విశ్వ. 1967

ఆ. తెలుపుమా యటంచు దేవరయంచును । వెంటఁబడెడివాండ్రవెతలుదీర్ప
నెవ్వఁడైనఁజెప్ప నేదైననొక్కటి । యట్టిదెల్లనమ్మనగునె వేమ. 1968

ఆ. తెలుపువాఁడెవండు తెలియు వాఁడెవ్వఁడు । గుట్టెఱుంగునంత బట్టబయలు
సారది భాండమందు సూర్యునిచందంబు । విశ్వ. 1969

ఆ. తేకు వమర బుద్ధి తెల్లముగానిల్పి । తాకనదిప్రణవపు ధ్యానమగును
సోకి మించువాఁడె సురలోకమును బొందు । విశ్వ. 1970

ఆ. తేనెతెరల జాడఁ దేనెటీఁగ యెఱుంగు । సుమరసంబుజాడ భ్రమరమెఱుఁగుఁ
బరమయోగి జాడ భక్తుఁడెఱుంగురా । 1971

ఆ. తేనెపంచదార తీయమామిడి పండుఁ । దిన్నఁగాని తీపితెలియరాదు
కన్ననింపు పుట్టుఁ గామినియధరంబు । విశ్వ. 1972

ఆ. తేలునకు నిఁకెంత తెలియఁ గొండివిషంబు । ఫణికి నుండు విషము పండ్లయందు
దెలివిలేనివాండ్రదేహమెల్లవిషంబె । విశ్వ. 1973

ఆ. తొడల మెఱుపుఁజూడ దొడ్డచనులఁజూడ । వగలుఁజూడ దానివన్నెఁజూడ
నయ్యలకెప్పుడైన నాశలువుట్టురా । విశ్వ. 1974

ఆ. తొడలమెఱుపు మోవి తోరంపుఁగుచములు । నోరకొప్పుఁగలుగునువిదఁజూచి
విటుఁడు నిలుచు నెట్లు విరహాగ్నిఁ జొరకయె । విశ్వ. 1975

ఆ తొత్తు తొత్తెకాని దొరసానిగాఁబోదు । అడఁచుటెంతె దానికైనగుణము
మిత్తికూళ్లదొంగ మేలెట్లు నేర్చురా । విశ్వ. 1976

అ. తొత్తుతోడఁబొందు దోషంబుదోషంబు । లంజెతోడఁబొందు లజ్జచెడును
జారతోడఁబొందు చావునకేయగు । విశ్వ. 1977

ఆ. తొత్తుతోడి పొందు తిట్టిపెసలమాఁట । ముచ్చుతోడి పొందు తెచ్చుసిందఁ
దలవరి దగుపొందు తలతోనె తీఱురా । విశ్వ. 1978

క. తొమ్మిదిక్రంతలతిత్తికి । నిమ్మగు సొమ్ములును గులము నేఁటికిఁజెపుమా
నమ్మకు దేహము నాదని । నెమ్మది బ్రహ్మమును దెలియు నేనని వేమా, 1979

క. తొమ్మిది తొఱ్ఱల తిత్తిని । నమ్మి శివునిఁదలఁపలేక నశియింపంగా
నిమ్మహి గృధ్రచయంబులు । సమ్మతిగా నిన్నుఁ దినును జక్కఁగ వేమా. 1980

సీ. తొమ్మిదివాకిళ్లు, తొలుత నేశిశువున । కేర్పడియుండెడి, నెనయఁజూడఁ
చెవులుఁగన్నులు ముక్కుఁ, జెలఁగు నోరునుమఱి।గుదమును గుహ్యంబుఁ,గూడఁజేర్చి
యందుతొమ్మిదితూటు, లమరి యొప్పారఁగా । నాధారములటాఱు, నానఁజేసి
భేదంబులేకయె, పెరిగెడిదేహంబు । పదివాయువులతోడ, విదితములుగ
నిన్ని కల్పించి దేహాగ్ని, నెనయఁజేసి । తన్నుమఱపించి లోకంబు, తగులఁగలిపి
వాఁడుమరిగియు నానక,పరుసగాను । బుట్టఁజేసెను గాదెయా, పుడమివేమ. 1981

ఆ. తొట్టిమానులోని తొఱటి జీవులనెల్ల । నెల్లలేక చంపు ముదముతోడ
నగ్నిలేనిమంట యదియేమి చోద్యమో । విశ్వ. 1982

ఆ. తొట్టివానిమిగులఁ దూలి దీవింపకు । వెట్టివానిమాట వినఁగఁబోకు
వెట్టికుక్కఁబట్టి వేటాడవచ్చునా । విశ్వ. 1983

తే. తొల్లిచేసిన పాపంబు తొలఁగ కొఱకె । పుట్టిచచ్చి తిరిగియును బుట్టిపుట్టి
గురునిఁజేరియు వేడి తాఁగొల్వవలెను । వేఱుమార్గములేదెట్టు వెదకవేమ. 1984

ఆ. తోకగలుగువానిఁ దొడరి గొంతులుగోసి । మేఁకజీవములను మెడలు విఱిచి
కడమజీవములను గాల్చియుఁదినెదరు । విశ్వ. 1985

ఆ. తోటకూరకైన దొగ్గలికైనను । తవుటి కుడుముకైనఁ దవుటికైనఁ
గావ్యములను జెప్ప గండ్యాలు ఘనమైరి । విశ్వ. 1986

ఆ. తోలుకడుపులోన దొడ్డవాఁ డుండంగ । రాతిగుళ్ల నేల రాశిఁబోయ
రాయిదేవుఁడైన రాసులు మ్రింగదా । విశ్వ. 1987

ఆ. తోలుఘటములోనఁ దొలఁగకయున్నప్పు । డాలుమగలుఁ బ్రీతి నలరుచుండ్రు
జీవి ఘటముఁ విడువఁ జిక్కుఁడిపోవురా । విశ్వ. 1988

ఆ. తోలుతిత్తిలోనఁదోలుతఁబుట్టినతాను । వెనుకఁదెలియవలయు వివరమరసి
వెనుకఁ దెలియలేమి వెఱ్ఱియైచెడిపోవు । విశ్వ. 1989

ఆ తోలుతిత్తిలోనఁదోలుతఁబుట్టినవాని । వెదకితెలియ వలయు వివరముగను
వెదకి తెలియలేక వెఱ్ఱులై చెడిపోరె । విశ్వ. 1990

ఆ. త్రాఁడు పామటంచు తాఁజూచి భయపడి। తెలిసితాఁడటన్నఁ దీఱుభయము
భయము తీఱినపుడె బ్రహ్మంబునంటురా । విశ్వ. 1991

ఆ. త్రాఁడు మెడను వేసి తనకు కూఁదత్వంబు । పోయెననెడి దెల్ల బుద్ధిలేమి
మదనిలుపక త్రాఁడు మఱిపెన్నెఁదెచ్చునా । విశ్వ. 1992

క. త్రాసునుధరలోఁబడసిన । వేసియుఁదానొక్కతడవ వివరింపంగా
వీసంబెక్కువయైనను । భాసురముగ నొఱగు నొక్కవంకకు వేమా. 2993

క. త్రాసును వడిసెలలంజేయు । భాసురగతి నొక్కరూపు పరికింపంగా
వీసంబధికంబైనను । వాసియుఁజెడ నొక్కవంకవ్రాలుర వేమా. 1994

తే. త్రిగుణభావములో మించి తిరుగువారు । జగతిపైయాస విడి బ్రహ్మజంత్రమందు
నిప్పు నివురున నున్నట్టు నిలుతు రవనిఁ । గనఁగ లేరయ్యవారలఘనత వేమ. 1995

క. త్రిజగంబులు నిర్మించియుఁ । ద్రిజగంబులు భుక్తిముక్తి తీరిచి నడపు
న్నజహరిరుద్రులు తానై । భజియింపఁగ విశ్వకర్మబ్రహ్మము వేమా. 1996

క. త్రిపుటికిఁజూడిక్కని బైనిడి । యుపజిహ్వకు సూటిచేసియు న్మదిలో నే
తప మొనరించెదు భక్తుఁడు । నిపుణుండై వెలుఁగులోనె నేర్పున వేమా. 1997

తే. త్రిపుటిపైఁ జూపునిలుపంగఁ దేజమమరుఁ । జట్టుగల పట్టుగాఁగనిభావమందు
నిట్టనిలువున గమకింపు నిర్గుణంబు । బట్టబయలగుఁగన్గొని పరగు వేమ. 1998

## ద

ఆ. దగ్గఱున్నవాఁడు దట్టుఁడు దక్షుఁడు । ఎడముపడినవాఁడు దుడుకుగడుసు
అనుసరించువారి కయ్యెడుఁ గార్యముల్ । విశ్వ. 1999

ఆ. దనియుపిండమునను దగిలినమనుజుండు । పుట్టలేఁడు వాఁడు పుడమిలోన
నట్టిపుట్టుకఁగన నవనిలోలేదయా । విశ్వ. 2000

తే. దర్పణంబునఁ దనరూపు తగిలినట్లు । నేర్పుగలిగినమదిలోన నీదురూప
మర్పణంబుగ నెఱుకలో నడఁచిచూడ। నోర్పుకలవాఁడె నేర్చు తానొనర వేమ. 2001

ఆ. దర్శనంబులందు ధరషణ్మతములందు । వర్ణమాశ్రమమును వదలకెపుడుఁ
దిరుగుచున్నవాఁడు ధరలోన నజ్ఞాని । విశ్వ. 2002

ఆ. దశముకొనియొకప్డు దారిద్ర్యమేర్పడ । హీనకార్యములు సహించి చేయుఁ
బరువుమాయునింతె ఫలమట్టెచిక్కదు । విశ్వ. 2003

ఆ. దశగలారినెల్లఁ దమబంధువులటంద్రు । దశయులేమి నెంతు తక్కువగను
దశయనంగను దశ ధనమొప్పటొక్కటే । విశ్వ. 2004

తే. దశమియేకాదశియని వ్రతములఁబూని । మెదుకుఁడినకున్న దుర్గుణమదియడఁగునె
పుట్టపైఁగొట్టనురగంబు గిట్టఁబోదు । తీరెఱుంగనిమూఢ్యమీ తెలిఁగెవేమ. 2005

ఆ. దశయనంగ మెండు ధనముంటయేయంద్రు । కూడునిద్రలేక కుందు లెకడ
దాఁగనుండఁబోవ బాగుగా నేడ్పించు । ధనము నెంచు బెట్టి తలఁపు వేమ. 2006

ఆ. దశరథుండు రామధరణీశుఁబట్టంబుఁ । గట్టఁజేయఁదలఁపఁ గట్టెజడలు
తలఁపుమనదిగాదు దైవికమదివేఱె । విశ్వ. 2007

క. దశవాయువులనొసంగియుఁ । బశుఁడైతానున్నయట్టి భవునెఱుఁగవె యో
పశువాయని యముఁడనఁగ వి । పశుఁడవుమున్నగుదు వీలు వడిఁగను వేమా. 2008

ఆ. దక్షయాగమెఱుఁగుఁ దమ్మబదుకెల్లను । వీరవిష్ణుఁడపుడె పాఱెఁగాథె
శివునినిందఁజేయ సిగ్గేది ద్విజులకు । విశ్వ. 2009

ఆ. దాఁచినధనమునకుఁ దానునుగొడుకులు । వాంఛపడుటెకాని వట్టిభ్రమలు
భాగ్యహీనునకును ఫలములభించునా । విశ్వ. 2010

ఆ. దాతగానివానిఁ దఱచుగావేడిన । వాఁడుదాతయగునె వసుధలోన
నవురు దర్భయౌనె యబ్ధిలోముంచిన । విశ్వ. 2011

ఆ. దాతయైనవాఁడు తానెమున్నిచ్చెడిఁ । గానివాఁడొసఁగునె కానియైన
జలముదప్పితీఱ్చు మలమెట్లుతీఱ్చురా । విశ్వ. 2012

ఆ. దాతలేనికొంప దయ్యాలపెనువాఁడ । నీతిలేనిమాట రాతివేట
ప్రీతిలేనిలంజె ఘాతకియైతోఁచు । విశ్వ. 2013

ఆ. దానధర్మములకుఁ దగుతీపుతీపని । కాలలయముసేయు కష్టజనుఁడు
తానిఁకేమియౌనో తనబ్రదుకేమౌనో । మాయఁదెలియలేఁడు మహినివేమ. 2014

ఆ. దానధర్మములను దాఁజేసిపుట్టమిఁ । గర్మగతిని యముఁడు కష్టపఱచుఁ
గర్మధర్మములను గడవీడబ్రహ్మంబు । విశ్వ. 2015

ఆ. దానధర్మములును దయయుసత్యమునీతి । వినయధైర్యధుర్య వితరణములు
రాజుపాలిటికిని రాజయోగంబులు । విశ్వ. 2016

ఆ. దానమడుగువాఁడు ధరలోననధముండు । దానమడుగనతఁడు దైవసముఁడు
దానమీనివాఁడు ధన్యుండుగాఁడయా । విశ్వ. 2017

ఆ. దానమమరఁజేయ దరిఁజేర్చునయ్యది । మనమె నమ్మెసేని మాయముంచు
జ్ఞానకలికనమ్మఁ జంపురా వైరుల । విశ్వ. 2018

క. దానముచేతులకగునను । జ్ఞానంబును నెఱుఁగ నేల ఘనతరముగదా
దానమె తమతత్వదమని । మానవులెంచంగవలయు మహిలో వేమా. 2019

ఆ. దానములనుజేయ ధరఁజేతులాడక । బహుధనంబుఁగూర్చి పాతిపెట్టి
తుదను దండుగనిడి మొదలుచెడునరుఁడు । విశ్వ. 2020

ఆ. దానములనుజేసి దరిఁజేరు నొకవంక । మాన మొకటినమ్మ మాయఁదగులు
జ్ఞానమరసినమ్మఁ గడతేఱు వైరుల । విశ్వ. 2021

ఆ. దానములనుజేసి ధరఁగీర్తిఁ జెందంగ । బహుధనములొసఁగియు భక్తిలేమిఁ
దుపను జెడునరుండు మడిఁ గడగండ్లచే । విశ్వ. 2022

ఆ. దానములను నన్నదాన మెదొడ్డది । గానములను సామగాన మెచ్చు
ధ్యానములను శివుని ధ్యాన మేశ్రేష్ఠంబు । విశ్వ. 2023

ఆ. దాన మొనరఁజేయు దాతదగ్గరఁజేరి । వక్రభాషణములు వలుకుదుడుకు
చందనతరువందు సర్ప మున్నట్లయా । విశ్వ. 2024

ఆ. దాన మొసఁగుకన్న దేనంబుమతిహెచ్చు । దేన మొనరుకన్నఁ దెలివిహెచ్చు
తెలివికన్న నాసఁ దెగవేసినది హెచ్చు । విశ్వ. 2025

క. దాపుననున్నదియద్దము । రూపున నీరూపుఁజూచి రూఢిగఁ గనియా
పాపకులోనగు చూపునఁ । బ్రాపై శివుఁడుండుఁగనుము పనుపడి వేమా. 2026

ఆ. దారబందిగంబు తనయులుసంకెల । బంధువర్గమెల్లఁ బ్రిహరిగోడ
మోహ మెఱుఁగలేఁడు మొక్కలి కాఁడయా । విశ్వ. 2027

తే. దాసరట్టులఁగావచ్చు వేసమునను । జంగముగ నుండఁగావచ్చు లింగమేసి
పరగలక్షలకైనను బారునివలె । నుండఁగారాదుగద యెన్న నుర్వివేమ. 2028

ఆ. దాసరయ్యతప్ప దండంబుతోసరి । మోస మేదితన్ను ముంచకున్న
నీచుఁడైచెడునటు నీచులనమ్మిన । విశ్వ. 2029

ఆ. దాసరియనవచ్చు వేసాలకైనను । జంగమనగవచ్చు లింగమున్న
బాపఁడనఁగరాదు పదివేలకైనను । విశ్వ. 2030

ఆ. దిక్కులేనివాని దీనతఁబాపిన । పురుషుఁడిహమునందె పూజ్యుఁడగును
పరమునందువాని భాగ్యమేమనవచ్చు । విశ్వ. 2031

సీ. దినకరచంద్రులు, చనుత్రోవలనుగట్టి । పాన్పుతోడనిరులు, పాదుఁగూర్చి
మూఁడుమూలలయింటి, మ్రోతలునిద్రించి । పరగుముంగిలిమీఁద, శరణుమాన్పి
కడుసన్నమగుగుఱ్ఱు, నడయానునడివీధి । శోధించిమాత్రను, మీఁదఁబెట్టి
అణువనుజ్యోతియై, యానందరూపమై । దివ్యతేజంబుపై, దృష్టినిల్పి
తలఁపనెడలేక భేదంబు, తలఁగనీక । జోలలందును నర్థియై, జోలలాడు
చున్నయోగీంద్రుఁడనిచెప్ప,నుచితమగును । వేమననియెడియోగిని, వెలయుభువిని 2032

ఆ. దినము మూఁడుమార్లు తిని నిదురించుచు । సొగసుచనులవారి సొంపుతోడఁ
జేరుచుండికడకుఁ జెడిచావఁ బోవును । విశ్వ. 2033

క. దినముల వ్యర్థముపుచ్చక । కనుచుండుమి యాత్మ నెపుడు ఘనగురుబోధ
న్నినునీ వెఱుఁగకయున్నను । గొనకొని మది చెఱచునిన్ను గొబ్బున వేమా. 2034

క. దిన మొక్కటి నడచునుమఱి । యినచంద్రస్వరము లెన్న నిరువదియొకపై
చనఁగా నాఱున్నూఱగుచును । మనమునఁ దెలియంగవలయు మహిలో వేమా. 2035

తే. దివ్యపరతత్వమనుజ్ఞప్తి ధిజయుండు। మరలిపుట్టని గురుభక్తిమహిమతోడ
నక్షయాత్మకపరమంది యమలుఁడగును । ఏమలిన మాతనికి నంటదెపుడు వేమ. 2036

తే. దివ్యమైనట్టి పరశివతేజమూని । భవ్యమగుయుక్తి మదిలోన భద్రపఱచి
సేవ్యుఁడైయుండుటే ముక్తిస్థిరము గాను। కావ్యములరాదు గురుబోధఁ గలదు వేమ 2037

క, దీపంబులేనియింటను । రూపంబులఁ దెలియలేమిక్షిరూఢియెతములో
దీపమగు తెలివిగలిగియు । పాపంబులమరుగుత్రోవఁ బడుదురె వేమా. 2038

ఆ. దుండగీనికొడుకు కొండీఁడు చెలికాఁడు । బండరాజునకును బడుగుమంత్రి
కొండముచ్చునకును గోఁతియె విందౌను । విశ్వ. 2039

ఆ. దున్నపోతునకును దోడిరాగంబేలఁ । గన్నగానికేలఁ గంటినిదుర
వెన్నముద్దకేల వేడినీరపుఁబొందు । విశ్వ. 2040

ఆ. దున్నపోతుమడక దురుతుగాసాగదు । ఎద్దుమడకకంటె నెచ్చుగాదు
ముద్దరాలిమగఁడు ముదుసలిమెచ్చునా । విశ్వ. 2041

ఆ. దుష్టజనులుమీఱి తుంటరిపనులను । శిష్టకార్యములుగఁ జేయుచుండ్రు
కూడదనెడివారిఁ గూడనిందింతురే । విశ్వ. 2042

తే. దుష్టబుద్ధుల నన్నిఁటిఁ దోలకున్న । నిష్ఠగుటియందు నిలువదు నిర్మలముగ
భ్రష్టుఁడైయేమితోఁపక భ్రమయునయ్య। శిష్టతయె ముందవశ్యముక్షితిని వేమ. 2043

క. దుర్గతిస్వర్గములనితగు । దుర్గుణముల దాటి హృదయదుర్గము జేరక
స్వర్గముఁ జేరుటదుర్గతి । నిర్గుణమందైక్యమగుట నిజముర వేమా. 2044

తే దురితముల నెల్ల ఖండించుగురునిఁ జేరి । పరమనిర్గుణమననంబుఁ బ్రాకినంత
గురుతరంబుగ గుణములు కొట్టువడును । బరశివుండన భాసిల్లు ధరను వేమ 2045

క. దృక్కునకు దృశ్యమునకును । మక్కువతో భేదమెంచ మతిలేదనుమీ
దృక్కునకు దృక్కు బ్రహ్మమె । నిక్కమునీయందెనిండి నెగడును వేమా 2046

ఆ. దృశ్యమైనదానిఁ దెలిసినమ్మెదరట్లు । కానిదానినమ్మఁ బూనుకొనరు
కానిదృశ్యమగుటఁ గానరే యదియెట్లు। విశ్వ. 2047

ఆ. దూరదృష్టిఁగనరు తూఁగినదనుకను । బాఱుపట్టెఱుఁగరు పడినదనుక
దండసాధ్యులరయ ధర్మసాధ్యులుగారు! భూమిజనులు వెఱ్ఱిబుద్ధి వేమ. 2048

క. దూరమునశత్రుఁ డుండిన । వేఱుగ వాఁ డున్న చోటు వెదకఁగవలెనా
యాటేఁటఁదాయిడి తిట్టిన । వారకగురివేసినట్టు పడురా వేమా. 2049

ఆ. దూరయోచనలకు దూరమౌ దైవము । తనువుదూరమైన తగులునపుడు
జీవి దవ్వుచేయ దేవుఁడైనిలుచును । విశ్వ. 2050

ఆ. దూలములనలెక్కి దొమ్మరిగడనెక్కి । జాలుదుననుటయును సాహసంబు
వీలుమాలుపనుల వెఱ్ఱియె చేయునా । విశ్వ. 2051

ఆ. దూలములనుబోలు దుగవస్థలవియెల్ల । రోసి యాసలన్ని కోసివేసి
వాసనను దెలిసినవాఁడెపో బ్రహ్మంబు । విశ్వ. 2052

క. దూలాలు లెంకినుండిన । వాలాయము చేటువచ్చు వసుమతిలోన
న్నోలాక్షివిడిచిపెట్టిన । మేలిమిగా బ్రతుకవచ్చు మేదినివేమా. 2053

తే. దేవతార్చన జపతపతీర్థయాత్ర । దానధర్మక్రతువులను దలఁచిచూడఁ
బుణ్యసాధనవృత్తులు పుడమిలోనఁ । గల్మషములేని హృదయము కలుగ వేమ. 2054

తే. దేవదానవులను గుట్టు తెలియుమప్ప । సత్పురుషులును దుష్టులసంఘమెసుమి
ధర్మవర్తులు సజ్జనుల్మర్మమెఱిఁగి। దేవుఁడే వారి రక్షించుఁ దివిరి వేమ. 2055

ఆ. దేవపూజసేయ దివ్యభోగములగ్గు । తత్వమెఱిఁగనేని దైవసముఁడె
యేమిలేనినరున కేగతిలేదురా । విశ్వ. 2056

ఆ. దేవభూములందు దేవాలయములందు । దేవుఁడనుచు మ్రొక్కి సేవఁజేసి
తెలియ విశ్వకర్మ దేవాదిదేవుఁడౌ । విశ్వ. 2057

ఆ. దేవళములలోను దీర్థంబులందును । మూలమెఱుఁగకున్న ముక్తిలేదు
ఆత్మమూలమెఱుఁగఁ డదియెట్లు తెలియురా । విశ్వ. 2058

ఆ. దేవుఁడనఁగ వేఱు దేశమందున్నాఁడె । దేవుఁడనఁగఁదనదు దేహముపయి
వాహనంబునెక్కి పడిఁగదలునుజూడ । విశ్వ. 2059

తే. దేశదేశమ్ముఁదిరుగుట తిండికొఱకె । పూనివేషము వేయుట పొట్టకొఱకె
మనసునందునె గుఱిఁగాంచి మరిగితిరిగి । పుట్టకుండెడిపదవిని బూను వేమ. 2060

ఆ. దేశదేశములను దిరుగంగఁ దిరుగంగ । నాత్మయందుధ్యాన మంటుకొనునె
కాసులకునుదిరుగఁ గలుగునామోక్షంబు । విశ్వ. 2061

ఆ. దేశవేషములను తేటసేయఁగదేవుఁ । డాత్మలోన నుండు నణఁగిపెనఁగి
వేస మరసిచూడ గ్రాసంబుకొఱ కయా । విశ్వ. 2062

ఆ. దేహగుణములెల్లఁ దెలిసినశివయోగి । మోహమందుఁదగుల మోసపోఁడు
ఇంద్రజాలకుండె యెందునఁజిక్కునా । విశ్వ. 2063

సీ. దేహంబనిత్యంబు, దేహినిత్యంబని । దేహేంద్రియాదులఁ, దీవ్రగతిని
మోహంబులెల్లను, మొదటికివర్జించి । యాపరమాత్మతో, నైక్యమంది
చిత్తశాంతినిబొంది, చిన్మాత్రమువినాగ । నితరంబుఁజూడక, యెప్పటికిని
సర్వమాత్మయటంచు, సత్యంబుగాఁజూచు । వారెతత్త్వజ్ఞులు, వసుధలోన
నట్టివారలమర్మంబు, లరయుటకును । సాక్షిహరబ్రహ్మలకునైన, నలవిగాద
టంచు శాస్త్రంబులెల్ల ని,ట్లనివచింపఁ । దెలిసిచెప్పెనువేమన, దేశికుండు. 2064

క. దేహభ్రమములువీడక । సాహసమున ముక్తిఁబొంద శక్యంబగునా
మోహంబులెల్లఁదీఱిన । బాహాటముగానతండె పరుఁడగువేమా. 2065

ఆ. దేహభావమెల్లఁ దెలియంగఁజూచిన । నఖిలహేయములకు నాలయంబు
పరసతిగమనంబు ప్రత్యక్షనాశంబు । విశ్వ. 2066

ఆ. దేరుమనెడియింటి దినదినంబునునూడ్చి । యాలికిప్రాసిమెత్తి యనువుపఱచి
కాపువిడిచిపోవుఁ గడపటనీజీవి । విశ్వ. 2067

ఆ. దేహమాత్మరూపుఁ దేటతెల్లముఁజేసి । యవలిచూపుఁజూపునతఁడె గురువు
భ్రమరముతనరూపు క్రిములకిచ్చినరీతి । విశ్వ. 2068

తే. దేహమాత్మలువేఱని తెలియలేక । మోహమునఁజిక్కి గాథలోమునుఁగులేల
సాహసంబున గురుభక్తి సలుపవలెను । నివరమాతండు తెలిపెడి వేగ వేమ. 2069

క. దేహములెస్సగనుండిన । పోహణతత్త్వ బులన్ని పొందుగఁదెలియుం
దేహము బడలికఁబడినను । పోహణతత్త్వములువచ్చి పొందవువేమా. 2070

ఆ. దేహమూలమందు దేహిదేవుఁడటంచుఁ । దెలిసియున్నబుధులు తీర్థయాత్ర
లరయఁబోరుజగతి నాత్మతామైయున్కి । విశ్వ. 2071

తే. దేహశక్తియులేనట్టి దీనునకును । జక్కఁగాబోధచేసెడి చతురుఁడుగను
నిక్కముగ విశ్వకర్మతానీటుమెఱయ । రామయాఖ్యనువిలసిల్లె రహిని వేమ. 2072

ఆ. దేహసంకటమ్ము తెగఁదేరకాండ్రయ్యు । మోహదృష్టివీడి మూలమెఱిఁగి
యూహయొకటిపన్ని యుల్లంబుసాధించి । స్నేహమెఱుఁగ యోగసిద్ధి వేమ. 2073

క. దేహాభిమానముండఁగ । మోహాదులువిడుచునెట్లు మునులకునైన
న్నాహాసమున నదివిడఁబనె । సోహమ్మని యెఱుఁగవచ్చు సుమ్మీ వేమా. 2074

క. దేహికిదేహమెయిల్లని । మోహముచేతనుగుబుద్ధి మఱియుఁచునుండుం
దేహియుదేహమునంటని । పోహణయగుబట్టబయలు పొందుఁగ వేమా. 2075

క. దేహియుజ్ఞానానలమున । దాహంబై దేహమెల్లఁ దల్లడపడఁగా
దేహములోఁబొర్లాడుచు । మోహమువిడ శివునిఁజూడు ముక్తికి వేమా. 2076

ఆ. దైవఘటనలేక దైవసుజ్ఞానంబ । దెలవచ్చురెంటి కెఱుకపడక
యెఱుఁగనెఱుగువాని కెఱుకలోఁగనుపించు । విశ్వ. 2077

ఆ. దైవమతులనరులు తమవంటివారని । యరసిగూఢతత్వ మెఱుగలేరు
ఇల్లుమూయఁబడిన నెట్లుమర్మమెఱుంగ । విశ్వ. 2078

ఆ. దొంగతనమువలన ద్రోహమెంతయుఁజేసి । యెవ్వరెఱుఁగకుండ నిముడుకొన్నఁ
దాముచేయుపనులఁ దగులుకొనరెయుందు । విశ్వ. 2079

ఆ. దొంగతనముఅంకు దొరసియుండుజగతి । అంసలాడికింత శంకపుట్టు
దొంగకెన్నరేవెలుం గొప్పకానట్టు । విశ్వ. 2080

ఆ. దొంగతెలివిచేత దొరకునామోక్షంబు । చేతఁగానిపనులఁజేయరాదు
గురుఁడనంగవలదు గుణహీనుఁ డనవలె । విశ్వ. 2081

ఆ. దొంగమంత్రములను దొరకొనునాముక్తి । చేతఁగానిచేత చెల్లదెపుడు
గురువటండ్రెవాని గుణహీనుఁడందురు । విశ్వ. 2082

ఆ. దొంగమాటలాడ దొరకునామోక్షంబు । చేతఁగానికూత చెల్లదెపుడు
గురువుపద్దుగాదు గుణహైన్యమదియగు । విశ్వ. 2083

ఆ. దొడ్డవాఁడననుచు దొరలదగ్గరఁజేరి । చాడిఁజెప్పె పాపజాతినరుఁడు
చాడిఁజెప్పువాఁడు సాయుజ్యమందునా । విశ్వ. 2084

ఆ. దొడ్డవాండ్రమనుచుఁ ద్రోవడొంకలుకట్టి యడ్డమైనజనుల నంటఁగట్టి
దోఁచుకొన్ననట్టి దోషమెక్కడఁబోవు । విశ్వ. 2085

ఆ. దొడ్డివాఁడు పెద్దతోడేలునైనను । మట్టుఁజూచిదాని మర్మమెఱిఁగి
గొడ్డుగొఱ్ఱెనైనఁ గొనిచననీయఁడు । విశ్వ. 2086

ఆ. దొమ్మతెగులుచేతఁ దూలినగేదెకు । వాతవేయ బ్రతికి వచ్చెనేని
బ్రాతయెనుముపాలు రోఁతనవచ్చునా । విశ్వ. 2087

ఆ. దొమ్మనాయుకోళ్ళకు నమ్మవారికి వేఁట । లిమ్మటం బ్రదిదేమి దొమ్మతెవులో
అమ్మవారిపేర నందఱుఁ దినుటకా । విశ్వ. 2088

ఆ. దొమ్మరాటహాని దోర్బలమెల్లను । బొట్టకూఁటికొఱకె పట్టినదగు
నదియెయోగికమర నానందమందఁడొ । విశ్వ. 2089

ఆ. దొమ్మరింటినుండి తొంగిచూచుచురాఁగ । నెఱిఁగినట్టివార లెదురుపడినఁ
జచ్చునంతకంటె నొచ్చి పాఱఁగఁజూచు । విశ్వ. 2090

ఆ. దొమ్మరీనిలంజెతోఁగూడ దోసంబు । పాపజాతిమనసు పాడుచేయు
వీడుగదలిపోవ వీఁడెంత యేడ్చునో । విశ్వ. 2091

ఆ. దోఁపునిచ్చువాఁడు తులకిందునెఱదాత । దోఁచుకొన్నవాడు ద్రోహియయ్యె
బ్రాపుఁజూపువాఁడు పరమపుణ్యుండయ్యె। బ్రాపుఁజెఱచువాఁడుపశువు వేమ. 2092

ఆ. దోషగుణమనియెడి దుర్మతిమాయచే । మోసపోయిపుట్టి మునిఁగిరందు
దోషగుణముమందు దుస్సంగతులువీడి । వేషభాషలుడుగ వెలయు వేమ. 2093

ఆ. దోషరాసిఁబుట్టి దోషంబుఁదెలియక । దూషణములుసేయు దుష్టజనులు
నరకకూపమందు నాటియుండెదరయా । విశ్వ. 2094

ఆ. దోసకారియైన దూసరికాఁడైన । బగతుఁడైన వేదబాహ్యుఁడైన
పట్టిలేని పేద వాని కీఁదగు నీవి । ధనికునకు నొసంగఁ దగదు వేమ. 2095

ఆ. దోసముల్లువంటి తుర్యమందాత్మను । జూచియాసలనటు ద్రుక్కఁజేసి
వాసనను దెలిసినవాఁడెపో బ్రహ్మంబు । విశ్వ. 2096

ఆ. ద్రోహబుద్ధినింక దొంగటికమునను । సటలనైన సాహసముననైన
సంపదధికువలన సాధించిధనమును । బడుగునకు నొసంగ బాగు వేమ. 2097

ఆ. ద్రోహియైనవాఁడు సాహసంబుననెట్టి । స్నేహితునికినైనఁ బెఱుపుచేయు
నూహఁగలిగియుండు నోగుబాగులనక । విశ్వ. 2098

ఆ. ద్వాదశతిరుమణులు దగునట్లు ధరియించి । ద్రావిడగ్రంధములను దనరఁజదివి
అక్షయముగుపాత్ర నమరంగఁదాల్తురు । విశ్వ. 2099

తే. ద్వాదశాక్షరిమంత్రంబుఁదనరఁదెలిసి । యాశరీరంబునకు మూలమెన్నరాని
సరణిమరిగిన నిత్యమౌ పరముగల్గు । గురునిబ్రాపున్న నే యిది కూడు వేమ. 2100

ఆ. ద్వారబంధమునకుఁ దలుపులుగడియలు । వలెనె నోటికొప్పుఁగల నియతులు
ధర్మమెఱిఁగిపలుక ధన్యుఁడౌ భువిలోన । విశ్వ. 2101

ఆ. ద్విజకులంబునందుఁ దేజరిల్లుచుఁబుట్టి । తాఁదరించి యొరుల దాఁటఁజేయ
లేనియాతఁడున్న లేకున్ననొక్కటే । విశ్వ. 2102

ఆ. ద్విజవరుండుచెడ్డ దిక్కులేక యీభూమి । మనుజులెల్లఁ జెడుదురనుట కేమి
కాలగతులుమాఱఁగ వి యధర్మముమీఱ । నిదియెముందుజరగు నిలను వేమ. 2103

ఆ. ద్విజుల ఖేదపెట్టి తిట్టఁ దొడఁగువాఁడు । మృతినిబొందితాను వెతలఁబడఁగఁ
గాలుదరినిజేరుఁ గడతేఱలేఁడయా । విశ్వ. 2104

## ధ

క. ధన దారాపుత్రీషణ । మనెడిది ఘనలోకవాంఛయగుఁ దలపంగం
దనుదాఁ దెలిసినపుణ్యుఁడు । మనుజులతోఁ జేరఁ డెపుడు మహిలో వేమా. 2105

ఆ. ధనమదంబుచేత దైవంబునెఱుఁగక । కుటిలభావమొంది క్రూరజనులు
మదముమించినంత మన్నింపఁబోరయా  విశ్వ. 2106

ఆ. ధనముఁగూడఁబెట్టిధర్మంబుసేయక । తానుదినక లెస్స దాఁచు లోభి
తేనెనీఁగగూర్చి తెరువరికియ్యదా । విశ్వ. 2107

ఆ. ధనముఁగూడఁబెట్టి ధర్మంబుసేయక । యూరకుంద్రుపాపు లూహలేక
ధనమువెంటరాదు ధర్మంబుసేయరో । విశ్వ. 2108

ఆ. ధనముచాలఁగూర్చి ఘనదానధర్మమ్ము । లొనరుపక యిచ్చుఁదనయులకును
దేనెఁగూర్చియీఁగ తెరువరులకునీదె । విశ్వ. 2109

ఆ. ధనములేకయున్న ధైర్యంబుచిక్కదు । ధైర్యమొదవదేని ధనమొనరదు
ధనముధైర్యమరయఁ దగుభూమిపతులకు । విశ్వ. 2110

ఆ. ధనములేని పేదతండ్రిగర్భంబున । భాగ్యపురుషుఁ డొకఁడు పరగఁబుట్టి
బహుళధనముఁగూర్చి భద్రమార్గంబునఁ । బరుల కుపకరించి ప్రబలు వేమా. 2111

ఆ. ధనములేమిగుణము తక్కువపడవచ్చు । ధనములేమిఁగీర్తి తలఁగిపోవు
ధనములేమిశుచిని దగఁబట్టనీయదు । ధనములేమిఘనత తప్పు వేమ. 2112

ఆ. ధనములేమియనెడు దావానలంబది । తన్నుఁజెఱుచుమీఱి దాపుఁజెఱుచు
ధనములేమి మదిని దలఁపనెపాపంబు । విశ్వ. 2113

ఆ. ధనములేమి సుతులు తప్పులనిడుదురు । ధనములేమిఁబత్ని తాకరాదు
ధనములే మెవరికిఁ దాళియేయుండదు । విశ్వ. 2114

క. ధనమెచ్చినమదమెచ్చియు । మనమెచ్చును దుర్గుణమును మానకయెచ్చుం
ధన ముడిగినమదముడిగియు । మనముడుగును దుర్గుణమును మానును వేమా. 2115

క. ధనమామూలముజగమున । ధనమామూలంబుసకల ధర్మంబులకుం
గొనమామూలముసిరులకు । మనమామూలంబుముక్తి మహిపుకు వేమా. 2116

క. ధనలక్ష్మిని జేపట్టిన । దేనమార్జింపంగవచ్చు ధర్మముగానే
ధనహీనులకు నోసంగెడు । ధనమేమూలంబుముక్తి దాతకి వేమా. 2117

ఆ. ధనవిహీనుఁడైయు తండ్రిపుణ్యము చేయ । భాగ్యపురుషుఁడొకఁడు పట్టియగుచు
బహుళధనముఁగూర్చి భద్రమార్గంబునఁ । బరులకిచ్చి కీర్తిఁబడయు వేమ. 2118

ఆ. ధరగ్రహములురాశిఁ జరియించుచుండిఁగ । మంచిచెడుగుఁగానుపించుచున్నఁ
బురుషయత్నమనుచుఁ బొంగుదురేలరా । విశ్వ. 2119

క. ధరగిరులుజలధులన్నియుఁ । బరికింపఁగ బ్రళయమునను భస్మములయియా
సురలును మునులును జనఁగా । చెరయోధులిటుండఁగలరె నేర్పున వేమా. 2120

క. ధరజక్రవర్తులాఖ్యురు । పరగమహారాజులెన్నఁ బదియాఱ్గురయా
నెరయోధులువీరేగద । వెరవునమును వెనుకఁజూచి వెదకర వేమా. 2)21

సీ. ధరణిలోజదువెల్లఁ, బరమాత్మలోనాత్మ । కైక్యపడని బ్రహ్మకైనసొడ్డు
పంచభూతఘటిత, ప్రకృతినిదలపోసి । నిరుకెఱుంగనివాని, నెత్తిసొడ్డు
పంచవింశతితత్వ, పద్ధతియెఱుఁగక । వేదాంతిననువాని, మీఁదిసొడ్డు
అంతరంగములోని, యానుకూల్యములేక । యోగినేననువాని, కొక్కసొడ్డు
తానుదానైనతత్వంబు, తగులుగలిగి । వెలిసిలోననదొకటని, తెలివిఁదెలిసి
బ్రహ్మవేదంబుఁగనలేని, పామరునకు । వెనుకవొకసొడ్డుగలదిల, వినుము వేమ. 2122

చ. ధరనతికీర్తిమంతుఁడును దైవసముండతిగోప్యుఁడోర్పుమీ
అరహిని గొండవీటియభిరామయనా గురువర్యుఁడాతఁడు
స్మతియుఁ బ్రభుండవీవునను మానములేదిక మీదునామముల్
స్థిరముగనుండుఁగాక యిడసిద్ధముసుమ్ము జగాన వేమనా 2123

తే. ధరనుజాత్రాన వైష్ణవుసనంబు । లనెడినామంబు లుండంగ నవనిజనులు
వేమపనియందురేయిట । వెట్టినము తెరచిచూడంగవలెనయ్య ధాత్రి వేమ. 2124

ద ధరనుదలారిపొందునను దప్పకహానియె పొందునంచుఁదా
మరయఁగఁజెప్పరే బుధులటంగన సల్పెడు చేష్ట లట్టులే
పొరలునుహానియాఁ జెలిమి బొంకులుగా విపి ముందు మీకురా
నెఱుఁగుదురేమి చెప్పనిఁక నెప్పుడుఁ బ్రాంతములోను వేమనా. 2125

ఆ. ధరనుదేవళముల తగులువీడిననాఁడు । తనువుగుడిగఁజేసి తన్నునిలిపి
లోకబుద్ధివిడిచి లోచూపుఁజూడరా । విశ్వ. 2126

క. ధరఁబుట్టియు భోగినయితిఁ । బరమందిచ్చనటుమాని పడఁతులకై నేఁ
దిరిగియలసితిని ద్రివ్యము । మఱియార్జించితిని గడకు మరణమెవేమా. 2127

ఆ. ధరవిరక్తియనెడు దానిని విడువమిఁ । దనకుఁదగులునెట్లు తత్వమరయఁ
దత్వమరయఁదాను దానగుబ్రహ్మంబు । విశ్వ. 2128

ఆ. ధర్మకంటకుండు ధనముచేగర్వించి । సకలసంపదలను జాలఁదనిసి
కడకుదాను మేలుఁ గానక చెడిపోవు । విశ్వ. 2129

తే. ధర్మపరుఁడైన పరిపూర్ణదాతగురుఁడు । దానమొనరించునంతటఁ దత్వమరుఁ
దానుదానగు మననంబుఁజాకఁగనగు । దాన సార్థక్యమపుడటు తనరువేమ. 2130

ఆ. ధర్మబుద్ధిచేత దైవంబుఁదెలిసినఁ । గాలుఁ డేమిసేయఁ గలఁడు ప్రజల
ధర్మమంటి వెంట దైవంబునుండును । విశ్వ. 2131

ఆ. ధర్మమన్నవినరు తనువునమ్మిన నరు । ల్యమునివారు వచ్చియడలఁజేసి
చొచ్చికట్ట తమరు చొరఁబారఁగలరకో । విశ్వ. 2132

ఆ. ధర్మమరసి పూని ధర్మరాజాదులు । నిర్మలంపుఁ బ్రౌఢి నిల్పుకొనిరి
ధర్మమే నృపులకుఁ దారకయోగంబు । విశ్వ. 2133

ఆ. ధర్మమునకుఁగీడుఁ దలఁచినవాఁడు తా । దుష్టమార్గుఁడగును ద్రోవనెచెడు
గురువుపత్నిఁ గవయఁ గోరెడు హీనుండు। మొదలుసెడఁడె ముప్పమూడివేమ.-2134

ఆ. ధర్మసత్యములను దప్పఁగాఁ చెడఁబుచ్చు । కర్మజీవి మేలుఁ గానలేఁడు
నిర్మలహృదయుండు నీరూపముననుండు । విశ్వ. 2135

క. ధర్మార్థకామమోక్షము । లర్మిలి మదిఁ దెలిసినంత నామోదంబా
నిర్మలగతిఁదాఁగనవలెఁ। గర్ములకును లేదుముక్తి గదరావేమా. 2136

ఆ. ధాత్రిజనులకెల్లఁ దగనెఱింగించెద । నొనర హారు నెఱుంగు నుపమయొకటి
మనసుచెదరనీక మహిమతోఁజూచుటే । విశ్వ. 2137

ఆ. ధార్మికునకుఁగాని ధర్మంబుగనరాదు । కష్టజీవికెట్లు కానఁబడును
నీరుచోరమి లోతు నిజముగాఁ దెలియదు । విశ్వ. 2138

క. ధూమాదుల నావృతమై । వ్యోమంబునకెగసి కలియు నుపమను దనలో
శ్రీమించు శివునిఁజేరును । కామాదులఁగలియఁ డతఁడు ఘనముగ వేమా. 2139

ఆ. ధైర్యయుతున కితర ధనమైననదురేమి । దానమిచ్చినపుడె తనకుదక్కు
నెలమిమించుపనికి నెవరేమిసేయుదు । రడుగుదప్పఁదప్పఁ బిడుగు వేమ. 2140

ఆ. ధ్యానివలెనెయుండు మౌనివలెనెయుండు । భోగివలెనెయుండు రోగివలెనె
సకలమునుదెలిసిన సర్వజ్ఞుఁడైయుండుఁ । బరమయోగి యిలను బరగ వేమ. 2141

క. ధ్వనిపుట్టినవాలించుచు । ధ్వనిమధ్యమునందుఁజేరి ధ్వనితానై తాఁ
గనుపించునంతఁ దనహృ । ద్వనజంబునఁజూడముక్తి వశమగు వేమా. 2142

# న

ఆ. నక్కనోటికండ నదిలోనిమీనుకై । తిక్కపట్టివిడిచి మొక్కచెడఁగ
ముక్కవపడి గ్రద్ద మాంస మెత్తుకపోవు । విశ్వ. 2143

ఆ. నక్కపో తెఱుఁగునె నతగురులింగనిఁ । గుక్కపో తెఱుఁగునె యొక్కప్రొద్దు
మ్రుక్కిడిదియెఱుఁగునె మోక్షంబుత్రోవయు । విశ్వ. 2144

ఆ. నక్కవినయములను నైగారములువల్కు । కడుపకెల్ల ధనముఁ గూడఁబెట్టుఁ
గుక్కబోనువాఁతఁ గూడుచల్లినరీతి । విశ్వ. 2145

క, నగజాతకుఁ దనదేహము । సగపాలుగనిచ్చువాని జప మూనుమ యా
పగఁదీఱ్ప నేర్పకున్నను । మగవాఁడా మగువగాక మహిలో వేమా. 2146

తే. నచ్చుపడుబుద్ధిలోపల నడవఁబోదు । చొచ్చినిర్భయవృత్తిలో సూక్ష్మమెఱిఁగి
మ్రుచ్చువలెతిచ్చమైకొనముఱియుచుండు। దచ్చనలుగావుయోగిసాధనము వేమ. 2147

ఆ. నచ్చుసేయరాదు నమ్మినైక్యమునకు । మ్రుచ్చెఱుఁకను మ్రింగిముదముగాంచి
చొచ్చిబయలుచేరి సొమ్ముసిల్లునుయోగి । విశ్వ. 2148

క. నడజీవులు స్థావరములు । వడిఁ జనిపోవంగ నెఱిఁగి భావములోను
న్విడువక బ్రహ్మముఁదలఁపరు । వడి చని పోకుందు రెవరు వసుధను వేమా. 2149

క. నతిఁజేసి పతినివేడెడు । సతిమర్మముగానవచ్చు సరసోక్తులనే
మతిఫోక లడఁచిపట్టిన । సతిదుర్గతి వీడిన దగు సత్యము వేమా. 2150

క. నందనసంవత్సరమునఁ । బొందుగఁ గార్తికమునందుఁ బూర్ణిమనాఁడీ
వింధ్యాద్రిసేతువులకును । సందున నొక వీరుఁడేలు జాటర వేమా. 2151

క. నందనుఁడు పెఱిగి పెద్దల। కందఱికి విధేయుఁడైన నానందమగుం
బొందిక చెడి సత్పురుషుల। నిందనుబడఁ జింతగలుగు నిక్కము వేమా. 2152

క. నదినుదకంబులు చనుక్రియ । మదిఁబోడమెడు తత్వవిదుల మహిమాన్వితులై
పృధివినిగల నరులాదవఁగఁ । బదపడిసద్గతులుపొంద బాగగు వేమా. 2153

క. నదియుదకంబును బ్రియమగు। మది నొదవెడు తత్వబుద్ధి మగ్నత లెన్నం
దుదపదవి గలియ ఘనమగు । నుదధిఁబ్రవేశించు గంగ యొప్పగు వేమా. 2154

తే. నందిదుర్గముపైనుండు నాతిఁగూడి । ముందు వెనుకఁదోఁగక ముచ్చటాడి
పొందుఁగోరినవాఁడెపో పూర్ణుఁడరయ।మందునికినెట్టు లిదిగల్గు మహిని వేమ. 2155

ఆ. నందుఁడైనయాతఁ డిందు నం దనకుండు । నన్నితావులందు హరునివలెనె
తెలియువారికెల్ల దేవుఁడైకాన్పించు । విశ్వ. 2156

తే. ననయుచుండెడిజ్ఞప్తి నంటునదికాక । ధ్యానమమరఁగఁ బెరజ్ఞప్తిఁదాకినంత
స్వానుభవపూర్ణమై యొప్పుసజ్జనులకుఁ। గనఁగలారలుమాత్రమే కాంత్రు వేమ. 2157

క. నభమైననందవచ్చు మ । ఱిభమును బట్టంగవచ్చు నిమిడికలోనే
వ్యభిచారి మనుననిలుపఁగఁ । బ్రభువులకును సాధ్యపడదు పైకొను వేమా. 2158

ఆ. నమన మొనరవచ్చు నారాయ ణనవచ్చు । మేలువారిఁజూచి మెచ్చవచ్చుఁ
గొంగుకాసునడుగ గొబ్బుననీలేఁడు । విశ్వ. 2159

ఆ. నమ్మినట్టెయుండి నొకభూతమనంగఁ । జాపబొరలవేసి చక్కఁబోవు
నీతగాఁడయిన నటేలఁబోనిచ్చురా । విశ్వ. 2160

ఆ. నయనదృష్టిమీఱ నడపడి గుత్తించి । భయములేక నొక్క బయలు పడక
స్వయముజ్యోతినంటి సౌభాగ్యమందురా । విశ్వ. 2161

ఆ. నయముగాను దృక్కు నాళంబులోనొంచి । భయముమానిపట్టి భ్రమలఁద్రొక్కి
స్వయముగానుబుద్ధి సాధించిచూడరా । విశ్వ. 2162

క. నరకులమునఁ దాఁబుట్టియు। నరకులమునఁ దానుబెరిగి నరుఁడయ్యును దా
నరకులమున ఛీఛీయన । హరకులమునఁ దిరుగు నేని హరుఁడా వేమా. 2163

క. నరజన్మముఁ దానెత్తియుఁ । బరమాత్మ నెఱుంగలేక పాపాత్ముండై
కొఱగానిపను లొనర్చినఁ। దిరిగి యధోగతికి నేగుఁ దిరముర వేమా. 2164

ఆ. నరుఁడటఁ బరమాత్మగురునిఁ జేరినపుడ । హస్తమందు మోక్షమపుడె చూపు
విరివిసంపదలను విఱ్ఱవీఁగినజీవి । పర మెఱుఁగఁడు యమునిపాలె వేమ. 2165

ఆ. నరుఁడయినను లేక నారాయణుండైనఁ। దత్త్వబద్ధుఁడైన ధరణి నరయ
మరణమున్నదనుచు మదినమ్మవలెనుమ్మి । విశ్వ. 2166

ఆ. నరుఁడు జాగరమున నటియించుచుండును। నరుని కిలను జాగ్ర తరుదునుమ్మి
నరుఁడు జాగ్రతనుట ధరణిలోఁబరమాత్మె । విశ్వ. 2167

ఆ. నరునిబిందువునను నాతిగర్భముఁగట్టు । రాతియుప్పు చేత రసముఁగట్టు
బుద్ధి తెలివియున్న భువనంబుఁ గట్టదా । విశ్వ. 2168

క. నల్లనిసతి నొల్లనిపతి । ఫుల్లాంబుజనేత్రిఁ గోరు బుద్ధినిగుదురై
యల్లది యొప్పిన మేలే । కల్లరియైనంత నొల్లఁగలఁడా వేమా. 2169

ఆ. నల్లబోడితలలు తెల్లనిగొంగళ్లు । నొడలబూదిపూఁత యొంటిరోఁత
యిట్టివేషము లవి పొట్టనింపనెనుమీ । విశ్వ. 2170

క. నలుగురిదొంగలఁ బట్టుక । తలఁగొట్టఁగవలయు నొకనిఁ దగఁ మన్నింప
న్వలెరా ముప్వురిఁదీరిచి । యిలలోపల నెఱుఁకఫలమె యిదియగు వేమా. 2171

క. నలుగురిదొంగలఁ బట్టుక । తలఁద్రుంపక యున్నయట్టి తామసికేలా
కలుగును జ్ఞానము ధరని । శ్చలపాలన మాత్మసుఖము సత్యము వేమా. 2172

క. నలుగురు గలచోటను డాఁ । దలచూపుచు మెలఁగుచుండి ధన్యతఁగనఁగాఁ
దలఁచెడియాతఁడు నిచ్చలుఁ । గలమాటలె పలుకుచుండఁగాఁ దగు వేమా. 2173

ఆ. నలుఁ డలదమయింతి నలరఁగఁబెండ్లాడి । పుష్కరునకునోడి భూమివిడిచి
భార్యతోడఁదాను బటుపేదఁదనమున । నడవిఁదిరుగలేదె యపుడు వేమ. 2174

క. నవ్వును జదువును బాడును । నొవ్వక తా నిట్టిచెప్పు నుడువు నెమఱచు
న్నివ్వటిలియుండు ముదిమిని । నివ్విధమునఁ జూడఁజూడ నెవ్వఁడు వేమా. 2175

ఆ. నాకునెవరుదిక్కు నడినాళములలోను । వేగుచుక్కవంటి వెలుఁగెదిక్కు
వెలుఁగుకంటెదిక్కు వెదకంగలేదయా । విశ్వ. 2176

ఆ. నాగుఁబాముఁగన్న నంబిబ్రాహ్మణుగన్నఁ । జెవులపిల్లిఁగన్నఁ జేటువచ్చు
గరుడినిగనుఁగొన్నఁ గలకోర్కెలీడేరు । విశ్వ. 2177

తే. నాటి వినవచ్చు బ్రిణవంబు నాకమందు । సూటిఁదప్పకమదియందు సూత్రిపటచి
కోటదాటిన నిశ్చలకూటమగును । వాటమగుదీనిఁ దెలియంగవలయు వేమ. 2178

క. నాటును గురువరమంత్రము । దీటుగ మదియందుఁ జేర్చి ధీరుఁడవగుచు
న్నాటును నినుఁగను చోటికిఁ । గోటికిఁ బడ గెత్తనేమి కుదురుర వేమా. 2179

క. నాడీచక్రముఁ జూడఁగ । నాడులు పది ముఖ్య మల్ల నాడులలోనం
గూడలి నాసిక కుడియెడ । మూఁడును నిడపింగళాఖ్యములఁ దగు వేమా. 2180

ఆ. నాడెమైన చెడిపె నయమెఱింగి తిరుగు । విటునిఁ గుస్తరించు వివరమెఱుఁగు
ఖానిసైన తొత్తుఁ బాటింపరాదయా । విశ్వ. 2181

ఆ. నాణెమైన లంజె నగవు మేలు నెఱుంగు । విటునిఁ గుస్తరించు వివరమెఱుఁగు
బానిసయినదాని పాటిఁ గోరఁగరాదు । విశ్వ. 2182

ఆ. నాతిపైని బ్రేమ నానాఁటికి నిరోఁత । జ్యోతిపైని బ్రేమఁ జూడఁగాను
మాతపైని బ్రేమ మర్యాదయౌ నెప్డు । విశ్వ. 2183

ఆ. నాదబిందుకళల నయమొందియాత్మయం । దంటిచపల చిత్తమమర నిల్పి
బ్రహ్మరంధ్రమునను బ్రబలిన యోగియౌ । విశ్వ. 2184

క. నాదము బిందువు బిందువు । నాదంబుగఁ జేసి కళను నాదును బిందు
న్నాదుగఁ జేసియు నీయొక । నాదంబునె చూడ యోగినాథుఁడు వేమా. 2185

ఆ. నాద మలరఁ జేసి నాదముఁ బొంగించి । భేద మింత లేక పెనఁగినపుడు
పాఱుకాల్వ వలెను బాఱురాయీనాదు । విశ్వ. 2186

క. నాదముఁ దెలిసిన యోగియె । వేదాంతములోన నున్న విధిఁ దెలుపు మది
న్నాదంబె ముక్తిపదమని । యాదరమున జనులతోడ ననరా వేమా. 2187

క. నాదము బ్రహ్మం బనుచును । వేదములను జదువవచ్చు వినికనినంత
న్నాదంబులేని బయలున । నాదాంతమె పూర్ణపదవి నయముగ వేమా. 2188

క. నాదమును బిందుకళలను । గాదనక యె వినియుఁ గనియుఁ గడుఁ జిత్రముగా
మోదించి దాటకున్నన । భేదము నొందించు నెఱుక పెంపే వేమా. 2189

క. వాదము ముక్తికిఁ దెరువగుఁ । బాదును దెలియంగనగును బరిపక్వముతో
భేదంబు మాని మదిలో । వేదిక పైఁ జేరి వినుము విసువక వేమా. 2190

ఆ. నాదినీదటంచు ననువుగాఁ బల్కునఁ । గాదు కాదటంచుఁ గాలఁ ద్రొక్కి
పాదుకొనెడు యుక్తిఁ బడయని వారికిఁ । జేదు పుట్టి ముక్తి చెడును వేమ. 2191

ఆ. నాదు నాదుఁ గూడి నామరూపంబైన । నాదులోన నాదు నాటియుండు
నాదుఁ జేయువారు వర్ణింపలేరయా । విశ్వ. 2192

ఆ. నాదునాదుఁజూడ నాతులయందుండు । నాదులేక లోకనరులె లేరు
భేద ముడిగిదీనిఁ బ్రియపడి కనుఁడయ్య । విశ్వ. 2193

ఆ. నాథుఁ డున్నయట్టి నవబోడియాతని । దేవుఁడనుచు నెంచి సేవచేయఁ
దగునుగాని యొరునిఁ దా నంటవచ్చునా । విశ్వ. 2194

క. నామన సనుకొని మనుజులు । కామినులనుగూడి పూర్వకర్మంబునఁ దా
మే మేమిపనులఁబూనినఁ । బాముల కిరవగుచునుండు భద్రము వేమా. 2195

ఆ. నారయననవచ్చు నమశివ యనవచ్చు । మేలువారినమ్మి మెచ్చవచ్చుఁ
గొంగుకానువిడిచి గొబ్బుననీరాదు । విశ్వ. 2196

ఆ. నాల్గునాలుగింట ననువుగాఁదగుఁగాని । నాలవయిలువాని నయమెఱుఁగరు
అట్టివాని నరయు నాతఁడేశివయోగి । విశ్వ. 2197

క. నాలుగు వీధులమధ్యను । మేలుగ బ్రహ్మంబు నుండు మెలఁకువతోడం
జాలగ గురుమూలంబున । వీలుగఁ బొందంగ నగును వినరా వేమా. 2198

సీ॥ నావదినెయునాఁడు, నవరత్న భూషణ । ములు ధరించినయంద, మలరఁజూచి
యాభూషణములు వా, రాంగనకేఁబెట్టు । వలెనని తోఁచినా, వదినెకడకుఁ
జనియు నీకున్న భూ, షణములిమ్మని యన । నడ్డబాసయెతక్క, నన్నియొసఁగె
ముక్కు భూషణ మది, ముఖ్యమైనది దాని । నీ కున్నబ్రాణమ్ము, లేగునంటి
నట్టులైనను గొనిపొమ్మి, యనుచునిచ్చె । యల్లవెలయాలికీభూష, ణాదులిడియుఁ
జీరఱవికయువిడిపింపఁ, జేసి చూడు।మనియె నటుచేయరోసెనా, మనను వేమ 2199

ఆ. నాసికందుదృష్టి నయనించుయోగికి । వాసివన్నెలేల వసుధలోనఁ
గాశినాథుఁ డతఁడ గణుతింప లేరయా। విశ్వ. 2200

ఆ. నాసికంబునడమ ననుఁజూచుయోగికి । వాసివన్నెలేదు వసుధలోనఁ
గాశినాథుఁడైనఁ గనగలఁడాయోగి । విశ్వ. 2201

తే. నాసికాగ్రపుఁజూపున నట్టుపడఁగ । బుద్ధినొక్కుచు గురుశక్తిపూనినపుడు
ముద్దుగుల్కెడుతనయాత్మమూలమగును। దానఁబరిపూర్ణతకుఁదగుదారి వేమ. 2202

ఆ. నాసికాగ్రమందు నయముగాగుఱినిల్పి । వాసిగానుజూడ వశ్యమగును
గాశికంచులఁ గనఁ గడగండ్లుపడనేల। విశ్వ. 2203

ఆ. నాసికాగ్రమందు నయమునఁజేర్పక । మూసిమూయక కనుమూలమందుఁ
జూచిచూడనతఁడె శుకయోగియగుఁ దన్నుఁ। బాయకున్న నాఁడె పరము వేమ.2204

తే. నిక్కమగు జ్ఞాననిష్ఠలో నేర్పుమీఱ । సాక్కిసోలియు భ్రమయక సూక్ష్మమంది
చిక్కపడకుండువాఁడెపో చిన్మయుండు। దక్కవగ వానిఁగనలేరు ధరను వేమ. 2205

ఆ. నిక్కమైనమంచి నీలమొక్కటిచాలుఁ । దళుకుబెళుకురాలు తట్టెడేలఁ
జదువఁ బద్య మరయఁ జాలదాయొక్కటి। విశ్వ. 2206

క. నిఖిలాకారుఁ డనంతుఁడు । నిఖిలమునకు సర్వసాక్షి నిజముగఁ దానై
నిఖిలంబునందు వెలుఁగుచు । నిఖిలంబై యుండునతఁడు నిజముగ వేమా. 2207

ఆ. నింగినెగయువాఁడు నెఱిలోకమునలేఁడు । బంగిఁద్రాగువాఁడు బలియఁబోఁడు
కొంగయోగములను గోర్కెలడంగునా । విశ్వ. 2208

ఆ. నిగురుగప్పినట్లు నిశ్చలభక్తితోఁ । దగిలియుండ ముక్తి తానెవచ్చు
జగతినొప్పఁజెప్ప జాణండులేఁడయా । విశ్వ. 2209

క. నిజగురులక్ష్యం బుంచక । యజపాదిక్రియలమీఱి యలమటపడకే
నిజవిమలాంతస్పందిన । సుజనుని నెన్నంగఁదరమెసూటిగ వేమా. 2210

ఆ. నిజగురూపదేశ నిశ్చయాత్మకవిద్య । రక్షకం బటండ్రు రాజవీధి
మధ్యదేశమందు మార్కొనిచూడనా । విశ్వ. 2211

ఆ. నిజముకల్లరెండు నీలకంఠుఁడెఱుంగు । నిజములాడకున్న నీతిదప్పు
నిజములాడునపుడు నీరూపమెనవచ్చు । విశ్వ. 2212

ఆ. నిజముకళలమీఱి నిత్యుండుకావలె । పలుకులోనిపలుకు పదిలపఱచి
వేడుకలరముక్తి వెన్నంటిచూడరా । విశ్వ. 2213

ఆ. నిజముఁదెలియనైన సుజనుఁడానిజమునె । పలుకవలయుఁగాని పరులకొఱకు
దాపఁగూడ దింక నోప దన్యముఁబల్క । విశ్వ. 2214

ఆ. నిజము నేలనెఱిఁగి నిత్యుఁడుగాఁడాయె । పలుకులోనిబిందుఁ బదిలపఱచి
వేడుకైనబిందు వెదఁబెట్ట కుండియు । విశ్వ. 2215

క. నిజముం బలికెడునరులకు । విజయముగలదెందువారి విభవముఁజూడం
గుజనాళికోర్వశక్యమె । సుజనులమహి మెన్నఁదరమె సూటిగ వేమా. 2216

ఆ. నిజములాడునతఁడు నిర్మలుండైయుండు। నిజములాఁడు నతఁడు నీతిపరుఁడు
నిజముఁబల్కకున్న నీచచండాలుండు । విశ్వ. 2217

ఆ. నిజములాడువాని నిందించుజగమెల్ల । నిజములాడరాదు నీచులకడ
నిజముహాత్ముఁగూడ నిజమాడవలయురా । విశ్వ. 2218

ఆ. నిజమువరుసనెఱఁగి నిత్యుఁడవగుటకుఁ । బలుకులోనిపలుకుఁ బదిలముగను
బలుకువానినీవు పరికించిచూడరా । విశ్వ. 2219

ఆ. నిజమువరుసనెఱఁగి నిర్గుణత్వంబందఁ । బలుకులోనిశబ్ద మలరఁదెలియఁ
బలుకకుండువాఁడె పరమాత్ముఁడందురు । విశ్వ. 2220

తే. నిటలదుర్గములోనున్న నిజమెఱింగి । పటుతరంబుగ మదినిల్పి ప్రబలయోగి
యంటిముట్టును నిర్గుణం బట్టిమదిని । గెంటుపడఁదెప్ప తెలియునీ కిటుకు వేమ. 2221

ఆ. నిటలదుర్గమెక్కి నిక్కి మాఢంగనె । కుటిలరూపకళలఁ గూల్చి నెఱుక
పటుతరంబుగాను బట్టిసాధింపుఁడీ । విశ్వ. 2222

క. నిండినమతమున వెదకిన । నుండెడి శేవస్తువైన నుపముఁదలిర్ప
న్దండిగ నిండినపిమ్మట । ఖండించినవెల్తిగాదు గదరా వేమా. 2223

ఆ. నిండునదులుపాఱు నిలిచిగంభీరమై । వెఱ్ఱివాగుపాఱు విఱిగిపొర్లి
యల్పుఁడాడురీతి నధికుఁ డాడఁడుసుమీ । విశ్వ. 2224

క. నిత్యంబుకానియొడలికి । నిత్యముదుఃఖంబుఁబడును నిరతినిధరలో
నిత్యానందపుఁబదవిక । నిత్యపుదుఃఖంబు పడఁగ నేరరు వేమా. 2225

తే. నిత్యసత్య నిరామయ నిర్గుణంబు । మృత్యుసమదృష్టిలోనెంచి మిన్నకుండి
భృత్యభృత్యానురాగుఁడై భృకుటినంటి। నృత్యమాడుచునుండు లే నియతి వేమ. 2226

తే. నిత్యసత్య వ్రతాచార నిపుణుఁడవయి । పరమధర్మార్థములనెల్లఁ బట్టిచూచి
సిద్ధిఁబొందెడుపరిపూర్ణ చింతఁబూను । మప్పు డానంద మమితమౌనయ్య వేమ. 2227

క. నిత్యానందవివేకము । సత్యంబుగఁదెలియకున్న శక్యంబగునా
ముత్యముసరి గురుమర్మము । భృత్యుఁడవై మదినెఱుంగఁ బెంపగు వేమా. 2228

ఆ. నిద్రజాగరముల నెలవులఁదానుండెఁ । గప్పుకొన్నమాయఁ గానలేక
దబ్బరనిజములను దాబాగుగఁగనక । గొబ్బునఁజెడిపోవు గుణము వేమ. 2229

ఆ. నిద్రమేలు తెలిసి నిలుపుఁడీమిలోనఁ । బ్రాణిమేలు తెలిసి పాయకుండుఁ
బ్రాణి నిదురసందుఁ బరమాత్ముఁడెఱుఁగురా । విశ్వ. 2230

ఆ. నిద్రలోనినిద్ర నిజముగాఁదెలిసిన । భద్రమగును మిగుల బ్రహ్మవిద్య
నిద్ర తెలియువాఁడు నిర్మలయోగిరా । విశ్వ. 2231

ఆ. నిద్రలోనినిద్ర నిర్జరతాప్తికా । తామసంపునిద్ర తలఁగఁద్రోయు
నిద్రలోనినిద్ర నిర్భీతి నుదయించు । విశ్వ. 2232

ఆ. నిద్రలోనినిద్ర నిర్జరవిదితంబు । తామసంపు నిద్ర తలఁగిపోవ
సతిపతు లొగిఁగూడ సమయంబు నిద్దురా । విశ్వ. 2233

ఆ. నిద్రలోనినిద్ర నిర్భేద్యమనఁదగుఁ । దామసంపునిద్రఁ దలఁగద్రోచి
సతత మదియె పూన సర్వదా యోగియా । విశ్వ. 2234

ఆ. నిద్రలోని మనసు నిలుపుము లోకము । ల్భద్రిముగను జూపి భ్రమయఁజేసి
పొత్తువిడువకుండుఁ బొసగఁగ నీలోన । విశ్వ. 2235

తే. నిద్రలోవచ్చు సంపద నిజముగాదు । భద్రమైనదిపరిపూర్ణభావపరము
ముద్రలో భద్రమైనది మూలవిద్య । చిద్రహస్యము తెలియంగఁ జెల్లు వేమ. 2236

క. నిందించు భ్రమలఁ జెందక । పొందిన మదిఁజేరనొక్క పోడిమితోనీ
వందుకొని గురురహస్యము । సందియ్యాక పూర్ణుఁడవగు సతముఁడవేమా. 2237

క. నిను నీవెఱుఁగఁగ నెంచిన । మనసున సంకల్పములను మానఁగవలెరా
యనుమాన రహితమగుగుఱి । వినయంబున గుఱిని బట్టి వెదకుము వేమా. 2238

ఆ. నిన్నుఁజూచుచుండ నిండును దత్వంబు । తన్నుఁజూచుచుండ దగులు మాయ
నిన్ను నెఱిఁగినపుడె తన్నుఁదా నెఱుఁగును । విశ్వ. 2239

ఆ. నిన్నుఁజూచెనేనిఁ దన్నుఁదామఱచును । దన్నుఁజూచెనేని నిన్నుమఱచు
నేవిధమున మనుజుఁ డెఱుఁగు నిన్నును దన్ను । విశ్వ. 2240

ఆ. నిబిడమైన తమము నిక్కిదాటఁగ లేక । గుబురు బట్టబయలు కూడు టెట్లు
ప్రబలుచున్న మదిని బాలించి చూడరా । విశ్వ. 2241

ఆ. నిమ్మఁబండువుట్టె నిజమైనరసముండె । హేమమునకు నేత్తు రేలఁ బ్రజలు
సత్తుపొత్తుఁజేసి సాధింపలేరకో । విశ్వ. 2242

తే. నిమిషమైనను మదినిల్పి నిర్మలముగ । లింగజీవేశులను గాంచి భంగపడక
పూజమదియందుఁ జేయుట పూర్ణపదవి । పరముఁగోరిన నిదిచేయ బాగు వేమ. 2243

ఆ. నియతివృత్తి మీఱినిట లదుర్గముఁజేరి । భయములేకయుండు బ్రహ్మవేత్త
జయముగల్గముక్తిఁజవిజూచుచుండురా । విశ్వ. 2244

సీ. నియమాది సంగుఁడై, నిలిచినఁదత్వంబు । తామసంబగునిద్రఁ, దలఁగఁజేయు
నిద్రతాఁదలఁగిన, నిర్భీతి నొందించు । శమమున నానంద, సమితిపుట్టు
నానందమున విశ్వ, మంతయుఁదానగుఁ । దాను విశ్వంబైనఁ, దత్వమగును
దత్వమింద్రియ పంచ, కత్వంబునను నిల్పుఁ । దత్వంబు నిలచిన, దానయగును

రాజయోగీంద్రుఁ డాతఁడై, తేజరిల్లు । వెలయు జగముల విహరించు, విశ్రుతముగ
బాలువిధమున వృద్ధుని,పగిది సోఁక । కరణి వెంగలి క్రియఁజూడ,ఘనత వేమ. 2245

ఆ. నియమితాసనమున నిలిచిన చిత్తంబు । తామసంపు నిద్రతలఁగ ద్రోయు
నిద్రతొలఁగినంత నిర్భీతి యుదయించు । విశ్వ. 2246

క. నిరతం బెడ తెగకుండం । బరిపూర్ణబ్రహ్మ మాత్మపదముననుండు
న్నిరపద్యమైన నడవిని । జరియించును జగమెఱుంగ సత్యము వేమా. 2247

తే. నిరత మాత్మ చిదానందనిలయమందు । సరవితోడుతఁబరి పూర్ణ సౌఖ్యమెసఁగి
యరిదియగు బల్తేరుటయనుభవంబు । గురునిపాలి పున్నఁగూడెడి గుఱుతు వేమ 2248

తే. నిర్మలజ్ఞాన పరిపూర్ణ నిష్ఠయందు । కర్మసన్న్యాసయోగియై కసిమసంగి
మర్మమెఱుఁగుచునుండుటే మౌనమయ్య । ధర్మమింతయెబోధించు ధరణి వేమ. 2249

క. కర్మలసమాధిఁబూనియు । కర్మలఁదొలగించి మించి కాంక్షించికొన
నిర్మోహమైన గుణమగు । ధర్మముపరిపూర్ణమగును దాకును వేమా. 2250

ఆ. నిర్మలాత్మవిద్య నిత్యసత్యజ్ఞాన । నిరతుఁడైనవాఁడు నేర్పుమీఱ
ననుభవింపఁగోర నలసఁటబొందునా । విశ్వ. 2251

క. నిర్వాతకళికసామ్యపు । సర్వాత్ముని మదిని జూడ సారము గాన
న్నిర్వేదనమగు దుర్గతి । గర్వముచెడి పరము గల్గుఁగ దరా వేమా. 2252

క. నిఱుపేదల రక్షించెడి । సరసుఁడు నెఱదాత గాక సంపన్నులఁదా
భరియించువాఁడు దాతయె । మెఱమెచ్చులదాతయతఁడు మేదిని వేమా. 2253

తే. నిర్గుణాంశము మదినెన్ని నేర్పుమీఱ । స్వర్గమని యెంచుచుండిన శాశ్వతంబు
భర్గుఁడేవచ్చి భ్రమలనుబాపునయ్య । దుర్గుణభ్రమలనుబాయుదొసఁగు వేమ. 2254

తే. నిష్ఠయందును దృఢమైన దృష్టిఁబూని । కష్టయోగంబులను మించి కాంక్షదీఱ
వ్యష్టిపరిపూర్ణమందుట వదలకున్న । స్పష్టమపుడౌను సంతోషసరణి వేమ. 2255

ఆ. నిహతిపుట్టువులకు నెలవిహమందురు । కుహరలోక మందుఁ గుతుక మేది
యహరమందుఁజూడఁదలఁగును దత్వంబు । విశ్వ. 2256

క. నీచకు లీనుని వ్యాసునిఁ జూచిరె నారాయణాంశ శోభిల్లభువి
న్గోచులకెల్లను మేటిగ । వాచాలత నొందె నౌరవసుధను వేమా. 2257

ఆ. నీచగుణము లెల్ల నిర్మూలమైపోవు । కొదవలేదు సుజన గోష్ఠివలన
గంధమలద మేని కంపడఁగిన యట్లు । విశ్వ. 2258

క. నీచుల వినుతులు సేయుచు । యాచకమునఁ దిరిగితిరిగి యలయుటకంటెన్
నోచిన యింద్రియపశువులఁ । గాచెడివాఁ డిందు నందు ఘనుఁడగు వేమా. 2259

ఆ. నీటిలోని వ్రాత నిలువక యున్నట్లు । పాటిజగతి లేదు పరము లేదు
మాటమాటకెల్ల మనసు గోరుచునుండు । విశ్వ. 2260

ఆ. నీతిజ్యోతిలేక నిర్మలంబగు నేది । యెట్లుకల్గుఁ బరమ దెంతయైన
ధనము గలిగియున్న దైవంబు రాదయా । విశ్వ. 2261

ఆ. నీతిఁదెలియఁజెప్ప నిజముగ వేమన । పాతకముల నెల్లఁ బాఱఁబట్టి
లోతుతత్వ మరసి లోకులకును జెప్పె । విశ్వ. 2262

క. నీతియుభక్తియు జ్ఞానము । రీతుల వర్తించుమదిని రేవెలుఁగగుచున్
జ్యోతిగఁదగునా బ్రహ్మము । భూతాత్ముఁడునిన్నుఁబొందుఁబోడఁగను వేమా 2263

తే. నీతి వైరాగ్య సద్భక్త్యుపేతులకును । ఘాతకులు గాని సుజ్ఞానకలితులకును
వ్రాలకందని పద్యము ల్వేలసంఖ్య । లుగను జెప్పంగనయ్యె రాజగతి వేమ. 2264

క. నీమము పెట్టుక ద్రవ్యము । కామంబునఁ గొనుచు భువిని గల్లరికూత
ల్నేమముగఁబలుకుచుండినఁ । గోమటు లోక కొందఱుండు కుంభిని వేమా. 2265

ఆ. నీరుకారమాయెఁ గారంబు నీరాయె । వారినిర్వికారవస్తువాయె
నీటిలోననుండు నిఖిల బ్రహ్మాండంబు । విశ్వ. 2266

ఆ. నీరుకారమాయెఁగారంబు నీరాయెఁ । గారమైననీరె కారమాయెఁ
గారమందు నీరు కడురమ్యమైయుండు । విశ్వ. 2267

ఆ. నీరుకారమౌను నీరౌనుగారంబు । వానివద్దనిద్రబోను వచ్చు
నీటిలోనెయుండు నఖిల బ్రహ్మాండముల్ । విశ్వ. 2268

ఆ. నీరునన్నములును నిమురయుఁదామాని । ముక్తి కోఱకు తిరుగు మూఢజనుఁడు
వెఱ్ఱిదైనకుక్క వేసారితిరుగురా । విశ్వ. 2269

క. నీరునఁబుట్టినదుప్పగు । క్షారము నీరాయె నీరుక్షారము నొకటే
యారీతి శివుని జీవుని । వారకమది నెఱుఁగ నౌను వసుధను వేమా. 2270

ఆ. నీరుపయినఁబడ్డ నిప్పులు బొగ్గులౌ । నిప్పుమీదఁదనుండనీరు పెట్టఁ
గళపెళనుచుఁ గ్రాగుఁ గడుఁజోద్య మిదికదా । విశ్వ. 2271

ఆ. నీరు పెదవిఁ గొట్టి నీమంబుతోడుత । నాచమానమనుచు నతఁడు చేసె
నాచమానమౌనో యల్పాచమానమో । విశ్వ. 2272

ఆ. నీరు మొదలఁబెట్టి నీరమే మొలకయ్యె । మొలకవిశ్వమగుచు మొనయుచుండు
నీరువిశ్వమగుట నేర్పుతోఁ దెలియరో । విశ్వ. 2273

క. నీలియుఁ దగరము జిల్లెడు । ఫాలాక్షునిరసముచేత భస్మంబులు గా
నేలంగలిమికి వగవఁగ । గాళాసురహరుని యాజ్ఞ గావలె వేమా. 2274

క. నీలోని యెఱుక యనునది । నీలోన నెఱిఁగి పెఱిఁగి నీలోనడఁగు
న్నీలోని చిత్ర మడఁచిన । నాలోచన బ్రహ్మబయలు నందగు వేమా. 2275

ఆ. నీళ్లమీఁదఁ జూడు నెరయ నోడలపరువు । బయలు మీఁదఁ జూడు పక్షిపరువు
ఆడువారిగమన మాలాగెయుండురా । విశ్వ. 2276

ఆ. నీళ్లమీఁదఁ జూడు నెరయ నోడలబల్మి । బట్టబయలఁ జూడు బండిబలిమి
ఆడుదానిబలిమి యాడనే చూడరా । విశ్వ. 1277

ఆ. నీళ్లమీఁద నోడ నిగిడి తిన్నగఁ బ్రాకు । బైట మూరెడైనఁ బ్రాకలేదు
నెలవుదప్పచోట నేర్పరి కొఱగాఁడు । విశ్వ 2278

ఆ. నీళ్లమీఁద బుగ్గ నిలచినప్పుడు । తళ్లు వేగవచ్చి తాఁకఁగా దె
విడెడు కుండ కింత విభ్రాంతిపడుదురు । విశ్వ. 2279

ఆ. నీళ్లమునుఁగ నేల నిధుల మెట్టఁగ నేల । మొనసివేల్పులకును మ్రొక్క నేలఁ
గపటకల్మషములు కడుపులోనుండఁగా । విశ్వ. 2280

ఆ. నీళ్లమునుఁగువాఁడు నిర్మలాత్ముఁడుగాఁడు । పూర్ణమైనముక్తిఁ బొందలేఁడు
నీరుకోడి యెపుడు నీళ్లను మునుఁగదా । విశ్వ. 2281

ఆ. నీళ్లలోన మొసలి నిగిడి యేనుఁగుఁ బట్టు । బైటఁ గుక్కచేత భంగపడును
స్థానబలిమి కాని తనబల్మి కాదయా । విశ్వ. 2282

ఆ. నీళ్లలోని చేఁప నెఱిమాంసమాశకుఁ । గాలమందుఁ జిక్కి కూలినట్లు
ఆశపుట్టు మనుజుఁడా రీతిఁ జెడిపోవు । విశ్వ. 2283

ఆ. నీళ్లలోని మీను నిగిడి దూరము పాఱు । బయట మూరెడైనఁ బాఱలేదు
స్థానబలిమి కాని తనబల్మి కాదయా । విశ్వ. 2284

ఆ నీళ్లుపోసి కడిగి నిత్యంబు శోధించి । కూడువెట్టి మీఁద గోకఁ గట్టి
యేమి పాట్లఁబడుదు రీదేహమున కిల । విశ్వ. 2285

క. నీవనినను నేననినను । భావమ్మున నెఱుక యొక్కపద్ధతి యగునా
భావంబుఁ దెలిసి మది ని । ర్భావముగా నిన్నుఁ గనుట పరమగు వేమా. 2286

క. నీవాడిన నేనాడుదు । నీ వుండిన నేనుందు నిర్వాణ్ణుఁడనై
నీవుదలంచినఁదలఁపుదు । నీవునగిన నేను నగుదు నిజముగ వేమా. 2287

ఆ నీవుగలుగునట్టి నెలవుఁదెలియువాఁడు । వసుధయందుఁద్రోవపడలఁ డెంచుఁ
కాలుగదల నీక గ్రక్కునఁజేరురా । విశ్వ. 2288

ఆ. నీవునిలిచియుండు నిఖిలంబు నిలువదు । నిలిచియుండు నెండ నీరుపలేను
నీవునిశ్చయంబు నిఖిలంబు మాయయౌ । విశ్వ. 2289

తే. నీవు నెఱిఁగను లోకంబు నీకుఁదోఁచు । నీవుమరిగినతోడ్తోడ నెందుఁబోయె
ననెడి యెఱుకనువిడనాడునయ్యయోగి।దానఁబరమార్థమెఱుఁగంగనౌను వేమ. 2290

ఆ. నీవుపలుకుచున్న నిత్యపూజితుఁడౌను । నీవుపలుకకున్న నిదురవోవు
నీవుపలుకు పలుకు నిర్మలుం డెఱుఁగురా । విశ్వ. 2291

ఆ. నీవువినఁగ నొకటి నిలిచియుండఁగలేదు । నిలువ నెండమావుల లరు నట్టె
నీవు నన్నెఱుఁగుట నిశ్చయం బాయెరా । విశ్వ. 2292

ఉ. నీవెసమస్తలోకములు నిండుచుఁబృథ్వినిటోలలాడుచు
న్నీవెచరించుచున్నదుల నీటను నగ్గిని దేజమొప్పుచో
నీవెచరించు నెల్లెడల నిండిన గాలి నభంబు నందును
న్నీవెకదా చెలంగునది నీవెవరందురె వెఱ్ఱివేమనా. 2293

ఆ. నూటెనిమిది గళ్లనోము పుణ్యములెల్లఁ । గలవెజీవులకును గన్నయపుడె
చెడిననీళ్లునదిని జేతిమీఁదైనట్లు । విశ్వ. 2294

ఆ నూరుపలుకవచ్చు నుడివ్రాయఁగారాదు । వ్రాతకన్న సాక్షివలపదెన్నఁ
బరగవ్రాతలేని పక్షముననపుడు । బలిమిసాక్ష్యమున నె ఫలము వేమ. 2295

ఆ. నెత్తి వేదవేత్త నేమంబునొనగూడు । షోడశోపచారసూక్తు లిలను
జేసి శివుని నెపుడు సేవించువాఁడయా । బ్రాహ్మణుం డతఁడనిపలుకు వేమ. 2296

ఆ. నెనరుగలుగగురుఁడునిటలదుర్గముఁజూపుఁ।గనులచూడ్కిమఱుఁగుగవయఁ జూపు
జెనకి యాత్మరూపుఁజేఁజేతఁజూపురా । విశ్వ. 2297

క. నేఁజచ్చినతోడనె మఱి । తాఁజచ్చును నపుడె పంచతత్వములొకటౌ
రాజత్స్వరూపమందును । దాజితుఁడె నిలచి యుండుఁ దథ్యము వేమా. 2298

తే. నేత్రిములచూపు దాటెడి నేర్పుఁబూని । సూత్రగమనము చెదరనిచూడ్కినంటి
గాత్రసంసర్గమొందులే గగనవిద్య । పాత్రతగలాని కదియబ్బుఁబరగు వేమ. 2299

క. నేననఁగ మేనుగాదని । మానసమున నెఱుఁగకున్న మనుజులకెల్లన్
స్వానుభవసిద్ధిదొరకదు । తానగుపరమాత్మ నెఱుఁగఁదరమా వేమా. 2300

ఆ. నేనను వచనంబు నీవనఁగావచ్చు । నీవు నేననఁబడు నిష్టఁదెలియ
నేనునీవెనీవె నేననవచ్చురా । విశ్వ. 2301

ఆ. నేను నీవని యెడి నెత్తంపుమాటలు । మానియుండు వాఁడె మానవిదుఁడు
తాను నేనని యెడి తమకంబుమానరో । విశ్వ. 2302

తే. నేను నీవను భావంబు నిగ్రహించి । నిర్వికల్ప సమాధిలో నేర్పుగాను
నిబిడమౌ పూర్ణమందుట నిత్యసుఖము । నిర్గుణబ్రహ్మమెఱిఁగి తానెగడు వేమ. 2303

క. నేనెవఁడను దలపెట్టిన । మానసమునఁదలఁపకుండ మనుజునకకటా
కానఁబడు నెడజనుండును । మానుగఁగనుఁగొనఁగవలయుమహిలో వేమా. 2304

క. నేనెవ్వఁడనని తలఁపడు । మానసమునఁ బుడమిలోని మనుజుఁడకటా
కానఁడు తానకలంబును । మానుగఁ గనుఁగొనుట యెట్లు మహిలో వేమా. 2305

సీ. నేమమున నెయుండ, నిల్చును జిత్తంబు । తామసముననుండ, దలఁగిపోవు
నెలవున్న చిత్తంబు, నిర్వృతినొందించు । నిర్వృతిసౌఖ్యంబు,నీరసించు
సౌఖ్యదూరగుణంబు, శమమును బొందించు । శమగుణమునుజూడ, శమతపుట్టు
నట్టి సమతవిశ్వ, మంతయుఁదానగుఁ । దానెవిశ్వంబగు, తత్వమగును
దత్వమింద్రియములు, దరిఁజూచిగెలుచును । దత్వవేత్తయగున, దానెమిగిలి
రాజయోగియగుచుఁ, దేజంబు చేతను । వెలసియుండుజగతి, వినర వేమ 2306

ఆ. నేయిలేనికూడు నీయాన కసువది । కూరలేనితిండి కుక్కతిండి
ప్రియములేనికూడు పిండపుఁగూడురా । విశ్వ. 2307

ఆ నేయివెన్నకాచి నీడనే యుంచినఁ । బేరగట్టిపడును బెరుగురీతిఁ
పోరిపోరిమడిని పోనీకపట్టుము । విశ్వ. 2308

ఆ. నేరనన్నవాఁడు నెరజాణ మహిలోన । నేర్తునన్నవాఁడు వార్తకాఁడు
ఊరకున్నవాఁడె యుత్తమోత్తముఁడెందు । విశ్వ. 2309

ఆ. నేరనిజనులకును నేర్పు నేరములెల్లఁ । జక్కఁజేయుదు రల సాధుజనము
ఒప్పుదుర్జనములు తప్పుగనెంతురు । విశ్వ. 2310

క. నేరములెంచెదు ప్రభువును । జేరఁగరాదయ్యనెపముఁ జెచ్చెరఁదెచ్చు
న్వారాశిదాటినను శని । మూలకుఁడైపట్టిచంపు మహిలో వేమా. 2311

ఆ. నేర్చినడతునన్న నేరమితావచ్చు । నోర్చినడతునన్న నోర్వరాదు
కూర్చినడతునన్నఁ గూడంగనీయదు । విశ్వ. 2312

ఆ. నేర్పుగలుగువారు నెఱతనముగలారు । విద్యచేత విఱ్ఱవీఁగువారు
పసిడిగలుగువారి బానిసకొడుకులు । విశ్వ. 2313

ఆ. నొసట వ్రాయ వాని నొసలుకొంచెముచేయ । నొసటికంటెవాని నొసలువ్రాత
నొసటిమీఁదివ్రాత నులిమినఁబోవునా । విశ్వ. 2314

ఆ. నొసలు భక్తుడయ్యె నోరు తోడేలయ్యె । మనసుభూతమువలె మలయఁగాను
శివునిఁగనియెనన్న సిగ్గెట్లుగాదకో । విశ్వ. 2315

ఆ. నోటిపుప్పికల్ల నొప్పిలేనుండఁగా । నాకుపోకసున్న మౌషధముగఁ
బెట్టుకుండెనేనిఁ బెనురోతఁవేయురా । విశ్వ. 2316

క. నోరెఱిఁగి తామవేమియు । నేరసిజంతువులఁజంపి నెమ్మదిఁదిను నా
క్రూరపు సంకరజాతుల । మారణమే మందు నింక మహిలో వేమా. 2317

ఆ. న్యాయశాస్త్ర మరయ నన్యాయమునదించు । ధర్మశాస్త్ర మొసఁగు దుర్మతంబు
జ్యోతిషము జనముల నీతులుతప్పించు । విశ్వ. 2318

క. న్యూనముగల తనభార్యను । గాననమునఁ జంపవచ్చుఁ గడుఁజిత్రముగాఁ
దానెఱుక మిగులఁగూరితిని । మానముఁ గాపాడుకొనెడి మహితుఁడు వేమా. 2319

## ప

ఆ. పంకజాక్షిఁగన్న బంగరుపోఁడఁగన్న । దిమ్ముఁబట్టియుండు తెలివియొప్ప
మనుజులకును దత్వమహి మెట్లుకల్గురా । విశ్వ. 2320

ఆ. పంకజాక్షులఁగన బంగారుపోడఁగన । రిమ్మబుట్టుయోగి నమ్మరాదు
మనసునిలుపువాఁడె మహిమొప్పయోగిరా । విశ్వ. 2321

క. పగయుడుగఁ గోప ముడుగును । పగతెగకోపంబులడఁగుఁ బదలునుకోర్కె
లెత్తెగఁగోర్కె భేదముడుగును । ద్రిగుణము లుడుగంగ ముక్తి స్థిరమగు వేమా. 2322

క. పగయుడుగుఁ గోప ముడుగును । బగయుడుగం గోర్కెలుడుగుఁ బరజన్మంబు
లత్తగు లుడుగు భేదముడిగినఁ । ద్రిగుణంబులు నుడుగుముక్తి స్థిరమగు వేమా. 2323

క. పగలుడుగఁ గోప ముడుగును । బగతెగికోపంబు లుడుగ వదలునుగోర్కె
ల్పగకోర్కె లుడిగిభేదము । తెగఁద్రిగుణము లుడుగుముక్తి తెరువుగ వేమా. 2324

క. పగలుడుగ నాశ లుడుగును । వగ పుడుగం గోర్కె లుడుగు వడిజన్మంబు
లు గు లుడుగు భోగ ముడిగినఁ । ద్రిగుణంబును నుడుగుముక్తి తెరువుగ వేమా. 2325

ఆ. పగలు రేయుమఱచి భావంబును మఱచి । తాను నేననియెడి తలఁపుమఱచి
యుండువాని నెంచ నుత్తమయోగిరా । విశ్వ. 2326

ఆ. పంచబుషులుభువిని బరమపవిత్రులు । మించి లోకమునకు మేలు కోఱను
పంచితార్థములను సమసింపఁజేయరె । విశ్వ. 2327

క. పంచగు నక్షయబిందువుఁ । బంచాక్షరినాదమంత్రము పరమమునీంద్రుల్
ప్రాంచితముగ నది తెలిసిన । మంచిగనక్ మొక్కనతఁడుమహిలో వేమా. 2328

ఆ. పంచతత్వఫలముఁ జాలించికడమించి । కొంచెమైనమదిని గోలుపోక
యెంచిమించువాఁడ యేర్పడ్డయోగిరా । విశ్వ. 2329

ఆ. పంచతత్వములకు బ్రహ్మలకొకసొడ్డు । వారితండ్రి నెత్తివైతుసొడ్డు
నంతరంగ మెల్ల నాదిశక్తియెఱుంగు । విశ్వ. 2330

తే. పంచతత్వాదినిర్ణయ ఫక్కిసూని । మించి రేచకపూరకమిత మెఱింగి
యంచితంబుగఁగుంభించియందుమయ్యామంచిదనఁదగుయోగికమహిను వేమ. 2331

ఆ. పంచభూతములను నెంచుచుమదిలోన । మించియందవలెను మిత్తిగొంగ
నంచుఁదెలియుఁవాఁడె యఖిలజ్ఞుఁడగుయోగి । విశ్వ. 2332

ఆ. పంచభూతములను బరగవలనుబట్టి । సంచరింపకుండు శక్తిఁదెలిసి
వేటలాడబెస్త వాటంబు నెఱుఁగురా । విశ్వ. 2333

ఆ. పంచభూతములను బరగియుండినవాఁడు ! పంచలింగములను బ్రబలియుండుఁ
బంచబీజమునను భావింపదానయా । విశ్వ. 2334

ఆ. పంచభూతములను బరగనింద్రియముల । సంచరించినపుడు జగముకలుగు
సంచరింపకున్న జగమెట్లు కలుగురా । విశ్వ. 2335

ఆ. పంచమతములకును బ్రాహ్మణులకుసొడ్డు । వారితండ్రి నెత్తి వైతుసొడ్డు
నంతరంగమెల్ల నాదిశక్తియెఱుంగు । విశ్వ. 2336

ఆ. పంచమనిగమంబు భారతంబగునని । పొగడి రేలజనులు బుద్ధిమాలి
హింసకార్యము తమకిష్ట మెట్లాయెరా । విశ్వ. 2337

క. పంచమహాభూతములై । పంచశరీరములుగలిగి బ్రహ్మాండంబై
పంచావస్థలుదాటి న । టించుటఁ బరిపూర్తిఁజెందుఁడెంకిని వేమా. 2338

ఆ. పంచముఖములందుఁ బంచాక్షరిజనించెఁ । బంచవర్ణములను బ్రబలె జగము
పంచముఖునిమీరు ప్రస్తుతిఁజేయుఁడీ । విశ్వ. 2339

ఆ. పంచవర్ణమెఱుఁగఁ బరము నెఱుంగును । బరము నెఱుఁగనిచ్చ ప్రజ్వరిల్లుఁ
బ్రజ్వరిల్లువాఁడు పరముతా నౌనయా । విశ్వ. 2340

ఆ. పంచశత్రువులను బంచబాణునిఁగెల్చి । పంచవర్ణములను బఠనఁజేసి
పంచముఖములందుఁ బ్రతిఫలించెడువాని । పంచఁజేరువాఁడు పరుఁడు వేమ. 2341

క. పంచాక్షరి జపమంచెన । సంచితకర్మములువాయు సాకల్యముగా
మించును బరమజ్ఞానముఁ । ద్రుంచును దుర్భ్రముల మదినిరూఢిగ వేమా. 2342

క. పంచాక్షరి బీజంబుల । నంచితముగ నెఱుఁగునాతఁ డఖిలజ్ఞుండై
పంచనరయెఱుఁగక కువలయ । సంచారము సేయునతఁ డీశంభుఁడు వేమా. 2343

ఆ. పచ్చఁజామువారు పచ్చమెచ్చెడువారు । పచ్చమీఁదవాంఛ పడినవారు
పచ్చవిడుచువానిఁ బ్రభువుగాఁజూతురు । విశ్వ. 2344

ఆ. పచ్చఁదనముఁజూచి యిచ్చతోఁగాముకు । లిచ్చలోఁబడుదురు క్షితితలమున
నిచ్చకుఁగులజుండి కెవ్వఁడు లేఁడయా । విశ్వ. 2345

ఆ. పచ్చవిల్తుచేతఁ గ్రిచ్చఱజనులెల్లఁ । గచ్చనాడనైరి ధరణిలోనఁ
గులజుఁ డెవ్వఁ డిందుఁ గులహీనుఁ డెవ్వఁడు । విశ్వ. 2346

ఆ. పచ్చిమలముఁదినుచుఁ బండుటాకునమలి । యుచ్చదప్పిఁదీర్చి యుడుకుకోర్చి
కచ్చనుబిగియింపఁ గలుగునా తత్వంబు । విశ్వ. 2347

ఆ. పట్టకుండియధిక భాగ్యంబుపట్టెనా । దొడ్డవారిఁదిట్టి త్రుళ్లిపడును
అల్పజాతికుక్క యధికుల నెఱుఁగునా । విశ్వ. 2348

ఆ. పట్టనేర్చుపాము పడగయోరగఁజేయుఁ । జెఱుపఁజూచువాఁడు చెలిమిఁజేయుఁ
జంపఁదలఁచురాజు చనువిచ్చుచుండురా । విశ్వ. 2349

ఆ. పట్టరానిపట్టు పట్టియుండినవాఁడు । పుడమిలోనఁగీర్తిఁ బొందలేఁడు
సుగుణలక్షణమున సుజ్ఞానియౌనయా । విశ్వ. 2350

ఆ. పటిమమీఱమనసుఁ బాటించిచూడక । కిటుకుఁదెలియరాదు కెరలుటను
జటిలవేషమేల జైత్రుఁడై సాధింప । విశ్వ. 2351

ఆ. పట్టివిడువరాదు పదిలక్షలకునైనఁ । బెట్టిచెప్పరాదు పేదకైన
వెట్టిగొలువరాదు విభుఁ డెట్టిఘనుఁడైన । విశ్వ. 2352

తే. పటుతరంబుగఁ దనయాత్మ భావమంది । నిటలమర్గము పైనున్న నిత్యతిమిరాత్మ
ఘటము పులుచినవాఁడెపో ఘనుఁడుసుమ్మి। కుటిలకర్ములకిదియెట్లు కూడు వేమ. 2353

ఆ. పట్టుఁగొమ్మలేక బలుపాటుపడువారు । పెట్టిపొయ్యలేక తిట్టువారు
ముట్టిశివునిపూజ మొదలెచేయఁగలేరు । విశ్వ. 2354

ఆ. పట్టుఁగొమ్మవదలి పలవింపనేఁటికి । నిట్టిగుణముని వేడి గుట్టు నెఱిఁగి
నిట్టనిలువుఁగాంచి నిర్గుణమందరా । విశ్వ. 2355

ఆ. పట్టుచీరఁగట్టి పట్టెనామము లిడు । సృష్టివైష్ణవంబు శిఖలుమించు
చిన్నెలిన్ని చేసి చేరు వైష్ణవమిట్లు । విశ్వ. 2356

ఆ. పట్టుపట్టరాదు పట్టినవిడరాదు । నెట్టి గుణవికారనిహతినణఁచి
మిట్టిపడకలోని మిన్నందియుండరా । విశ్వ. 2357

ఆ. పట్టుపట్టరాదు పట్టివిడువరాదు । పట్టెనేనిబిగియఁ బట్టవలయుఁ
బట్టువిడుటకన్నఁ బడిచచ్చుటయె మేలు । విశ్వ. 2358

ఆ. పట్టుపట్టినతతిఁ బరవాదములవేల । నెట్టుకొన్నతలఁపు నిలుపవలయు
నట్టిపలుకులువిడ నవనిలో నగుదురు । విశ్వ. 2359

ఆ. పట్టుపాగఁజుట్టి పట్టుదోవతిఁగట్టి । మిట్టదైవతంబు మిట్టిపడును
జిన్నెలింతెకాని శ్రీవైష్ణమతంబు । విశ్వ. 2360

ఆ. పట్టుబట్టఁగట్టి పట్టెనామముఁబెట్టి । వట్టిభ్రాంతిఁజెంది వైష్ణవుఁడయి
లొట్టిదాగి నతఁడు లోకులఁజెఱచురా । విశ్వ. 2361

ఆ. పట్టువస్త్రములును బరగుభూషణములు । కుదువ లిడుట లెల్లఁ గొదవపద్దు
లనుభవింపఁగూడ దతఁడెంతవాఁడైన । ననుభవింపఁగొంత హాని వేమ. 2362

ఆ. పట్టువిడకలోని గుట్టును గమనించి । ముట్టు టదియె యొకమూలమదును
బట్టబయలునందు పాటింపనెఱుకేది । విశ్వ. 2363

ఆ. పట్టువిడుపులధిక భాగ్యంబుఁగూర్చిన । దొడ్డవారినైనఁ దూలనాడు
నల్పజాతిదుష్టుఁ డధికులనెఱుఁగునా । విశ్వ. 2364

ఆ. పట్టుశాల్వఁజుట్టి పట్టుదోవతిఁగట్టె । జగతి వైష్ణవంబు శాశ్వతంబె
చిన్నెలిన్ని యేఁటి శ్రీవైష్ణవంబులో । విశ్వ. 2365

ఆ. పట్టెనామమొప్పఁ బరమవైష్ణవుఁడని । పట్టిమాయ చేయుఁ బొట్టకొఱకుఁ
బలుగురాలపణులు పాటింపవచ్చునా । విశ్వ. 2366

ఆ. పడక నేర్పులంజె బంగార మాసించు । మాటలకువలచుట మహిమఁ గాదె
కొఱక నేర్చినదియు గోకితే చెప్పనా । విశ్వ. 2367

ఆ. పడఁతిఁ జూచునపుడె పాలిండ్లపైయాస । నుడగలేక మనుజుఁ డుపచరించి
యిడుమ లంది పొంది యిలఁబట్టి చచ్చురా । విశ్వ. 2368

ఆ. పడఁతిముఖము సొగసు పాటించిచూచినఁ । గోటిపూజలెల్లఁ గొల్లపోవు
సిగను చెంతనున్నఁ జెడునటే తాపంబు । విశ్వ. 2369

ఆ. పడఁతి మోసెనొకఁడు పడఁతి మేసెనొకండు । పడఁతినురముఁ జేర్చ బ్రతికెనొకఁడు
పడఁతికొఱకె పెక్కుపాట్లను బడిరయా । విశ్వ. 2370

క. పడయఁగరానిది పూర్ణము । తడబడకల మనసమందు దలపడినంతం
జిడిముడిలేకటు నిల్చిన । విడనాడఁగ బట్టబయలె వెలయును వేమా. 2371

క. పడి పడి మ్రొక్కఁగ నేఁటికి । గుడిలోఁగల కఠినశిలల గుణములు చెడునా
గుడిదేహ మాత్మ దేవుఁడు । చెడురాళ్లకు వట్టిపూజ సేయకు వేమా. 2372

ఆ. పడుచునిచ్చినతని భత్యమిచ్చినవానిఁ । గడుపుచల్లఁజేసి ఘనత నిడఁగ
నడవనేర నతఁడు నాలిముచ్చెగదా । విశ్వ. 2373

ఆ. పడుచు నూరకేలఁ బారఁజూచెదరొక్కొ । యెంతవారలైన భ్రాంతిఁ జెంది
లోనమీఱు కాము లొంగఁజేయఁగలేక । విశ్వ. 2374

ఆ. పడుచునొసఁగు వాని పద్యమొసఁగువానిఁ । గడుపుచల్లచేసి గౌరవమున
నడపలేనివాఁడు నాలంజెకొడుకురా । విశ్వ. 2375

ఆ. పడుచుపక్వమెన్నఁ బసివాఁడెఱుంగునా । సరవిదివ్యయోగి యెఱుఁగుఁ గాక
మోహగుణ మెఱింగి మోహంబువిడనాడు । విశ్వ. 2376

ఆ. పడుచుమాటలాడి పరితపింపఁగనేల । వెడఁగుచర్యలడఁచి వేడిగురుని
యడుగులంటి మ్రొక్కియాసను విడఁద్రొక్కు । విశ్వ. 2377

ఆ. పడుపు మరుగులంజె పైనాసపడుఁగాక । యుత్తమాటలకది యొప్పదెపుడు
కుడితిమరుగు బఱ్ఱె విడినీరు త్రాగునా । విశ్వ. 2378

ఆ. పండువలనఁబుట్టెఁ బరగుప్రపంచంబు । పండివలనఁబుట్టెఁ బరమిహములు
పండుకానపడిరి బ్రహ్మాదిసురలెల్ల । విశ్వ. 2379

ఆ. పండువలనఁబుట్టెఁ బరగుప్రపంచంబు । పండువలనఁబుట్టెఁ బరమునిహము
పండు మేలెఱింగెఁ బ్రహ్లాదుఁ డిలలోన । విశ్వ. 2380

ఆ. పతకమందునొప్పు బలురత్నముల పెంపు । బంగరందుఁగూర్పఁ బరువుగనును
గాని యితరలోహమైన హీనము గాదె । విశ్వ. 2381

ఆ. పతగ మితర జంతువితతి యంతకు మేటి । యగునెరెక్కలుండి యెగయఁగలుగ
పట్టియోగియిట్టి వైఖరివాఁడయా । విశ్వ. 2382

ఆ. పతనమందునట్టి పక్వఫలంబును । బట్టితినఁగలాఁడు పచ్చికాయ
కాసపడఁడు యోగి కైహిక మిట్టిదే । విశ్వ. 2383

ఆ. పత్తనములఁగలరు ఘోరఘాంగనలువారు । పల్లెలందు నిలిచి బ్రిదుకఁగలరె
సుఖులుపరముదారి శోభింపలేరయా । విశ్వ. 2384

ఆ. పత్తనమ్ములందుఁ బతులకు సతులకు । మోహమెచ్చుదానియూహలెచ్చు
ముక్తిమార్గమునకు యుక్తిగే తెలియదు । విశ్వ. 2385

క. పంతము విడకరయె నెమ్మది । చింతనమునగుఱ్ఱుఁ దెలిసిచిన్మయమంద
న్వింత లడంగును మానస । మింతింతని చెప్పరాది దెలుఁగును వేమా. 2386

ఆ. పతికిమాఱు పల్కు పడతిశునకమగు । మీఱినసతితోడ మెలఁగరోఁత
పందిఁబందిఁగూడి పడుఁగదా రొంపిలో । విశ్వ. 2387

ఆ. పతినిదిట్టరాదు పదివేలకైనను । బెట్టిచెప్పరాదు పెద్దతోను
బతినిమీఱ నగునె సతి మానవతియైన । విశ్వ. 2388

ఆ. పతినినిందఁజేసి పాటించియెంచని । సతులకెల్ల ముక్తిసాధకంబు
ఎట్లుగల్గు నియతి యెంచంగలేరయా । విశ్వ॥ 2389

ఆ. పతిని భావమందుఁ బరమాత్మగానెంచు । పడఁతి కమరుగతిని బరమటంద్రు
పతిని దూఱు నట్టి పడఁతికి దుర్గతి । విడని బాధకలుగు వినర వేమ. 2390

ఆ. పతినివిడువరాదు పదివేలకైనను । బెట్టిచెప్పరాదు పెద్దకైనఁ
బతిని దిట్టరాదు సతిరూపవతియైన । విశ్వ. 2391

క. పతియొప్పిన సతియొప్పును । బతిసతు లొకటైనఁబరమపావనమగురా
సతిపతివిధసుదెమోక్షం । బతులితపరమాత్మనైక్యమగురా వేమా. 2392

క. పతిసుతు లిద్దఱుఁగూడియు । సతియొద్దను బవ్వళింపసంతతదృష్టిం
బతిచూచుమాంసపిండము । సుతులందలి పాలపేరిమఁ జూతురు వేమా. 2393

క. పతిసుతు లిద్దఱుఁగూడుక । సతియొద్దనె పవ్వళింత్రు స్తనయుగళంబు
సుతుఁడంటినఁబాలుబ్బును । బతియంటిన నల్లతావు పద నగు వేమా. 2394

ఆ. పదవి గలుగ లంజె పైఁడా నెపడుఁగాక । పేదవానిమాట ప్రియము లేదు
కుడితిపురుగు బట్టె కూసినఁ జేపునా । విశ్వ. 2395

ఆ. పదవినున్న లంజె పైదా నెపడుఁగాక । పేదవానిమాట ప్రియముగొనదు
ముద్దరాలిమగఁడు ముదుసలి మెచ్చునా । విశ్వ. 2396

ఆ. పందనధికుఁ జేసి బవరంబునకుఁ బంపఁ । బాఱిపోవుఁ గార్యభంగమవును
బాఱువాఁడు బంటు పనికిఁ గాఁడెందును । విశ్వ. 2397

ఆ. పందనధిపుఁ జేసి బవరానకంపిన । వాఁడు వాఱు మూకవలెను దెలియఁ
బాఱునట్టి బంటు పనికిరాఁ డెన్నఁడు । విశ్వ. 2398

ఆ. పది యసంగతములు పదిసార్లు చేసినఁ । దప్పుదారిఁ ద్రొక్కు దార్ఢ్య మొదవుఁ
గూడదేల నట్టిసుదిరికి మంచికి । విశ్వ. 2399

ఆ. పదిలపడఁగ మనసు పట్టనేరనివాఁడు । కదియఁబోఁడు పూర్ణకలితుఁడగును
గుదురు కొనెడు వాఁడు కోవిదుఁడగునయా । విశ్వ. 2400

ఆ. పందిపిల్లలీను బదియునైదింటిని । గుంజరంబ దీనుఁ గొదమ నొకటి
నుత్తమపురుషుఁడటు లొక్కఁడు చాలఁడా । విశ్వ. 2401

ఆ. పదుగురాడుమాట పాటియై ధరఁ జెల్లు । నొక్కఁడాడు మాట యొక్కదెందు
నూరకుండువాని కూరెల్ల నోపదు । విశ్వ. 2402

ఆ. పదును గలుగ మ్రాను పచ్చనై యుండును । ఈవిగలుగు లంజె యింటనుండుఁ
దలఁపుగలుగ హరియుఁ దనయొద్దనే యుండు । విశ్వ. 2403

ఆ. పనసతొనలకన్నఁ బంచదారలకన్న । జుంటితేనెకన్న జున్నుకన్న
జెఱకురసముకన్నఁ జెలిమాట తీపిరా । విశ్వ. 2404

ఆ. పనితొడవులు వేఱు బంగార మొక్కటి । పలుఘటములు వేఱు ప్రాణమొకటి
యరయఁ దిండ్లువేఱ టాకలియొక్కటి । విశ్వ. 2405

క. పనుపడి నిర్గుణ మనునది । తనకెద్దియుఁ దోఁపఁబోదు తత్వ మెఱుఁగకే
మననాంతరంగమందును । వినయంబగు బయలు చేరి వెలయుము వేమా. 2406

ఆ. పప్పులేని కూడు పరులకసహ్యమౌ । నప్పులేనివాఁడె యధికబలుఁడు
ముప్పులేనివాఁడు మొదటి సుజ్ఞానిరా । విశ్వ. 2407

ఆ. పయిరునిడిన వాని ఫలమేమి చెప్పుదుఁ । బయిరు నిడనివాని ఫలము పాడు
పయిరునిడిన వాఁడు పరలోకధాముఁడౌ । విశ్వ 2408

క. పరకాంతకు సోదరుఁడై । పరధనముల కాసపడక పరులకు హితుఁడై
పరు లలిగినఁ దానలుగక । పరులెన్నఁగ బ్రతుకునతఁడె ప్రాజ్ఞుఁడు వేమా. 2409

క పరకాంతలందు భ్రాంతియు । నరకంబని తెలిసియైన నమ్ముట బహుదు
స్తరమగు నెంతటి వారికి । గురుకృపగలుగంగఁగాని కుదురదు వేమా. 2410

క. పరకాంతాసోదరుఁడై । పరధనములపైన భ్రాంతి పడకుండి తనుం
బోరిగొను కోపముతోడను । బరు లలిగిన నవ్వువాఁడె బ్రహ్మము వేమా. 2411

ఆ. పరగఁజెట్టుఁబట్టి పాలింప లేకున్న । వెలుగు దాటి వీడు వెళ్లఁబాఱు
నాడువారి చిత్తమటువలె నుండురా । విశ్వ. 2412

ఆ పరగ జలకమాడి పట్టెనామముదీర్చి । నీరుకావిపంచె నెరయఁగట్టి
వారకాంతఁజూడ వ్రతమెల్లమఱచురా । విశ్వ. 2413

ఆ. పరగఁ దా నొసఁగఁడు పరులు చెప్పినదైన । నియ్యఁజాలక విధి నెసఁగువాఁడు
పొట్టుఁదినెడి లండి బువ్వలు వెట్టునా । విశ్వ. 2414

ఆ. పరగదేవుఁజేసి పరిజలను మ్రొక్కించి । త్రొక్కుభూమి కెల్ల దొరను జేసి
మనుజవరుల కొగిని మాంగల్యమునుజేసి । యాజ్ఞ చేసి యేలె నతఁడు వేమ. 2415

తే. పరగ నట్టిల్లు విడక నాభాగ్యమనిన । దైవమొట్టులు కొని తెచ్చి తనకు నిచ్చుఁ
జేయఁదగినప్రయత్నముల్చేయఁజేయ । వలయునటమీఁదఁదనభాగ్యవశము వేమ 2416

ఆ. పరగ నింతవఱకుఁబడినపాటెల్లఁగాఁడే । ఘనత నొప్పమనుజుఁడనగఁబుట్టి
కీడు మేలెఱుఁగక క్రిందాయెఁజూడరా । విశ్వ. 2417

ఆ. పరగ నిలను ముందు బ్రదుకరీ తెఱఁగక । సకల సంపదలును సతములనుచు
దూరదృష్టిలేక మీఱుచు వర్తించు । హీనుఁడందకున్నె యెగ్గు వేమ. 2418

ఆ. పరగబొందులు పది ప్రాణం బదొక్కటి । పుష్పజాతులు పది పూజయొకటి
పసులవన్నెలు పదిపాలన్ని యొక్కటి । విశ్వ. 2419

ఆ. పరగబొమ్మగుడ్డుఁ బరికించిచూచినఁ । గులములన్నియందె కూడిపుట్టె
నంప యొకటఁగలియ నన్నదమ్ములెకదా । విశ్వ. 2420

ఆ. పరగ భూమియందు బ్రాణప్రతిష్ఠాయెఁ । బ్రాణమొసఁగఁ బ్రతిమ పలుకవలదె
మొదటివాసిదృష్టి మూర్తివంతంబైన । విశ్వ. 2421

ఆ. పరగ రాజకులులు పాతినధనమెల్ల । భటులపాలొ కవులపాలొ తలఁప
నౌసరహీనజనుని ధనము దాయాదుల । పాలొ జారకాంతపాలొ వేమ. 2422

ఆ. పరగ రాతిగుండు పగులఁగొట్టఁగవచ్చుఁ । గొండలన్ని పిండి గొట్టవచ్చుఁ
గఠినచిత్తు మనసుఁ గరఁగింపఁగారాదు । విశ్వ. 2423

ఆ. పరగ లేమిచేత బంధువు ల్పగవారు । పరగ లేమిచేత బరము తప్పుఁ
బరగ లేమిచేతఁ బరపతియును దప్పు । విశ్వ. 2424

క. పరగిన గాలి నభంబున । వెరయఁగ భూమియందు నీరుండుఁగదా
దరిదాపుల వేఱొక్కటి । యిరవు గొనుం దేజమిట్టి యెల్లెడ వేమా. 2425

ఆ పర్వత వనవాసపరిణామవర్తన । కూపవాసికెల్లు గుఱుతుపడును
బ్రహ్మదేవు వెంటఁ బాఱిక్రుతుఁ డరుగునా । విశ్వ 2426

ఆ పరదళములఁ జూచి పాఱిణంపుఁ బీతిచే । నుఱికుఁ బిఱికివాఁ డటూరిదాక
యముఁడువచ్చినప్పు డడ్డం బిఁకెవ్వఁడో । విశ్వ. 2427

ఆ. పరధనంబునకును బారుగా జేఁజాచి । సత్యమింతలేని చట్టుద్విజులు
ద్విజులమంచు నెంత్రు తేజ మించుక లేదు । విశ్వ. 2428

ఆ. పరధనములకుఁ జెయిపట్టైను మిక్కిలి । సత్యమింతలేక జారుఁడయ్యె
ద్విజుఁడను గొనుతాను దేజమింతయు లేక । విశ్వ. 2429

క. పరనారీదూరఁగుడై । పరధనముల కాసపడని పరమోత్తముఁడై
పరు లలికినఁ దా నలుకక । పరులెన్నఁగ బ్రతుకువాఁడు ప్రాజ్ఞుఁడు వేమా. 2430

ఆ. పరపురుషునిమీఁదఁ బ్రాణంబుఁ బెట్టుక । మగువ సేయుఁదనదు మంచితనము
అట్టి భంగియోగి యాత్మభావించును । విశ్వ. 2431

ఆ. పరబలంబుఁ జూచి ప్రాణరక్షణమున । కుఱికి పాఱిపోవుఁ బిఱికినరుఁడు
యముఁడు కుపితుఁడైన నడ్డమ డ్డెవ్వఁడో । విశ్వ. 2432

ఆ. పరభృతమ్ము కాకపాలిత మైనట్లు । దారిఁ జాపవలయుఁ దజ్ఞుఁ డొకఁడు
తొంటి జన్మఫలము తుదకెట్లు లొప్పిన । విశ్వ. 2433

తే. పరమగురుఁడభిరామయ పాదములకుఁ । జేతులనుజూచి మొక్కి లిశిరముఁ జేర్చి
తప్పవినియును తక్షమియించె నొప్పిదముగఁ । దలపఁ డేనందఁ దనపాటు ఫలము వేమ 2434

ధృవకోకిలోపమ.

పరమగురువరు మంత్రసిద్ధిని బట్టి నీలో నుంచరా
యురములో గుటిబయలుఁ దాకెడి నూని నొక్కిన తోడనే
కరతలామలకంబు బ్రహ్మము గాలుచుండెడిఁ బ్రిజ్ఞలోఁ
దిరము వేమన చేరుపదవిని దెంపుగా మదినుంచరా. 2435

ఆ. పరమనిర్గుణంబుఁ బట్టి జూపఁగలేరు । గురుతరంబు గాను గోప్యమెఱిఁగి
చెలఁగు చుండుయోగి చిట్టాడి ముట్టురా । విశ్వ. 2436

తే. పరమనిర్గుణవిద్యలో భావముంచి । మానసజ్ఞాన పరిపూర్ణమననమందు
నేకరూపము మదినెంచు నిచ్చఁగనుము । శాశ్వతానందసంసిద్ధి జరుగు వేమ. 2437

ఆ. పరమపదవిఁ గోరుభక్తుండు నిత్యము । రాజుగోరుచుండు రణజయంబు
మూర్ఖుఁడెపుడుఁగోరు ముదితలతోఁబొందె । విశ్వ 2438

ఆ. పరమపావనతను బ్రాహ్మణోత్తరుఁడగు । విశ్వకర్మవంశ విశ్రుతుండు
మానఘనుఁడు గురుఁడు తానభిరాముయ । నన్నుగురునిఁజేర్చినాఁడు వేమ. 2439

ఆ. పరమభాగవతులు ప్రజలు సంతోషించు । నాట పాట నేర్చి నీటుగాను
గోట్లకొలఁదిఁ దెచ్చి కూటికిలేకుంద్రు । విశ్వ. 2440

ఆ. పరమయోగుల మని పరముఁజేరగలేని । మాయజనులకెట్లు మంచికల్గు
వేసములను విడిచి విహరించులే ముక్తి । విశ్వ. 2441

తే. పరమ సిద్ధాంతమగు నట్టి బయలు చేరి । పట్టువిడుపులు వదలితాఁ బ్రాకినిలిచి
పట్టెదని లోకపాశంబు వదలనగును । పిదపఁ గనగు నానందపదవి వేమ. 2442

ఆ. పరమ సిద్ధికొఱకు బాపల నిగుడించి । శ్రవణ మననవృత్తి సంగ్రహించి
యెఱుకమఱచువాఁడె యేకాగ్రచిత్తుఁడో । విశ్వ. 2443

ఆ పరమహంస యనుచుఁ బగువు చేయఁగ భూమిఁ । బరధనములకాసపడెడువాఁడు
పరమహంసకాఁడు పరహింసకుం డంద్రు । విశ్వ. 2444

క. పరమాత్ముని చింతినలోఁ । దఱచుగనుండుటయె తగును ధరనాకటికిం
దిరిపము నెత్తి భుజించుచు । దొరవలె గృహవేది కందుఁ దొంగుము వేమా. 2445

క. పరమాత్ముని వివరింపఁగ । నరుఁడా యణురేణు వందు నతిసూక్ష్మగతిం
బరికింప నన్ని రూపుల । గురు డైఁతా వెలుగుచుండు గుఱుతుగ వేమా. 2446

ఆ. పరముఁగోరినట్టి పామరజనులకు స్థిరముగాదు బుద్ధిచిక్కఁబోదు
తరముగాని పరముఁ దలపోతయగు రోఁత । విశ్వ. 2447

ఆ. పరముపరమ టంచుఁ బలుకదురందఱుఁ । బరమునందు నేమి ప్రబలముండుఁ
బరము నందు నిందుఁ బరిపూర్ణుఁడేకదా । విశ్వ. 2448

ఆ. పరయువతిరతంబు పాటించికోరిన । కోటి పూజలెల్లఁగొల్లబోవు
సిగకుఁబొంత వెన్న చెడదెతపముచేత । విశ్వ. 2449

ఆ. పరసతి గమనంబు ప్రత్యక్షనరకంబ । దరయ నిందలకిల నాలయంబు
పురుషుఁడు వినఁజంపు భూపతి నొప్పించు । విశ్వ. 2450

ఆ. పరస మినుము సోక బంగారమైనట్లు । కప్పురంబు జ్యోతిఁగలిసినట్లు
పుష్పమందుఁ దావి పొసఁగిన ట్లగుముక్తి । విశ్వ. 2451

క. పరిపక్వమొప్ప శిష్యుని । యురమందలి బయలు చూపి యుద్ఘాటముగాఁ
బరిపూర్ణమందఁజేసెడు । గురుఁడు పరబ్రహ్మమైన గుణనిధి వేమా. 2452

క. పరిశీలించిన జ్ఞప్తిని । గుఱినిల్పెడు భక్తిచేతఁగోర్కె లడఁగెడిఁ
స్థిరరూప మంది పొందెడు । పరిపూర్ణసమాగమంబుఁ బడయును వేమా. 2453

ఆ. పరుల కుపకరించి పరు సొమ్ము పరునకుఁ । బరగ నిచ్చె నేనిఁబరము కల్గుఁ
బరముకన్న నేమి పావన మాసొమ్ము । విశ్వ 2454

ఆ. పరుల కుపకరింపఁ బాపక్షయంబగుఁ । బరుల కుపకరింపఁబట్టుకొమ్మ
పరుల కుపకరింపఁబరలోకసాధన । పరులకుపకరింప బలిమి వేమ. 2455

ఆ. పరులదత్తమొప్పి పాలనఁజేసిన । నిల స్వదత్తమునకు నినుమడియగు
నవనిపరులదత్తమపహరించిన స్వద । త్తంబు నిష్ఫలంబు ధరణి వేమ. 2456

ఆ. పరులఁదిట్టి నంతఁ బాపకర్మంబబ్బు । విడువదెన్నఁటికిని విశ్వమందుఁ
బరుఁడు పరుఁడు గాఁడు పరమాత్మ యౌ నయా । విశ్వ. 2457

ఆ. పరులనిందఁజేయఁ బరులు నావా రన । స్థిరము నస్థిరమును దెలియకుంటె
పరగమిన్ను చేతఁ బట్టుక పెట్టినఁ । బెట్టు గాదు కట్టి పెట్టు వేమ. 2458

క. పరులను నీవని తలఁచెడు । పరబుద్ధిని మీఱకీవు పదరకయున్నన్
స్థిరవేత్తృతందుఁదోఁచెడు। పరిపూర్ణమె బట్టబయలు బాగుగ వేమా. 2459

ఆ. పరుల మేలుఁజూచి పలుగాకివలె నెప్పు । పట్టిమాటలాడు వాఁ డధముఁడు
అట్టివాని బ్రతుకు టదియేలమంటికి । విశ్వ. 2460

ఆ. పరులమోసపుచ్చి ధర ధన మార్జించి । కడుపునించుకొనుట కానిపద్దు
బుణము నేయుమనుజుఁ డెక్కడకెక్కునా । విశ్వ. 2461

ఆ. పరులవిత్తమందు భ్రాంతిమానినయట్టి । పురుషుఁ డవనిలోనఁ బుణ్యమూర్తి
పరులవిత్త మరయఁ బాపసంచిత మౌను । విశ్వ. 2462

ఆ. పరులు చదువఁజూచి నిరసనబుద్ధితో । పట్టిమాటలాడు వాఁడుగండు
అట్టివాని బ్రతుకు టదియేలమంటికి । విశ్వ. 2463

ఆ. పల్లటిల్లుమజని బట్టిబంధింపమి । నుల్లమందున శివుఁడుండఁబోఁడు
జల్లిమాటవిడిచి పొల్లుమఱవ ముక్తి । విశ్వ. 2464

ఆ. పలికిబొంకలేక భళ్లాణరాజప్డు । పడఁతిఁగూర్చియిచ్చెఁ బరునకరయఁ
బాళిమీఱఁ దుదకు బాలుఁడై యుండెరా । విశ్వ. 2465

తే. పలుకుచుండెడి ప్రాణనంబు పట్టువిడక । వినికి నిశ్శబ్దమైయుండు విధముఁబూనఁ
దలఁపుసర్వత్ర బ్రహ్మమై తనరవలెను । జెలఁగునప్పుడు తత్వసంసిద్ధి వేమ. 2466

ఆ. పలుకుమన్న నేలఁ బలుకకయున్నావు । పలుకునన్నుఁజూచి ప్రబలముగను
బలుకుమయ్య నీదు పలుకునే నెఱిఁగెద । విశ్వ. 2467

ఆ. పలుకులోనిపలుకుఁ బరగంగఁజూచినఁ । బలుకులందుబ్రహ్మ పదముగలుగుఁ
బలుకుఁగానలేక పరువుఁదప్పిరి జనుల్ । విశ్వ. 2468

ఆ. పలుకులోనిబిందు వలరంగఁగావలెఁ ! బలుకులోనిదానిఁ బదిలబఱచి
వేడుకైననద్వి వెతఁబెట్ట కుందురు । విశ్వ. 2469

ఆ. పలుగురాళ్లఁదెచ్చి పరగ గుడులుగట్టి । చెలఁగిశిలలసేవఁ జేయ నేల
శిలలసేవఁజేయ ఫలమేమి గల్గురా । విశ్వ. 2470

ఆ. పలుగువానికేఁటి పరసమృద్ధితలంపఁ । బల్గుపరుస వాని బలువుదప్పఁ
జలమువానికేఁటి సాత్వికధర్మంబు । విశ్వ. 2471

ఆ. పలుగువాని కేలఁబరసమృద్ధి తలంపఁ । బలుగువానికేల భక్తిపథము
పలుగువానికేలఁ బరమార్థతత్వంబు । విశ్వ. 2472

ఆ. పలుతెఱంగులఁ బగవెలయుచుండెడిచోటఁ । జిటుకుమన నెప్రిమముఁజెప్పవలయుఁ
గాల్పఁదగినకట్టె కడకతో మ్రోఁగదా । విశ్వ. 2473

ఆ. పలుమఱుఁబిలిచినను బలుకకయున్నావు । పలుకరాదె నాదు భ్రమలుదీఱఁ
బలుకకున్ననిన్నుఁ బరులుదూషింతురు । విశ్వ. 2474

క. పలుమాట లేల నీకిఁకఁ । గలవంటది మాయజగముఁ గనవలెసుమ్మీ
చలనంబు నందుఁజేరక । పులిబోనునఁ జిక్కినట్లు పూనుము వేమా. 2475

ఆ. పవలురేయుఁజూడ భావంబులోపలఁ । దాను నేన టనెడు తలఁపుమఱచి
యున్నయట్టియతఁడె యుత్తమయోగిరా । విశ్వ. 2476

క. పసరపునంజుఁడు మెక్కియు । మసలక సురఁద్రాగ ముసలిమానులఁ గూర్చుం
గుసుమాంగికధరమాంసముఁ । గుసుమాస్త్రునిఁ బట్టిచెఱిచెఁ గుజనుల వేమా. 2477

క. పసరపునంజూఁడు మెక్కియు । మసలక సురఁద్రాగుమహిమ మఖవంతులకు
ద్రసికత రంభాభోగము । గుసుమాస్త్రునిఁ బెట్టిచెఱిచెఁ గుంభిని వేమా. 2478

ఆ. పసిడిసొగసుబొమ్మఁ బరగఁజూచెడివాఁడు । చిన్నిచనులమోముఁ జేర్చువాఁడు
నతివ లనదఁజేయ నపుడెపో ముక్తుండు । విశ్వ. 2479

ఆ. పసులవన్నె వేఱు పాలెల్లనొక్కటి । పుష్పజాతివేఱు పూజయొకటి
దర్శనంబువేఱు దైవం బదొక్కటి । విశ్వ. 2480

ఆ. పక్షిజాతిఁబట్టి పరగ హింసలఁబెట్టు । గూళ్లుగట్టియందుఁ గుదురఁబెట్టి
యుంచువారికట్టి వంచనరాదొకో । విశ్వ. 2481

ఆ. పక్షిజాతిఁబట్టి పరగహింసలఁబెట్టి । కుక్షినిండకూడు కూరుటనసె
పండితినెడువాఁడు వసుధఁ జండాలుండు । విశ్వ. 2482

ఆ. పాకనాటిరెడ్డి పరగమూటారెడ్డి । యెసఁగుతోటపెద్ద యెఱ్ఱరెడ్డి
మెఱపులందఱుభువి వారువొప్పమిన్నంటి । ప్రతిభ కెక్కిరట్టె పరగ వేమ. 2483

ఆ. పాగపచ్చడంబు పైకిఁగూనంబును । బోగులుంగరములు బొజ్జకడుపుఁ
గలిగినట్టివాని గందురుచుట్టాలు । విశ్వ. 2484

ఆ. పాగపచ్చడములుఁ బైకంబుసొమ్ములు । బోగులుంగరాలు బొజ్జకడుపుఁ
జూచిగారవింత్రు చూడరేలోగుట్టు । విశ్వ. 2485

ఆ. పాడిగాదుజగతిఁ బంచాంగములుసెప్పి । కొంచెమైనబుద్ధి నెంచలేక
బ్రహ్మమెఱుఁగ కిట్లు పౌరోహితముజేసి । యుపని బ్రాహ్మణులమటంద్రు వేమ. 2586

క. పాతక సంసారార్ణవ । మే తెఱఁగున దాటెదీవు హెచ్చరిక మెయిం
జేతనమూర్తిని మదిలో । ఖ్యాతిగ నెన్నంగఁ దగును ఘనమతి వేమా. 2487

క. పాదమున నడుచునరుఁడట । వేదనగా భూమిఁదిరుగు లెస్సగఁదనకే
యేదైన హానివచ్చిన । సాధనముగు పదమునడపజురుగదు వేమా. 2488

ఆ. పాదపాయువులను బరగ దేహముమోయు । దేహిజీవములను దెలియమోయు
ధరణి వీనిరెంటిఁ దానేల మోయునో । విశ్వ. 2489

క. పాదుకొన గురురహస్యము । లేదొర వెలుగండి గుఱిగ రేచించుడునా
సాధన పూరకకుంభక । వేదికయం దాత్మ బయలు వెలుఁగుర వేమా. 2490

క. పాదుకొని హృదయమందును । సాధారణవృత్తులడఁచి సన్నుతిఁగను జే
యాధారచక్రమందును । మోహంబున విఘ్నపతిని మ్రొక్కుము వేమా. 2491

ఆ. పాపజాతి నరుఁడు పరసతిఁ గోరుట । చేపజిహ్వ రుచికిఁ జిక్కువడుటె
తీపునంటి యాఁగ తెగువతో నీల్గుటఁ । జూచి విడువ రిట్టిజోలి వేమ. 2492

ఆ. పాపపుణ్యములను పసిగాపెఱుంగునా । ధరను బరమయోగి యెఱుఁగుగాక
లోని పొందికఁ గని లోహములూ క్రొవ్వరా । విశ్వ. 2493

ఆ. పాపమనఁగ వేఱె పరదేశమున లేదు । తనదుకర్మములను దగిలియుండుఁ
గర్మతంత్రి గాక కనుఁగొని యుంటొప్పు । విశ్వ. 2494

ఆ. పాపమనఁగ వేఱె పరదేశమున లేదు । తానుజేయుపనులఁ దగిలియుండుఁ
గర్మజనుఁడు గాక కనుగలిగిన యెడఁ । బాపభయము లేదు పరగ వేమ. 2495

ఆ. పాపరాశిఁ బుట్టి పాపంబుఁ దెలియక । పాపశుద్ధిచేతఁ బరగియుండు
భక్తిగలిగియున్నఁ బాపంబు లేదయా । విశ్వ. 2496

ఆ. పాముకన్న లేదు పాపిష్ఠిదగు జీవి । యట్టిపాముఁ జెప్పినట్టు వినును
ఇలను మోహిఁ దెల్ప నెవ్వరి వశమయా । విశ్వ. 2497

ఆ. పాముకప్పచేతఁ బరగ జంబీరంబు । పరుస దీపపుసెగ వండి దించి
రాగిమీఁద వేయ రమణ బంగార మా । విశ్వ. 2498

ఆ. పాము చేపలోను బరగు కప్పను జూచి । పరుసదీసి యగ్ని వండి దించి
రాగి కఱగి వేయ రమణ హేమంబౌను । విశ్వ 2499

క. పాయవె బ్రహ్మకృతిలో । మాయలు బ్రహ్మాదిసురల మనుగడ జూడక్
జ్ఞేయంబన మదిఁ దోఁచెడు । న్యాయంబునఁ దోఁపఁ బోవునటనిట వేమా. 2500

క. పాయువనంగన పానము । మాయగ నాదారియందు మలవర్జ్యముఁ దాఁ
జేయక యుండెడి నెప్పుడు । నేయముతోఁ జూడు మయ్య నేర్పుగ వేమా. 2501

ఆ. పాలఁ గలియు నీరు పాలై యె రంజిల్లు । నదియు సాంబయోగ్యమైనయట్లు
సాధుసజ్జనముల సాంగత్యముల చేత । మూఢజనుఁడు ముక్తి మొనయు వేమ. 2502

ఆ. పాల నీడిగింటఁ గ్రోలుచునుండిన । మనుజు లెల్లఁ జూచి మద్య మండ్రు
నిలువఁదగనిచోట నిలువ నిందలు వచ్చు । విశ్వ. 2503

ఆ. పాలనీరు కలిమి పరగ హంస యెఱుఁగు । నీరుపాలక్రమము నెమలి కేల
అజ్ఞుఁ డైన హీనుఁ డలశివు నెఱుఁగునా । విశ్వ. 2504

ఆ. పాలపక్షి శకునఫల మిచ్చునందురు । పాలపక్షికేమి ఫలము దెలియుఁ
దనదు మేలు కీళ్లు తనతోడ నుండంగ । విశ్వ. 2505

ఆ. పాలప్రియముచేత బరగ నేడ్చెడి బిడ్డ । తాతుదప్పులకిల శోకపడఁగఁ
దల్లి పనులు దీర్చి తనయుని ముద్దాడు । విశ్వ. 2506

ఆ. పాలరాళ్లఁ దెచ్చి పరగంగ గుడిఁ గట్టి । చెలఁగి శిలల పూజసేయ నేల
శిలల సేన చేయ ఫలమేమి కద్దురా । విశ్వ 2507

ఆ. పాలలోనఁ బులుసు లీలతోఁ గలిసిన । విఱిసి తునుకలగును విరివిగాను
దెలివి మనములోన దివ్యతత్త్వము తేట । విశ్వ. 2508

ఆ. పాలసాగరమునఁ బవ్వళించినవారి । గొల్లపల్లెపాలుఁ గోరనేల
నెదుటివారి ద్రవ్య మెల్ల వారికిఁ దీపి । విశ్వ. 2509

ఆ. పాలు ద్రాగినపుడు ప్రాణంబు రక్షించుఁ । బాలు ద్రాగకున్న బడలి కొను
బాలవలన ముక్తి ఫలముండఁగా లేక । చాలరోగపడును జగతి వేమ. 2510

ఆ. పాలుఁ బంచదార పాపరపండ్లలోఁ । జాలఁ బోసి వండఁ జవికిరావు
కుటిలమానవునకు గుణమేలఁ గలుగురా । విశ్వ. 2511

ఆ. పాలు పెరుగు నేయి పరగు నన్నముఁ దిని । స్త్రీలఁ గననివాఁడు శిలవంతుఁ
డొక్కఁడైన వాఁడె యుత్తమశివుఁడయా । విశ్వ. 2512

ఆ. పాలు పెరుగు నేయి పాయసంబును జల్ల । పాలలోనె కల్గుఁ బ్రబలముగను
బాలుపాళ్లు గలిసి పంచామృతంబాయె । విశ్వ. 2513

ఆ. పాలు పెరుగు వెన్న పాయసాన్నము నేయి । జున్ను లెన్నియైనఁ జూడ పాలె
పాలవంటికులము బ్రహ్మంబుఁ గానరో । విశ్వ. 2514

ఆ. పాలుపోసి వండఁ బరగెడి తగరంబు । వేళ యొత్తిగిఁ దింప వెండియగును
గల్లగాదు నిజమె కఱకంఠ నీయాన । విశ్వ. 2515

ఆ. పాశబంధు చేత బంధువర్గములెల్లఁ । జిక్కి జూతు రరయ జీవము చన
నొక్కఁడైన నేగఁ డుసురుమాత్రమె కాని । విశ్వ. 2516

ఆ. పాశమునను జూడఁ బరగ దేహమునకు । పోనివచ్చుఁగాన నదియుఁ జూచి
జ్ఞానదీపకళికఁ గడ కొత్త వలెనయా । విశ్వ. 2517

ఆ. పాశమైనయాశ పడఁ దోఁచియున్నట్టి సం । సారమనెడి యంధకారమందు
జ్ఞానదీపముననె కానఁగావలె ముక్తి । విశ్వ. 2518

ఆ. పికము వనములోన విలసిల్ల బలికిన । భంగి ప్రాజ్ఞ జనుల పలుకు లలరుఁ
గాకి కూతఁ బోలు కర్మబంధులకూత । విశ్వ. 2519

ఆ. పిచ్చివానికైన వేదవానికైనఁ । గుష్ఠురోగికైనఁ గుంటికైన
భామ కానుపింప బాములఁ బెట్టురా । విశ్వ. 2520

క. పిండంబై యుదరంబున । నుండును నొన్నాళ్లు పిదప నుర్వీస్థలిపై
బిండంబై జనియించును । బిండంబాఁ బ్రాణరక్ష పృథివిని వేమా. 2521

ఆ. పిండమగుచుఁదల్లి పెనుగర్భముననుండి । పూర్వకర్మమెంచి పొరలియేడ్చు
ధరణిఁబుట్టి యద్ది మఱచి వర్తించురా । విశ్వ. 2522

ఆ. పిండమండమందుఁ బెనగుచునున్నట్టి । తండ్రిబిందునాదుఁ దనరఁగూడి
యుండమైనిలిచిన యపుడు గర్భమటండ్రు । రవని జనము లప్పు డరయ వేమ. 2523

ఆ. పిండమండమునడి బిందువాత్మజ్యోతి । యక్కజ్యోతి సరసిజాండమంద
నాదుబిందువులకు నడుమనద్భుతజ్యోతి । విశ్వ. 2524

ఆ. పిండమనఁగ జనుఁడు పృథివిలోపలఁజూడ । నండమనఁగ బ్రహ్మాండములలో
నవిధంబె మనుజులందఱుఁ దెలియుఁడీ । విశ్వ. 2525

క. పిండముపృథివిని బడఁగా । నండనైతగుమంత్రసాని యదిదెల్పును దా
మొందుగ మగవాఁడంచును । దండిగ నీజనము తెలియఁగ ధరలో వేమా. 2526

ఆ. పిండములను జేసి పితరులఁదలపోసి । కాకులకును బెట్టుగాడ్దిలార
పియ్యి దినెడు కాకి పితరుఁడెట్లాయెరా । విశ్వ. 2527

ఆ. పిడుగును నరచేత బిగఁబట్టి యందులోఁ । గల్మషంబులెల్లఁగడకుఁదీసి
కడమకరము చేతఁగలిజనములఁ బ్రోచు । కర్మకర్త యెఱుఁగ ధర వేమ. 2528

ఆ. పిడుగు పడినఁదావు బడబడగానుండు । పిడుగుపడినఁగొంప నడకిఁగూలు
పిడుగుపడిన వాని ప్రేతమే మనవచ్చు । విశ్వ. 2529

ఆ. పితృపతికిని జిక్కి పెనుత్రోవఁగానక । వెతలఁజెందువాఁడు వెఱ్ఱివాఁడు
సతుల వలలఁజిక్కి సంతాపపడనేల । విశ్వ. 2530

ఆ. పిన్నవాండ్రస్వేచ్ఛ మన్ననఁజెఱుచును । ఆడవాండ్రస్వేచ్ఛ గోడొనరుఁ
బురుషవరుని స్వేచ్ఛ భూతిని గూర్చురా । విశ్వ. 2531

క. పిరిగొనుహంసను మదిలో । బిఱువిఱుఁగుంభించి పట్టి బిత్తరవోకా
స్థిరభావసిద్ధిఁగైకొని । పరిపూర్ణ సమాగమమును బడయుము వేమా. 2532

చ. పిలిచినఁ బల్కకుండు మఱి పెచ్చున నేమన కూరకుండెడిం
దలచిన నెవ్వరేమనినఁ దన్నును గాదని నవ్వుచుండు నా

త్మలరఁగ నెంచుచుండుఁబరతత్వము నిత్యము దాన యై సదా
తెలిసిన యోగి వేమనగతి స్వస్వరూపుఁడె యెల్లతావులన్. 2533

క. పిలిచినఁబలుకును దేవుఁడు । పలుకున నేనిండియున్న ప్రభువై యుండు
న్వెలుఁగున వెలుఁగై మించెడు । వెలుఁగే పరమాత్మ బయలు విడకది వేమా. 2534

ఆ. పిల్లియెలుకఁబట్టు ప్రియమునునుండఁగ । నదియె కోడిఁబట్ట ననుగమించు
మమతవిడువకున్న మానునా మోహంబు । విశ్వ. 2535

ఆ. పిసినివానియింటఁ బీనుఁగువెడలినఁ । గట్టెకోలలకును గాసులిచ్చి
వెచ్చమాయెనంచు వెక్కి వెక్కి యేడ్చు । విశ్వ. 2536

ఆ. పుక్కిటిసతి వానిఁ బూజింపదోషంబు । ఊరపుసుదతివాని యూహ లెన్స
నెత్తియుపిదవాని బత్తియే పరమిచ్చు । విశ్వ. 2537

ఆ పుట్టమీఁది మన్నుఁజెట్టునందలి కాయ । పుట్టలోనిదానఁబుట్టు తోడుగు
గట్టియీవచనము కాంచనం బగునయా । విశ్వ. 2538

ఆ. పుట్టలోను దేనె పుట్టినరీతిని । గట్టుమీఁద మణియుఁబుట్టునట్టు
కట్టెలోననగ్ని పుట్టిన విధమునఁ । బుట్టిమెట్టవలెను భువిని వేమ. 2539

ఆ. పుట్టిచచ్చునరుఁడు పూర్వమే మెఱుఁగక । బట్టబయలనుండి భ్రమసియయినఁ
దెలివివిడిచి భూమిఁ దిరుగంగ నేఁటికి । విశ్వ. 2540

ఆ. పుట్టినజనులెల్ల భూమిని మనియున్నఁ । బట్టనేజగములు పట్టవెపుడు
యముని లెక్కరీతి నరిగి తగ్గుచునుండు । విశ్వ. 2541

ఆ. పుట్టినదియు మొదలు పురుషుఁడే కాలంబుఁ । బాపమెఱిఁగి శుద్ధపశువుగాక
ముదిసి యోగికరణి ముదమొప్పఁగావలె । విశ్వ. 2542

ఆ. పుట్టినదియు మొదలు పురుషుఁడేర్పడు దాఁక । మంత్రసాని గూడు మరిగియంత
పోయిరావె యనుచు పుత్తురు సెలవిచ్చి । విశ్వ. 25·3

ఆ. పుట్టినపుడు లేదు పురిటింటిలో లేదు । తల్లిమెడకు లేదు తనకు నేల
తల్లిశూద్రిరాలు తాను బ్రాహ్మణుఁడఁట । విశ్వ. 2544

ఆ. పుట్టినపుడె బొడ్డుపట్టి కోయుచునుండ । నప్పుడుగురుముద్ర లానతి పడె
ముద్రలేనివారు ముజ్జగంబులలేరు । విశ్వ 2545

తే. పుట్టినప్పుడు తెచ్చె నే పుడమి విడిచి । గిట్టునప్పుడుఁగొనుపోకో యట్టిధనము
నడుమ నీయాజ్ఞవచ్చెఁద్రినేత్రియనుచు । నర్థికిని నీయఁడేమందు వ్యర్థ వేమ, 2546

ఆ. పుట్టిపుట్టరేడె పుడమిని జనులెల్ల । పుట్టిగిట్టలేడె పూర్వులెవరుఁ
బుట్టిగిట్టుటెల్ల వట్టిభ్రాంతులు సుమ్మి । విశ్వ. 2547

ఆ. పుట్టుటకును ముదము గిట్టుటకును వెత । యందరెఱిఁగినట్టి దైనవిద్దె
చచ్చువాఁడె పుట్టుఁ జప్పున నేడ్వరే । విశ్వ. 2548

ఆ. పుట్టుదుఃఖమునను బోరలుదుఃఖమునను । గిట్టుదుఃఖమునను గ్రిందఁబడును
మనుజదుఃఖమువలె మఱిలేదు దుఃఖంబు । విశ్వ. 2549

ఆ. పుట్టుదుఃఖముననె ప్రొద్దెల్లదుఃఖంబు । గిట్టుదుఃఖముననె మట్టుపడును
ఉనికి దుఃఖమునకు నెనలేదు దుఃఖంబు । విశ్వ. 2550

ఆ. పుట్టుబ్రహ్మలైదు పుడమిని నడపఁగాఁ । జేతబ్రాహ్మలేల శ్రేష్ఠపగును
ఏలవిగ్రహములు మూల విరాడ్డైచ్చు । విశ్వ. 2551

ఆ పుట్టుబిత్తలివలెఁ బోవుబిత్తలివలెఁ । దిరుగు బిత్తలివలె దేహిధరణి
నున్ననాఁటి కైన నుపకారిగాలేఁడు । విశ్వ. 2552

ఆ పుట్టుముగ్ధతిరిగి పోయెడియాముగ్ధ । తేరముగ్ధతాను దెలియలేఁడు
ఉన్ననాఁటికయిన నుపకారి కాలేఁడు। విశ్వ. 2553

ఆ. పుట్టువారలెవరు పుట్టకుండురెవరు । పుట్టిపుట్టనట్టి పురుషులెవరు
పుట్టిపుట్టనట్టు బోధించి చూడరా । విశ్వ. 2554

ఆ. పుట్టు వెఱుఁగగనని పురుషాధములు భూమిఁ । బుట్ట నేమి వారు గిట్ట నేమి
పుట్టలోనఁ జెదలు పుట్టదాగిట్టదా । విశ్వ. 2555

ఆ. పుట్టుశక్తులైదు పుడమి నటింపంగ । విప్రులెల్లవేదవేత్తలండ్రు
శక్తిపుత్రకులము జగతిలో నెఱుఁగరో । విశ్వ. 2556

ఆ. పుట్టెడు చెరిగినను బుర్రెడు చిక్కదు । పొల్లువిత్తులంద్రు భూమియందు
నాడితప్పుమాట యంతకన్నను గీడు । విశ్వ. 2557

ఆ. పుడమిఁదిరుగఁబడయుఁబుణ్యంబులెల్లను । గలుగు సాధుజనులఁగన్నయపుడె
వడిని నీరు నదిని గడుఁదేటయైయుండు । విశ్వ. 2558

ఆ. పుడమి ధరపుఁడొకఁడు పురుగుత్యుఁడను మేటి । ధర్మమనుసరించి ధాత్రినేలి
తనకుఁగాని వేళఁదాఁబడెఁగష్టముల్ । విశ్వ. 2559

క. పుడమిని గలవడజీవులు । బడబాగ్నియు దీవులకును భానునియెడల
న్జడమును గూడిన యప్పుడె । వెడలని ప్రళయంబునకును విధమదివేమా. 2560

ఆ. పుడమి యుప్పరంబుఁ బుఱికొని జగముల । రక్షసేయఁగల్గు రాజులెవరు
మహిపతియను పేరు మనుజున కేడదో । విశ్వ. 2561

ఆ. పుడమిలోన నరులు పుత్రులఁ గనఁగోరి । యడలుచుందు రనుపమాశచేతఁ
గొడుకు గలిగినంతఁ గుల ముద్ధరించునా । విశ్వ. 2562

క. పుడుకను బెజ్జముఁ జూచియుఁ । బుడుకను దఱవంగ నగ్ని పుట్టిన భంగి
న్విడువక పడఁతులకూటమి । తొడరిన విరహాగ్ని పుట్టుఁదోడనె వేమా. 2563

ఆ. పుణ్యమంతకూడి పురుషుఁడై జన్మించెఁ । బాపమంతకూడి పరగెనసతి
కష్టపుసతి యన్చుఁగనువారు లేరయా । విశ్వ. 2564

ఆ. పుణ్యముగలవాని పుండుబాధయుఁగూడ । వసుధలోనఁ జాల వార్తకెక్కు
పేదవానియింటఁ బెండ్లైన నెఱుఁగరు । విశ్వ. 2565

ఆ. పుత్రసంతులేక పుత్రుండు జగతిలోఁ । బుణ్యలోకమెట్లు పొందఁగలఁడు
పుత్రహీనునకును బుణ్యంబు గల దెట్లు । విశ్వ. 2566

ఆ. పునుఁగుఁబిల్లి యేలఁ బుట్టించు వాసన । జ్ఞానిమహిమలేమి ధరణిలోన
బ్రహ్మ చేతలెల్లఁ బలుగాకి చేతలో । విశ్వ. 2567

క. పురములు నాల్గింటి పైనొక । పురమందును మూలశక్తి పూనికఁ గనుఁగా
యురమున గుఱిఁగని నంతటఁ । బరిపూర్ణసమాగమంబు బయలగు వేమా. 2568

ఆ. పురహరునకు నేతపురువు తా నేసిన । స్థిరముకల్గుజ్ఞానజీవమయ్యె
నేతకేమివచ్చె నిజభక్తి హేతువు । విశ్వ. 2569

ఆ. పురుషచిహ్నఁ జూడఁ బుట్టె స్త్రీలకు భ్రమ । పురుషుఁ డీవ్యామనుచుఁ బుట్టరాదె
శివుఁడు పురుషుఁడైన స్త్రీలకుఁ జిక్కునా । విశ్వ. 2570

ఆ. పురుషుఁ డెన్నిగతులఁ బుట్టువు మొదలుగఁ । బాపచింతఁ జేయుఁ బామరతను
మహినిఁ గుంటికుక్క మాంసముఁ దిన్నట్లు । విశ్వ. 2571

ఆ. పురుషుఁ డెఱుఁగఁ జంపు భూపతి వినఁ జేటు । అఖిలనిందలకు నిఁకాలయంబు
పరపురుషగమనము ప్రత్యక్షనరకంబు । విశ్వ. 2572

ఆ పురుషుభాగ్యమున నె పుణ్యవతి దొరకుఁ । బుణ్యవతికి నట్టె పురుషుఁ డబ్బ
నిరువు రనుభవింప హితులును బ్రతులు । నష్టభోగములును నమరు వేమ. 2573

ఆ. పురుషు లరసి కొన్ని పుణ్యభూములటండ్రె । బుద్ధిలేదొ యదియు భూమిగాదొ
పుణ్యతీర్థమునకుఁ బోయివచ్చితి మందు । రేమనందు నయ్య యిఁకను వేమ. 2574

ఆ. పులియ దెట్టిదన్న భూలోకమ్మునరాజు । కలియ దెట్టిదన్నఁ గానరాదు
పులికబులవి యెంత భువిని నాకలియెచ్చు । విశ్వ. 2575

ఆ. పువ్వుచేను గలిగిన భూమెల్ల వెలసేయుఁ । గొందమచన్నులుగనఁ గోటి సేయుఁ
దడకచన్నులుగన దయ్యాలు నొల్లవు । విశ్వ. 2576

ఆ. పుస్తకములు జడలుఁ బులితోలు ఛత్త్రంబుఁ । గక్షపాలలుఁ బదిలక్షలైన
మోతచేటెకాని మోక్షంబులేదయా । విశ్వ. 2577

ఆ. పూజకన్న నెంచ బుద్ధిని దానంబు । మాటకన్న నెంచ మనసె దృఢము
కులముకన్న మిగుల గుణమె ప్రధానంబు । విశ్వ. 2578

ఆ. పూజవిడక చేసి పుణ్యంబునార్జించు । పూజ్యమతియె తనదు పూజవలనఁ
దేజమంతుఁ దెలిసి తిరుగు నెన్నఁటికైన । విశ్వ. 2579

ఆ. పూజసేయఁజేయఁ బూజరితానాయె । పూజ్యవస్తు వెన్న భువిని దానె
యెడఁబూజసేయ నెల్లదిక్కులఁదానె । తాను నేను నేను దానె వేమ. 2580

ఆ. పూతగడ్డికేలఁ బుట్టించెవాసన । కనకము తనకేమి కల్లఁజేసె
బ్రహ్మచేతలెల్ల శాడైనచేతలు । విశ్వ. 2581

తే. పూని సుఖదుఃఖముల మీఱి లోనఁజేరి । తానుదానగు తత్వంబుఁ దాకితాకి
పోరిపరిపూర్తి నొందులే పుణ్యమయ్యె । యిట్టుకాకున్నఁ గడ తేరు టెట్టు వేమ. 2582

ఆ. పూపఁజనులనాఁడు భూమెల్లఁ జేయును । గొందమచనులనాఁడు కోటిచేయుఁ
దటుకుచనులనాఁడు దారంబు సేయదు । విశ్వ. 2583

క. పూరకమున యోగీంద్రవి । హారునిఁగుభించి పట్టిహాటమదలిర్పం
గా రేచక పూరకముల । పోరునఁగుంభించి యుందఁబురికొను వేమా. 2584

క. పూర్ణముగయుక్తి యోగికిఁ । బూర్ణము సాధనము సపరిపూర్ణము సంసా
రార్ణవతారకగోచర । పూర్ణము పరిపూర్తి చెందఁబూనుము వేమా. 2585

ఆ. పూర్ణమైనతనదు భుజబల్మిఁజూడక । భువిని జెడుగుతోడఁ బోరరాదు
పాలకుండ రాయి పగిలించుఁదగిలిన । విశ్వ. 2586

ఆ. పూర్వజన్మమందుఁ బుణ్యంబుఁ జేయని । పాపి తా ధనాశఁ బడుటయెల్ల
విత్తమఱచికోయ వెదకిన చందంబె । విశ. 2587

ఆ. పూర్వవాసనగల పుణ్యాత్ముని కలిమి । యూటచెలమరీతి నూరు నెపుడు
నెందఱికి నొసఁగిన నెప్పటి యట్లుండు । విశ్వ. 2588

ఆ. పూసపోగుఁ బసిడి పుట్టంబు విద్యయుఁ । గాయపుష్టిచాలఁ గలిగెనేనిఁ
గానిపులజాఁడైన ఘనుఁడంచు రమ్మంద్రు । విశ్వ. 2589

ఆ. పూసపోగు పసిడి పుష్పంబు మొదలైన । సంపదగల వాఁడు జగతిలోన
హీనకులజుఁడైన సెట్టి వాఁడైనను । రండు రండటంద్రు రహిని వేమ. 2590

ఆ. పూసపోగుఁబెట్టి పురుషుని భుజమెక్కి । కన్నులార్పవారకాంత చేరి
తనకు లొంగువానిఁదడయక చంపురా । విశ్వ. 2591

ఆ. పూసపోగు లింకఁ బుట్టంబు విడియంబుఁ । గాయపుష్టి మిగులఁ గలిగియున్న
హీనజాతి నైన నిందు రమ్మందురు । విశ్వ. 2592

ఆ. పెక్కుచదువులేలఁ జిక్కువాదములేల । నొక్కమనసుతోడ నూరకున్న
సర్వసిద్ధుఁడగును సర్వంబుఁ దానగు । విశ్వ. 2593

ఆ. పెక్కుజనులఁ గొట్టి పేదలపధియించి । డొక్కకొఱకు నూళ్లు దొంగిలించి
యెక్కడి కరిగినను నెఱిఁగి యముఁడు చంపు । విశ్వ. 2594

ఆ. పెట్ట పుంజుఁ గూడి పెనఁగిన యప్పుడు । గ్రుడ్డు పెట్టి తాను గులముఁజేయుఁ
బుంజులేని పెట్ట పుడమిఁ గుప్పలనుండి । తోలగుడ్డు పెట్టుఁదొడరి వేమ. 2595

ఆ. పెట్టినంతఫలము పెక్కండ్ర కుమాపతిఁ । జేయుచున్నఁదాను జెఱుపకున్నఁ
బెండ్లిసేయునట్టి పెద్దఫలంబురా । విశ్వ. 2596

ఆ. పెట్టిపోయులేని వట్టిదేబెలు భూమిఁ । బుట్టిరేమివాఁరు గిట్టిరేమి
పుట్టలోనఁ జెదలు పుట్టదేగిట్టదే । విశ్వ. 2597

ఆ. పెట్టిపోయువాఁడు కట్టడిగలదాత । తిట్టిపోయువాఁడు తుట్టపురుషు
రట్టుసేయువాఁడు గాణింపునకురాఁడు । విశ్వ. 2598

ఆ. పెంటిమేళమునకుఁ బెద్దలైపత్తురు । పోతుమేళమునకుఁబోరె యెవరుఁ
బుండున ముసరెడిది పూవుపైవాలునా । విశ్వ. 2599

ఆ. పెట్టువారలెవరు పెట్టకుందు రెవరు । పెట్టిపెట్టనట్టి దట్టలెవరు
పట్టుఁదప్పకుండ భావించిచూడరా । విశ్వ. 2600

ఆ. పెట్టువారితల్లి ముట్టుకోకలుమోసె । వారితండ్రి కూలిపడ్లు మోసె
గాడిదెల కొడుకుల ఘనమేఁటిఘనమురా । విశ్వ. 2601

ఆ. పెట్టెడుపతియింటఁబెట్టనిలోభున్నఁ । దిట్టితిట్టితిరుగఁగొట్టుఁదెలియఁ
బండినట్టి చేనఁ బల్లేరుగతి నొప్పు । విశ్వ. 2602

ఆ. పెతరులన్న మనుచుఁ బ్రీతితోఁబిలిపించి । కాకులకును బెట్టు కర్మలార
కాకులందు నేమి ఘనులకు బెట్టుఁడీ । విశ్వ. 2603

ఆ. పెదవిఁగొఱుకుదు రిల నధరామృతంబంచుఁ । చొంగ కడుపులోనఁజొచ్చునటుల
మలము తిత్తి మీఁద మనసెట్లుపుట్టురా । విశ్వ. 2604

ఆ. పెద్దల నటనములు ప్రేమతో వినియుఁడా । నటుల నడవఁగనఁగ ననువుపడదు
పులిని జూచినక్క పూతఁబూసిన యట్లు । 2605

ఆ. పెరటఁజెట్టు వెట్టి పరికింపకుండిన । వెలుఁగుదాటి తీఁగ వెడలఁబారు
నాడుదాని గుణము నటువలె నుండురా । విశ్వ. 2606

ఆ. పేదముట్టైవాని వినయంబులధికంబు । చెడ్డముండ ముసుఁగు చెలఁగి పెట్టుఁ
జెడిపె కొడుకు మిగులఁజేయునాభాగ్యంబు । విశ్వ 2607

ఆ. పేదముదురు కాయ పెనుబాము కుబుసంబుఁ । జోడుగూర్చి రసము సోకఁజేసి
యొక్కయేడుతినఁగ నుర్విహేమము తానె । విశ్వ. 2608

క. పేదకుఁగన్యాదానము । బూదిఁదలిర్పంగఁజేయు పురుషుఁడు తుదిఁ దా
సాధించుఁబుణ్యలోకము । వేదాంతరహస్యమిద్ది వినురా వేమా. 2609

క. పేదతికమం తదోషం । బేదో యీజగతిలోన నీశ్వరుఁడెఱుగుం
బేదను బొడఁగను వాఁడది । కాదని శవమనుచుఁజూచుఁగదరా వేమా. 2810

ఆ. పేదవానిబాధ పెనుభూతమైయుండుఁ । జూడలేనిబాధఁజూడవశమె
కలుగువానిబాధఁగనులఁజూడఁగలేమి । కేమిచెప్పవచ్చు నింక వేమ. 2611

ఆ. పేరు సోమయాజి పెనుసింహబలుఁడాయె । మేకపోతుఁబట్టి మెడనువిఱువఁ
గాక క్రతువువలనఁగలుగునా మోక్షంబు । విశ్వ. 2612

ఆ. పైరునిడిన వాని ఫలమే సఫలమగుఁ । బైరునిడనివాఁడు ఫలముఁగనునె
పైరు నిడినవాఁడు బహుసౌఖ్య వంతుఁడౌ । విశ్వ. 2613

ఆ. పొంకములకు మనను పోనీక సర్వేశు । వంకనిల్పువాఁడు వంశవరుఁడు
వంకనిల్పకున్న వచ్చు నాపదవులు । విశ్వ. 2614

ఆ. పొట్లకాయ రాయి పొడుగు త్రాఁటనుగట్ట । లీలతోడవంక లేక పెరుగుఁ
గుక్క తోకఁగట్టఁ గుదురునా చక్కగా । విశ్వ. 2615

ఆ. పొట్టివాఁడుకీడు పొడలపురుగుకీడు । ఎట్టియాశకీడు పరుఁడు కీడు
పొట్టిచేయికాలుఁ బొసఁగుట కీడురా । విశ్వ. 2616

ఆ. పొత్తుఁ గుడవ వచ్చు పుత్రుఁడే వయసైనఁ । దొత్తుకొడుకు నెంగి లెత్తుకొందెరి
కాని వానిజోలిఁ గాన రీరీతిగా । విశ్వ. 2617

ఆ. పొందుగ ధరలోన మును బురూరవరాజు । ధర్మమే జయమని తనరియుండి
తనదు కాలగతిని దా నెఱుంగఁగలేక । మదను చేతఁజిక్కె మరిగె వేమ. 2618

క. పొందుము హృదిగుత్తిఁదగువా । నందము సదసద్వివేక నాదముపైగా
నిందించు భ్రమల నెల్లను । సందియ్యని బయలుచేరు సాక్షిగ వేమా. 2619

ఆ. పోకలింగములను బొరలించి పూజింపఁ । గట్టివేయు వారికర్మమేమొ
కడిగి త్రాగ వారి కడుపేమి నిండురా । విశ్వ. 2620

ఆ. పావనీయమందుఁ బొరలింతుఁ లింగంబుఁ । గట్టివేసి యేమి కల్లఁజేసె
నఖిల కర్మములను నాకారమే సాక్షి । విశ్వ. 2621

ఆ. ప్రజ యొనర్చుచెడుగు ప్రభునకు వచ్చును । బ్రభువు మంచియందు ప్రజకు సగము
ప్రభు వొనర్చుచెడుగు ప్రజలకు రాదురా । విశ్వ. 2622

ఆ. ప్రజలెఱుంగ బ్రదుకఁ బట్టభద్రుఁడు గాఁడు । పైఁ గిరీటముండు బ్రహ్మ గాఁడు
నోగుఁ దెలిసి పలుకు యోగీశ్వరుఁడుఁ గాఁడు । అట్టివానిఁ దెలియనగును వేమ. 2623

ఆ. ప్రణవమంత్రమహిమ భావింప లింగంబె । మూఁడుమూర్తులందు మొనసియుండు
మాన్య తెలిసి కొలువ నన్యులశక్యమా । విశ్వ. 2624

ఆ. ప్రణవ మంత్ర మొకటి భావింపవునగ్ని । వక్రకర్మ సేయ వంతఁగూర్చ
వెలుఁగుచుండుయోగి విజ్ఞాన దీపమై । విశ్వ. 2625

ఆ. ప్రణవమెఱుఁగ నతఁడు భక్తుండు తాఁగాఁడు । జ్యోతిఁజూడ నతఁడు జోగి గాఁడు
నిత్య మెఱుఁగనతఁడు నిర్వాణి కాఁడయా । విశ్వ. 2626

ఆ. ప్రణవ మెఱుఁగలేమి భక్తుఁ డెప్పుడుఁ గాఁడు । జ్యోతి నెఱుఁగ లేమిఁ జూడఁబోఁడు
నిత్య మెఱుఁగలేమి నిర్వాణి గాఁడయా । విశ్వ. 2627

క. ప్రత్యక్షమగు మిశివయని । నిత్యము మదిలోనఁదలచి నిలిచినయపుడే
సత్యముగ జ్యోతికనఁబడు । నిత్యములోఁ దృష్టిఁ జెంది నెరయును వేమా. 2628

క. ప్రత్యక్షము భూదేవికఁ । బ్రత్యక్షము వాయువగ్ని ప్రాణేంద్రియముల్
ప్రత్యక్షము రవిచంద్రులు । ప్రత్యక్షమె కాన వేరె పదరా వేమా. 2629

క. ప్రత్యక్షము రవిచంద్రులు । ప్రత్యక్షము వాయువగ్ని పానీయంబుల్
ప్రత్యక్షము భూదేవత । ప్రత్యక్షము విశ్వమెల్లఁ బరగెడి వేమా. 2530

క. ప్రతిదినమును నుదయమ్మున । మితకాలము లెక్కఁ గొనక మీఱిపనికిరాఁ
గత మేమి యనుచు రామయ । ప్రతమరయఁగఁగంటి నిట్టి వానిని వేమా. 2631

క. ప్రథమమున మాతదేవత । పదపడి జనకుండటగును బరికింపనిఁకం
గుదిరిన సదమలగురుఁడే । తుది దైవము పెరలులేరు దొరకెట వేమా. 2632

ఆ. ప్రభునకిచ్చినట్లు రహిఁ బేదలకునీరు । వనితకిచ్చినట్లు వటున కీరు
సురకునిచ్చినట్లు సుమతులకియ్యరు । మనసుపదిలపడమి మహిని వేమ. 2633

ఆ. ప్రభులకిచ్చునట్లు పండితులకు నీరు । వనిత కిచ్చినట్లు పరుల కీరు.
సురకునిచ్చునట్లు సుధకునునీయరె । విశ్వ. 2634

ఆ. ప్రభువుకోఁతియైనఁ బ్రెగడలు పందులు । సైనికుండు పక్కి సేన పసులు
నేన్గు లశ్వచయము లెలుకలుం బిల్లులు । విశ్వ. 2635

ఆ. ప్రళయకాలమందుఁ బ్రమథులచేత నే । నష్టమైరిగాదె నాటిజనులు
తెలియనేరరైరి దేవుని గ్వాళితేమొ । విశ్వ. 2636

ఆ. ప్రవరయున్నఁబేరు పరిఢవిల్లినదేమి । దానియందు నేపుతగిలె మీకు
నిజముఁదెలియమీరు నిత్యపూజితులైరె । యుండఁగండ్రుజగతి నొనర వేమ. 2637

ఆ ప్రస్తుతంపువేళఁబద్యంబుఁ జనుపుచోఁ । దప్పుగలిగియున్న నొప్పియుండు
వెలఁదినురతవేళ బిత్తరైయుండదా । విశ్వ 2638

ఆ. ప్రాకటముగనింత లోకమందునుగంటిఁ । బల్లెముత్తఁడెన్నఁబరమగుణుఁడు
అన్నదానమునను హరిపూజచేతను । హరునిలోనఁగలిమికతఁడె వేమ. 2639

తే. ప్రాకుపెట్టినవర్తనల్పదటఁగలిపి । క్రొత్తవర్తన మొనరింత్రుకోడకాండ్రు
కన్నతల్లినివిడనాడికష్టపెట్టి । యన్యకాంతలపోషించునట్లు వేమ. 2640

ఆ. ప్రాణబంధములను బంటకాపెఱుగునా । యెఱుఁగఁగలుగుజ్ఞాని యెఱుఁగుఁగాక
మోసపాటెఱుఁగక మోహమునఘటింతురు । విశ్వ. 2641

ఆ. ప్రాణమగును గాలి బ్రహ్మాండమగు మేను । మిత్రచంద్ర శిఖులు నేత్రచయము
మఱియుదేవునెఱుఁగ మహిమీఁద నెవరయా । విశ్వ. 2642

ఆ. ప్రాణమందుశివుని భావించి తెలిక । ముద్రలనుచుఁ బడెడుమూఢులార
ముద్రలందులేదు మూలమందేకాక । విశ్వ. 2643

ఆ. ప్రాణమాత్మమున్న ప్రాణిజీవితమెన్న । జీవిప్రాణమాత్మ చేరియొకటె
కర్మబంధనమునఁ గట్టఁబడినవంచు । దేహగంధికిపుడు తెలుపు వేమ. 2644

ఆ. ప్రాణమిలనులేక పరమందఁగారాదు । ప్రాణముండఁగానె పరముఁగద్దు
ప్రాణిపరముఁగనుట భావింపనేరరే । విశ్వ. 2645

ఆ. ప్రాణరక్షణకిలఁ బరమశివునిమీఁద । ధ్యానమొనరలేమిఁ దగిలినరుఁడు
పుట్టిచచ్చుచుండుఁబుడమిలోపలఁబుట్టు । చెదలుగానువాఁడుచెడును వేమ. 2646

ఆ. ప్రాణలింగమంచుఁ బ్రార్థించికీర్తింతు । కట్టివేయనేమి చట్టఁజేసె
నఖిలజనుల కెల్ల నానంద మేసాక్షి । విశ్వ. 2647

ఆ. ప్రాణిచేరువాఁడు పరగదేహమునకు । హానిలేకయుండు నరయనంట
ప్రాణిపోయినపుడు పనికిరా దీదేహ । మనుచుఁబలుకుదు రిల జనులు వేమ. 2648

ఆ. ప్రాణులందుశివుని భావింపనేరక । యోగమందు రేల నోగులార
యోగమంచుఁగలదె భోగమం దున్నట్టు । విశ్వ. 2649

ఆ. ప్రాప్తిగల్గుచోట ఫలమిచ్చుదైవంబు । ప్రాప్తిలేనిచోట ఫలములేదు
ప్రాప్తిలేదుతనకుఁ బరమాత్ముఁ డెట్లిచ్చు । విశ్వ. 2650

ఆ. ప్రియములేనివిందు పిండివంటలచేటు । భక్తిలేనిపూజ పత్రిచేటు
పాత్రమెఱుఁగ నీవి బంగరుచేటెరా । విశ్వ. 2651

ఆ. ప్రియములేనివిందు పింటివంటలచేటు । బత్తిమాలుపూజ పత్రిచేటు
ఓజమాలునాల దోలిసాళ్లకుఁజేటు । విశ్వ. 2652

ఆ. పృథివిఁబుట్టెమొలక పృథివిలోఁగలిసెను । మరల నదియెపుట్టు మగఁడెసుతుఁడు
ధరణిజనులకెల్లఁ దల్లియే పెండ్లము । విశ్వ. 2653

ఆ. పృథివిమీఁదఁబుట్టి పిరిఁగనిహంసల । విహరణంబెఱింగి విడువకమదిఁ
దిరుగ నేర్చువాఁడు ధీరుఁడై యుండురా । విశ్వ. 2654

ఆ. పృథివివారికెల్లఁ బెట్టుననొకగిన్నె । పొత్తుకుడిచికులముఁ బొలయఁజేయఁ
దలనుజేయిపెట్టి తగ నమ్మఁజెప్పఁదా । వారకాంతనమ్మ వలదు వేమ. 2655

ఆ. ప్రేతయన్నమనుచుఁ బ్రీతితోఁబిలిపించి । కాకులకునుబెట్టు కర్ములార
కాకులు పెతరులయి కలిగింతెఱి మోక్షంబు । విశ్వ. 2656

ఆ. ప్రేమలేనివాని వినయంబు లధికంబు । చెడ్డముండమునుఁగు చెలఁగిపెట్టుఁ
జెడిపెఱోడుకు మిగులఁ జెప్పు నిచ్చకములు । విశ్వ. 2657

ఆ. ప్రొద్దుపొడుచుచోటుఁ బ్రొద్దునిలుచుచోటుఁ । బ్రొద్దుగ్రుంకుచోటుఁ బొసఁగఁజూచి
పొద్దెఱిగినవాఁడు పొలుపైన యోగిరా । విశ్వ. 2658

ఆ. ప్రొద్దుపొడుచు టెఱిఁగి పొద్దునడయెఱింగి । పొద్దుగ్రుంకునట్టి పోలి కెఱిఁగి
పొద్దుఁదెలియు నతఁడె పొలుపొందు బ్రహ్మంబు । విశ్వ. 2659

## ఫ

ఆ. ఫక్కిఁ దెలిసి పలుకనొక్క వాక్యమె చాలు । పెక్కు లేలపట్టి పేలుటేట
దిక్కుకలుగ నొక్క దేవుఁడొక్కఁడె చాలు । విశ్వ 2660

ఆ. ఫణికిఁ గోరలుండ భయమొందుచుంటిలె । వెరతురయ్య దుష్టు విభవమునకుఁ
గోరలూడఁ ద్రాచు మీఱదు దుష్టుఁడు । విభుతపోను బెట్టు వెతలు వేమ. 2661

ఆ. ఫణితిఁ దెలిసి మాఱు పల్కులే యుక్తము । గణనకెక్కునట్టి ఘనుఁడె యెపుడు
గుణములేక యున్నఁ గుదురు నేయూహలు । విశ్వ. 2662

ఆ. ఫలక మొడమ చేతఁ బట్టి ఖడ్గంబూన । బంటుతనము రాదు ప్రతిభలేమి
వీధిలోను దిరుగ వెలఁది పురుషుఁడౌనె । విశ్వ. 2663

తే. ఫలము నిహమందుఁ బరమందుఁ బడయఁగనని । యట్టి భూభారమగు వారలెట్లు సృష్టి
చేయఁబడిరయ్య బ్రహ్మచేఁ జెన్ను మీఱ । వరిపొలంబునఁ గసవుండు వరుస వేమ. 2664

ఆ. ఫలములేని కార్యములు సేయనొల్లరు । కలజనంబులెల్ల నిలనిజంబు
ఫలము మంచిదైనఁ బరువందు ముదమందు । విశ్వ. 2665

ఆ. ఫాలనేత్రుఁడైన భావింపలేఁడయా । ఆలిమీఁదఁ బెట్టి యాదిమరవ
గోలయనుచు నమ్మఁ గూడదు వెఱ్ఱియై । విశ్వ. 2666

ఆ. ఫాలమునకుఁ బొట్టఁ బడతికి జుట్టును । కాపురమున గుట్టు కలిసికట్టు
ఉన్నఁ జూడలేక యున్నను బాడురా । విశ్వ. 2667

## బ

ఆ. బంగరు పాడఁగన్న భామల బోడఁగన్నఁ । జిత్తమునను చింత నేయఁడేని
వాఁడె పరమయోగి వర్ణింప జగమందు । విశ్వ. 2668

ఆ. బంగి త్రాగి తిరిగి బకముచాడ్పుననుండ । సంగ్రహింపరాదు చంద్రకళలు
బ్రింగుమదిని బోరి మిన్నంది యుండరా । విశ్వ. 2669

ఆ. బంగి త్రాగువాఁడు భావమునందఁడు । నింగి కెగయు కైపు నిల్వనీఁడు
లింగ మమర బంగి లీలను జెందురా । విశ్వ. 2670

ఆ. బట్ట త్రాళ్లతోను బంధించికట్టఁగా । లింగ మొవరిసొమ్ము దొంగిలింప
నాత్మలోనిలింగ మటువలెనుండునే । విశ్వ. 2671

క. బట్టబయలందు శ్వాసను । ముట్టుచు నెగరోజి పట్టి మూలమునందే
నెట్టుచు విడుచుచు నిండిన । గుట్టు పరబ్రహ్మమంచుఁ గూడుము వేమా. 2672

ఆ. బట్టబయలు చేసి భావము వెలి జేసి । గుట్టు తెలియఁజేసి క్రూర మడఁచి
పట్టపగలు చేయ భావంబు తానయా । విశ్వ. 2673

తే. బట్టబయలైన తత్త్వమే బ్రహ్మమనఁగ । నిట్టనిలువున మదిఁజేర్చి నెగడవలెను
దట్టిఁగట్టిన జయమున్నె జెట్టివలెను । గుట్టులోగుట్టు పరమంబుఁగూడు వేమ. 2674

క. బట్టబయలైన బ్రహ్మము । గుట్టును మది నెంచి లోన గుణముపడినచో
దిట్టముగ జగముగిట్టును । దిట్టరియై యెఱుక మఱచి తిరుగును వేమా. 2675

ఆ. బట్టి పెట్టినాల్గు బానలచమురుతో । పండిశుద్ధి చేయ దండియగునె
పుట్టువందెకలుగుఁ బూర్వపుణ్యం బున్న । విశ్వ. 2676

ఆ. బటువుగాను బుద్ధి బరికించి నొక్కుచు । కుటిలగుణము లన్ని కూలఁద్రొక్కి
పటుతరంబుగాను బలపడఁజూడరా । విశ్వ. 2677

ఆ. బంటుతనము కాదు బలముతోఁ గట్టఁగా । వెంటనుండి మనసు వెతలఁబఱచు
నింటఁగెల్చి రచ్చ నిలఁగెల్వవలెనయా । విశ్వ. 2678

ఆ. బంటువలె నెలేచుఁ బండితమ్మన్యుఁడు । సాధుపండితుండు శాంతముగను
కుక్కకూయ నేమి గుఱ్ఱమునకు లెక్క । విశ్వ. 2679

ఆ. బండదానికేల బంగారు మొలత్రాడు । విధవరాలికేల వెండిగొలుసు
ముచ్చుముండకేల ముంజేతికడియాలు । విశ్వ. 2680

ఆ. బండమీఁద చెలమ పాటించి త్రవ్విన । నలవికెక్కడో జలాశ లేదు
గుంటపట్టు చెలమ గుణ ముద్ధరించురా । విశ్వ. 2681

ఆ. బడుగు నెఱుఁగలేని ప్రాభవం బదియేల । ప్రోదియిడని బంధు భూతియేల
వ్యాధిఁదెలియలేని వైద్యుఁడేరికి నేల । విశ్వ 2682

ఆ. బడుగుబాపనయ్య వడి నేర్పె మంత్రంబు । లెచ్చు మేమె యంద్రు హీనజనులు
కడుగుఁద్రాగు కాకి కఱ్ఱనికూయదా । విశ్వ. 2683

ఆ. బండుబూతులాడు పరమ నీచుండెన్న । దండి వారి మేల్మి తానెఱుఁగునె
చందనంబు ఘనత పందియే మెఱుఁగురా । విశ్వ. 2684

ఆ. బందెత్రాళ్లు తెచ్చి బంధించి కట్టంగ । లింగఁడేమి దొంగిలించినాఁడో
ఆత్మలింగమునకు నర్పింప నేరరో । విశ్వ. 2685

తే. బంధముక్తుల రెంటిని బదలనుగను । గోరరాకయమదియందుఁ గోర్కెలడఁచి
చేయుపనులెల్ల బయటను జెనకి మించు । వలయునది కూడు నీకయావలను వేమ. 2686

ఆ. బంధుకోటిఁబాసి బయలును దెలియక । సింధుపుత్రిమాయఁజిక్కఁగాదె
కార్ష్ణియంతవాఁడె జనులకు శక్యమా । విశ్వ. 2687

ఆ. ఖన్నపడక గుటెసి బట్టులోఁ బట్టుగాఁ । జిన్నబలముఁ జేర్చి చింతవిడిచి
యున్నవాఁడె ముక్తిఁగన్నవాఁడౌనుమ్ము । విశ్వ. 2688

క. బయలందె పుట్టుసర్వము । బయలందే లీనములగు బ్రహ్మాండంబుల్
బయలని మదిలోఁ దెలిసిన । బయలందే ముక్తిబట్టబయలగు వేమా. 2689

ఆ. బయల నిల్లుగట్టి పరికింప నేరక । భ్రమసితిరుగువాఁడె పామరుండు
బయలు పడిన యతఁడు బ్రహ్మంబు తానగు । విశ్వ. 2690

క. బయలనుచు బయలు పొడగన । బయలునఁ దనమనసు నిలచి బాగుగఁదనరున్
బయలని తలఁచెడు భ్రాంతియె । బయలైతనుఁదానె కాంచు బ్రహ్మము వేమా. 2691

ఆ. బయలుకాని బయలు బయలని తెలియక । బైటపడిరి బట్టబైటివారు
బయలులోని బయలు పరికింపఁదత్వమా । విశ్వ. 2692

క. బయలున బంధము గప్పును । బయలునఁబరమాత్మునకును బంధముతొలఁగున్
బయలున బంధములూడిన । నయవర్తనముక్తిఁగాంచు నరుఁడటు వేమా. 2693

క. బయలున బంధము బుట్టును । బయలునఁబరమాత్మునకును బంధముగలుగున్
బయలున బంధము తుదిపెను । బయలున బయలయ్యెడిని దెపరముర వేమా. 2694

క. బయలునఁబుట్టిన బంధము । బయలునఁగలుపంగవలయుఁబరమాత్మునకున్
బయలునఁబుట్టెడిసంపద । బయలునఁగలుపంగముక్తి బయలగు వేమా. 2695

క. బయలున సర్వముఁబుట్టును । బయలందేలీనమగును బ్రహ్మంబనఁగా
బయలని మదిలోఁదెలిసిన । బయలందే ముక్తి బట్టబయలగు వేమా. 2696

ఆ. బయలు బయలుగాను బరికింపఁజాలక । బయలులోనివారు బయటఁబడిరి
బయలులోని జాలఁబరికింపఁదత్వమా । విశ్వ. 2697

ఆ. బయలు బయలుగాను బలపడినప్పుడే । నయముతోడ నైక్యమొయగు మదిని
జ్ఞప్తియందు నెఱుకఁగనుటయే లేదురా । విశ్వ. 2698

ఆ. బయలు బ్రహ్మమనుచుఁ బరికింపుచుందురు । బయలదేలఁదాను బ్రహ్మమవును
బ్రహ్మమైన బయలు పరికింపఁదత్వమే । విశ్వ. 2799

ఆ. బయలు బ్రహ్మమనుచు భాషింపుచుందురు । బయలదేమిఁటికిని బ్రహ్మమగును
బ్రహ్మమైన బయలు భావమందుంచుమీ । విశ్వ. 2700

ఆ. బయలురూపుతనను బయలుగాఁ జేసియు । బయలు రూపునంటి భ్రమయకుండి
బయలులోని బయలె భావింపఁ బరమాత్మ । విశ్వ. 2701

ఆ. బయలు రూపురూపు బయలుగాఁ జేసియు । నింటి రూపు బయట నేరుపఱచి
బయలు కాని బయలుపరికింపఁ దత్వంబు । విశ్వ. 2702

ఆ. బయలు రూపురూపు బయలుగాఁ దెలిసియు । బయలురూపు బట్టబయలు చేయు
బయలులోని బయలు పరమాత్మతత్వము । విశ్వ. 2703

ఆ. బయలు రూపురూపు బయలునుగాఁ జేసి । బయలు రూపుబట్టబయలుఁ జేసి
బయలు లోనిదాని భావింపఁదత్వంబు । విశ్వ. 2704

ఆ. బయలు రూపులేని భావంబులోనెంచి । బయలురూపుబట్టబయలు చేసి
బయలు బ్రహ్మమనుచు భావింపఁదత్వము । విశ్వ. 2705

ఆ. బయలులోని బయలు పరికింపఁగా లేక । బయలు రూపుఁ జూచి భ్రమయ నేల
బయలు రూపులెల్లఁబరికింప వలదయో । విశ్వ. 2706

ఆ బయలులోని బయలు పరికింపఁ జూడక । బయలు రూపుఁ జూచి వలచు నౌర
మురికిదేహమందు మోహంబు విడఁడయో । విశ్వ. 2707

ఆ. బయ లోని బయలు పరికింప నేరక । బయటఁబడిరి పట్టపగలుగాను
బయలులోని బయలు భావింపఁగా ముక్తి । విశ్వ. 2708

ఆ. బయలు-లోనె పెనఁగి బయలులోమునిఁగియు । బయలుఁ దెలియలేఁడె బంధకుండు
బయలు బ్రహ్మమనుచు భావించి చూడరా । విశ్వ. 2709

క, బయలే చూడఁగ సర్వము । బయలున లీనములు చూడ బ్రహ్మాండంబుల్
బయలనితోఁ జెడిమదిలో । బయలందిన ముక్తి బట్టబయలగు వేమా. 2710

క. బయలయినది యెంతెంతయొ । బయలున బ్రహ్మాండమునకుఁ బట్టది యెంతో
రయమున రవి తానెంతో । భయపడుదురు దానిఁ జూడ బయలని వేమా. 2711

ఆ. బఱ్ఱె లట్లు లరవ ఫలమేమి కద్దురా । అందుసార్థకంబుఁ జెందకున్న
విన్నవారు వారి వెఱ్ఱులుగా నెంత్రు । విశ్వ. 2712

ఆ. బలము కోనఁగ గాలిఁ బట్టి రేచించుచుఁ । గలియఁ బూరకంబు కడలుకొనఁగ
విలయ కుంభకంబు విధమంద చూడరా । విశ్వ. 2713

ఆ. బలముజూపు టేల బలవంతముగ రాదు । కులము జూచి మెచ్చఁగుదురఁ బోదు
తలముఁ ద్రొక్కియట్లు తలకొని విడరాదు । విశ్వ. 2714

ఆ. బల్లిపలుకులు విని ప్రజతమపనులెల్ల | సఫలములగు ననుచు సంతసించి
కానిపనులకుఁ దమకర్మమటందురు | విశ్వ. 2715

ఆ. బహుళకావ్యములను బరికింపఁగావచ్చు | బహుళశబ్దచయము పలుకవచ్చు
సహన మొక్కటబ్బఁజాలకష్టంబురా | విశ్వ. 2716

క. బహువిధవస్తువులందును | మహిఁగలిగెడు నెల్లజాతి మనుజులయందున్
రహిమించు బ్రహ్మునిమది | గ్రహియింపఁగ బాహ్యశబ్దకథితము వేమా. 2717

ఆ. బాగుగాను ముక్తిఁబడయంగ ముందుగా | యోగిగాక గురుని కేగి మ్రొక్కి
వేగబుద్ధి నొక్క విలయముపందుటతగు | విశ్వ. 2718

ఆ. బాటఁదెలియకున్న బహుదూరమైతోఁచు | చోటుఁదెలియకున్నఁ జూపొనరదు
కోటకొమ్మమీఁదఁగుదురుగఁజూడుమీ | విశ్వ. 2719

ఆ. బాపఁడనఁగ నేమి భక్తుఁడనగ నేమి | జోగియనఁగ నేమి సొంపులేక
ఇన్ని పేరులేల నినజుఁడు పనిదీఱు | విశ్వ. 2720

ఆ. బాపఁడారగింపఁబరగ నేకాహంబు | పేదపనుల నొదవఁబెండ్లిమునిగె
గులము మొదలె చెడ్డఁగూలెపోమానంబు | విశ్వ. 2721

ఆ. బాపఁడెముకకూడు భక్షింపసాగెను | పోవుఁబేరంటంబు బొచ్చుముండ
కులముమానముడఁగఁగోరుక్కలు మెండాయె | విశ్వ. 2722

ఆ. బాపలన్నదొడ్డపరువునఁజూతురు | కానిపనులుసేయు హీను లండ్రు
కులములెక్కయేమి గుణమే ప్రధానంబు | విశ్వ. 2723

ఆ. బారెడేసి జడలు భస్మంబు పూతలు | వనితలకును బోధ వరుసకుదుర
గంజిగోచులమురె లంజె వేషముమీఱె | విశ్వ 2724

ఆ. బారెడేసి జడలు భస్మాంగలేపనల్ | మదనమదముతోడ మాఱుమలయ
లోకలుడిగి యంగదేకులుబలిసెగా | విశ్వ. 2725

క. బాలకు నెత్తుచు నప్పుడె | చాలంగా జలకమార్చి సంతోషముతోఁ
బాళిని మంత్రసానియు | జోలలువాడెడిని గదర సొంపుగ వేమా. 2726

ఆ. బాలచనులఁ బూలబంతులు పోల్తురు | పాలుమాలినట్టి భ్రాంతులవని
మాంసఖండమందు మఱియేమియున్నది | విశ్వ. 2727

క. బాలతతనమున్నప్పుడు | బాలురతోఁగూడి నటుల భాషింపంగా
నేలకొ శివునకు నప్పుడు | మాలిమిగల జాలితగులు మహిలో వేమా. 2728

క. బాలప్రాయంబునను ముక్తిఁబడయరాదు । పరువునందును గామంబు వదలబోదు
ముదిమియందును జింతలోముక్తి లేదు । చచ్చిసాధింప నౌనేమొ జగతి వేమ. 2729

ఆ. బాలప్రాయమందె భ్రమలనడంపక । మేలుపొందరెపుడు మేదినందు
కీలుఁదెలిసి మదిని గీడ్పడకుండుమీ । విశ్వ. 2730

ఆ. బాలప్రాయమునను బహువిధములఁ బట్టి । చప్పరించినట్టి స్తనములను నె
మోహమింతయేల మూఢాత్మ తెలియరా । విశ్వ. 2731

తే. బాల్యచేష్టల పాల్పడి భ్రమనుదగిలి । తిరిగిమదిలోన దేవునిఁ దెలియలేక
యిహసుఖంబును విడలేక యీల్గునరుఁడు। నరకభాధకునడలుచు నెఱుఁగు వేమ. 2732

ఆ. బాల్యమందునెపుడు పాలపైఁ బ్రేమచేఁ । దల్లి నెఱిఁగిచూచి తనయుఁడేడ్చు
తల్లిపనులదీర్చి తనయుని ముద్దాడు । విశ్వ. 2733

ఆ. బాల్యమందు శివునిఁ బరికింపఁగాలేరు । యౌవనంబునందు నరయలేరు
ముదిమియందుఁగూడ మోసమేకందురో । విశ్వ. 2734

ఆ. బాల్యమందు స్వామి భక్తిలేకుండును । యౌవనమున నారుని సేవఁగనరు
వార్ధికంబునందు వర్ణింపలేరటే । విశ్వ. 2735

క. బాలుఁడవై యున్నప్పుడు । చాలవు యౌవనమునందు సంపదరూపుల్
మేళనమూ ముదిమియె యే । వేళనుగడ తేఱ్చు శివుని వెదకర వేమా. 2736

ఆ. బిగియుదృష్టి యెపుడు బింబమందుంచిన । మనసమందు నెఱుక మగ్నమగును
లగ్నచిత్తమమర రక్షించుచుండురా । విశ్వ. 2737

ఆ. బిడ్డలందుఁ బ్రేమ ప్రియమైనచుట్టాల । సంపదయునుగలిగి సఖియుఁగూడి
ముందుచే టెఱుఁగక మురియుటఁజూచిన । భంగురంబుమాయ బలిమి వేమ. 2738

ఆ. బిడ్డలను సతులను పేరెక్కుచుట్టాల । సంపదలఁదనువులఁ జాలనమ్మి
సంతసిల్లుచుంద్రు క్షణభంగురములని । తెలియలేరదేమి తెల్పవేమ. 2739

ఆ. బిడియమింతలేక పెద్దను నేరంచు । పొంకములను బలుకు సంకరునికి
ఎచ్చుకలుగదీడఁ జచ్చినగాడాడ । విశ్వ. 2740

ఆ. బిందునాదుఁజేసి ప్రియమొప్పఁగా నల్ల । నాదుబిందుఁజేసి నయముగాను
బిందునాదుసందు భేదించిచూడరా । విశ్వ. 2741

ఆ. బిందు నాదునాదు బిందునుగాఁజేసి । నాదుబిందులాది నాదుఁజేసి
బిందులోనినాదు భేదించిచూడరా । విశ్వ. 2742

తే. బిందు బీజములనడుమ భేదపడక । నందనిష్ఠను తాండవ నటనుఁడగుచు
పొంది పరిపూర్తిఁ జెందును బూర్ణతముగ । నందలంబగు బయలెక్కి యందు వేమ 2743

ఆ. బిందురక్తములను బెరసిన దేహము । చందమెఱుఁగక ధ్వజ శబ్దమిడుక
నడచినను విడుచునో నరకంబు మృత్యువు । విశ్వ. 2744

ఆ. బిందువందుఁ బుట్టెఁ బెంపైన నాదంబు । నాదమందుఁ బుట్టె నాదిశివుఁడు
శివుని మధ్యమందుఁ జెలఁగును సూక్ష్మంబు । విశ్వ. 2745

ఆ. బిందు వనఁగ మాయె బీజంబు శివుఁడాయె । నందుఁ గనక మాయె నప్పాల యె
సంధి వెలయు జగము సర్వము నాత్మాయె । విశ్వ. 2746

ఆ. బిందు సేవకుండు బీజంబె యైయుండు । తీర్థ సేవకుండు దేవుఁడగును
నాదు సేవకుండు తాదొడ్డ శివుఁడయా । విశ్వ. 2747

ఆ. బిందు సేవకుండు బీజమై యుండును । సాధు సేవకుండు సర్వహితుఁడు
తీర్థ సేవకుండు తిరుగుచుండెడిఁ గదా । విశ్వ. 2748

ఆ. బింబఫలములుండ బిగిత పురసముండఁ । బసిడికొఱకుఁ దిరిగ పొల్లుపడిరె
సత్తు వెచ్చ చేసి సాధింపలేరొకో । విశ్వ. 2749

ఆ. బీరువోవుకులము బిరుదుమ్రింగుకులము । ఎల్లజీవులనుభవించుకులము
ఇట్టికులమువార లిహపరంబులయందుఁ । బట్టుగలుగువారు పరగ వేమ. 2750

ఆ. బుద్ధియుతుని కేలఁ బొసఁగని సఖ్యంబు । కార్యవాది కేలఁ గడుఁజలంబు
కుత్రితునకు నేల గురుదేవతా భక్తి । విశ్వ. 2751

క. బూటకపుఁ బూర్వకథలను । వాటముగాదయ్య పరము పరియించెడు నా
కూటముఁ జేరక పూర్ణము । సాటింపఁగ నెవ్వరివశము సత్యము వేమా. 2752

ఆ. బూటకంబు చేత పుడమిలో నొకకొన్ని । నాటకంబులాడి నయముఁ జూపి
దీటు లేక తాము తిరుగుచునుందురు । విశ్వ. 2753

క. బూటక మీబ్రదుకును గన । నాటక మగులోకమునను నైజముఁ జూడక
వాటపడు గురుముఖంబున । దీటుగఁ బరిపూర్ణమందుఁ దెగఁబడు వేమా. 2754

తే. బూటకము పుట్టిచచ్చుట భూమియందు । నాటకంబగు బ్రదుకుల నానెసులును
చోటుగుర్తింప గుటిఁ జేరి చూడవలెను । అల్లనాటు విడక పర మందు వేమ. 2755

ఆ. బూతులేనిలంజె భూతంబుకూతురు । ప్రీతిలేని పాటు పేత చేటు
దాతలేని యూరు దయ్యాల పేటరా । విశ్వ. 2756

ఆ. బూదిపూఁతలెన్న భుజముల పొంకాలు । వ్రాలులింగములును పరుసమతము
లిక్కడఁదగుగాక యిక్కడఁదగునెట్లు । విశ్వ. 2757

ఆ. బెసికంటివానిఁ బెంపారమదిఁజేర్చి । పూజచేయవలెను బుద్ధినిలిపి
ఆత్మపూజకంటె నదనంబు లేదయా । విశ్వ. 2758

క. బైలునబంధము కలుపక । వ్రాలెనుబరమాత్మునకును వాంఛితమొప్పన్
బైలున బంధముగలిపినఁ । గైలాసముఁజేరి ముక్తిఁగాంచుర వేమా. 2759

క. బైలున బంధముపుట్టెను । బైలునబంధమ్ముగలిసెఁ బరికింపంగా
బైలున బంధముగలిసినఁ । గైలాసముఁబాసి ముక్తిఁగాంతుర వేమా. 2760

ఆ. బొందినమ్మిమిగులఁ బోషించిపలుమాఱు । ప్రాణివిడుచునెల్లఁ బాతకంబె
తనదులోన భక్తి తనరుటేమోక్షంబు । విశ్వ. 2761

ఆ. బొందియెవరిసొమ్ము పోషింపఁబలుమాఱు । ప్రాణమెవరిసొమ్ము భక్తిసేయ
ధనమదెవరిసొమ్ము ధర్మమేతనసొమ్ము । విశ్వ. 2762

ఆ. బొందివేఱుకాని భువిప్రాణమొక్కటి । అన్నములిలవేఱె యాకలొకటి
పుష్పములిఁకవేఱు పూజయొక్కటిసుమ్ము । విశ్వ. 2763

ఆ. బొందివేఱునిజము భువిప్రాణమొక్కటే । అన్నములును వేఱె యాకలొకటె
దర్శనంబువేఱు దైవంబదొక్కటే । విశ్వ. 2764

ఆ. బొమలనడుమగుఱ్ఱు పొందింపఁజాలక । విమలదృష్టిమదిని వెలుఁగఁబోదు
తమముడిగినంతఁ దత్వంబుతానగు । విశ్వ. 2765

ఆ. బొమ్మలాటవాఁడు బొమ్మలనాడించు । భువిని జనులనూడఁబోలుపుమీఱ
తానుటిగియుండి దైవమట్లాడించు । విశ్వ. 2766

ఆ. బొల్లిమాటలాడు బోగముసానితో । డొల్లిడుల్ల నిల్లు గుల్లఁజేసి
యెల్లిరమ్మటంచు నీడ్చురాబయటికి । విశ్వ. 2767

ఆ. బోటియొకతె బ్రహ్మ నోఁటిమీఁదనె తన్నె । కొమ్మయొకతె విష్ణురొమ్ముఁదన్నె
సఖియయొకతె శివుని సగముగాఁజేసెను । విశ్వ. 2768

ఆ. బోడితలలజడల బూడిదెపూఁతల । భాషణాసనముల వేషములను
యోగులైరెలోన బాగుగాకుండిన । విశ్వ. 2769

ఆ. బోడితలలమీఁద బూడిదెపూఁతలు । వాసనముల వేషమమరఁజాల్ప
భోగిజంగమనుట బాగుగాదదిచూడ । విశ్వ. 2770

ఆ. బోనులోనియెలుక పోఁజూచునట్టులు । జ్ఞానమందనెలుక చనునుమీఁదఁ
గాన మేనుమఱచి ఘనతత్త్వమందరా । విశ్వ. 2771

ఆ. బౌద్ధమతమువారు బుద్ధిదైవంబని । యెచ్చుదక్కువాడఁ దుచ్ఛమతిని
గాడిదెల గుమియటుల్ గక్కునఁబడుదురు । విశ్వ. 2772

ఆ. బ్రతుకుఁదెరువులేని బహుగులందఱు పెద్ద । యోగివరులమనుచు సాగిరాఁగ
బండవాండ్రు ముందు దండంబులిడుదురు । విశ్వ. 2773

ఆ. బ్రితుకులన్నిమాయ భవబంధములుమాయ । తెలివిమాయతన్నుఁ దెలియుమాయ
మాయఁదెలియునతఁడు మర్మజ్ఞుఁడగుయోగి । విశ్వ. 2774

ఆ. బ్రిదుకునిత్యమనుచుఁ బదరుచుపగమీఱ । పిఱ్ఱివీగువాఁడు వెఱ్ఱివాఁడు
ప్రాణులెల్లయముని బారికిగొఱ్ఱెలే । విశ్వ. 2775

ఆ. బ్రిదుకువారలెవరు బ్రిదుకకుందురెవరు । బ్రతికిబ్రితుకలేని పాపులెవరు
శ్రుతినిశోధఁజేసి స్థిరముగఁజూడరా । విశ్వ. 2776

తే. బ్రిహ్మణులఁజూఁడవో నభిరామయార్య । మోసమొనరించి మీకైతి దాసుఁడనిటు
తప్పునైరించి బ్రోవఁగఁదలపవలయు । నభయమొందకవిడనంటి నంఘ్రి వేమ. 2777

ఆ. బ్రహ్మగుడ్డుమేను ప్రాణమునఁగగాలి । కనులు చంద్రసూర్యకళలతెలియ
కంతకంటెబ్రహ్మ మెక్కడఁగన్నది । విశ్వ. 2778

ఆ. బ్రిహ్మగుఱ్ఱమాయె భవుఁడు పల్లంబాయె । నాదివిష్ణువెన్న నంకమాయె
నందుమీఁదనుండు నాడుదోముగవాఁడో । విశ్వ. 2779

ఆ. బ్రహ్మఘటము పేరి పట్టణమందును । బ్రహ్మమెఱుఁగలేని బాపఁడేల
తనమనంబుఁదెలియఁ దానెపో బ్రిహ్మంబు । విశ్వ. 2780

ఆ. బ్రహ్మఘటము మేను ప్రాణంబుదగగాలి । మిత్రచంద్రశిఖులు నేత్రచయము
మఱియు బ్రహ్మమనఁగ మహిమీఁదలేదయా । విశ్వ. 2781

తే. బ్రహ్మచర్యమహింసనాఁ బరగుపరమ । ధర్మములురెండు సువ్వెయుత్తమ తపములు
వానిఁగలవాఁడు నిర్మలజ్ఞానయోగ । వంతుఁడైచూడ నేర్చుసర్వంబు వేమ. 2782

ఆ. బ్రహ్మఁజంపివిష్ణు భాగంబునగలిపి । విష్ణుఁజంపి శివుని వీటఁగలిపి
శివునిఁజంపితాను శివయోగికావలె । విశ్వ. 2783

తే. బ్రిహ్మతన్మయచింత నభవహరంబు । బ్రహ్మమాత్మావలోక నప్రముదితంబు
బ్రహ్మమందైక్యమగునాత్మ పరవశంబు । విమలమతినెంచు నపుడిదేవిధము వేమ. 2784

ఆ. బ్రహ్మను దలఁ గొట్టి పారవైచినయప్ప । డడ్డపడఁగ నోప్పరయిరిసురలు
శివుని కరుణలేమిఁ జెడి పోదుమందురు । విశ్వ. 2785

ఆ. బ్రహ్మపరువు చెడును బ్రాహ్మణులాదొడ్డ । బ్రహ్మవలనఁ బుట్టి పరగి రనఁగ
బ్రహ్మవేత్త యగును బ్రాహ్మణుండేయైన । విశ్వ. 2786

ఆ. బ్రహ్మబ్రహ్మ యండ్రు బ్రహ్మం బదెట్టిదో । వలసి తెలిసి చూడ వద్దనుండు
ముద్రలోన నుండు ముద్రకే కానరే । విశ్వ. 2787

ఆ. బ్రహ్మమనఁగ నెటనో పరదేశమున లేదు । బ్రహ్మమనఁగఁ దానె బట్టబయలు
తన్నుఁదా నెఱుఁగినఁ దానెపో బ్రహ్మంబు । విశ్వ. 2788

తే. బ్రహ్మమయమగువిశ్వంబుప్రబలఁ గాంచి। లయముఁ బొందఁగమది నెంచులక్ష్యమూని
చింతవిడనాడయుండుటే చిన్మయంబు।నిత్యసంతోషనిలయంబు।నిజము వేమ. 2789

ఆ. బ్రహ్మ మపలనున్నఁ బ్రళయకాలంబైన । నదియు బ్రహ్మ చేత నందవచ్చు
బ్రహ్మమమరు జ్ఞప్తి పట్టులో పట్టుగా । విశ్వ. 2790

ఆ బ్రహ్మముఁ దెలియనగు భావమందును నిల్చి । తనువుఁ గుడిని జేసి తన్ను నిలిపి
లోకమందు సలిచి లోఁ జూపుఁ జూడరా । విశ్వ. 2791

ఆ. బ్రహ్మమున్నచోటు పరగంగఁ దెలియక । యెందొ వెదక బ్రహ్మ మేలఁగలుగు
సంజనంబు లేక యాసొమ్ము దొరకదు । విశ్వ. 1792

ఆ. బ్రహ్మమును దెలియవు భావమిందుంచిన । తనువు గుడిగఁ జేసి తన్ను నిలిపి
లోకబుద్ధివిడిచి లోఁ జూపుఁ జూడరా । విశ్వ. 2793

తే. బ్రహ్మ మెఱుఁగనివా రెట్లు పారులైరొ । జిహ్వ రుచులకు దోఁపడె జీవులార
గహ్వరంబైన మదియందుగనుఁడి మీరు । బ్రహ్మకులమైన బయలులోఁ బరగు వేమ

ఆ. బ్రహ్మ మెఱుఁగు జ్ఞప్తి పదిలంబు గావించి । తనువు మఱచి వేగఁదన్నుఁ దలఁచి
లోకబుద్ధి మరచి లోచూపుఁ జూడురా । విశ్వ. 2795

ఆ. బ్రహ్మవేద ననుచుఁ బలుమారు నాడేరు । వెఱ్ఱి మూర్ఖజనుల విధముచూడ
బ్రహ్మమన్నిట దగుఁ బరిపూర్ణమై యొప్పు । విశ్వ. 2796

ఆ. బ్రహ్మ యెవని కొడుకు పరికింపఁగా భువి । విష్ణువెవనికొడుకు వెలయఁజూడ
శివుఁ డెవరికిఁగొడుకు సిగ్గెఱుఁగరుఁ జనుల్ । విశ్వ. 2797

ఆ. బ్రహ్మరాజ వైశ్య పటు శూద్రులును మఱి । బ్రహ్మవిష్ణున్నపతి పశువులన్ని
బ్రహ్మమును దెలియక బహురూపు లెల్లైరి । విశ్వ. 2798

ఆ. బ్రహ్మవంశభవులు బ్రబలులై యుండఁగా । నితరజాతులకును గతులుగలవె
వనములోని కోతి వసుమతి నడుపునా । విశ్వ. 2799

ఆ. బ్రహ్మవాదు లెల్ల బ్రహ్మంబునంగను । వలసి తెలిసి చూడ వద్దనుండు
ముందునున్నయట్టి ముద్రికఁ గానరో । విశ్వ. 2800

ఆ. బ్రహ్మ విష్ణువులకుఁ బరగంగ రుద్రుండు । సిగయు నూట నెఱిఁగి సృష్టిజనులు
రుద్రు నిందఁ జేసి రూఢితప్పిరిగాదె । విశ్వ. 2801

ఆ. బ్రహ్మ విష్ణు శివుల భాగంబులను నిల్పి । పరమయోగియైన బ్రహ్మ మాను
బ్రహ్మ మైన వాని భావింప శక్యమా । విశ్వ. 2802

ఆ. బ్రహ్మ వేత్తలమని పౌరుషమాడేరు । బ్రహ్మమనఁగ దాని ? వమేమి
తెలుపొ నలుపొ యెరుపొ తెలిసినఁ బలుకుఁడీ । విశ్వ. 2803

ఆ. బ్రహ్మ సంతతియన భక్తులై వెలసిరి । ఋషులజాతు లెన్నొ రీతులయ్యె
కోతకొక్క వారి కోయక పిలుతురా । విశ్వ. 2804

తే. బ్రహ్మసుఖతత్త్వవిజ్ఞానపరముఁ గోరి । గురుకళాజాలనిలయమా గుప్తమందు
యోగనిర్ముక్తరూపుఁడై యుండ నయిన। పరమశివుఁ డనభాసిల్లుధరణివేమ 2805

ఆ. బ్రహ్మ హత్యసేయ బహురోగములుగల్గు । బ్రహ్మహత్యచేత పదవిచెడును
బ్రహ్మ హత్యవలని పాపమ్ము సమకూఱు । విశ్వ. 2806

సీ. బ్రహ్మాండ మందును, భాసిల్లు చుండెడి । కొండ వీడాఖ్యచేఁ, గొమరుమిగిలి
దేవఘూతంబుల, దేవాలయంబుల । దేవతల్ తపసులు, దేజరిల్లఁ
జిన్మయ లంబికా, శివయోగ పరునకు । సచ్ఛిష్యుఁ డగురామ, భాత్రపరుఁడు
అరుణోదయస్నాన, మైనపిమ్మటఁ దాను । పుష్పముల్గొనిచని, పూజకిచ్చు
సతత మిటు చేయ సిద్ధుఁడు, సంతసించు । నిట్లుగురుసేవ చిరకాల, మొనసిచేయ
ఫలము లభియించు కాలంబు, ప్రాప్తమయ్యెఁ । దప్పెఁబూర్వకృతంబేమి, చెప్ప వేమ

ఆ. బ్రాహ్మణునకు నొక్క బహు దీవన లొసంగు । నాత్మశుద్ధి గల్గు నాతఁడైనఁ
గలుగునన్ని కామిఁ గంతశోషయె సుమీ । విశ్వ. 2808

ఆ. బ్రాహ్మణులకుఁ బెట్ట ఫలము కద్దందురు । కుక్కలకను బెట్టఁగొదవయేమి
ఇందునందు శివుఁడె యేకమైయుండురా । విశ్వ. 2809

ఆ. బ్రాహ్మణులకు సకల భాగ్యంబు లీవచ్చు । గౌరవింపవచ్చుఁ గోరవారు
జ్ఞాన మొసఁగి జనులఁ గడతేర్పఁగలిగిన । విశ్వ. 2810

తే. బ్రాహ్మణులమనుచును బ్రహ్మత్వమదిలేని । బ్రాహ్మణమదియేల బ్రాహ్మణుఁడటె
బొమ్మవలెనుదాను దిమ్మపైఁ గూర్చుండ । విశ్వ. 2811

# భ

క. భక్తికిమూలము జ్ఞానము । రక్తిగ గురుచెంతఁజేరి రక్షింపనినంతన్
యుక్తిగ నెఱుకైతోచును । ముక్తికినిలయమగుదారి మునుకొనివేమా. 2812

ఆ. భక్తిగలుగులంజె పలుమారుపిలిచిన । బత్తిగాదు లయపుమిత్తిగాని
మిత్తిచొరఁగనిల్లు బ్రిమిఁగకపోవునా । విశ్వ. 2813

ఆ భక్తిఁదగులము క్తిఁ బడయుట సులభంబు । యుక్తిచెదరెనేని నూహఁజెరుచు
శక్తిశీలదభక్తి సాధింపఁబరమబ్బు । విశ్వ. 2814

ఆ. భక్తిముక్తిగలుగు భాగ్యంబుఁగలుగును । చిత్తమెఱుఁగుపడఁతి చెంతఁబతికిఁ
జిత్తమెరుఁగనిసతిఁ జేరంగరాదయా । విశ్వ 28॥5

ఆ. భక్తియున్నచోటఁ బరమేశ్వరుండుండు । భక్తిలేనిచోటఁ బాపముండు
భక్తిగలుగువాఁడు పరమాత్మతానయా । విశ్వ. 2816

ఆ. భగముఁగోరువారె పలువురు గాన్పింతురి । భగముఁగోరకునిక్క జగతిలేదు
భగముగల్గువాఁడు భగవంతుఁ డొకఁడయా । విశ్వ. 2817

క. భగవంతుఁడైనదేవుఁడు । జగములఁదనలోనఁజెంచి జాలముజూపుం
దగురీతిని దానన్నిఁట । నగణితుఁడై వెలయుచుండు ననువుగవేమా. 2818

క. భగవంతుని ప్రతిబింబం । బగునీశుండొరసి మాయానగులోకమునం
దగభోజ్యమునగుజీవుం । డొగిభోక్తయ విద్యఁగూడి యొప్పఁగవేమా. 2819

ఆ. భద్రమైనమనసు బలపడినంతట । వద్దఁదగునుపరము వశముగాను
నిద్రిలోనినిద్ర నిలుపుకొనుచుఁజూడు । విశ్వ. 2820

క. భయకామాదులు సిగ్గును । జయమారక భూతమందు జనుభూతములై
నయమున నాభియుఁ గంఠమ్ము । దయ మూర్ధము లండఁ గవిలితధ్యము వేమా. 2821

క. భయమంతయు దేహమునకె । భయముడిగిన నిశ్చయంబు పరమాత్మునిదే
లయమంతయు జీవికిఁగద । జయమగునని లోకమందుఁ జాటరవేమా. 2822

క. భయమునుమీ యజ్ఞానము । భయముడిగిన నిశ్చయంబు పరమార్థంబౌ
లయమునుమీ యాదేహము । జయమునుమీ జీవుఁడనుచుఁ జాటరవేమా. 282

క. భయమెంతటి యజ్ఞానమొ । భయముడిగిన యట్టి తెలివి పరమార్థమె కా
లయమగునసుమ్మి దేహము । బయమగుజీవంబున కని చాటర వేమా. 2824

క. భయమేమిలేదు మదిలో । జయపథమగు పూర్ణమందుఁ జంద్రిక వెలయన్
బయలందు పొందునిండిన । నయనంబగు నాత్మపదవి యందును వేమా. 2825

క. భల్లుకములట్లు ప్రాజ్ఞులె । యిల్లోకములందు గురుని నెఱుఁగరుతములో
ముల్లోకము లెఱిఁగినటుల । గొల్లుఁబొగడుకొనుచుండ్రు గొనకొని వేమా. 2826

ఆ. భవముపూర్వకర్మ ఫలములనుభవింపఁ । గలిగెననుచుమదిని గట్టిపఱచి
కష్టసుఖము లేవి కలిగినఁ దలఁపకు । విశ్వ. 2827

ఆ. భవముసాగరంబు భార్యయాముకరము । చేపఁ జెలఁగలగును శిశువులెల్ల
భవహరునిఁదలపక పారమందఁగలేఁడు । విశ్వ. 2828

ఆ. భవుఁడు గుజ్జుమాయె బ్రహ్మపల్లంబాయె । కల్లదేహమాయెఁ గ్రమముతోడ
నందుమీఁదిదెఱుఁగ నాడుదోమగవాఁడో । విశ్వ. 2829

ఆ. భవుడు చిత్రిముగను భార్యలమోయును । అట్టిమోయఁగలుగు దిట్టయైన
ఆతసిఐలెనెబూది యులదినమెఱుఁగది । విశ్వ. 2830

ఆ. భస్మదూషకులట భస్మంబుపాలైరి । మంటిదూషకులును మట్టిపాలు
దూషణఫలమెల్లఁ దోడనే చూపెరా । విశ్వ. 2831

ఆ. భాగవతులమనుచుఁ బరగంగ నెవ్వరు । వారినెఱుగలేక పరులతోడ
ఆడిపాడువార లరయభాగవతులా । విశ్వ. 2832

ఆ. భాగ్యవంతురాలు పరులయాకలిదప్పిఁ । దెలిసిపెట్టనేర్చుఁ దీర్పనేర్చుఁ
దనదుదుష్టభార్య తనయాకలినెకాని । పరులయాకలెఱుఁగ దరయ వేమ. 2833

ఆ. భాగ్యహీనునకును బరసవేదిదొరక । నదియునిల్వదపుడె వదలుఁగాక
వానతోడవచ్చు వడగండ్లునిల్చునా । విశ్వ. 2834

ఆ. భానుసోమవహ్ని భవ్యలోచనుమదిఁ । దలఁపకున్న ఫలము గలుగఁబోదు
ఇహపరములకును మహేశ్వరుఁడతఁడౌట । విశ్వ. 2835

ఆ. భారతమునఁబలుకు పలుధర్మములయందు । సత్యనిష్ఠ మేటిసత్యమొకద
ననుధదానగలుగు నన్నియు మిన్నయా । విశ్వ. 2836

ఆ భార్యతనదుపాలి భారపుసంకెల్ల । చిన్నచిన శిశువులు జంజీరీలు
ఆరయఁగ జెరసాల యగును సంసారము । విశ్వ. 283"

ఆ. భార్యమీఁద నాశ పరఁగుఁబురుషునకు । మగనిమీఁద నాస మగువకుండు
శివునిమీఁద నాశ సిద్ధునకుండురా । విశ్వ. 2838

తే. భావమమరెడు పూర్ణమౌ ప్రజ్ఞఁబూని । నిర్వికారుఁడవై యుండు నిత్యముగను
బడయు మెప్పుడు భావము పట్టువిడక । సుకరపదవికి మార్గదర్శకము వేమ. 2839

ఆ. భావమరయ వేఱె పరదేశమున లేదు । తాను జేయుపనులఁ దగిలియుండు
భావమందు శివునిఁ బరికింపుచుండిన । పాపభయము లేక పరగు వేమ. 2840

ఆ. భావమరసి తన్ను భార్య సేవించిన । నింటికైన నగును నీశ్వరుండు
అదియు లేక బ్రదుకు టధమము భువిలోన । విశ్వ. 2841

క. భావాభావములంటక । సేవించెడు బట్టబయలు స్థిరమతిలోనం
గేవలము శివధ్యానము, తావరమునుగన్న వాఁడె ధన్యుఁడు వేమా. 2842

క. భావించి చూచుచుండిన । నీవంతట నిండియున్న నిలుకడలోనే
యీ వింత జగముఁదోచును । రావంబు గణించి మించి రాజిలు వేమా. 2843

క. భావింప లింగముండఁగ । భావింపఁగ లోకమందు బ్రహ్మంబును గాఁ
గావించు విధముఁ దెలియక । యీ విధమున నరులు చెడుదు రిలలో వేమా. 2844

ఆ. భాషలాడకున్నఁ బరులు మెచ్చరుగాన । భాషలాడవలయుఁ బరువుఁజూచి
భాష పరువు తెరగు పరమాత్ముఁ డెఱుఁగురా । విశ్వ. 2845

ఆ. భాషలాడ నేర్చి పరగ ప్రియముఁ బల్కి । గ్రాసవాసములకు గడనఁ జేసి
వాసనఁ దెలిసినను వాఁడెపో ముక్తుండు । విశ్వ. 2846

ఆ. భాషలాడ నేర్చి పలుమోసములు సేసి । గ్రాసమునకు వేషగాఁడవయితి
దోసకారులకిల దొరకునా మోక్షంబు । విశ్వ. 2847

తే. భాషలెన్నఁటిలోనైన భావమొకటె । వేషములలోనఁ జిక్కని విధమెఱుంగు
పోషకుండని తలఁచుట పొందుగాదు । దోషమున్న నెఱుంగుము తొలఁత వేమ. 2848

తే. భాసురంబైన ప్రజ్ఞాన భావమందు । మరిగియుండుము నిత్యమౌ మార్గమదియె
సత్య మానందపూర్ణమౌ ప్రత్యగాత్మ । నిర్గుణబ్రహ్మ వేత్తవై నెగడు వేమ. 2849

క. భుక్తికి ముక్తికి విషయా । సక్తత తాఁ దిరుగుచుండు సతతములందుక
భుక్తిని ముక్తి లభింపదు । భక్తి న జీవునకు ముక్తి భద్రము వేమా. 2850

క. భువనాకారు నిమదిలోఁ । బ్రవిమల శుభమూర్తిగాను బరికించినచో
భవనాశమగును బూర్ణుఁడు । శివదేవుఁడు చిన్మయుండు స్థిరుఁడగు వేమా. 2851

క. భువి నరకులమునఁ బుట్టియు । భువి నరకులమునను దిరిగి భువి నరకులకున్
సవిరళముగ ఛీఛీ యని । శివకులమునఁ దిరుగునతఁడె సిద్ధుఁడు వేమా. 2852

క. భువిరాజ తారకంబులు । ప్రవిమలతర హంసయోగ భావంబులకున్
వివరంబులు గావించెద । శివయోగ మహత్త్వమిదియె సిద్ధము వేమా. 2853

క. భూగగనంబులలోపల । దాగిన చందంబు గాను తగులుకొని తగు
న్వేగమె మదిలోఁ గాంచిన । నీగకతా నిండియుండు నెన్నిక వేమా. 2854

క. భూతంబుల నైదుఁట ని । ర్ణీతంబగు సురలయందు రేవెల్గినులం
దాతతమగు లోకంబుల । సూతంబగు ప్రకృతిబ్రహ్మ సూచ్యము వేమా. 2855

క. భూతంబులపైఁ గనుమిఁక । ఖ్యాతిగ నొక మూలశక్తి కంధరమందున్
జ్యోతికి లోవెలి తానై । సూత్రించును జగములెల్ల సూటిగ వేమా. 2856

క. భూతము లైదుండగ నే । ఖ్యాతిగఁ దానొక్క దేహి కలిగిన భువిలో
లోపైన తత్త్వమెఱుఁగక । నూతను బడుచుందురపుడు నోముక వేమా. 2857

ఆ. భూతి దేహమందు బూసినయ్యెనే । నిష్ఠశివునియందు నిలుపవలయుఁ
గాక భస్మమందు గాడిదే పొర్లదా । విశ్వ. 2858

ఆ. భూతి పూజలెన్న భుజములపోకలు । వ్రాలు లింగములును పరుసమతము
ఎక్కడఁ దగుఁగాక యెక్కడఁ దగదెట్లు । విశ్వ. 2859

ఆ. భూతిపూసి నీవు ప్రేతభూతంబుల । వెడల గొట్టఁబోవ వెఱ్ఱివనుచు
నిన్నె కాంచి భీతి నిలుపక పారరో । విశ్వ. 2860

ఆ. భూతిలేని లంజె భూతంబు కూతురు । రీతిలేని పోటు రాతిచేటు
దాతలేని యూరు దయ్యాల కొంపరా । విశ్వ. 2861

క. భూదేవియనఁగ మృత్తిక । భూదేవత పుట్టువిధము భూజన మెఱుఁగున్
భూదేవి భారమందిన । నాదేవత కాదరు వెవరందురు వేమ. 2862

క. భూదేవియనఁగ మృత్తే । భూదేవతలైనవరుసఁ బుట్టినవెన్నో
యాదేవతలకె తెలిసెడి । నాదిని నేనరులు నెఱుఁగరందురు వేమా. 2863

ఆ. భూపతి కృపనమ్మి భూమిఁ జెఱచువాఁడు । ప్రజల యుసురుదాకి పడును బిదప
నెగురవేయు బంతి యెందాక నిల్చురా । విశ్వ. 2864

ఆ. భూమి నాదియన్న భూమి ఫక్కున నవ్వు । దానహీనుఁ జూచి ధనము నవ్వు
కదనభీతుఁ జూచి కాలుండు నవ్వురా । విశ్వ. 2865

ఆ. భూమి పేరువల్ల పుణ్యస్థలములాయె । వెలయ రాళ్లవల్ల వేల్పులాయె
నీళ్ల పేరువల్ల నిఖిలతీర్థములాయె । విశ్వ. 2866

ఆ. భూమిమీఁదఁ బుణ్య పురుషులులేకున్న । జగములేల వెలుఁగు బగలురాత్రి
అంత బయలుగాదె యాడకాడకుఁజూడ । విశ్వ. 2867

ఆ. భూమిలోనఁ బుణ్య పురుషులులేకున్న । జగములేల నిల్చుఁ బోగులుఁ గాక
అంత తెలియుచూడ రాదనాదనుగాని । విశ్వ. 2868

ఆ. భూమిలోనఁ బుట్టు భూసారమెల్లను । తనువులోనఁ బుట్టుఁ దత్వమెల్ల
స్వాయముగాను పుట్టు సర్వంబు తనయందు । విశ్వ. 2869

తే. భూరి నిగమార్థ సారంబుఁబొంది పరమ । యోగ పరిపూర్ణనిష్ఠలో నుండఁగోరు
నతని కరచేతిదైయుండు నాత్మవిద్య । కాక వాదంబులాడినఁ గలదె వేమ. 2870

క. భేదా భేదంబులనుకు । వాదంబై జగముచూడ వర్తించెడినా
భేదా భేదములుడిగిన । వేదాంత ధ్యానియగుచు వెలుగుర వేమా. 2871

తే. భోగ పరవశమాజ్ఞప్తి పూరితముగ । నిరతమాత్మ చిదానంద నిలయమాని
మానికేళినిగూడుచే మన్నయంబు । సాధకంబున సమకూలు జగతి వేమ. 2872

క. భోగంబుల కాశింపక । రాగద్వేషంబు లుడిగి రంగుగఁదనలో
వేగమె మోక్షపదమ్మును । రాఁగను నాతండుయోగి రాయఁడు వేమా. 2873

తే. భోగ భాగ్యాది సుఖములఁ బొందవచ్చు । రాగ వైషమ్యముల నెల్లఁ దీగఁదెంచి
వేగ మదియందు గురుభక్తి సాగనిమ్ము । యోగివరులకు దీటుగానుందు వేమ. 2874

ఆ. భోగ వాంఛచేతఁ బోలుపేదో యెఱుఁగక । ద్రోహబుద్ధినొరుల దూఱుచుండు
సాహసి యగువాఁడు సర్వదా చెడుఁగదా । విశ్వ. 2875

తే. భ్రాంతిచేతను మర్త్యులు భక్తివిడువ । భయదమౌపుట్టు చావులు ప్రాప్తములగు
నిట్టినరులకుఁ గష్టంబు లెట్లుతీఱు । గురుని సన్నిధితీర్చునా కొఱత వేమ. 2876

క. భ్రూకుటిస్థల మధ్యస్థ । ప్రకట ద్వాదశాబ్జ శిఖరి భవదుద్యద్యు
న్నికట నుదేహ జగత్త్రయ । వికసితరూప ప్రతాప వీరుఁడు వేమా. 2877

క. భ్రూమధ్య దేశమందును । నేమరకయ చూడ నిర్గుణైకమ్మగునా
నేమము మదిలో నెంచఁగ । సామీప్యా నంద మొదవు సరగున వేమా. 2878

# మ

ఆ. మక్కకేగ నేల మఱితిరుగఁగ నేల । ఏకమైనకర్త యెందులేఁడు
అన్నిటఁ బరిపూర్ణుఁ డల్లామహాత్ముండు । విశ్వ. 2879

ఆ. మగఁడు తప్పులేక మనసిచ్చియున్నను । సహజగుణమువిడదు జారకాంత
పిండిఁదిన్న కుక్క పీతికాసింపదా । విశ్వ. 2880

ఆ. మగఁడు మదనుఁడైన మంచికాపురమైన । సహజమేల మాను జారకాంత
పాలుఁద్రావు కుక్క బతినిడిపోవదా । విశ్వ. 2881

ఆ. మగనికాలమందు మగువ కష్టించిన । సుతులకాలమందు సుఖముఁబొందు
కలిమిలేమి రెండుఁ గల వెంతవారికి । బలిమిపుత్రబలిమె బలిమి వేమ. 2882

ఆ. మగని బలిమికలిమి మగువకును బలము । బలములేని మగఁడు పనికిరాఁడు
పనికిరానిమగని పాటించి చూడరు । విశ్వ. 2883

తే. మగని మాటకు మించని మగువఁజూడ । జగములోపల నెన్నంగఁ జాలరెవరు
ముగితియుర చేతిదైయుండుముదితకెపుడు । భర్తృవిశ్వాసమొక్కటిపరగ వేమ 2884

ఆ. మగనిమీఁదభక్తి మానకుండినకాంత । మూఁడులోకములను ముక్తిఁగనును
మగువలందఱికిని మగలె దేవతలయా । విశ్వ. 2885

క. మగవాఁడై యాఁడుదియగు । పగఁదెగి పోరానియట్టి పరుసలవాఁడై
యుంగమునఁబడి నటియించును । సుగుణినిటు లనఁగరాదు చూడర వేమా. 2886

ఆ. మఘవుఁడైన నేమి మర్యాదయెఱుఁగని । వారలేలఁదెలిసి గౌరవింత్రు
ఉరిమి మొరుగుకుక్క యోగిసేమెఱుఁగురా । విశ్వ. 2887

ఆ. మంచి గంధముఁగన మనసు రంజిల్లును । ఎంతొ వాసననుచు నెన్నుచుందు(రు)
తామెఱుంగలేరు తమపూర్వ వాసన । విశ్వ. 2888

ఆ. మంచినీరు వోయ మల్లె పూచునుగాని । ఫలితమొనరు బెట్టు పనిఁజొరమిని
వంటచేయకెట్టు వంటక మమరురా । విస్వ. 2899

ఆ. మంచిమాటచేత మనసు రంజిల్లును । గొంచెమనుచు నెవరుఁ గొరఁబోరు
వంచ నోక్తులనన వైభవంబందునా । విశ్వ. 5890

ఆ. మంచి రుచులఁగోరు మంచిస్త్రీలనుగోరు । మనుజుఁ డెంతచెడ్డ మనసొ చూడ
ఇంచు కంతయైన నేలని విడుపఁడు । విశ్వ. 2891

ఆ. మంచివారులేరు మహిమీఁద వెదకినఁ । గష్టు లెందరైనఁ గలరు భువిని
పసిఁడిలేదుకాని పద డెంత లేదయా । విశ్వ. 2892

ఆ. మంచిశకునములనె యెంచి పెండిలిచేతు । వారలూకరు లేరు వసుధలోన
జనుల కర్మములను శకునముల్ నిల్పునా । విశ్వ. 2893

ఆ. మంటఁ బుట్టు సొమ్ము మంటిలోపల దాచి । మంటికుండలోన మరలవండ
మంటికుండ కింత మరు గేల వచ్చెరా । విశ్వ. 2894

ఆ. మంట లోహమందు మాన్యకుల శిలలందుఁ । బటము గోడలందుఁ బ్రతిమలందుఁ
దన్నుఁ దెలియుకొంటకుఁ దగులదా పరమాత్మ । విశ్వ. 2895

ఆ. మంటలోహములను మాన్యుచీలలందుఁ । బటముగోడలందుఁ బరగనిసుక
బెట్టి నంటు నట్లు పెనగు దేహము జీవి । విశ్వ. 2896

ఆ. మట్టికుండఁ జేసి మహిమీఁద బ్రవికెడి । భ్రష్టుకుమ్మరియును బ్రహ్మయనఁగ
నెట్టుగానిలుచునె నీతియే ధరణిలో । విశ్వ. 2897

ఆ. మంటికుండ వంటి మాయాశరీరంబు । చచ్చునెన్నఁడైనఁ జావ దాత్మ
ఘటము లెన్నియైన గగనం బదేకమే । విశ్వ. 2898

ఆ. మంటితోడఁ గొన్ని మ్రానితోడను గొన్ని । రాతితోడఁ గొన్ని రాగిఁగొన్ని
ప్రతిమలెన్నొ చేసి భగవంతుఁడని మ్రొక్క । ముక్తియెట్టులిచ్చు మొనసి వేమ.

ఆ. మంటిమింటిసంధి మన్నవా రెంవతో । ఎన్నగానుదరమె యేరికైన
నున్నవారుచావ నున్నవారేసుమీ । విశ్వ. 2900

ఆ. మంటిలోనఁ బుట్టి మంటిలోనఁ బెరిగి । మన్నుఁ జూచి నరులు మగ్నులైరి
మన్ను మన్నుఁ జేర మదినిల్పలేరయా । విశ్వ 2901

ఆ. మంటిలోనఁ బుట్టి మంటిలోనె పెరిగి । మంటిలోనె తిరిగి మనుజుఁడాయె
మన్ను మంటిఁ గలుప మనుజుఁడే తత్వంబు । విశ్వ. 2902

ఆ. మంటిలోనెపుట్టి మంటిలోనె పెరిగి । మంటిమింటి సందు మరుఁగుఁ దెలిసి
మింటిలోన సుఖమె మితిమీఱఁ గనవలె । విశ్వ. 2903

ఆ. మంటిలోనె పుట్టి మంటిలోనె పెరిగి । మంటివెడలి నతఁడు మింటికెగసె
మింటిలోని సుఖము మంటనులేదురా । విశ్వ. 2904

ఆ. మట్టు వెట్టి కోర్కె మదినిల్పి చూచిన । గుట్టుమిగుల దాని గుణము దొరకు
నట్టునిట్టు చెదర నమరదు తత్వంబు । విశ్వ. 2905

ఆ. మఠములోన నున్న మతములన్నియుఁ గోసి । దిటవుచేసి మనసు తేటపఱచి
ఘనము నిల్పువాఁడు ఘనతత్వయోగిరా । విశ్వ. 2906

ఆ. మఠములోనియోగి మాయలన్నియుఁ గోసి । ఘటములోననున్న ఘనునిఁ దెలిసి
మాటమాటకు గురు మరవక తెలుపురా । విశ్వ. 2907

ఆ. మండలంబుఁ దిన్న మహిమీఁద జరమారు । మండలంబుఁ దిన్న మహిమ వెలయు
మండలనవకంబు మరి తిన్న సిద్ధుఁడౌ । విశ్వ. 2908

ఆ. మండలములు మూఁడు మఱిచూడఁ జూడఁగా । చంద్రసూర్యవహ్నిఁ జెందిపిదప
దండివెలుగు గాను ధరణికి దైవంబు । గాను నుండు మిగుల ఘనత వేమ. 2909

ఆ. మడియు వాఁ డెవండు మడియని దెవ్వండు । పాటుఁజేసి చూడ బట్టబైలు
సొరది జలఘటమున సూర్యుని చందంబు । విశ్వ. 2910

ఆ. మణియు పూరచక్రమహిమంబుఁ గనుఁగొని । వ్యాసవాయువునను పనరుచున్న
మనసు చెడకయున్న మర్మంబు తెలియదా । విశ్వ. 2911

ఆ. మతపు వేషధార్లు మహిలోనఁ బదివేలు । మూఢజనులఁ గలుప మూగుచుండ్రు
కొంగలు గుమిగూడి కొఱకవా బోదెలు । విశ్వ. 2912

ఆ. మతముదారి మఱచు మధురాధరముఁ జూచి । మగువరూపుఁ జూచి మనసు మఱచు
ఊరముఁ జూచి సర్వయోగంబు మఱచురా । విశ్వ. 2913

ఆ. మతము భేదముగల మాయసంసారియై । దారిఁ దెలియ లేఁడు తమకమంది
దారిఁ దెలియ నతఁడు ధన్యుండు గాఁడయా । విశ్వ. 2914

ఆ. మతము మమతఁ జిక్కి మఱి దేహమున్నది । పంచభూతములును ప్రజలఁ బొందె
బొందికిఁ బరమైన భూతేశుఁ డెఱుఁగురా । విశ్వ. 2915

ఆ. మతము లెన్నియైన సతముగా నుండదు । సతముగా నెయుండు జగతి నొకటి
అన్ని మతములు విడ నరయు నొక్కఁడు లేఁడు । విశ్వ. 2916

తే. మంత్రతంత్రాది యుక్తులు మరిగిరావు । వేదవిద్యాదిఘనయోగ విధము గాదు
సాధుఁగని లోన పూర్ణుఁడై పరిణమించు । సాధువై నానె పరమందు జగతి వేమ. 2917

క. మంత్రము సద్గురు చింతన । మంత్రార్థం బతఁడు చూపు మన్మయముగునా
మంత్రాధిక మగు సద్గురు । మంత్రముచేఁ గన్నబయలు మఱవకు వేమా. 2918

ఆ. మంత్రమెల్ల మఱచి మధురాధరముఁగోర । నేవిధమున భక్తుఁడెఱుఁగునిన్ను
ఈవిదఁ జూచి పరమయోగంబు మఱచుగా । విశ్వ. 2919

ఆ. మంత్రమొకటి చెప్పి మతిదేవతార్చనఁ । జేసి కరుణ తమకుఁ జెందినదని
వేదపఠనఁజేసి వెఱ్ఱులై చెడుదురు । విశ్వ. 2920

ఆ. మంత్రవిద్యలెల్ల మాయలకొఱకిల । సృష్టియందు బ్రహ్మ సృష్టిఁ జేసె
మత్తుఁడైన వాఁడు మదినిల్ప లేఁడయా । విశ్వ. 2921

ఆ. మత్సరంబు మదము మమకార మనియెడి । వ్యసనములను దగిలి మసలఁ బోక
పరుల కుపకరించి పరమునమ్మికనుండి । యొనరుచుండు రాజయోగి వేమ. 2922

ఆ. మతిని గానలేరు మతిబ్రహ్మమూర్తిని । మదినిగన్నవారు మహినిలేరు
వెదకి తనువులోన వేడ్కతో నెఱిఁగిన ।యతఁడె యోగివర్యుఁ డండ్రు వేమ. 2923

తే. మతిహితంబున నిర్గుణ మర్మమెఱిఁగి । సతత మభ్యాస యుక్తిలో సంచరించి
యతులితానందసంపూర్ణ మమర నుండు ।పరశివుండని భావింతురెఱిఁగి వేమ. 2924

ఆ. మత్తచిత్తులు తమ మర్మంబుఁ దెలియక । చిత్తచలన మంది చెడిరి భువిని
బత్తిలేని వాఁడు పరమాత్మ నెఱుఁగునా । విశ్వ. 2925

ఆ. మదముచేత లోకమాయలు దెలియఁడు । మదముచేతఁ దన్ను మఱచు నెపుడు
బుద్ధిలేని పసులపోలికఁ జెడుదురు । విశ్వ. 2926

ఆ మదము వలనఁ గలుగు మాటలఁ బలె పల్కి । ముచ్చు సుద్దులకొగి మోసపుచ్చి
కాసురాఁ బెనఁగెడు కష్టుండు గురుఁ డౌను । విశ్వ. 2927

ఆ. మద్యమాంసరుచిని మాదిగదైవాల । యెంగిలి దినువారి దెట్టికులము
భక్తిని హరుగొల్చి భవ్యులు గండయా । విశ్వ. 2928

ఆ. మదిఁగలిగిన పూజ మదనారి మెచ్చును । మనసు నిల్పినంత మహితుఁడగును
మనసులేని పూజ మట్టిసమానము । విశ్వ. 2929

ఆ. మదిని గానవచ్చు మతి బ్రహ్మమూర్తిని । మదిని గన్న యపుడె మహితుఁడగును
వెదకి తనువులోన వేడ్కతో నరసిన । యతఁడె యోగివరుఁ డటండ్రు వేమ. 2930

ఆ. మది నెఱిఁగినవాని మహిఁ గాన మెందును । మది నెఱుంగు నరుఁడె మహిమనుజుఁడు
వెదకి తనువులోన వేడ్కతో నిను జూచు । విశ్వ. 2931

క. మందుఁ దినఁ బోటుమానును । మందుఁ దినఁగఁ జేయఁ బొలఁతి మహిలో వలచున్
మందుఁ దినఁ గుదురు రోగము । మందుఁ దినం గలదు పుష్టి మహిలో వేమా. 2932

క. మందు దిను వఱకు పథ్యము । పొందుగఁ జేయంగవలయుఁ బుడమితలమునన్
మందుఁ దిని పథ్య ముడిగిన । నెందున నావ్యాధి కుదర దిలపై వేమా. 2933

ఆ. మందుఁ బెట్టి మగని మఱపించి విటుఁ జేరు । సుందరాంగి పాడుసుదతి సుమ్ము
పంది బురద మెచ్చుఁ బన్నీరు మెచ్చునా । విశ్వ. 2934

ఆ. మధురసంబుఁ గోరి మక్షికంబులు చేరి । చొచ్చి వెడల లేక చొక్కినట్లు
మునిఁగి విడువలేఁడు మోహాంబురాశిలో । విశ్వ. 2935

ఆ. మధురసార మొప్పు మహిత ఫలంబుల । కంటె రుచ్యమగును గలికి పలుకు
అట్టి దెదుటనున్న నన్ని రోగము లూడు । విశ్వ. 2936

ఆ. మనసవృత్తిఁ బూని మౌనసమాధిలో । దనదుజ్ఞప్తి మఱచి తాల్మితోడఁ
బెంపుఁ జెందువాఁడు బ్రియభక్తుఁ డగు యోగి । విశ్వ. 2937

ఆ. మనసవృత్తిలోన మహిమ నెఱుంగుచు । మనసు నందె పూజ మహితముగను
మానకుండువాఁడె మర్మజ్ఞుఁడగు యోగి । విశ్వ. 2938

ఆ. మనముఁ జూచి గెల్చి మనములో సుఖియింప । గడకు మోక్షపదముఁ గనుచటనె
చెట్టుఁ బెట్ట ఫలము చెరుగాలదె దాన । విశ్వ. 2939

ఆ. మనములోనఁ బుట్టు మదికోర్కులన్నియుఁ । గోర్కులందు ముక్తి కుదురు పడదు
మనము బ్రహ్మమనుచు మది నెఱుంగఁగ లేరు । విశ్వ. 2940

క. మన సన్న బాలపాయము । మనసే యావరణ మందు మలయుచుఁ దిరుగ
న్మనసునకు మనసె సాక్షియు । మనసునకును మదము లేదు మహిలో వేమా. 2941

ఆ. మనసు కోర్కెలంటి మఱిచిక్కు పడియుండు । కోర్కెలడఁచుయుక్తి గుట్టెఱింగి
గుఱుతునంటి చూడ గుణముగుఁ దత్త్వంబు । విశ్వ. 2942

ఆ. మనసు గలుగువాఁడు మహనీయుఁ డేజుండు । అజ్ఞానకైన వాని నరయఁ గాదు
బలుగానఁ బడును పాషాణములఁ గన్న । విశ్వ. 2943

ఆ. మనసు నిష్ఠ పఱచి మఱగిన శివయోగి । తెలుచుపలుక కున్న ధర్మమందు
తెలుచు మాటచేతఁ దత్త్వంబు చెడిపోవు । విశ్వ. 2944

ఆ. మనసు గెలిచి పూని యున్న సుజ్ఞానులు । కడక మోక్షపథముఁ గనుచు నుందు
చెట్టుఁబెట్ట ఫలము చేకూర కుండునా । విశ్వ. 2945

ఆ. మనసుఁదెలిసి యొకని మాటకుఁ బ్రతి చెప్ప । సంతసించు నతఁడు చాలమెచ్చు
మనసుఁదెలియ కాడ గొనియుచు నను నేదొ । విశ్వ. 2946

ఆ. మనసునఁ గృపలేని మాలల కొడుకుల । వద్దఁ జేరినట్టి వారలెల్ల
మనసకొడుకు చెందుపడుచుల చందమా । విశ్వ. 2947

ఆ. మనసు నంటి గెలిచి మనసున సుఖియింపఁ । గడకు మోక్షపదముఁ గనకపోఁడు
చెట్టుఁబెట్టఫలము చేకూర కుండునా । విశ్వ. 2948

ఆ. మనసున దయలేని మాలకొడుకు నొద్దఁ । జేరయున్న ప్రజకుఁ జేటు నిజము
పెద్దతనము లెంచఁ బెంకెలచందమా । విశ్వ. 2949

ఆ. మనసు నందు ముక్తి మఱియొండుగఁ గలేక । మనసు చేతఁ దగిలి మాయమైరి
మనసు తాన యయిన మర్మజ్ఞుఁడే యోగి । విశ్వ. 2950

ఆ. మనసు నందుముక్తి మలయుచునుండంగ । మనసు నెఱుఁగలేని మనుజు లెల్ల
మనసు నంటలేక మాయమై పోదురు । విశ్వ. 2951

క. మనసున నెఱుకను మఱపును । గని విని చూడంగ లేరు కడసిన పిదపం
బెనఁగొని పట్టెదమన్నన । మనచోటను మాయమాయె మహిలో వేమా. 2952

క. మనసును ననలము రెంటను । ఘనమును గొంచెంబుఁ దెలియఁగావలె సుమ్మీ
కనుమూసి తెరచునంతనె । ఘనమై విహరించు మనసుఁ గానరు వేమా. 2953

ఆ. మనసు నిల్పలేని మాయావిరక్తులు । మనసుపడుదు రొక్క మగువమీఁద
ఇంతవ్యర్థజన్మమీ బ్రదుకేఁటికి । విశ్వ. 2954

ఆ. మనసు నిల్పినట్టి మర్మజ్ఞు లగువారె । గరిమ మోక్షపథముఁ గన్నవారు
చెట్టుఁబెట్ట ఫలము చేకొనరా తాము । విశ్వ. 2955

సీ. మనసు నిల్పి నతండు, మతిసర్వసమమందు । ననుభవంబును గోరి, యాచలుఁడగును
నిగమాంతవేద్యమై, నిత్యప్రకాశమౌ । పరమపూర్ణముఁగోరు, పట్టువిడఁడు

అరయంగ రానిది, యలపరబ్రహ్మంబు । తానని తెలిసియుఁ, దలఁపువిడఁడు
నిరతమాత్మనుతించి, నిర్గుణంబును జెంది । నిశ్చలబ్రహ్మమౌ, నియతి విడఁడు
సగుణ మెప్పుడు తాఁగాక, సత్యమనెడు । నిర్గుణబ్రహ్మ మేయని, నిశ్చయించి
తానదనలోనఁబూర్ణుఁడై, తలఁకకుండు, నవతరించిన శివుఁడందు, రతని వేమ 2956

క. మనసును బుద్ధియు మఱియును । ఘనమగు నహమును గనంగఁ గడువడిగా నే
తనరెడు నంతఃకరణం । బనఁగా ముఖ్యంబు దీని నరయుము వేమా. 2957

ఆ. మనసు పాఱవిడచి మనసుఁ దా మగుడించి । మనసులోనఁగలుగుమనసు నాని
మనసుతానె నిల్ప మఱియుఁదా బ్రహ్మంబు । విశ్వ. 2958

ఆ. మనసుఁబూని గెలిచి మనసులోసుఖియించి । కడకు మోక్షపదముఁగనునువాఁడు
చెట్టుఁబెట్టిఫలము చేకొనకుండునా । విశ్వ. 2959

ఆ. మనసు మాయనంటి మఱిరూపులై తోఁచు । తరముగాదు నిలుపఁదలఁపులపుడు
స్థిరముగాను నిలిపి చిన్మయు మందరా । విశ్వ. 2960

ఆ. మనసు ముక్తియనుచు మది నెఱుంగఁగలేరు । మనసు చేతఁదగిలి మాయమైరి
మనసు తానయైన మర్మజ్ఞుఁడగు యోగి । విశ్వ. 2961

ఆ. మనసులేనితావు మరిగిన శూన్యము । శూన్యమనఁగరాదు నూటిగాను
బయలులోన రవము ప్రకటనగాలేదు । విశ్వ. 2962

ఆ. మనసులోన నున్న మతములొకటియైన । మనసులోననున్న మహిమ నెఱుఁగు
మహిమ నెఱుఁగు నతఁడు మరణంబు నెంచునా । విశ్వ. 2963

ఆ మనసులోననున్న మమతలన్నియుఁగోసి । దృఢము చేసిమనసుఁ దేటపఱిచి
ఘటమునిల్పువాఁడు ఘనతరయోగిరా । విశ్వ. 2964

ఆ. మనసులోననున్న మర్మమంతయెఱింగి । స్థిరముఁజేసి యాత్మ తేటపఱిచి
ఘటమునిల్పవలయు ఘనమైన నేఁటికి । విశ్వ. 2965

ఆ మనసులోనశివుని మానక నిలిపిన । యోగియగు నతండ యుర్విలోన
శివునిఁదలఁపలేని చిత్తంబదేలనో । విశ్వ. 2966

ఆ. మనసులోనిముక్తి మఱియొక్కచోటను । వెదకబోవువాఁడు వెఱ్ఱివాఁడు
గొఱ్ఱె జంకఁబెట్టి గొల్ల వెదకురీతి । విశ్వ. 2967

ఆ. మనసులోనివాని మనసులోనె కలిసి । మనసులోనివాని మగ్నమంది
మనసుఁదెలియువాఁడు మర్మజ్ఞుఁడై యుండు । విశ్వ. 2968

ఆ. మనసులోనివాసి మానుగాఁ దెలిసిన । సర్వజనులు వాని యోగియండ్రు
నీవు నిన్నెఱుంగ నీవెపో శివుఁడవు । విశ్వ. 2969

ఆ. మనసులోనె పుట్టె మాయసంసారంబు । మనసువిఱిగెనేని మాయతొలఁగు
మనసునిల్పెనేని మహిఁదానె బ్రహ్మంబు । విశ్వ. 2970

ఆ. మనసువాక్కుకర్మ మఱియేమిలేకయె । రాకపోకలేని రాజవీధి
పరగవానికలదె పరతత్త్వయోగికి । విశ్వ. 2971

ఆ. మనసు శివునిమీఁద మఱితాళితాళియాఁ । గుక్కపంది శివునిఁ గొలువఁజేయ
కుక్కవంటి పాప గుణమబ్బుఁ దెలియరో । విశ్వ. 2972

క. మనసే మాయామృగమా । మనసేమిఁటి పైకిఁగాని మఱిపోసీతా
మనసున మనసును జంపిన । మనసందే ముక్తిగలదు మహిలో వేమా. 2973

క. మనసే యెలప్రాయము దా । మనసే మఱి జీవనంబు మనుజులకెల్లన్
మనసునకు మనసె సాక్షియు । మనసునకును ముదిమిలేదు మహిలో వేమా. 2974

క. మనసే లోకాలోకము । మనసే చూపించిమెచ్చు మాయలసుమ్మీ
మనసగు ముక్తికి భుక్తికి । మనసును విడనాడ మేలు మరుగును వేమా. 2975

క. మనియుండెడు జగమెల్లను । జనిపోయిన వారిపుణ్యసత్కథ లెలమి
న్వినవలెఁ గనవలె మనవలె । ననిమిషులకు నైనఁదెలియ దంత్యము వేమా. 2976

ఆ. మనుజులందఱి నిలమంగలిచే గిన్నె । పొత్తుఁగుడిపి కులము బోడిఁజేయఁ
దలనుజేయిపెట్టి తగ నమ్మఁ జెప్పఁడా । విశ్వ. 2977

ఆ. మనుటలెల్లఁగల్ల మనసెల్ల దొంగయుం । కేఁటి ప్రాణమింక నేఁటి బ్రదుకు
మాటసత్యమైన మఱి శతాయువ్యంబు । విశ్వ. 2978

ఆ. మన్నుకుప్పఁజేసి మంటిలోఁగోరాడి । మంటినంటకుండ మరిగి తిరిగి
మన్ను మింటఁగలియ మఱియెందుఁబోవునో । విశ్వ. 2979

ఆ. మన్ను దినుమటన్న మండిరే జనులార । మంటిలోని మేలు మఱవనేల
నీళ్లలోని మేలు నిఖిలమైయుండురా । విశ్వ. 2980

ఆ. మన్ను నీరు నగ్ని మఱి గాలితోఁగూడి । మిన్నుతోడఁ గలిసి మెలఁగి చేరి
కన్ను గానకుండఁ గలిగిన దేహంబు । విశ్వ. 2981

ఆ. మన్ను పాఱఁబెట్టి మన కేమిలాభము । ధాన్యమట్టు చేయఁ దలఁగుఁదూలు
ఘనుని లోపమిన్నఁగను విడు మేలౌను । విశ్వ. 2982

ఆ మన్ను మిన్ను నంటి మహిమీఁద నొకకోట । కొమ్మలమరియుండుఁ గొనలు సాగి
దివ్వెలేని వెలుఁగు దేజరిల్లుచు నుండ । విశ్వ. 2983

ఆ. మన్ను మెత్తి కడిగ మఱిరూపు గావించి । గుంటనిండఁ బూడ్చి గుఱుతు నిల్పి
మనుజులెల్లఁగూడి మఱి దేవుఁడందురు । విశ్వ. 2984

ఆ. మన్ను రాయిలేదు మహిమీఁద నొకకోట । కొమ్మ గలిగియుండి కొనలు సాగు
దివ్వెలేని యిల్లు దీపించియుండునా । విశ్వ. 2985

ఆ. మయిన మొత్తి లిఖువు మఱిరూపు గావించి । తామ్రము కరగించి దానఁ బోసి
మనుజులెల్లఁగూడి మన దేవుఁడందురు । విశ్వ 2986

ఆ. మయిలకోకతోడ మాసినతలతోడ । నొడలిముఱికితోడ నుండెనేని
అధికకులజుఁడైన నట్టిట్టు పిలువరు । విశ్వ. 2987

ఆ. మరణకాలమునను మదినిల్పు సుజ్ఞాని । పరముఁగోరి తాను బట్టువిడక
వెనుకఁ గోర్కెలకును విలపించు నజ్ఞాని । విశ్వ. 2988

ఆ. మరణమన్న వెఱచి మదిఁ గలంగఁగనేల । నిరుడు ముందు లేదు నిన్న మొన్న
తనువు విడిచి నతఁడు తనకన్నఁ దక్కువా । విశ్వ. 2989

క. మరణము దాపగుచున్నది । స్థిరబుద్ధిని బరముఁగన్నఁ జిక్కును మోక్షం
బరయుచు గుఱిలో మించిన । పరమార్థమె బట్టబయలు పాల్కుము వేమా. 2990

క. మఱతు నేమో యనుచు మది నెప్డుఁ దలఁచుచు । నెవరొనర్చు మే లదెంతదైన
మాఱుమేలుఁ జేసి మర్యాదనిల్పుకో । విశ్వ. 2991

ఆ. మఱపు తెరపి చేత మానవదేహంబు । నెత్తవలసెఁ గాని యిహమునందు
మఱపు లేకయున్న మరణమెక్కడిదన్న । విశ్వ. 2992

క. మఱపులు చెప్పిన విధములు । మాఱవక మన సందెయున్న మతములవారా
అరుదయిన వస్తు వప్పుడ । యెఱుకంగా వలయుఁదానె యిచ్చును వేమా. 2993

క. మఱవవలెఁ బాపసంగతి । మఱవంగావలెను దురము మతివిశ్వములోఁ
మఱవవలెఁ బరుల నేరమి । మఱవంగా వలదు మేలు మహిలోఁ వేమా. 2994

ఆ. మర్మమంతఁ గానక మనసైక్యమందక । పరమ గూఢమింత బైలు పడదు
పడినమాత్ర మెన్న బయలు పడిన యంతె । విశ్వ. 2995

ఆ. మర్మమెఱుఁగ లేక మతములు గల్పించి । యుర్విదుఃఖులగుదు రొకరి కొకరు
గాజెయింటఁ గుక్క కళవళ పడురీతి । విశ్వ. 2996

ఆ. మర్మ మెఱుఁగలేని మనుజు లెల్లరు నిట్లు । మాలదాసరులకు మడుపులిచ్చి
మహిని గాదు నట్టి మనుకులం బెఱుఁగరు । విశ్వ. 2997

ఆ. మర్మవిదుఁడుగాని మర్మంబుఁ దెలియఁడు । కర్మజీవి మేలు గానలేఁడు
నీరు వొరక లోతు నీయాన తెలియదు । విశ్వ. 2998

ఆ. మఱియు దధిని ఘృతము మ్రానులం దనలము । సౌమ్యసుమములందు సౌరభంబు
తిలలఁ దైల మట్లు తేజరిల్లుఁ జిదాత్మ । విశ్వ. 2999

ఆ. మరుగుఁ జేరి గురుని మర్మంబుఁ దెలియక । యెఱుక మించరాదు దేరికైన
నెఱుక మఱపు సందు నెంచులే తత్వంబు । విశ్వ. 3000

ఆ. మరుగుపడ్డవాఁడు పరగ దాసావళి । యూడిగంపుఁ బనుల కొప్పుచుండు
బిరుదు బంటుజ్ఞాని పరమాత్మఁ జొరబాఱు । విశ్వ. 3001

ఆ. మలచ మెంత భువిని గలిగిన నిఁక నేమి । వితరణమ్ము లేక వెలయ దెందు
ఆరగింపులోన నాజ్యంబు లేనట్లు । విశ్వ. 3002

ఆ. మలము జారవిడుచు మతిపోయు పథమున । మలము విడువ బలము మనుజునకును
మలము బిగిసె నేని మతి ప్రాణహానియౌ । విశ్వ. 3003

ఆ. మలము మూత్రములకు మధ్యమునను బుట్టి । మలము రోయువాఁడు మనునె జగతి
మలము మూత్రములను మానుట మూలంబు । విశ్వ 3004

ఆ. మలము మూత్ర రక్తములు మాంసమును గల । ముట్టుకుండ నీళ్లు ముంచనేల
పైముఱికియె పోవు లోముఱికియె పోదు । విశ్వ. 3005

క. మలమూత్రాదుల నిలిపియుఁ । దలపెంచుచు యోగులమని ధారుణి దిరుగన్
ఫలమేమి కలుగు భృకుటీ । స్థలమందుం దన్ను గనుటె ధర్మము వేమా. 3006

క. మశకము ఝుమ్మని కూయుచు । పసగల దేహమున వ్రాలి బలుతీక్ష్ణమ్మౌ
కొసగల ముక్కునఁ బొడుచుచు । పెసగ్రోలును నెత్తురిలను వినరా వేమా. 3007

ఆ. మహినినిండి బొక్క మందుల బుట్టిరో । పొడఁ జదువనేర్చుఁజూడఁజూడ
ఇంతకంటెఁ జేటెఱిఁక నేమి జ్ఞానమో । విశ్వ. 3008

ఆ. మహిమఁదెలియ లేక మాయచేతను జిక్కి । వచ్చి చూడలేని సూక్ష్మరూపు
మహిమఁ దెలిసెనంత మర్మంబు లేదయా । విశ్వ. 3009

సీ. మహిలోన నొకయీఁగ, మఱికేకలిమచును । మంచంబు ద్రింగిన, మహిమయేమి
మానుషవంతుఁడై, మహినీఁద బాలుండు । మానునమలినట్టి, మాఱుపదేమి
తోడరి దోసలు గిరి, నొడసి పట్టియుండాము । పరగగతించిన, బలమదేమి
పంచపన్నెల చిల్క, పరగ నైమను గూడి । పర్వతంబును దిన్న, బలమదేమి
గొట్టె దొడ్డిని జడి చెట్టు, చిట్టఁజూచి । విరులుపూచిన యట్టియా విధమదేమి
అరయనేర్చిన సర్వజ్ఞు, లైనవారు । వివరముగఁ బల్క నట్లయిన,వినర వేమ. 3010

ఆ. మాట కేడ్పునాలు మగనికియమదూత । తెఱచి చూడ విటునిఁదలచి యేడ్చు
అట్టియాలివిడిచి యడవి నుండుటె మేలు । విశ్వ. 3011

ఆ. మాట చెఱుపు మాట మర్మమే కర్మను । ఆశలు కడగండు లప్పు ముప్పు
పాపకారణములు పలుకులుములుపలు । లేశమైన తెలియ లేరు వేమ. 3012

ఆ. మాటఁజెప్పవినని మనుజుండు మూర్ఖుఁడు । మాటవిన్న నరుఁడు మాన్యుఁడౌను
మాటవినఁగఁ జెప్ప మానుట కూడదు । విశ్వ. 3013

ఆ. మాట దిద్దవచ్చు మఱి యొగ్గు లేకుండ । దిద్దవచ్చురాయిదిన్నగాను
మనసు దిద్దరాదు మహి నెంత వారికి । విశ్వ. 3014

ఆ. మాటనిలుపలేని మనుజుండు చండాలుఁ । డాజ్ఞలేని నాథుఁ డాడుముండ
మహిమలేని వేల్పు మంటఁ జేసిన పులి । విశ్వ. 3015

ఆ. మాటమఱుగు సిగ్గు మనుజ లోకం బెల్ల । చీరె మఱుగు సిగ్గుచెప్పనేల
తెట్టనింటి సిగ్గు బండ సంసారంబు । విశ్వ. 3016

ఆ. మాటమిగులు నాలు మగనికి యమదూత । యొరపడగ పాము నుద్దియగును
తనకుఁగాని యాలు దానవునాలుగా । విశ్వ. 3017

క. మాటల మాటలు వచ్చును । మాటలనే కలుగు చండు మణి మంత్రంబుల్
మాటల పొందికఁ దెలిసిన । మాటలనే ముక్తి కలుగు మహిలో వేమా. 3018

ఆ. మాటబొడఁగలుగు మర్మము తెలిసిన । పిన్న పెద్దతనము లెన్నపలదు
పిన్నచేతి దివ్వె పెద్దగా వెలుఁగదా । విశ్వ. 3019

ఆ. మాటలాడ నేర్చి మనసు కరఁగకున్న । పరగు ప్రియముఁ జెప్పి పడయకుండ
నౌకరి చేతి సొమ్ము దూరక వచ్చునా । విశ్వ. 3020

ఆ. మాటలాడ నేర్చి మనసుఁ గరఁగఁజేసి । పరగఁ బ్రియము పుట్టఁ బలుకకున్న
నౌకరి చేతి సొమ్ము లూరక వచ్చునా । విశ్వ. 3021

ఆ. మాటలాడవచ్చు మనసు నిల్పఁగలేఁడు । తెలుపవచ్చుఁదన్నుఁ దెలియలేఁడు
సురియఁబట్టవచ్చు శూరుఁడు గాలేఁడు । విశ్వ. 3022

ఆ. మాటలాడ వేఱె మనసు కొలఁది వేఱె । మొదలిగుణము వేఱె మోజ వేఱె
యెట్లుకల్గు ముక్తి యేలాగు తనలాగు । విశ్వ. 3023

ఆ. మాటలాడు టొకటి మనసులో నొక్కటి । మొదలి గుణమ కొకటి నడత యొకటి
యెట్లుకలుగు ముక్తి యీలాగు తానుండ । విశ్వ. 3024

ఆ. మాటలుడుగకున్న మంత్రంబు దొరకదు । మంత్రముడుగకున్న మదిమురదు
మనసు నిలుప కున్న మఱి ముక్తి లేదయా । విశ్వ. 3025

ఆ. మాటలెల్లఁ గల్ల మనసెల్ల దొంగయౌ । నేఁటి ప్రాణమింక నేఁటి బ్రతుకు
మాటసత్యమైన మాత్రకతాయున్యంబు । విశ్వ. 3026

ఆ. మాటలోని వాని మహిమ తాఁ దెలియక । మాటఁ దెలియలేక మమతఁ జిక్కి
మాటఁ దెలిసెనేని మహితాత్మ యోగిరా । విశ్వ. 3027

ఆ. మాటవినని యాలు మగనికి బంధాలు । దానిఁ జేర ప్రాణమానహాని
అట్టియాలి విడిచి యడవి నుండుట మేలు । విశ్వ. 3028

ఆ. మాటవినని యాలు మగనికి మృత్యువు । నోరపడగ సర్ప మొంటి గ్రహము
తనకుఁగాని యాలు దానవురాలయా । విశ్వ. 3029

క. మాటికి సైగలు చూపెడి । బూటకులను నమ్మరాదు పూర్తిగ మదిలోఁ
జోటెఱిఁగి పూజ చేసినఁ । గోటీశ్వర తేజమదియె గుఱిఁగను వేమా. 3030

ఆ. మాటికీపు రెల్ల మనసులో బెట్టుక । మాదిగలను దెగడు మాదిగెపుడు
మంచిగుణము లేక మర్యాద యెట్లబ్బు । విశ్వ 3031

క. మాతంగమునికి మనుములు । భూతలమున బ్రాహ్మణులుగఁ బొలుపగు నానా
జాతులఁబుట్టిరి వీరలె । ఖ్యాతిగ నీధరణిఁ జెడియు కదరా వేమా. 3032

ఆ. మాదిగ చెయువులను మనసులో బెట్టుక । మాదిగలను దెగడు మాదిగెపుడు
మంచి గుణములేక మఱి ద్విజుఁ డెట్లగు । విశ్వ. 3033

ఆ. మాదిగయనవద్దు మఱిగుణ మొనరిన । మాదిగని వసిష్ఠు మగుపఁడేఁడె
మాదిగ గుణమున్న మహిద్విజుఁడగునటే । విశ్వ. 3034

ఆ. మాదిగ యనవలదు మఱివసిష్ఠునకును । మాదిగ చెలి యెట్లు మగువయయ్యె
మాదిగ గుణమున్న మహిద్విజుం డెట్లౌను । విశ్వ. 3035

ఆ. మాదిగ యనఁగానె మఱితక్కువందురు । మాదిగ యిలసురల మామగాదె
మాదిగకును బిడ్డ మన యరుంధతిగదా । విశ్వ. 3036

ఆ. మానధనము విడదు మఱిపుణ్యవతియైనఁ । బూని పతికి భక్తి పొసఁగఁ జేయు
లోన మెచ్చుచుండు లోగుట్టుఁ గననలె । విశ్వ. 3037

ఆ. మానసపు విరక్తి మసలక యాత్మలో । బోడితలల సొంపుపొల్పుమీఱ
కడుపు కొఱకుఁ దిరుగుకష్టంపు మదితోడ । విశ్వ. 3038

ఆ. మానసమున మంచి మల్లెపూల చవికె । బావితోటఁ జేసి బాలఁగూడి
భోగినయ్యెద ననఁ బోయెఁ బోకాలంబు । విశ్వ. 3039

ఆ. మానినీమనోజమందిరానందైక । లోలుఁడొల్లఁ డూర్ధ్వ లోకసుఖము
మాలవాడకుక్క మఱియన్న మెఱుఁగునా । విశ్వ. 3040

క. మాయములో నై జీవుఁడు । కాయములనుబొంది తన్నుఁ గనెడి యుపాయం
బేయెడఁ దెలియక బహువిధ । మాయలెతానగుచుఁ దానె మరుగును వేమా. 3041

ఆ. మాయజగమటంచు మనుజుఁడెఱుఁగలేక । మాయలోనఁ దాను మగ్నుఁడయ్యె
మాయఁదెలియునరుని మర్మజ్ఞుఁ డందురు । విశ్వ. 3042

ఆ. మాయజగమటంచు మఱిపల్కుచుందురు । మాయగాదుబ్రహ్మ మయముగాని
మాయయైనజగము మఱియేడనున్నదో । విశ్వ. 3043

ఆ. మాయజగములోని మమకారవృత్తి చే । మాయఁదగిలిమంచిమనసు విడక
మదముచేతగురుని మహి నెట్లుకందురు । విశ్వ. 3044

సీ. మాయఁద్రొక్కెడుదారి, మర్మంబులివియని । తెలియఁజెప్పవినరు, తేటగాను
జనులందఱునుబుద్ధి, చాంచల్యమునుమాని । జాగులేకవినరు, జగతిలోను
విన్నమాత్రములోనె, విజ్ఞానమునురును । బాపాత్ములువినరు, పట్టుగాను
కామ్యకర్మంబులు, గడుఁజేయుదురుకాని । కరుణించివినరుగా, కలియుగమునఁ
గానసీగోప్యమెఱుఁగని, కలుషమతులు । బ్రహ్మమేనని భావింపఁ, బ్రాలుమాలి
నరకకూపముగందురు, నయముగాను ! బోధవిన్నవెయమరెడి, బుద్ధివేమ. 3045

ఆ. మాయనరకమనుచు మాయరోయకపాటి । సమము గనరు దేవ సభలయందు
నందఱుఘనులైన వారునకుఁ దావేది । విశ్వ. 3046

ఆ. మాయనుచెరసాల మనసను గొలుసును । భేదమసెడుబొంద బెరసియుండ
ఇట్టిబద్ధజీవి కెన్నడు మోక్షఁబు । విశ్వ. 3047

ఆ. మాయపోవువిధము మనుజుండు దలచిన । మంచిమార్గమబ్బు మానవులకు
మాయదాటలేని మనుజుండు వ్యర్థుండు । విశ్వ. 3048

ఆ. మాయభయములేని మనుజుండె మనుజుఁడు । మాయలోమునుంగ మనుజుఁడగునె
కాయముడుగునపుడె మాయయునుడుగును । విశ్వ. 3049

తే. మాయమగు జగద్భ్రమలెల్ల మట్టుపఱచి । సర్వసమదృష్టిలోనెంచి సాక్షిగాను
నిర్వహించుట ముక్తికి నిజపదంబు । గర్వము వహింప నేదైనఁ గలదె వేమ. 3050

ఆ. మాయమనసెయయ్య మనసుమాయయెయయా । మాయఁదెలిసినతఁడు మహిమగనును
మాయలోనిమాయ మతిపరంజ్యోతియా । విశ్వ. 3051

తే. మాయమమకారమును ద్రుంచి మరిగినంత । గర్మకడగండ్లఁజెప్పను గాలుఁదొలుఁగు
దీనిఁగని మెలఁగెడువాఁడె ధీజితుండు । నీయఁగనమన్నగతులెల్లమాయు వేమ. 3052

ఆ. మాయమాయునపుడు మదినిల్చిజ్ఞప్తిలోఁ । గాయమసెడుదానిఁ గానఁబోఁడు
న్యాయముగను జ్ఞప్తినంటును దత్వంబు । విశ్వ. 3053

ఆ. మాయయె చెరసాల మనసె యోజింపఁగఁ । బద్ధశృంఖలంబు భేదమిలను
ఇట్టి బద్ధపదవి కెన్నఁడు మోక్షంబు । విశ్వ. 3054

ఆ. మాయరూపురూపు మాయగాఁజేసియు । మాయరూపును బెనుమాయఁజేయ
మాయలోసిమాయ మతి పరంజ్యోతియా । విశ్వ. 3055

ఆ. మాయరూపురూపు మాయగాఁ దెలిసిన । మాయరూపును బెను మాయయగును
మాయలోనిమాయ మతిపరంజ్యోతియా । విశ్వ. 3056

క. మాయలకిరవై కొండఱు । మాయలుచూపించిమదిని మరలింతురుగా
మాయకు వెలియగుచిత్తముఁ । బాయకగురునిష్ఠఁబూన బలపడు వేమా. 3057

క. మాయలసంసారముకై । మాయలనే తిరుగుచుండు మనుజుఁడులోనై
మాయలఁ దెలిసినయంతట । మాయలనే ముక్తి కలుగు మహిలో వేమా. 3058

ఆ. మాయలోకమన్న మర్మంబుఁదెలియక । మాయఁజిక్కియెంతో మాయఁబడిరి
మాయదెలియ దివ్య మాయ తాఁజన్మంబె । విశ్వ. 3059

ఆ. మాయలోనఁ బుట్టి మాయచేఁ జిక్కియు । మాయచేతఁ బూర్వమఱచి మఱచి
మాయలోననరుఁడు మఱియాకలికిగాను । ఏడ్చినపుడునరుల కెఱుక వేమ. 3060

ఆ. మాయలోనఁ బుట్టి మాయలోనఁ బెరిగి । మాయఁ దెలియలేని మనుజుఁడేల
మాయఁ దెలియువాఁడె మహిమీఁద ధన్యుండు । విశ్వ. 3061

ఆ. మాయలోనిమాయ మర్మంబుఁ దెలియరా । మనసులోని తీఁగె మలయుచుండు
తీఁగెలో నెవ్వేల్పు త్రిపురతాండవమాడ । విశ్వ. 3062

ఆ. మాయలోనఁ బుట్టి మాయలోనఁ బెరిగి । మాయవిడువలేక మగ్నులైరి
తొల్లిచేయుకర్మ తొలఁగిపోవఁగనీదు । విశ్వ. 3063

క. మాయావిద్యలఁ జూడక । మాయాలకిరవైన యొఱుక మర్మముఁ గనకే
మాయావిద్యలజాలము । చాయగనె జీవేశ్వరులకు జాలము వేమా. 3064

క. మాయావిద్యలె తోడగు । న్యాయములో గుఱుతుఁ దెలిసి నాకముఁ గనినన్
మాయా విద్యలడంగియుఁ । బాయక బ్రహ్మైక్యమగును బనుపడి వేమా. 3065

క. మాయిల్లని మాపాలని । కాయము తనసొమ్మటంచుఁ గామాతురుఁడై
మాయని పదవినిగోరక । దాయాదుల పాలుచేయఁ దగదుర వేమా. 3066

ఆ. మాలకన్నియలను మందిరూపంబున్న । ముట్టినే త్రిశంకుపట్టినాఁడు
కానిపనులుసేయ ఘను లాస పడుదురా । విశ్వ. 3067

ఆ. మాలఁ ద్రిప్పుచుండి మంత్రంబుసనుగుచు । మదినిఁ గోతిలప మహిమమున్నె
బుద్ధినిలుకడున్నఁ బున్నెంబు నేకూరు । విశ్వ. 3068

ఆ. మాల మాలగాఁడు మహిమీఁద నేపొద్దు । మాటతిరుగువాఁడె మాలగాక
వాని మాలయన్నవాఁడెపో పెనమాల । విశ్వ. 3069

ఆ. మాలమాంసముఁదిను మఱి సర్వజనములు । క్రొవ్వుఁదిందు రొక్క కులమె కాదె
కులములెల్ల నొక్క కులముగాఁ దెలియుఁడీ । విశ్వ. 3070

ఆ. మాల మేలుగుణము మంచిదికలిగిన । మాలకూడుగుడుచు మనుజుకంటె
గుణమె మేలుగాని కులమేమి మేలురా । విశ్వ. 3071

ఆ. మాలయంటనుచును మఱినీళ్లమునిఁగిరి । మాలకర్మచేత మాలఁడాయె
ఏలఁ దెలియలేరొ యీనరపశువులు । విశ్వ. 3072

ఆ. మాలవాఁడయినను మఱియాత్మమీఁదను । మనసు నిల్పెనేని మాలగాఁడు
మనసు నిల్పకున్న మహిమీఁద మాలఁడో । విశ్వ. 3073

ఆ. మాలవానిఁజూచి యేలనిందింపంగ । పాటిలేనిమాట పలుకుటేకద
వానిలోనఁబలుకు వానికులం బేది । విశ్వ. 3074

ఆ మాలవానిఁజూచి యేలనిందింతురు । తూలుమాటపలుక దోష్మయేమొ
ఆపఁజూచిపలుకు నతనికులం బేమి । విశ్వ. 3075

ఆ. మాలవానినంటి మఱినీళ్లమునిఁగిరే । మనుజకర్మచేత మాలఁడయిన
నేలఁజాలియుండరో యీనరపశువులు । విశ్వ. 3076

ఆ. మాలవానినేల మహిమీఁదనిందింప । నొడల రక్తమాంస మొకటెకాదె
వానిలోనమెలఁగు వానికులంబేది । విశ్వ 3077

ఆ. మాలవానియంటు మునిగినీళ్లనుబోవు । తురకవానియంటు తుళ్లిపోవు
మ్రుచ్చురాలియంటు చచ్చినఁబోదురా । విశ్వ. 3078

ఆ. మాంసమున్నమునకు మాటుఁజేసికొనియు । మాంసముదినునట్టి మాయజీవి
మాంసముచెడిపోవ మాటెట్టులాడురా । విశ్వ. 3079

ఆ. మాంసముదనలోన మాటొనర్చుకయుండి । మాంసముఁ దినియుండు మాటలెల్ల
మాంసమువిడుపైన మాటెట్లుపోవురా । విశ్వ. 3080

ఆ. మాసినతలతోడ మలినవస్త్రముతోడ । యొడలిజిడ్డుతోడ నుండెనేని
అగ్రజన్ముడైన నట్టెపొమ్మందురు । విశ్వ. 3081

ఆ. మింటనంటియున్న మినుకుఁజూడఁగఁబూని । అంటలేక కొండ నవిసిపడిరి
కంటినంటుజ్యోతి కానంగలేరయా । విశ్వ. 3082

క. మితములుచెల్లిన నాఁటికి । మృతిబొందిన నిలువరాదు మేటులకైనన్
క్షితినేఁటికి భయపడుదురు । సతమాజీవంబుఁ జూడఁజయ్యనవేమా. 3083

క. మితములు సద్భాషణములు । హితములుగాఁ బలుకువాని నెల్లరుఁగడుస
న్నుతులొనరించుచు మెచ్చిక్కుదు । రితరాలాపములు వినఁగనేవగు వేమా. 3084

ఆ. మిరపగింజఁజూడ మీఁదనల్లగనుండు । కొరికిచూడ లోనఁ జురుకుమనును
సజ్జనులగువారి సారమిట్టులనుండు । విశ్వ. 3085

సీ॥ మీకుమారుగఁబోఁక, జేకొనిపుష్పముల్ । గుహలోననున్నట్టి, గురునిఁగాంచి
అయ్యావచ్చితినని, దయ్యనఁబూలిచ్చి । సాష్టాంగపడఁగనా, సద్గురుండు
నామోముఁజూచుచు, నేమివచ్చితివన । నభిరామశిష్యుండ, ననిపిరంటి
అంతటఁ దలయూచి, యహహా యనుచువారు । కానిమ్ము రమ్మని, కరుణతోడఁ

జేసె నుపదేశమయ్యెడి, చెందె నాకు । సూక్ష్మకాలంబులో సిద్ధ,సూరి నైతి
గురువు వదినెయె కాకనా, గురుఁడవీవు। నాత్మగురుఁడయ్యె శివయోగియంటి వేమ.

ఆ. మీటరక్కసందు బైటవగ్గి నడుమ । మేటిరాఁగఁ దెచ్చి మెఱయకరఁగి
కూటమెఱుఁగు వాఁడు కోటికిఁ బడగెత్తు । విశ్వ. 3087

ఆ. మీఁది యాకెఁ దీసి మిగులఁ బెద్దలమని । కానరాకతిరుగు కర్మజనులు
బైలుఁ గోరినట్లు భావంబుఁ గోరరు । విశ్వ. 3088

ఆ. ముక్తిఁ గానలేని మూర్ఖజనులకెల్ల । బట్టబయలుచేసి పరమపదము
దారిఁ జూపినతఁడు దైవంబు తానయా । విశ్వ. 3089

ఆ. ముక్తిమార్గమునకు మూలమై తనునట్టి । గ్రంథమంత జనులు వ్రాసిచదువ
విన్నవారికెల్ల విభవంబు కలదయా । విశ్వ. 3090

ఆ. ముక్తి యొవరిసొమ్ము ముక్కుమీఁదుగఁ జూడ । భక్తి యొవరిసొమ్ము భజనసేయ
శక్తి యొవరిసొమ్ము యుక్తిచే సాధింప । విశ్వ. 3091

తే. ముక్కు కన్నులు చెవులంటి మూయ నేల । తెలివి తెరగంటి లోపలఁ దేటపఱచి
తిరుగ నేర్చినవాఁడెపో ధీజితుండు । ఊరకయు మాయ డంబంబు లౌర వేమ. 3092

ఆ. ముక్కుఁగోపములును మోహలోభంబులు । నక్కజంపు గూర్ర మధికమయ్యెఁ
గక్కసంబుచేతఁ గాలునివలనను । మొక్కవోదురు తుది మొనసి వేమ. 3093

తే. ముక్కుఁగోరును సద్గంధములను నల్లై । చెవులుఁ జర్మంబుఁగన్నులు జిహ్వ మొదలు
ఇన్నియును గోరునటువంటియిల్లుఁ గోసి । తన్నుఁ గనుఁగొని సుఖియింపఁదగును వేమ.

ఆ. ముక్కుత్రోళ్ల గుచ్చి ముడికి పోవఁగఁదోమి । కచ్చనీరునించి కడిగి కడిగి
డొక్కతోమినంత దొరుకునా తత్వంబు । విశ్వ. 3095

ఆ. ముక్కుతుదనుదృష్టి ముదముతోడుత నిల్పి । హృదయమందుఁజూడ నెసఁగుముక్తి
పదవి మెఱుఁగుఁగన్నఁ బరమాత్మయోగియౌ । విశ్వ. 3096

ఆ. ముక్కుపట్టియూడ్చు ముండనుజేపట్టి । తిక్కయెత్తి నరుఁడు తిరుగఁగాక
యొక్కడి తలిదండ్రు లేమియుఁగనకేల । విశ్వ. 3097

ఆ. ముక్కుమీఁద దృష్టి ముదువుగానిలిపిన । నరముమీఁదఁజూడనుండుఁ బరము
పరముదెసకు నుండుఁ బరమాత్ముఁ డాయోగి । విశ్వ. 3098

ఆ. ముక్కుశ్వాసమునను మ్రోయుచుండును గాలి। ముక్కువాసనలకు మొనయుచుండు
తిక్కవిడిచి చూడఁ దీఱును భ్రమలెల్ల । విశ్వ. 3099

తే. ముష్టులకు నేలఁ జెట్టను మూఢజనుఁడు । మూఁడిమాటఁ బోలిన తన దొడ్డకడుపు
నించు చుండును సతమని నిత్యముగను । కడుపు తన్నుద్ధరించునే కడకు వేమ. 3100

క. ముక్కోణ శిఖరమున గుఱిఁ । దక్కగఁ బరిపూర్తిఁ జెంది ధైర్యము విడకే
సొక్కియు సోలకయుండిన । నిక్కపుఁ గైవల్యమదియె నిజముగ వేమా. 3101

ఆ. ముఖముఁ జూచినంత మోహంబు ఘనమౌను । దిస మొలను గసంగఁ దీఱునర్థి
కూడిన పలవెల్ల గుర్తింపఁగ రాదె । విశ్వ. 3102

ఆ. ముగురిలోన నెచ్చు ముందు గానఁగలేక । నరకమునకుఁ బోవు నరులు గలరు
ముగురి కంద నట్టి మూలమూర్తి యొకండు । విశ్వ. 3103

ఆ. ముగురు మూర్తు లున్న మూలభావ మెఱిఁగి । మూలవానితోడ ముచ్చటాడి
సత్తు చిత్తులోని సారంబుఁ దెలియరా । విశ్వ. 3104

ఆ. ముగ్గురధికులనుచు ముందు గానఁగలేరు । కానలేరు నరులు కానలేరు
ముగురుఁ గూడి యొప్పు మూల మొక్కటేసుమీ । విశ్వ. 3105

ఆ. ముగ్గురుండు నట్టి మూల మెఱింగియు । ముగ్గురని నొకటిగ మనటఁ దెలిసి
పరగు జిహ్వతోడఁ బ్రస్తుతిఁ జేయరా । విశ్వ. 3106

ఆ. ముగ్గు రెఱుఁగనట్టి మూల మెఱింగియు । ముగురి మీఁద నొకటి ముందె తెలిసి
పరగ జిహ్వతోడఁ బ్రస్తుతి చేయరా । విశ్వ. 3107

ఆ. ముజ్జగముల దశలు మూడయ్యె శోధింప । మూఁట నొకటె కలుగ మూఁటరోసి
మూఁటిలోన నంతు ముక్తిని గంటెరా । విశ్వ. 3108

ఆ. ముజ్జగములు వెదక మూడు వస్తువులన్న । మూఁటిలోననున్న ముక్తిఁ దెలిసి
ముక్తిలోని ముక్తి ముందుగాఁ బొడగను । విశ్వ. 3103

ఆ. ముట్టి మనసు గట్టు మూలమందుట భక్తి । నట్టువడని ముక్తి నాకపరము
నట్టి నిలువుగాను నిలఁద్రొక్కి చూడరా । విశ్వ. 3110

ఆ. ముట్టు చాకలికిని మును మంగలికి నంటు । నరులు మోపిదేవిగుడికిఁ జేరు
మ్రొక్కులన్ని చేరు మొగి విశ్వకర్మకు । విశ్వ. 3111

ఆ. ముట్టు ముట్టటన్న మూలదాగుమరేల । ముట్టులోనె పుట్టె మూఢజనుఁడు
ముట్టుగుట్టుఁ దెలిసి ముని మౌనమును దాల్చె । విశ్వ. 3112

ఆ. ముట్టు ముట్టనుచును ముట్టరాదందురు । ముట్టునపుడ రేమిమూల మేమి
సకలములకుఁ నరుల కందఱకును । పుట్టుగానె పుట్టు ముట్టు వేమ. 3113

ఆ. ముట్టులోనె పుట్టి ముగ్గురు మూర్తులు । ముట్టురక్తమాయె మొదటి ప్రకృతి
ముట్టులోని గుట్టు మొనసి గురుఁడెఱుంగు । విశ్వ. 3114

ఆ. ముట్టులోనె పుట్టి ముట్టంటు నసురోసి । వట్టితీర్థమాడు వారు గాక
ముట్టుకుండ నీళ్లముంచిన శుచియౌనె । విశ్వ. 3115

ముట్టులోనె పుట్టి ముట్టులోనె పెరిగి । వట్టి తీర్థమాడు వారలెల్ల
ముట్టునీళ్లలోన ముంచినఁబోవునా । విశ్వ. 3116

ఆ. ముండఁ జూచినంత మొగమోటమిని గంద్రు । ముండకూడు దివక ముక్తిలేదు
ముండ కూఁటి కెల్ల మూలంబె కాదయా । విశ్వ. 3117

ఆ. ముండ ముసుఁగుఁ జెట్టు మూఢుముడులు వేసె । ముండఁ జూడకున్న ముక్తి లేదె
కాంతనుఁ గళవచ్చెఁ గ్రమమున నెట్లకో । విశ్వ. 3118

ఆ. ముండమోపి కేల ముత్యాల పాపట । పన్నెల్లఁ బుణ్యవతిఁ గాక
ముక్కుగోసి పికేలఁ గుచ్చుల పల్లంబు । విశ్వ. 3119

ఆ. ముండమోపితోడ మునుఁగుచుఁ దేలుచు । నుండగానె మోహముండెఁ గాక
అండఁబాయు వెనుక నాయాశలే లేవు । విశ్వ. 3120

ఆ. ముండ మోపి వల్ల ముగ్గురు జన్మింప । బండ జగము లోన భ్రమయ నేల
ముండమోపిఁ జంపి మొదటి ముగ్గురిఁ జంపి । నిండుమగనిఁ దెలిసినిలువు వేమ. 3121

ఆ. ముండల దగుగోష్ఠి మునుఁగుచుఁ దేలుచు । విడువ లేరు సుమ్మి వెఱ్ఱినరులు
అండఁబాయు వెనుక నన్నియుఁబోవురా । విశ్వ. 3122

క. ముందరి పోటులు మాన్పను । మందెంతైనను గలుగును మహిలోపల నా
నిందల మాటలు మాన్పెడు । మందెంతైనను గలుగునె మహిలో వేమా. 3123

ఆ. ముద్రి చేతఁబట్టి మొదటిఁ దెలియలేక । విశ్వకర్మఁబట్టి విడువ లేక
విశ్వకర్మఁ బెట్టు వెఱ్ఱులు పడుదురో । విశ్వ. 3124

ఆ. ముద్రలన్న నేమొ మురిసెదరయ్యయో । భద్రముగను మనసు పరగకున్న
వెఱ్ఱి చేష్టలగును విపరింప ముద్రలు । విశ్వ. 3125

క. ముద్రాభ్యాసత నగు గుప్తి । భద్రమతిం జూడఁగానె భ్రమ లడగించున్
సద్రూపకళల మించిన । చిద్రూపమె నిర్గుణంపుఁ జింతన వేమా. 3126

ఆ ముదిత నడవినంచి మును లేడివెన్నంటె । రామచంద్రుకన్న రసికుఁడేడి
పొలుపు తొలఁగు వేళ బుద్ధు లట్లుండురా । విశ్వ. 3127

ఆ. ముదితవలపుఁ జూడ మోహింతురివారల । చెంతఁజేరఁగానె చెడును మనసు
వింత భ్రమగుణంబు కాంతఁజూచినఁజాలు । విశ్వ. 3128

ఆ. ముద్దుగుమ్మకేల ముసలిమగఁడు మది । వశముగాక విటుని వలను జిక్కి-
వెత్తి ముద్దునకును వేదశాస్త్రము లేల । విశ్వ. 3129

ఆ. ముందు జ్ఞాన మెల్ల మోసమై శిశువులు । కర్మబంధనమునఁ గానలేక
జననమరణములను సాదృశ్యమైవచ్చి । యిహమునందుఁ బుట్టు రెఱుఁగువేమ. 3130

ఆ. మునిఁగి బ్రాహ్మణుండు ముందు గానకపోయె । తిరిగితిరిగి జోగి దిమ్మరాయె
కూసి కూసి మాల కుక్కయై పోయెరా । విశ్వ. 3131

ఆ. మునిఁగి మునిఁగి మునిఁగి ముద్దయై ముద్దయై । వనరి వనరి వనరి వక్కవక్క-
తిరిగి తిరిగి తిరిగి దిమ్మరై యుండురా । విశ్వ. 3132

ఆ. మునిజనములు కలఁగ మునిఁగి వెళ్లినబావి । బ్రహ్మకుఁదలలెత్తరాని బావి
మొలల బంటి గాను మునుచు నెవ్వరినైన । విశ్వ. 3133

క. మును దా వలచినఁ జిక్కును । దనవలపది లేక తన్నుఁ దాఁగానఁడిలం
దనదు పటాటోపంబులు । దనమాయలు బనికి రావు ధరలో వేమా. 3134

ఆ. మును దెలిసిన వారు మెఱిఁగి నష్టమైరిల । తిరిగి చెప్పితనుచుఁ దిట్టవలదు
తెలియఁ జెప్పిన నీకుఁ దెలిసికో లే రయా । విశ్వ. 3135

ఆ. మున్ను నిన్నుఁగన్న ముఖ్యు లెవ్వరో వారి । సన్నుతింపుమయ్య సంతతమును
జ్ఞానదాన మొసఁగు ఘనుఁడు నంతటి వాఁడె । విశ్వ. 3236

క. ముప్పది రెం డక్షరముల । ముప్పిరి గొన్నట్టి మూలముం దెలిసినచోఁ
దెప్పునఁగడ తేరఁగ నగుఁ । జెప్పితిఁగద మహిమనీకుఁ జెల్లును వేమా. 3137

ఆ. ముఱికికొంపలోన నిఱికించి జీవునిఁ । గర్మపాశములను గట్టివేసి
నిట్టి కర్మజీవి కెట్లుకో మోక్షంబు । విశ్వ. 3138

ఆ. ముఱికితోలుకంత మూలంబె మదిచింత । నరకమబ్బఁ జెంత నలుగు డెంత
పరముఁగోరినంత బయలగు వింతరా । విశ్వ. 3139

ఆ. ముఱికినవబిలముల మొనసి కారంగాను । బరమపావనుని పలుకు రెట్లు
తోలు బొమ్మలాట కీలుఁదెలియ లేరు । విశ్వ. 3140

ఆ. ముఱికిలోనె పుట్టి ముఱికిలోనె పెరిగె । ముఱికితనువునకును మురిపెమేల
ముఱికిజేఁగిన వాఁడు ముఱికిలోఁ బుట్టునా । విశ్వ. 3141

ఆ. మఱిగితిరిగి నరుఁడు మఠలు కొన్ననుగాక । అందువలన నేమి యాశలేదు
అంతరాత్మనిలుప నతఁడెపో తానౌట । విశ్వ. 3142

ఆ. మఱియువాఁ డెవండొ మఱియని దెవ్వఁడో । పాటుఁజేసి చూడ బట్టబయలు
సౌరిది జలఘటమున సూర్యబింబంబు । విశ్వ. 3143

ఆ. ముష్టి వేపచెట్టు మొదలుగాఁ బ్రజలకుఁ । బరగమూలికలకుఁ బనికివచ్చు
నిర్దయాత్మకుండు నీచుఁడెందులకును । బనికి రాఁడుగదర పరగ వేమ. 3144

ఆ. ముసలి కంటి లోన ముదుసలి నీళ్లాడె । భూతవరులు చేరి పురుడుఁబుచ్చ
భూతవరుబు వచ్చి పురుడేమి పుచ్చిరో । విశ్వ. 3145

ఆ. మూఁటనువిడిపించిమూఁటగ్రహించియుఁ । మూఁట మూఁట మూఁట మొనలఁగోసి
మూఁట మూఁట మూఁట మొనసిన దత్వంబు । విశ్వ. 3146

క. మూఁటికి మూలంబైనది । ధాటిగ గుర్తించి మించు ధావళ్యమునకా
నూటిగ మించిన తత్వముఁ । జాటింపరె యచల మనుచు సరసత వేమా. 3147

ఆ. మూఁటినాగ్రహించి మూఁటి విసర్జించి । మూఁటమూఁటమూఁట మొదలు కోసి
మూఁటమూఁట మూఁట మొనయగాఁ దత్వంబు । విశ్వ. 3148

ఆ. మూఁటి నీగుణముల మొదటికిఁ జెరపక । చిత్త మేల నిలుచు స్థిరముగాను
చిత్తశుద్ధిలేక శివుఁడు కాన్పించునా । విశ్వ. 3149

ఆ. మూఁడుగుణములంటి మూలంబుఁగన వలె । వీలుగాను త్రిపుటి వెలయ నొక్క
త్రాఁడు త్రొక్కి పాముఁ దలఁచిన చందమా । విశ్వ. 3150

ఆ. మూఁడుగుణములందు ముఖ్యగుణంబును । దెలియలేనివాఁడు వెలయునట్టు
భ్రమలఁ బడిన వాఁడు బలువెట్టియగు ధర । విశ్వ. 3151

ఆ. మూఁడుగుణములన్ని మొనసి యొక్కటిచేసి । యారుచక్రముల నటింటఁగూర్చి
స్థిరముగాఁగ నుండ శివతత్వమందును । విశ్వ. 3152

ఆ. మూఁడుగుణములరయ ముఖ్యమైయుండును । మూఁడుగుణములకును మూలమొకటి
మూఁడుగుణములెపుడొ ముంచునెవ్వరినైన । విశ్వ. 3153

ఆ. మూఁడుగుణము లొకఁట మొదలనేయుండఁగాఁ । గలిసిమూఁడఁజట్టి తెలియలేక
భ్రమలఁ బడ్డవాఁడు బలువెట్టివాఁడకో । విశ్వ. 3154

తే. మూఁడుమూలలకందని మొదటనిలచి । వేడి యష్టాక్షరంబుల జాడలెఱిఁగి
యాడికూడెడి కైవల్య మందవలెను । గూడ నానందమమితమై కుదురు వేమ. 3155

ఆ. మూఁడులోకములను మొనసియొక్కటి చేసి । యారుతావరముల నంటఁగూర్చి
స్థిరముగా నెయ్యెండు శివమూర్తి గురుఁడయా । విశ్వ. 3156

ఆ. మూఁడువిడిచిపెట్టి మూఁడు మిశ్రముఁజేసి । మూఁటిమూఁటిమూఁటి మునుఁగఁజేయ
మూఁటమూఁటమూఁట మొరయును దత్వంబు । విశ్వ. 3157

ఆ. మూఁడు వేళలందు ముదముతో శివునాత్మ । పూజసేయువాఁడు పుణ్యమూర్తి
పూజలేక మోక్ష భోగంబుదొరకునా । విశ్వ. 3158

ఆ మూఢజనులకెల్ల మూలమై తగుయోగి । తారకంబుగాను దైవరూపు
బట్టబైలుచేసి పరమాత్ముఁజూపఁడో । విశ్వ. 3159

ఆ. మూఢభక్తిచేత ముక్కంటిఁబూజించి । మొన్నఁబోయినరుఁడు ముక్తుఁడాయె
పుంజకేమివచ్చె బుద్ధిప్రధానంబు । విశ్వ. 3160

క. మూఢాత్ములైనమనుజులు । గూఢంబును దెలియలేక గుటిఁగనలేరా
గాఢాంధకారదూరుని । రూఢిగఁ జేరంగఁగలుగు రూఢము వేమా. 3161

ఆ. మూలచక్రిమట్టె మొనసి గట్టిగఁబట్టి । శోధచేసి శక్తిచోరఁదెలిసి
భేదపఱచిమనసు భేదింపముక్తుఁడౌ । సాధకుఁడగుయోగి సరణి వేమ. 3162

క. మూలముఁదెలియకకొందఱు । చాలగయోగంబులెల్ల సాధింత్రిగదా
జాలమునక యీవిద్యల । మూలమునూహింపఁగలుగు మోక్షము వేమా. 3163

ఆ. మూలమెవ్వరనుచు ముగ్గురిలోఁగల । మూలమెఱుఁగలేరు మూఢజనులు
మూలము ముగురికిని ముఖ్యమైయుండఁగా । విశ్వ. 3164

ఆ. మూలవిద్యయుండ ముఖ్యతేజములోన । మెలఁగుఁజిత్పరుండు మిహిరుపగిదిఁ
గాలకర్మములకు గాలుఁడే సాక్షిరా । విశ్వ. 3165

క. మూలాధారములోపలఁ । జాలగబంధించిగాలి సాధనఁగనరా
యేలనొధారణసేయుట । మూలము మదిఁదెలియు టెల్ల ముఖ్యము వేమా. 3166

తే. మెక్కఁజేసెడువాఁడును మేయిమరప। నిద్రఁబోఁజేయువాఁడును నిఖిలగతులఁ
జూపియిల బద్ధులను జేయుసూక్ష్మరూపుఁ। డామహాదేవుఁడేకదా యనవి వేమ. 3167

ఆ. మెఱపుమెఱయగాను మేఘమునకు బల్మి । కదసివానగలుగు గణుతిగాను
మెఱపుమెఱయకున్న మఱివానలౌసున్న । విశ్వ. 3168

ఆ. మేఁలగి మన్మయుంపు మిఱిమీఱుచుండెడి । యునికివిడకతాను నపమునందు
తనువుమఱచిమించి తత్వజ్ఞుఁడగునయా । విశ్వ. 3169

ఆ. మొలఁతనడవినుంచి మృగమువెంటనెపోయె । రామచంద్రుకన్న రసికుఁడేడి
చేటుకాలమునకుఁ జెడుబుద్ధి పుట్టును । విశ్వ. 3170

తే. మొలఁతుకలమిన్న పతిభక్తి మీఱదెపుడు । పతినిమదిలోనఁ బూజించు బరముగోరఁ
యులకుసద్గతిఁగోరుచేయువిదకగును । వస్యమృగపట్టు లారుఁగనపలయు వేమ. 3171

ఆ. మేకగుదియగట్టి మొసచన్ను గుడిచిన । నాకలేలమాను నాశగాక
లోభివానినడుగ లాభంబు కలుగునా । విశ్వ. 3172

ఆ. మేకచంకఁబెట్టి మొఁగుచుమందలో । భ్రమసితిరుగుగొల్ల పగిదిగాను
దేవునెఱుఁగక పెరదేవతఁ దలంచు । విశ్వ. 3173

క. మేకలు మూకలు సనినను । బ్రాకటముగ నొక్కకోతి పర్ణంబెక్కెన్
ఆకపులు నూఱుచనినను । కోకోయని కొంకనక్క కూసెర వేమా. 3174

ఆ. మేఘమడ్డమైన మిహిరుఁ డెరుచును । జిత్తమడ్డమైన స్థిరతఁ జెరుచు
మఱపులడ్డమైన మతియుక్తిఁ జెరుచురా । విశ్వ. 3175

క. మేఘుని యాడంబరము । స్మేఘములో నఱుము మెఱుము మెఱవడి పిడుగుల్
మేఘునినా నెడిభావము । మేఘాడంబరముఁ దెలియు మేధిని వేమా. 3176

క. మేఘోద్భవ వివరంబును । మేఘములో నఱుము మెఱుము మెండుగఁ బిడుగుల్
మేఘంబనియెడి భావము । మేఘాంధము జైలుఁ దెలియ మెప్పగు వేమా. 3177

ఆ. మేడిపండుఁ జూడ మేలిమైయుండును । బొట్టవిచ్చిచూడఁ బురుగులుండు
బెరుకువానిమదిని బింకమీలాగురా । విశ్వ. 3178

ఉ. మేదినిలేనివాదములు మిక్కుటమైన బలంబు లేదు లే
వాడుగగాలి లేనియెడ నవ్వుము మేఘము గప్ప దంతగా
బోధయులేక సద్గురుని పుత్రుఁడవౌ దెనిదాన దృశ్యమా
వాదులఁబోక యుండు మిఁక వచ్చునదెల్ల నెఱుంగు వేమనా. 3179

ఆ. మేషముఖుని దక్షుమిగులు వారలఁ గన్న । శివుని దూషకులకు సిగ్గులేదె
రంకుబడవఁగనియు రంకాడ నేర్తురే । విశ్వ. 3180

ఆ. మైథునమునఁ బుట్టు మానవులందఱు । తిరుగుచుందురంచె తెరువులేక
యెందుఁ బుట్టువారికందేగతి గదర । విశ్వ. 3181

క. మైథునములోనఁ బుట్టెను । మైథునమునఁ దానె పెరిగి మఱియదె ప్రేమిం గెన్
మైథునము వెడలఁగాచిన । మైథునమే వస్తువగును మహిలో వేమా. 3182

ఆ. మైలకోకతోడ మాసినతలతోడ । ఒడలు బడలి జడల నుండెనేని
అధికకులజుఁడైన నట్టిట్టి పాష్మఁడు । విశ్వ. 3183

ఆ. మైల మైలటంచు నతిసీట మునిఁగిరే । మైలలోనె తనువు సహింబుట్టె
మైల నిలుచుచోటె మనుజుని పుట్టుక । విశ్వ. 3184

ఆ. మొగముఁజూచినపుడె మోహంబు ఘనమౌను । ధనముజూచినపుడె తగులుమనసు
కూడినప్పుడరయ గుసులెల్ల విఱుగును । విశ్వ. 3185

ఆ. మొగముఁజూడఁగానె మోహంబు ఘనమౌను । ధనముఁ జూచినపుడె తగులుమనసు
కూలినష్టమైనఁ గోరునే కొంటగామి । విశ్వ. 3186

ఆ. మొండివానికేల ముంజేతికడియాలు । తొత్తివానికేలఁ గత్తిపఁడ్లు
గాడిదెలకు నేలగడ్డముల్ మీసముల్ । విశ్వ. 3187

ఆ. మొదట నతఁడు జ్ఞానముద్రాంకితుఁడు గాక । యా విధమును దెలియ నజ్ఞుఁడగును
నడుమ జ్ఞానమొదవ నగుబాటె కాదయా । విశ్వ. 3188

ఆ. మొదటనాసఁబెట్టి తుదిలేదు పొమ్మను । పరమలోభులైన పాపులకును
వారియుసురుదాక వగ చెడిపోవరా । విశ్వ. 3189

క. మొదటను మతమున్వదలక । తుద నెవ్వరి మతము నైన దూషింపకయుం
బదిలుఁడయి కోర్కెఁ గోరక । ముదమునఁ జరియించువాఁడె ముఖ్యుఁడు వేమా. 3190

ఆ. మొదటఁబడ్డనీరు మొదటిదనుక నెక్కె । మొదటి దుఱికి వేగ మొలకలెత్తె
మొగి పృథివిని బడ మగకొడుకు కందురు । విశ్వ. 3191

ఆ. మొదటఁ బోయునీరు మొగబీజములకెక్కె । మొదటి కుఱుక వేగ మొలకలెత్తు
మొలక పృథివిఁ బెరిగి వెలయును వృక్షంబు । విశ్వ. 3192

ఆ. మొదట బ్రహ్మమనువు మొనయ రెండుమయుండు । మూఁటద్వష్టశిల్పి మొనయ నాల్గు
విశ్వకర్మ నెగడె విశ్వజ్ఞుఁడైనంట । విశ్వ. 3193

ఆ. మొదటమంచికులము పిదప నానాజాతి । యిట్టిజాతికన్న నెచ్చులేదు
కంసలికిని మించు ఘనజాతిలేదయా । విశ్వ. 3194

క. మొదట స్వమతమును విదలక । తుద నెవ్వరిమతము నైన దూషింపకయుం
బదపడి కోర్కెలుగోరక । ముదమున నటియించువాఁడె ముఖ్యుడు వేమా. 3195

ఆ. మొదటితరువునందు మూఁడు కొమ్మలు పుట్టె । అసలు కొనలు తీఁగలాకులమరె
పువ్వుపిందెపండ్లు భువనము ల్నిండెఁగా । విశ్వ. 3196

ఆ. మొదల క్రీడను దప్పి మోసంబుఁ జేసియు।పొట్టకొఱకు మనసుఁ బొందుపఱచి
బిడకుక్కరీతిఁ బెరుగను మనుజుండు । విశ్వ. 3197

ఆ. మొదలఁ బోయునీరు మొదలుదనుక నెక్కి । వృక్షమెల్ల నిండి విస్తరించు
ఆవిధమున జీవమంతట నిలుచురా । విశ్వ. 3198

ఆ. మొదల బ్రమానెయగును దుదఁబక్షియును గాదు । నోరులేదు పండు లాఱుగలవు
జీవమొకటిలేదు జీవులఁజంపురా । విశ్వ. 3199

క. మొదలి తనమతమువదలక । తుద నెవ్వరిమతమునైన దూషింపకయుం
బదిలుఁడయి కోర్కి గోరక । ముదమునఁజరియించువాఁడె ముఖ్యుఁడు వేమా. 3200

ఆ. మొదలు చూచిమూది తుదఁ జూడకుండినఁ । ఁపుతప్పినపుడె సొరఁగవలెను
సొరగకున్న వానిఁజులకగాఁ జూతురు । విశ్వ. 3201

ఆ. మొదలు మగఁడుచూడ మొనసి యీశ్వరుఁడగు । వెనుకనాలుచూడ విష్ణువగును
ఆలుమగఁడు నెవరో యాదినిఁ దెలియుఁడీ । విశ్వ. 3202

సీ. మొదలు మీఁదికిగాను, దుదమొదలుగనున్న । వృక్షంబు మొలచిన, వింతయేమి
మహిమింటి మీఁదను, మదగజంబొకటి । విహరించుచున్నట్టి, వివరమేమి
చిదిమి పెట్టినబంటు, విధమున నేనుంగు । జీమమ్రింగిన యా విచిత్రమేమి
పులిచింతమీఁదను, దలమీఁద నొకచింత । మ్రానుగట్టినయట్టి, మరుగదేమి
చింతవృక్షము మీఁద, జేమంతిపూలు । చెలఁగి పూచిన యట్టి విచిత్రమేమి
అరయ నేర్చిన సర్వజ్ఞులైనవారు । వివరముగఁబల్కిన ట్లైన,వినర వేమ, 3203

సీ. మొదలు మూలాధార, మొనసవిఘ్నేశ్వరుం।డచ్చోట దేవాళి, యధిపుఁడుండు
అందుమీఁదటను రెండంగుళముల మేర । స్వాధిష్ఠచక్రంబు, వరలుబ్రహ్మ
దీనికి నెనిమిది, దేహాంగుళములందు । మణిపూరచక్రంబు, మలయుహరి
అంతదశాంగుళ, మవల ననాహత । మొప్ప రుద్రుండట, నొనరియుండు
పదియు రెండంగుళములకుఁ, బైవిశుద్ధి।యందు జీవుండుపొందుగా,నలరుచుండు
వెలయఁ బరమాత్ముఁడగ్నియై, వెలుగుచుండు।నిట్టి జాడలు తెలియుట,యొఱుక వేమ.

ఆ. మొదలు సౌఖ్యదుఃఖ మూలమునివరింపఁ । బుణ్యపాపకలిత పూర్వకర్మ
పరగఁగాలువోయి పడగను బడ్డట్లు । విశ్వ. 3205

ఆ. మొనసి యింద్రియముల మొనటనిల్వఁగలేక । సమసిపోవువేళ సన్యసింత్రు
ఆత్మశుద్ధిలేక యెంటునా మోక్షంబు । విశ్వ. 3206

ఆ. మొలక చనులనాఁడు మూఁడుకోటులుచేయు । కలుకు చనులనాఁడు కోటి సేయు
తటుకు చనులనాఁడు దమ్మిడి సేయదో । విశ్వ. 3207

ఆ. మొలక చనులనాఁడు మోహంబు పుట్టించు । గుబ్బచనులనాఁడు కోర్కె దీర్చు
తటుకు చనులనాఁడు దయ్యాలు నొల్లవు । విశ్వ. 3208

ఆ. మోదమునను గురుని ముఖ్య కరుణచేతఁ । దొమ్మిది స్థలముల దొడ్డవాయ
సర్వజీవుఁ డాయె సర్వంబు తానాయె । విశ్వ. 3209

క. మోసము సేయుచు భువిలో । దాసులమని భూతిఁ బూసి ధరణిఁ దిరుగునా
మోసపు శివవంచకులను । దూషించెదరవని జనులు దురితము వేమా 3210

ఆ. మోసమునను దనకు మొదటి ముఖ్యతహాని । మోసమునను దనకు గురువుఁ దప్పు
మోసమునను దనదు మోక్షముఁ దప్పురా । విశ్వ. 3211

ఆ. మోహజలధిలోన మునిఁగి చచ్చుటె కాని । హరిపరాయణత్వ మమరఁ బోదు
ముట్టి గురుని ధ్యాన మూలమందుట ముక్తి । విశ్వ. 3212

తే. మోహ భవ బంధములనెల్ల మూలఁద్రొక్కి । సాహసంబున గురుభక్తి సలిపిలోన
జపము చేయుట ముక్తికి సక్తియగును । నిబ్బరముఁబట్టిఫలమొప్పు నిజము వేమ. 3213

ఆ. మోహమనెడుబుద్ధి మూలంబునెఱిఁగితా । మోహరించిగురుని మోముఁజూచి
మోహమందుముక్తి ముక్కానుఫలగామి । విశ్వ. 3214

క. మోహము దీఱకయుండిన । దాహంబై దేహమెల్ల దల్లఁడపడునీ
గేహములోఁ బోరాడక । దేహమునం దున్నశివునిఁ దెలియర వేమా. 3215

తే. మోక్షమార్గమెఱుంగక మూర్ఖ జనులు । కుక్షినింపెడు వేషముల్ గోరి వేసి
నిర్గుణాత్ములమని చెప్ప నీతిగాదు । వారికిహపరములు సున్నలౌర వేమ 3216

తే. మౌని నిజకేళిలోపల మమతఁద్రొక్కి । ప్రాణినంతటఁ బరిపూర్తి పొందుగలుగు
వానిభక్తికిసాటిది వసుధఁగలదె । డాంబికములైన నడుమునడంగు వేమ. 3217

ఆ. మౌని నిద్రఁబూని మతితత్వమందుట । స్వానుభవము సిద్ధిసాధ్యమగును
చానుతత్వమందుఁ దనరుటేయోగంబు । విశ్వ. 3218

ఆ. మ్రాఁకుకాలవేసి మహిమీఁద నొకజాణ । ప్రాణితిరుగుచుండెఁ బొందుగాను
కాల్చినట్టిమ్రాను కడురమ్యమైయుండె । విశ్వ. 3219

క. మ్రాఁకున ననలంబుండును । మ్రాఁకున నాయనలమువలె మనుజాళిలోనన్
డీకొని తారంజిల్లును । నేకంబగు బ్రహ్మముండు నేర్పడ వేమా. 3220

క. మ్రాకున ననలము పుట్టును । మ్రాఁకెఱుఁగునె యనలమునికి మనుజులలోనన్
మ్రాఁకున ననలము క్రియఁజీ । కాకుడిగిన యోగినెవరుఁ గానరు వేమా. 3221

ఆ. మ్రాఁకులోననగ్ని మఱియుండఁగావచ్చు । నగ్నిలోనమ్రాని కలవిగాదు
మ్రానులోనియగ్ని మర్యాదసంసారి । విశ్వ. 3222

ఆ. మ్రానిలోననగ్ని రహినుండుఁగనవచ్చు । నగ్నిలోనమ్రాని కలవియగునె
మ్రానిలోనియగ్ని మర్యాదసంసారి । విశ్వ. 3223

ఆ. మ్రానుకాలఁ బెట్టి మహిమీఁద జాణలు । పూనితిరుగుచుండ్రు పొందుగాను
కాలినట్టి మ్రాను కడురమ్యమైయుండు । విశ్వ. 3224

ఆ. మ్రాను తగినదైన మహితమూఁస్తువు । గానోనర్తునట్లు కాకయున్న
కాల్తురట్లె కాదెకా పురుషులపాట్లు । విశ్వ. 3225

ఆ. మ్రానుదిద్దవచ్చు మఱివంకలేకుండ । దిద్దవచ్చురాయి తిన్నగాను
మనసు దిద్దరాదు మహిమీఁద నెవరికి । విశ్వ. 3226

ఆ. ముచ్చు గుడికిఁబోయి ముడివిప్పనే కాని । పొసఁగస్వామిఁ జూడఁ బోఁడతండు
కుక్కయిల్లుసొచ్చి కుండలు వెతకదా । విశ్వ. 3227

ఆ. ముచ్చు యాత్రకేగ ముల్లెవిడుచుగాని । మొక్కబ్రోద్దు లేదు మునసియెప్పుడు
కుక్కయిల్లు సొచ్చి కుండలువెదకునా । విశ్వ. 3228

ఆ. మృగమదమ్ము చూడ మీఁద నల్లగనుండుఁ । బరిఢవిల్లువాని పరిమళంబు
గురువులైనవారి గుణము లీలాగురా । విశ్వ. 3229

ఆ. మృగము మృగములనుచు మృగములదూషింతురు । మృగముకన్నఁ జెడుగు మూర్ఖుఁడౌను
మృగమునకగు గుణము మూర్ఖునకును లేదు । విశ్వ. 3230

ఆ. మృగములకు నరులకు మేలుగాఁ బశువులు । తినగ దున్నఁ బాలుకొనఁగఁబుట్టె
కష్టపడును వాని కర్మ మీడేరదే । విశ్వ. 3231

క. మృగములు మృగముల నమగవు । తగనడుగవు పక్షిజాతితనసరివానిన్
మగవాఁడడిగిన నీయమి । మగవాఁడా మగువగాక మహిలో వేమా. 3232

క. మృత్తిక యేతనతనువట । మృత్తిక దళ మెత్తి నిలుప మేటి వసతియా
మృత్తికయున్నది మూఁటికి । నెత్తెరువుల ధరణి మహిను నెఱుఁగరు వేమా. 3223

క. మృదుమధుర వాక్యములతో । విదితంబుగఁ దెలుపఁగోరి వివరించెదనేఁ
దుది మొదలు గుఱుతులేనిది । మడిఁ దోచెడి భయమెయనుచు మరుగుచు వేమా. 3234

తే. యజ్ఞకర్తల కేర్పడు నధికతేమో । సంజ్ఞమదియందుఁ బూనట సాధువృత్తి
మనసు మగ్నమునొందుట మననవృత్తి । తుదకు గురుసేవ యైనను దొడ్డవేమ. 3235

క. యజ్ఞములు చేయుచుండిన । సుజ్ఞానులు రంభరతులఁ జొక్కుదురనుచే
యజ్ఞానమనుచుఁ దెలిసిన । సుజ్ఞాని యెవండు చేయఁజూచుర వేమా. 3236

ఆ. యజ్ఞయాగములని యెన్ని చేసినఁగాని । ఆత్మయజ్ఞమగునె యంటిచూడ
క్రతువు చేయువారు కానంగ లేరయా । విశ్వ. 3237

తే. యజ్ఞసూత్రముఁగట్టినఁ బ్రజ్ఞయగునె । మగ్నచిత్తములోనైన మహిమఁగాంచు
బ్రహ్మమయుఁడైన వాఁడె పో బ్రాహ్మణుండు । నామమాత్రులు మేటులే తాను వేమ

తే. యంత్రతంత్రపు విద్యల యాచకులును । మంత్రవిద్యలు మఱిగిరా మహిమయేది
పండువెన్నెల బయలునఁ బ్రాకనగును । నిండుమదిఁగానఁ గలిగిన నియతి వేమ. 3239

ఆ. యదుకులమునఁ బుట్టి యాపసులనుగాయఁ । గృష్ణునకును గొప్పకీర్తిరాదె
గుణము లెక్కగాని కుల మేమి లెక్కరా । విశ్వ. 3240

క. యమనియమ యోగవృత్తులఁ । గ్రమమున గమనించి మించికడు చిత్రముగా
శ్రమ లెల్లఁ దీఱుసుమనః । ప్రముదిత పరిపూర్ణమందుఁ బరగును వేమా. 3241

సీ. యమునాజ్ఞ చేతను, నధికుఁడనఁబడియుఁ । జంద్ర కాంతముఁ జేరి, సరగమఱలి
మేఘంబుతోవచ్చి, యోగంబుతో వృష్టి । బిందువు చేతను, బృథివిఁగురియు
సస్యాదులకువచ్చి, సారంబుతిని పోకి । యింద్రియంబుల చేత, నెచ్చిమిగుల
నెలబుతువై యున్న, నెలఁత యోనింజేరి । ముద్దగట్టుచు మాంస, మునను గూడి
ప్రాణియీరీతి నెలనెలఁ, బ్రబలుఁడగుచు । మూత్రమలములఁ గొన్నాళ్లు మునిఁగియుండి
వెడలి సంసారమునఁ గల, వెతలఁ బొందు । జననమరణము లెంచంగఁ, జను నె వేమ. 3242

ఆ. యముని బాధ తీఱినప్పుడే వెడలియుఁ । బరగు చంద్రకళను సరగజేపి
క్రమముగాను జేరి కాలమేఘమునుండి । దినుసుగాను బ్రాలు క్షితిని వేమ. 3243

క. యాగము చేసిన విప్రుఁడు । భోగించును రంభతోడఁ బుత్త్రుఁడు మరలన్
యాగంబు చేయఁ దల్లిని । భోగించుటెగాదె యజ్ఞపుణ్యము వేమా. 3244

ఆ. యాత్రవోయి నాతఁడన్నాళ్లు తిరిగియుఁ । బాదమైనముక్తిపదవిఁగనఁడు
మనసు నిలిపినతఁడు మహనీయమూర్తిరా । విశ్వ. 3245

తే. యాత్రలందును ఫలమేది యాగములను । సూత్రసమముగఁ జేసినసూక్ష్మమేది
పరమహంసను గీలించి ప్రబలవలెను । పరముఁ గోరెడుమనుజుండు ధరణి వేమ.

తే. యుక్తమొనది బయలని యూహజేసి । శక్తిఁదన్మయమనియెడి ముక్తి నెఱిఁగి
భుక్తిశక్తులు మఱచుట పూర్ణపదవి । సక్తిపరమాత్మయందుంచ జగతి వేమ. 3247

తే. యుగములన్నియు నీకలియుగమునందె । తిరిగివచ్చుచునున్నట్టి తెరఁగెఱుంగు
కృతముఁద్రేతయుఁ జరుగఁగాఁ గీడొదవదు। ద్వాపరముకొద్దికలి నెచ్చు ధరను వేమ.

క. యుగములు సల్లగఁజూచుచు । తగులక యుగయుగములందుఁ దపసులకైనన్
వగవగ సేనకయుండిన । నిగనిగమనుకాంతి మదిని నిలుచుర వేమా. 3249

తే. యోగమమరిన చిత్తంబు బాగుపఱచి । రాగవైరాదులను బట్టి రంగరించి
భోగమందినవాఁడెపో పుణ్యుఁడగు మఱిగతినిగాని తరియింపఁడిట్టు వేమ. 3250

క. యోగము కష్టంబైనను । రాగద్వేషముల మించి రంగుగమది నా
భోగమునందఁగ నొప్పును । రోగపుసంసారమెపుడు రోయును వేమా. 3251

క. యోగము ముదిరిలులక్ష్యము । లాగతమునఁ దెలివి లక్ష్యమయి తా బయలౌ
రాగద్వేషక బంధము । వేగమె పాలియించి మించు విడకయ వేమా. 3252

ఆ. యోగిననుచుఁ గొంత యోగముఁ గూర్చక । జగములోనివానిఁ జంపితినుచు
ధనముకొఱకు మిగులఁదగ వాడుచుండిన। యోగిగాఁడు నాఁడె యోగు వేమా. 3253

ఆ. యోగియోగియనఁగ యోగమేమి యొనర్చు । త్యాగబుద్ధియున్న సమరుఁడౌను
దన్ను దాఁదెలిసిన దైవంబు తానాయె । విశ్వ. 3254

క. యోగులమనుచును గొందఱు । వాగుటయది లెస్సయగునె వాగ్వాదముగన్
బాగుగ మదిలో మర్మము । తాఁ గన నిఁకఁదమకపడఁడు తజ్ఞుఁడు వేమా. 3255

ఆ. యోని కడిగినేయి యుపముతోఁద్రాగుచు । నిలన్ శ్రేష్ఠులమని పలుకనేల
నిగ్గులేదుగాక నీసులో ద్విజులకు । విశ్వ. 3256

ఆ యోనిగలుగునీటి నొనరంగఁ ద్రాగిన । బ్రహ్మమతమటంచు బలుకబెట్టు
బ్రహ్మనిష్ఠపలన బ్రాహ్మణుల్గావలె । విశ్వ 3257

ఆ. యోని బంధుడనుచు నొనరజన్మము నొంది । హానివృద్ధిచేత నలసుఁడౌను
కాని దానిమాయ కడమొద తెలిసిన । పూని బ్రహ్మమందుఁ బొందు వేమ. 3258

ఆ. యోనిబోను జేసి యొడలుడంబుగఁజేసి । నాల్కనిడుపుగట్టి నమలునంచు
వివరమెఱుఁగ కేడ్చు విటులే ద్విపాదుండు । విశ్వ. 3259

ఆ. యోనియందె పుట్టి యోనికిరుచిఁ జేయు । చన్నుఁగుడిచి పెరిగి చన్నుఁబట్టు
సృష్టిలోనిప్రాణి సిగ్గేల నెఱుఁగదో । విశ్వ. 3260

ఆ. యోనిలింగమందు నుద్భవమైనట్టి । వాదమేలఁ దనకు భేదమేల
ఆది హరియె తల్లి యారుద్రుఁడే తండ్రి । విశ్వ. 3261

ఆ. యోనిలింగములను నుద్భవించినవాఁడు । వాదమేల దైవభేదమేల
తల్లివిష్ణువగును దండ్రి యీశ్వరుఁడురా । విశ్వ. 3262

ఆ. యోనిలోనఁ బుట్టు యుత్తమకులజులై । బ్రహ్మకులమునందు బ్రదుకువారు
బ్రహ్మ నెఱుఁగలేక పడిచత్తు రిదివింత । విశ్వ. 3263

ఆ. యోనిలోనఁ బుట్టి యోనిలోనె పెరిగి । యోనిలోని తెరువుఁ గానలేమి
యోనిఁ జూచి పరమ యోగంబు మఱచురా । విశ్వ. 3264

క. యౌవనంబునందు వాలిఁ గౌమారము । నందు బిడ్డల తలినాదరింతు
ముదిమి వచ్చినంత మూర్ఖుదు నుందువో । విశ్వ. 3265

ఆ. యౌవనమునఁ జూడ నదియెఱుకేలేదు । యౌవనంబు నెంతు రధిక తనువు
యౌవనంబు తనకు నరిదక ముందును । విశ్వ. 3266

ఆ. యౌవనమున నీశు ధ్యానమునను మది । నిలుపనపుడు ముందు నెగ్గఁ గర్మ
చేయుకు స్నతనికి క్షితిసౌఖ్యమే దయా । విశ్వ. 3267

తే. రక్కసులఁ బట్టి చంపెడు రాజుగాను । దశరథాధిపపట్టియై ధరణినేలె
జగతిఁ బొగడఁగ శ్రీరామజనవిభుండు । జానకీదేవి జీవితేశ్వరుఁడు వేమ. 3268

ఆ. రక్తి నెఱుఁగువాఁడు రమణుల వాంఛను । దగిలి దిరుగుచుండు ధరణిలోనఁ
దగరు వెంట నక్క తగిలిన చందమా । విశ్వ. 3269

తే. రక్తిమించిన భక్తిలో రంగుఁ దెలిసి । యందుచుండెడి పరిపూర్ణ మచలవృత్తి
చిందఁ గానీక పొందు లేచిన్మయంబు । ఎవనికిదియబ్బునాతండె శివుఁడు వేమ. 3270

ఆ. రక్తిలేని పనులు రమ్యమై యుండునా । రక్తిగలిగెనేని రాజుమెచ్చు
రాజు రక్తి నందు రమణులు మెత్తురు । విశ్వ. 3271

క. రంగుగ భ్రూమధ్యంబున । శృంగారపు రసళివిమచుఁ జిహ్వనుఁ గనుచుం
బొంగుచు నిండిన మదిలో । లింగంబును గలియుచుండు లింగువేమా. 3272

క. రచ్చను నిచ్చక మాడెడు । కుచ్చితమా లోకనింద కోవిదునకు నీ
తుచ్ఛపు గుణమును నీచపు । మచ్చరమును నున్నఁ జెఱుచు మహిలో వేమా. 3273

ఆ. రజ్జులాడ రాదు రణభూమిలోపల । బుజ్జగింపరాదు బొంకువాని
నొజ్జతోడ వాదు లొనరంగ మానరా । విశ్వ. 3274

తే. రజ్జు నహిగాను దోఁచు విరక్తి కలుగ । స్థాణువు నరుఁడుగాఁ దోఁచు సంగ తెలిఁగి
లోనియెఱుకనుజయమందఁ బూనవలెను । భ్రాంతిమాయుడై పఠించినంత వేమ. 3275

క. రజ్జువు శుక్తులుగని భ్రమ । ముజ్జగములలోని జనులు మూఢులుగారే
సజ్జనులు రజితమందురె । గజ్జెలకును రజితమగును ఘనముగ వేమా. 3276

ఆ. రటనమైన ప్రణవరావము వినిపొక్కి । నటనమాడువాఁడు నైష్ఠికుండు
చటుల చిత్కళంది చర్చించి మీఱుటే । కటికి బ్రహ్మమయము గదర వేమ. 3277

ఆ. రతియొనర్పఁ బూని సతిని వేఁడిన యట్టి । మతిని వేఁడి పరము మరుగఁ దెలిసి
గతిని గోరుచుండు ఘనయోగి లీలలోన । విశ్వ. 3278

క. రతిలేక ముదియు నంగన । రతికలిగిన ముదియు నశ్వరత్నము ధరలో
సతతము భ్రాంతిని జెందెడు । తతరతిచే ముదియు నరుఁడు తథ్యము వేమా. 3279

ఆ. రద్దిమాని మనసు రాపాడి ధ్వనిఁ జూపి । ముద్దుగులుకు నాత్మమూల మంది
సద్దు సేయకున్న సంసారయోగియే । విశ్వ. 3280

ఆ. రద్దిలేక మదిని రాజిల్లఁ జేసిన । నొద్దదగును పరము యుతముగాను
ముద్దుగుల్కు నాత్మ మూలమె పరమాత్మ । విశ్వ. 3281

క. రథమునను నైదుచీలలు । నధిపుం డమరించి నపుడె యరుగు రథమ్మా
రథతనువు చీలలయిదే । విదితంబుగ నడపువాని వెదకర వేమా. 3282

ఆ. రమణినగుచు నుండు రమణుండు నేడ్చును । రమణి సేయుచుండు నంకు మీఱి
యంకు చూడఁగాను రమ్య మాతత్వంబె । విశ్వ. 3283

ఆ. రమ్యమైన మనసు రాజసి యెంచుచు । గమ్యముగను దానిఁ గట్టుకొలిఁగి
మరిగి పూర్ణపదవి మహిలోను గానరా । విశ్వ. 3284

క. రవి కననిది కవియెఱుఁగును । కవియెఱుఁగని చోటు రవియుఁ గానడు ధరలో
రవి కన్న మిగుల నెక్కుడు । కవియై విలసిల్లు నీవు గానవె వేమా. 3285

క. రవిచంద్రగతులు మాలెడి । యువగతమును మీఱి మదిని నలకువలే కా
వివరమెఱింగిన పిమ్మట । భవహరమై తోఁచుచుండు బాగుగ వేమా. 3286

క. రవిచంద్రగతులు మీఱిన । భవహరమగు నాత్మ తేజభాగ్యము కలుగున్
శివసాయుజ్యము బ్రహ్మముఁ । గవయుట పరిపూర్ణపదవి గలుగును వేమా. 3287

తే. రవిశశాంకులుఁ దారలు రమ్యముగను । వెలుగునంతకు సత్కీర్తి వెలయఁ గోర
ధర్మవర్మనఁ దా నొప్పి ధరణిజనుల । కుపకరించిన నట్లగుచుండు వేమ. 3288

ఆ. రాక పోకలడఁచు రాజమార్గము బూని । నాక మనెడు గుబ్బ నీఁక నెత్తిఁగి
సోకి మించ బయులు సూత్రంబు గాదకో । విశ్వ. 3289

ఆ. రాక పోక లేని రాజమార్గములోన । నేకరూపుఁదలఁచి యెన్ను టరుదు
సోకిసోకి మాయ సొక్కించి యడఁచురా । విశ్వ. 3290

ఆ. రాజయోగమునను రాజత్వమును బొంది । రాజరాజు దొడ్డ రాజనంగ
రాజయోగముననె రాజశేఖరుఁ డాయె । విశ్వ. 3291

ఆ. రాజయోగ మూని తేజమందుట ముక్తి । తేజమందకున్న దేవ లరయ
మర్మరహిత గురుని మహిఁ జేరవలెనయా । విశ్వ. 3292

ఆ. రాజయోగి మహిమ రా జయోగికిఁగాక । యితర జనుల కెల్ల నేమి తెలియుఁ
దాను దేవుఁడైన దైవమే కొలుచురా । విశ్వ. 3293

ఆ. రాజవరుల కెపుడు రణరంగముల చింత । పరమమునుల కెల్ల బరము చింత
అల్పనరుల కెల్ల నతివలపైచింత । విశ్వ. 3294

ఆ. రాజసంబుఁగోరి రాజ్యభారంబందు । నోర్పులేని యాతఁ డుభయతఁజెడు
నీటి పైన గుండు నిలుచునా మునుఁగక । విశ్వ. 3295

ఆ. రాజసంబు పొంది రమణులపొందాస । పడెడు వాఁడు గురుని ప్రాపెఱుగునె
విటుల మరుగు యువతి విభుభక్తి యెఱుగునా । విశ్వ. 3296

తే. రాజసంబును మదినుంచి రక్తిమీఱఁ । దామసంబును గుర్తించి తగులఁబెట్టి
సాత్వికాంశము బూనుటే సన్మతంబు । అప్పుడౌ గుణముజదిరె ననుట వేమ. 3297

ఆ. రాజసంబు నెగడు రాజు మాటలరీతి । తిన్నఁ దనము గుమర దివ్యమాను
అట్టి తిన్నఁదనమె యవనిలో జనులకు । బెట్టు బుట్ట వలయు వేగ వేమ. 3298

ఆ. రాజు మాటఁబట్టి రాజిలు నను రీతి । తిన్నఁదనము కనఁగ దివ్యమాను
అట్టి తిన్నఁదనము నందగా జనులకుఁ । బెట్టి పుట్టవలయుఁ బృథివి వేమ. 3299

ఆ. రాజుమాటవలెనె రసికుఁడాడఁగవలె । నెంత పనికి నదికి యెగరరాదు
కదిసి యెగిరె నేని గ్రహసమానము గాదె । దొడ్డకొంచెమేల దొరకు వేమ. 3300

ఆ. రాతిప్రతిమఁ దెచ్చి రాజసంబుగ నుంచి । పూజసేయు నరుఁడు బుద్ధిమాలి
భావమందుఁ బరము భావింప నేరఁడో । విశ్వ. 3301

ఆ. రాతిబసవనిఁ గని రంగుగా మ్రొక్కుచు । రూఢిబసవనిఁగని గుద్దుచుండ్రు
బసవభక్తు లెల్లఁ బాపులు తెలవోయ । విశ్వ. 3302

ఆ. రాతి బొమ్మ కేల రంగైన వలువలు । గుళ్లుగోపురములుఁ గుంభనములును
కూడుగుడ్డ తాను గోరునా దేవుఁడు । విశ్వ. 3303

ఆ. రాతిలింగమునకు రాజులు మొదలుగా । పూజ సేయుదురు రోగిఁ బూలతోడ
ఆత్మలింగమునకు నానంద పడలేక । విశ్వ. 3304

ఆ. రాతిలోని కప్ప రక్ష్యమైయుండు నే । నీరు నన్న మచట నేరిడిరయ
పుట్టఁజేసి స్వామి పూరియే మేపునా । విశ్వ. 3305

క. రానిది కోరినరా దది । రానున్నది కోరకున్న రానే వచ్చుం
దానెంత చింత పడినను । గానున్నది గాక పోదు గదరా వేమా. 3306

ఆ. రామనామపఠనచే మహి వాల్మీకి । పాపిబోయఁడయ్యెఁ బాపఁడయ్యెఁ
కులము ఘనముగాదు గుణమే ఘనంబురా । విశ్వ. 3307

ఆ. రామభక్తులమని రాతిబొమ్మకు మ్రొక్కి । భజన సేయు నేల భక్తిలేక
భక్తి నిల్పనతఁడు భజనము సేయునా । విశ్వ. 3308

ఆ. రామమంత్రి మెఱుఁగ రహిరామునితెలిసిన । భావముఁ దలపోయఁ బ్రబలుఁడైన
నామ రూపరహిత మైనమహి వెలసిన । రామయనఁగ నొప్పు రమణవేమ. 3309

ఆ. రామరామ యనుచు రంజిల మదివేడి । రహితపడఁక మదిని రసలి వినుచు
మనసునంటి యున్న మహనీయుఁ డపుడగు । విశ్వ. 3310

ఆ. రామవిభుఁడు పుట్టి రఘుకులం బలరించెఁ । కురువిభుండు పుట్టి కులముఁ జెఱిచె
నెవరి మంచి చెడ్డ లెంచి చూచినఁదేటె । విశ్వ. 3311

ఆ. రామసచ్చరిత్రి రాక్షస హరణంబు । బంధునాశనంబు భారతంబు
అగుబసవపురాణ మది ముక్తికిఁగుదురు । విశ్వ. 3312

ఆ. రాముఁడొకఁడు పుట్టి రవికులంబీడేర్చె । కురుపతియును బుట్టి కులముఁ జెఱిచె
నిల నధర్మధర్మముల రీతి యిట్టిది । విశ్వ. 3313

ఆ. రాయియగు నహల్య రాముపాదము సోకి । యాఁడుదయ్యె ననెద రపనిజనులు
శిల్పి పదము సోక శిలలెట్లు దేవతల్ । విశ్వ. 3314

ఆ. రాయి యూరియె దైవరాయఁడు భువిలోన । భక్తి మ్రొక్కువారు బండలెకద
దేవునంతవారు భావింపభక్తులు । విశ్వ. 3315

ఆ. రాయిరాయిఁ గూర్చి రాఁగారయింగ । నున్నసైనయట్లు లన్నిపనులు
పాటుచేసినంత పరిపాటి యగునయా । విశ్వ. 3316

ఆ. ఱాయి రూపుఁ జేసి రాజుల మెప్పింప | వన్నెకెక్కువాని వైభవంబు
కర్త యెవ్వఁ డగునొ కానరు వసుధలో | విశ్వ. 3317

ఆ. ఱారపోర యుండ్రు రమణులు కాంతులఁ | బొందుగూడు వట్టి సందడులను
అట్టులనుట ప్రేమ నగుట దోసముకాదు | విశ్వ. 3318

ఆ. ఱాళ్లుదెచ్చి జనులు రమ్యమౌ గుడిఁగట్టి | ఱాతి ప్రతిమఁ జేసి ఖ్యాతిమీఱ
దేవుఁడనుచు మ్రొక్కి దీవించిపల్కునా | విశ్వ. 3319

ఆ. ఱాళ్లుదెచ్చి నరులు రమణతో గుడిఁగట్టి | తివిరి మఱొక ఱాయి దేవుఁడనుచు
సేవచేయ ఫలము చేకూరు నేమకో | విశ్వ. 3320

ఆ. ఱాళ్లపూజచేసి రాజ్య మెల్లఁ దిరిగి | కానలేరు ముక్తికాంత నెపుడు
తానయుండు చోట దైవంబు నుండదా | విశ్వ. 3321

ఆ. రుద్రరూపుఁదాల్చి రుద్రుని నిందించి | భ్రష్టు త్రోవఁ దిరుగు భ్రష్టజనులు
అంకనకుఁ దిరిగెడు రమణుల వలెనుండ్రు | విశ్వ. 3322

ఆ. రూఢిగాను భక్తి రూపించి చెప్పిన | వాఁడె పరమగురుఁడు వసుధలోన
వేడిపరముఁ గనునె వేదాంతవేద్య మా | విశ్వ. 3323

ఆ. రూఢిమదిని మించి రోదవినఁజాలక | కాఁటిఁ జేర నేల ఘనమటంచు
వీఁటిలోని రవము విన్నంద వినుచుండు | విశ్వ. 3324

ఆ. రూపమడఁగ జీవరూపంబు గనరాదు | అట్టి రూపమడఁప నలవిగాదు
బ్రహ్మ మడఁగ కున్న బ్రహ్మంబుఁ గనరాదు | విశ్వ. 3325

ఆ. రూపవంతు లల్లె రూపులు ముగ్గురు | వారివారి నెఱిఁగి గారవింప
మొదలెతా నెయున్న మోక్షంబు గల్గురా | విశ్వ. 3326

ఆ. రూపవంతులు గురురూపవంతులఁ జూడ | వారివారి నేల గారవింప
మొదలెఱుంగకున్న మోక్షంబు గల్గునా | విశ్వ. 3327

ఆ. రూపికిఁదగు జీవరూపంబు గనరాదు | అట్టి రూప మడఁగ ననువుగాదు
బ్రహ్మ మడఁగకున్న బ్రహ్మంబు గనరాదు | విశ్వ. 3328

ఆ. రూపుఁజూచి మెచ్చి రూపింప నేరక | వేదశాస్త్రములను వెదకు జేల
దాపుగా నెయున్న దర్పణమట్టుల | శివుఁడు భావమందుఁ జెలఁగు వేమ. 3329

ఆ. రూపునడకఁ జూడఁ దాపంబు పుట్టిన | భ్రాంతులంకురించు నంతలోనె
బుద్ధి మరలకున్న రద్దికి నెక్కురా | విశ్వ. 3330

ఆ. రూపుమాపు చూపు రూఢియై వెలుఁగొందు । కాపులేని తనువు కల్పతరువు
చూపుఁ గ్రింగఁద్రోసి చూడమే సుఖమురా । విశ్వ. 3331

ఆ. రూపులేని వనిత రూఢి పతివ్రత । నీటులేని వాఁడు పోటుబంటు
తెలుపవచ్చు నతఁడు దేవరబంటురా । విశ్వ. 3332

ఆ. రూపువంక పేరు రూఢిగా వెలుచును । పేరు వంక క్రియలు పెనయుచుండు
నాశమౌను దునుక నామ రూపక్రియల్ । విశ్వ. 3333

ఆ. రూపు విడక మొకట రూఢిగాఁ దాఁగన్న । దలఁచు నప్పుడెల్ల దొలఁగుచుండెని
అట్లు మెలపి కోర యోగురురూపమే । విశ్వ. 3334

ఆ. రెండు రెండు గానె యుండిన విధముల । దండి దనుసరింప నుండు సుఖము
కండ కావరమునఁ గడమదిఁ బూనినఁ । జెండుఁ గాలుఁ దట్టిచెట్టవేమ. 3335

ఆ. రెండు రెండు రెండు రెండును రెండును । రెంటి మీఁద లెక్క కంటియున్న
కొండ మీఁద లెక్క గుఱుతెఱుంగ వశంబె । విశ్వ. 3336

ఆ. రెండు రెండు రెండు రెండు రెండును వీడి । రెంటిమీఁదనున్న యొంటి లెక్క
కుండలోనఁ జూట గుణి సుఖంబున నుండు । విశ్వ. 3337

క. రెప్పలు మూసియు మూయక । తప్పక తనమనమునందుఁ దత్త్వ మెసఁగఁగా
నెప్పుడుఁ జూచెడు వానికి । చొప్పడు నచ్చటనె ముక్తిసులభము వేమా. 3338

ఆ. రేగు పుచ్చకాయ రేయెల్లఁ దన్నిన । ముఱుగ దంకకంతఁ బెరుగఁగాక
ఒరులు ఛీయనంగ నోగు సిగ్గెఱుఁగునా । విశ్వ. 3339

క. రేచక పూరక కుంభక । సూచకముల రాజయోగ సుస్థిర మతివై
లోచూపుఁ జూడ నొల్లక । వాచాబ్రహ్మంబు పలుక వలదుర వేమా. 3340

తే. రేచకములోన సూక్ష్మంబుఁ జూచి మిగిలి । పూరకంబున గమనించి పుడమిసొచ్చి
కుంభకంబున శిఖనంటి కూడుకొనర । సుస్థిరత బ్రహ్మమును గాంచుసారది వేమ.

ఆ. రేయుఁ బగలుఁ జేసి రేచకంబున మించి । దేహమందిరమున దేవుఁడుండు
దేవుఁ డొకఁడె కాని దేహంబులేదయా । విశ్వ. 3342

ఆ. రోగి నరసి నట్టి లోకోపకారులు । భోగభాగ్యములను బొందితురను
పూర్వవాసన తెగ బురమాను తావున । మోగుచుండు రట్టె మొనసి వేమ. 3343

ఆ. రోగియైనవాఁడె రోగి నెఱుంగును । రోగి నరసి చూచి రూఢిగాను
రోగికిడిన వాని రాగి బంగారౌను । విశ్వ. 3344

తే. రోతపుట్టిన మగువపై బ్రీతి దొలఁగె । నాఁటినుండియు నాకేమి పాటులేమి
కాలమునుబుచ్చనాకర్మకాలమందుఁ।గూరుచుండఁగఁగూడె నీగురుఁడు వేమ. 3345

ఆ. రోయవచ్చుఁ బరము రూఢిగాఁ దెలిసినఁ । గననైవచ్చు గుడ్లు కదలకున్న
రెప్పలార్పకున్న రెంటి సందున నుండు । విశ్వ. 3346

## ల

ఆ. లంకపోవునాడు లంకాధిపతిరాజ్య । మంతకీశసేన లాక్రమించె
చేటుకాలమైనఁ జెలుప నల్పుఁడెచాలు । విశ్వ. 3347

తే. లగ్నచిత్తములోనైన లఘువుఁదెలిసి । విలయమగు నిచ్చలోపలి విధముఁబూని
యున్నవాఁడగు ముక్తుఁడీ యుర్విలోన।పాటుపడలేమి నెట్లబ్బు ఫలము వేమ. 3348

తే. లఘువుబిగువును మదిలోన లలితముగను । జగతిఁ బవనునిఁ బట్టెడు జాణఁడగుచు
విగతజీవుని వలె నుండు విడకమదిని।సుగతియంతంత నొడఁగూడు సుమ్మి వేమ. 3349

ఆ. లంజె దానియక్క లాలించియుద్దాడు । మిండఁడరయ లంజె మీఁదనె పడు
నాడు దానిపంక నందఱుచుట్టాలె । విశ్వ. 3350

ఆ. లంజె లంజెకాని లాగెల్లఁగొనియాడు । లంజెతల్లివాని లజ్జగడుగు
తల్లిగలుగులంజెఁ దగులుట చీకాకె। విశ్వ. 3351

ఆ. లంజె లంజెయండ్రు లౌకికమందును । లంజెగాని దెవతే లాగరయఁగ
మగనిలంజె కాని మగువయు భువినున్నె । విశ్వ. 3352

ఆ. లంజె విటునిగుణము లాలించిపొగడంగ । దానితల్లియెపుడు వానిఁ దిట్టుఁ
దల్లి గలుగులంజె తరముగానిదిసుమీ । విశ్వ. 3353

ఆ. లజ్జ లజ్జయనుచు లలనలమీఁదికి । లజ్జవిడిచి తిరుగు లావరియయి
లజ్జఁ దెలిసెనేని లలనలఁ దాకునా । విశ్వ. 3354

ఆ. లయమునొందెడు శివజీవలఘువు తెలిసి । ప్రియముతోడను మదిలోన పిరిఁగొనంగ
భయదపటుపాపనాశంబుప్రతిఘటించు।నయములభియించుఁబరమందునడపు వేమ,

క. లలిత శివతత్త్వపథమున । గలిసిన శివయోగి యేలఁ గలియును జనులన్
జలబిందువు ముత్త్యమై । కలియునె తొల్లింటినీటఁ గనరా వేమా. 3356

ఆ. లలి నెనుబదినాల్గులక్షల జీవులు । బ్రిష్టా కొడుకులనుచుఁ బ్రకటితమగు
జ్ఞానముకలిగినను గలుగును మోక్షంబు । విశ్వ. 3357

ఆ. లవణమెంత దాని లాభముఁగనవెంత । కొద్దిదనుచునెన్నఁ గూడుసత్యా
భోగమేఁటికి నుపయోగంబె లెక్కఁగ । విశ్వ. 3358

ఆ. లక్ష్మిపోవునాఁడు లంకేశురాజ్యమం । దంతటఁ గపిసేన లాక్రమించెఁ
జేటుకాలమైనఁ జెఱుప నెవ్వరో యేల । విశ్వ. 3359

ఆ. లక్ష్మియేలినట్టి లంకాధిపతిపురి । పిల్లకోతిపాఱి కొల్లఁబెట్టె
కలిసివచ్చువేళ ఘనులౌదు రల్పులే । విశ్వ. 3360

ఆ. లాగివిడిచిగాలి లక్షించిమదిలోన । వేగనిలిపి నిలిపి వెలయనొక్క
సాగఁదోలి గుఱిని సాధించిచూడరా । విశ్వ. 3361

ఆ. లాఘవంబుగాను లాగివిడుచుగాలి । బాగుగానునిలుపు పరవశతను
యోగముఁ గనినంత భోగమబ్బుచునుండు । విశ్వ. 3362

క. లాలన సేయక మనసను । జాలములోఁ దగులరాదు చపలముతోడై
కాలునిఁ దోడ్కొనితెచ్చును । వీలుగ మనంబునందు వెలయుము వేమా. 3363

ఆ. లింగజీవులకును లీలలు పదివేలు । భంగమమరఁజూచి పట్టువిడక
నింగికెగయువాఁడు నిర్మలయోగియా । విశ్వ. 3364

తే. లింగ జీవుల రెంటిని భంగపెట్టి । యంగమందును లింగంబు ననువుపఱచి
సంగమేర్పడఁజూచుటే సత్యమగును । లింగధారణమిదె వేఱులేదు వేమ. 3365

ఆ. లింగ మంగమునను లీలఁదెలియువెనక । మనసులింగమందు మరుగుకొనును
మనసునిల్పనం దమఱి లింగముండురా । విశ్వ. 3366

ఆ. లింగమందుఁజూడ లీనమైయుండును । అంగమందుఁజూడ నమరియుండు
అంగ లింగ భంగ మన నేకమైయుండు । విశ్వ. 3367

ఆ. లింగమందుఁజూడ లీనమైయుండిన । నంగమందుఁజూడ నమరియుండు
లింగభావ మెఱిఁగి లీయమై యుండరు । విశ్వ. 3368

ఆ. లింగ మునిక్కఁ గానలేకయె వెలువడి । పర్వతముల కరుగుఁ బామరుండు
ముక్తిలేకతుదను మూర్ఖుఁడై చెడిపోవు । విశ్వ. 3369

ఆ. లింగము పరశివుఁడు లీలతోఁజూచిన । నంగమందె యాతఁ డమరియుండు
పరగుమనుజులెల్ల నరయ లింగములేక । పుట్టనేరరయ్య భువిని వేమ. 3370

ఆ. లింగమె భవుఁడైన నంగంబుజీవుండు । జీవి స్వచ్ఛమైనఁ జేరుశివుని
గుని దెఱఁగుల నందు నెక్కటిబ్రహ్మంబె । విశ్వ. 3371

క. లీలానంద వినోదము । జాలింబడరాదుబుద్ధి జాడ్యముచేతం
గాలాకాలమునందును । మేలుగ శివు నంటముక్తి మెలఁగుర వేమా. 3372

ఆ. లెక్కలేనియాశ లీయమైయుండఁగాఁ । దిక్కరెత్తి నరుఁడు తిరుగుఁగాక
కుక్కవంటి మనసు కూర్చుండనిచ్చునా । విశ్వ. 3373

ఆ. లేఁడులేఁడనినను లేఁడు లేనేలేఁడు । కాఁడుకాఁడటన్నఁ గానెకాఁడు
తోఁడు తోఁడనినను దోడనే తోడౌను । విశ్వ. 3374

ఆ. లేదు జగమటంచు వాదుచేయఁగవచ్చు । సోదిసెప్పరాదు సూక్ష్మమెఱిఁగి
పాదుకొల్పి బుద్ధిఁ బరికించిచూడరా । విశ్వ. 3375

ఆ. లేదులేదటన్న లేదు లేనేలేదు । కాదు కాదటన్నఁ గానెకాదు
తోడు తోడటన్నఁ దోడనే తోడౌను । విశ్వ. 3376

ఆ. లేనికాలమునకు లేనిమనమునొందు । ఈనిన పులిరీతి నెఱుఁగకుండు
కఠినబుద్ధి కిట్లు కలిమేమికల్గురా । విశ్వ. 3377

ఆ. లేమికాలమప్పుడేమేమిచేసినఁ । గలిసిరాదు ఫలము కాసుకూడ
కలిమివేళ నన్ని తులఁదూగుచుండును । విశ్వ. 3378

ఆ. లేవుసర్వమునను లీయమైయున్నాఁడ । వున్న నీయునికియె యొదపఁదుదిన
ఇటులఁగాని నీవి కెటుపరబ్రహ్మంబొ । విశ్వ. 3379

తే. లోకభావంబుఁ జూడంగ లోకమగును । ఏకరూపుని మదినెంచ నేకమగును
తాక నేర్చినమది నిల్చితత్వమగును । వీఁకనెది భావమగ్గియే వెలయువేమ. 3380

ఆ. లోకమందుఁబుట్టి లోకమందె పెరిగి । లోకవిభవమోర్వలేక జనుఁడు
లోకమందుఁ జవికి లోఁబడిచెడిపోవు । విశ్వ. 3381

ఆ. లోకమాతలక్ష్మి లోలుఁడు కృష్ణుఁడు । మోకరించి దుమికి మొనసైనసికి
పాకవైరిపట్టిఁ బాలించువేడుక । విశ్వ. 3382

క. లోకముతను ఛీయన నా । యాకీడులానర్చుచుండు నధముఁడు ధర్మం
బేకాలఁదియె తానెఱుఁగునె । కాకులుమడివస్తువెరుఁగఁ గలవా వేమా. 3383

క. లోకముమాయనిమదిలో । లోకంబునఁ గలియకుండు లోననువెలియం
భాకుష్మరిపురు గట్టుల । లోకంబుననుండు యోగలోలుఁడు వేమా. 3384

ఆ. లోకములకుగురువు లోకులకునుగురు । వదియుఁ దెలిసి మోక్ష మందఁగోరి
గురునిఁగనక నరకకూపముఁ బొందిరే । విశ్వ. 3385

ఆ. లోకములకుగురువు లోపాదులగురువు । ఆదివిశ్వకర్మ యతఁడు గురువు
గురువుఁగానలేక కూపమునఁబడిరి । విశ్వ. 3386

తే. లోకములయందువెలిగైన లోతుఁదెలియఁ । బూనినర్తించిపరిపూర్తిఁబొందువాఁడు
ఉన్నవాఁడౌను ముక్తుఁడై యుర్విలోనఁ । బరమసంతోషనిలయుఁడై పరగువేమ.

## మధురగతిరగడ.

లోకాలోకములేకానున్నది । నాకముశబ్దములేకానున్నది
రాకలుపోకలు నేకానున్నది । టాకనుజిక్కను దక్కఁగనన్నది
ఏకము నేకములేనేయన్నది । సోకినమదినేఁ దాకేదన్నది
పాకముఁదప్పక పట్టుమటన్నది । వేకువజాముననిశదమాటన్నది
సాకులేలనిఁక సత్యమటన్నది । పోకలొల్లకయు పూనుమటన్నది
ఆకారములకు నాదియటన్నది । సాకారమునకు సాక్షియటన్నది
నిత్యానందము నిర్మల మన్నది । సత్యముజయులని సంధిలుమన్నది
సాహసివేమన సరసనెయున్నది । సోహంభావము సౌఖ్యమటన్నది
నిత్యము సత్యము నిరుపమరూపము । స్తుత్యము బ్రహ్మము సూక్తికలాపము. 3388

క. లోకోపకారఫలముగ । నేకారకు మహిమలెల్ల నెవరో విశదమా
వాకారములను దెలిసిరి । యాకాశములోని దద్దనంతమువేమా. 3389

ఆ. లోతుఁజూడ నూతిలోపలఁగూడదు । లోతుఁజూడఁ బోవలోనికడఁగు
లోతదీతకెన్న లోకువగానుండు । విశ్వ. 3390

ఆ. లోతు నెఱుఁగవలదు లోకవార్ధులలోన । జాతిపిడఁగవలదు జగములోన
రోతయైన మనసు రోయుదే మోహంబు । విశ్వ. 3391

ఆ. లోనఁబదిలపఱచి లోవికారంబెల్లఁ । దరుగవున్నవాఁడు తపసిగాఁడు
వెలివికారమెల్ల విధిపాలికోర్కెలే । విశ్వ. 3392

ఆ. లోనుజూచినతఁడు లోకంబులెఱుఁగును । బయలుచూచినతఁడు పరమయోగి
తన్నుఁజూచినతఁడు తానౌను సర్వంబు । విశ్వ. 3393

ఆ. లోనుజూడఁజూడ లోకాభిరామఁబు । బయలుచూడఁజూడ బంధనంబు
తన్నుఁజూడఁజూడఁ దారకబ్రహ్మంబు । విశ్వ. 3394

ఆ. లోనుబదిలపఱచి లోనివికారముల్ । తలఁచిమెట్టువారు తెలియువారు
ఆకసమునవేడ్క నరయంగ నుందురు । విశ్వ. 3395

ఆ. లోన బయలుఁజేసి లోకంబుఁదెగటార్చి । కులముఁగాలఁబెట్టి కులముపదలి
చింతలోనిచింతఁ జేరినయోగిరా । విశ్వ. 3396

ఆ. లోభమోహములను బ్రాభవములుఁదప్పు । తలఁచినపనులెల్లఁ దప్పిచనును
తా నొకటిఁదలఁచిన దైవమొండు దలంచు । విశ్వ. 3397

ఆ. లోభివాతయైన లోకంబులోపలఁ । బరులనడుగఁబోఁడు పాలుమాలి
ఒకనికీనివాఁడె యోచింపఁబెనులోభి । విశ్వ. 3398

ఆ. లోభివానికల్మి లోలతనాసించి । బడుగువాఁడు తిరుగుఁబరిణమించు
తనదువెంటనక్క దగిలినచందాన । విశ్వ. 3399

ఆ. లోభివానిఁజంప లోకంబులోపల । మందువలదువేఱు మతమొకలదు
పైకమడుగఁజాల భగ్గునఁబడిచచ్చు । విశ్వ. 3400

## వ

క. వంచన చేసెడి యెఱుకను । మించిన పరతత్వమమరు మేలిమిగానా
నంచున గన్గొని యుండిన । సంచారములేని బయలె సతమురవేమా. 3401

క. వంచన మదిఁగల వానికి । సంచితకర్మములు విడని సందేహులకుం
బంచేంద్రియ లోలురకును । బ్రాంచితముగ నాత్మవిద్య యందదు వేమా. 3402

క. వచ్చునది పోవునదిమఱి । వచ్చెడిదియుఁ గాన లేరు వరుసయె యనుచున్
విచ్చలవిడిగాఁ దిరుఁగుచుఁ । జిచ్చునఁ బడు మిడుతవలెను జీవులో వేమా. 3403

ఆ. వంట దప్పునపుడు వంటకము విషంబు । కంటఁజూడఁగానె కంటగించు
కంటకమును దిన్నఁగడుగండమైవచ్చు । విశ్వ. 3404

ఆ. వంటవానియింట వండు వంటకమును । వంటిఁదినిన యపుడె యొకటి వచ్చు
వచ్చినట్లుగాదు వరుస నుభయులకుఁ । గంటక మగు వంటకమును వేమ. 3405

ఆ. వట్టి మమతఁ జిక్కి వావివరుసలందుఁ । దిక్కుపట్టి నరుఁడు తిరుగుఁగాని
యెక్కడి తలిదండ్రు లేమియుఁ దనకేల । విశ్వ. 3406

ఆ. వడ్డికిచ్చువాని వాకిటఁ బడుదురు । బడ్డుచిక్కి వెనుక భావపడిన
దుడ్డుకాసె కాని దొడ్డ యీవియ్యరు । విశ్వ. 3407

ఆ. వండి తెచ్చునపుడు వంటక మమృతంబు । కంటి కింపుగాను గానుపించు
పడలఁ దినిన తిండి వడిమించగను దోఁచు । విశ్వ. 3408

ఆ. వడుగు ద్విజుల కెల్లఁ గడుముఖ్య మందురు । వడుగుఁ జేసెవమని వదరుకొనుచు
గడుగుఁ ద్రావి కాకి కట్టుక ట్టున్నట్లు । విశ్వ. 3409

క. వడుగులు సేసిన ద్విజ వరు । లడుగడుగున వడుగుమంత్రి వలవడి చదువం
గడు బ్రారభ్ఘులను విడి । దడబడఁ గడ తేరలేఁడు దనరఁగ వేమా. 3410

క. పంతుకు లింగముఁ గట్టుక । పంతతమును బూతిఁబూసి శంభునిఁగన నే
పంతకుఁబుట్టిన బిడ్డలొ । యెంతయుఁ దమతండ్రిగుఱుతు లెఱుఁగరె వేమా. 3411

ఆ. పంతు లింగముగను వరుసబూడిదెఁబూసె । అంతరంగ మెఱుఁగ నంత్యజాతి
సంతబసివికొడుకు జంగముదేవరా । విశ్వ. 3412

ఆ. వదరి వదరి వదరి వాఁడు రండాయెను । తిరిగి తిరిగి తిరిగి దిమ్మరాయె
మునిఁగి మునిఁగి మునిఁగి మురిడ యై పోయెరా । విశ్వ. 3413

ఆ. వద్దనంగఁ బోదు వలెననఁ గారాదు । తాను జేసినట్టి దానఫలము
ఉల్లమందు వగవ కుండుటే యోగంబు । విశ్వ. 3414

ఆ. వనము బిలములందు వరయోగితానుండు । వనియెయందు నిండు పాకపడఁగ
తనివిదీర మదిని దలకొనిచూడరా । విశ్వ. 2415

ఆ. వనములోనఁ దిరుగు వరమౌను లైనను । మనసు కుదురకున్న మమత చేతఁ
జెడుదురన్న నూరఁ జెడుటేమి లెక్కరా । విశ్వ. 3416

ఆ. వంపు కఱ్ఱఁగాచి వంపుఁ దీర్పఁగవచ్చుఁ । గొండలన్ని పిండిఁ గొట్టవచ్చు
కఠినచిత్తు మనసు కరగింపఁగారాదు । విశ్వ. 3417

క. వరదేశిక చరణంబుల । నురమున ధరియించి మిగుల నుత్సాహముతో
గురువరుని వేడికొన్నను । బరిపూర్ణము నొక్కచూపు వసుపడ వేమా. 3418

ఆ. వరలురత్నసమితి వలెఁ గూర్చు ధాన్యంబుఁ । జక్కదంచి వండి మిక్కటముగ
సుష్టు భోజనములఁ జూరగా నిడువాఁడు । చెప్పనేల నతఁడె శివుఁడు వేమ. 3419

ఆ. వర్ణమాశ్రమముల వదరుదురు గురుగ । మరణమెఱుఁగనట్టి మాలయయ్యె
గురువనుచును జొచ్చి గుఱివెన్కఁదానాయె । విశ్వ. 3420

ఆ. వర్ణ మాశ్రమముల వరుస వరుస తీర్చి । మరణ మెఱుఁగనట్టి మాలయయ్యె
గురువు తాను జొచ్చు గుఱుతుఁ గానఁగ లేదు । విశ్వ. 3421

ఆ. వరుఁడు చక్కనైన వజ్రలగనియైనఁ । దళుకు మెఱుపు వంటి తత్వమున్న
నన్యపురుషవాంఛ యాఁడుదానికి నుండు । విశ్వ. 3422

ఆ. వలపు గలిగెనేని వనజాక్షియధరంబు । పంచదారపప్పు పాలకోవ
చూత ఫలరసంబు జుంటి సమానమా । విశ్వ 3423

ఆ. వలపుఁ జూపి మదిని వర్ణించి కానక । వెతలఁ జిక్కువాఁడు వెర్రివాఁడు
కులముఁ గోరువాఁడు గుణహీనుఁడగునయా । విశ్వ 3424

ఆ. వలపుఁ జూపి సతిని వలలొడ్డి పట్టెడు । గతిని రాజుమనసుఁగడఁ గనగునె
లోన గుట్టుఁ దెలిసి లోలతనుండరా । విశ్వ 3425

ఆ. వలపు దీరె నేని వనజాక్షి యధరంబు । ములక పంటి గిజరు ముప్పిరసము
చింతలేని వేళ జీడిసమానమా । విశ్వ 3426

ఆ. వలయునన్న రాదు వద్దన్నఁ బోవదు । తానుజేసి యున్న ధర్మఫలము
ఉల్లమందుఁ దలఁప కుండుటే యోగము । విశ్వ. 3427

ఆ. వలలుపన్ని దుష్ట వన్యమృగంబులఁ । బట్ట వచ్చుఁగాని పాడుమనసు
గురుని బోధలేక కుదిరిక కేరాదు । విశ్వ. 3428

ఆ. వల్లకొల్లదన్న వాగు లడ్డము రాఁగఁ । దుమ్ముకంపఁ దుచ్చి తోఁపఁగట్టు
దంపు గైనఁ బెట్టు ధర్మాని కోర్వఁడు । విశ్వ. 3429

ఆ. వల్లభునికి నిష్టవస్తువు లందించి । యాతని మానసమున కతికియున్న
నట్టి వనిత మంచి కట్టడి కలదగు । విశ్వ. 3430

ఆ. వల్ల వైపులేక వాగ్దత్తమటు చేసి । యదిగో యిదిగో యనుచు నాసపెట్టి
గడువు పెట్టి రేపు గడియఁ గానిమ్మని । గడియ లోనెపడియెఁ గదర వేమ. 3431

ఆ. వశముగాని యాలి వైర మేమనవచ్చు । యశము చెఱుమగాని యనువుపడదు
కొసరుటెల్ల దాని కోరిక నేతీర్చు । విశ్వ. 3432

ఆ. వసుధనొడ్డకేల వైద్యకావ్యంబులు । గ్రుడ్డివానికేల గునుకుపరుగు
బుడ్డవానికేలఁ బో కుప్పిగంతులు । విశ్వ. 3433

ఆ. వక్షమందుగురుని వర్ణించి చూడరా । రక్షకత్వమునకు రాచబాట
అక్షమాలజపమొ యావనిదొంగలరీతి । విశ్వ. 3434

ఆ. వాక్కుశుద్ధిలేని వైపగుదండాలు । పేరిమగలిగినట్టి పెట్టనేల
నోసలభక్తిగలదు నోరు తోడేలయా । విశ్వ. 3435

సీ. వాక్కుగోరునుమంచి, వాగింద్రియమ్మును । వచనక్రియంబులు, వరలఁబలుకు
చేతులుగోరును, జెలఁగుదానంబుల । నియ్యఁబుచ్చుకొనఁగ, నిరవెలుంగు

పదములుగోరును, బరగుసంచారంబు । బహుదూరమైనను, బ్రజ్వరిల్లు
మలవిసర్జనములు, మహిం గుదమెుగిగోరుఁ । బదిలంబుగానిట్టి, పద్ధతిగను
గుహ్యమునుగోరుఁ గేళినా, కోరికలను । ఇట్టికోరికలెల్లను, గట్టిపెట్టి
నిన్నుజూచెడివాఁడెపో, నిర్మలుండు।ఘనుఁడుఁ గైవల్యపదవిని, గనును వేమ. 3436

ఆ. వాక్కుచేతకర్మ వచ్చునదెఱుఁగక । వాక్కుచేత లోకవాంఛఁ బెరిఁగి
వాక్కుమర్మమెఱుఁగువాఁడెపో బ్రహ్మంబు । విశ్వ. 3437

ఆ. వాక్కుచేతఁదప్పు వావివరుస లెంచ । వాక్కుచేతఁదప్పు వనితగుణము
వాక్కుచేతఁదప్పు పరమసుఖంబులు । విశ్వ. 3438

ఆ. వాక్కునందుగురువు వక్కృతనుగురువు । చీకటినటు గురువు చిక్కియుండు
నఖిలమునకుగురువె యాధారమైయుండు । విశ్వ. 3439

ఆ. వాక్కువలనఁగలుగు పరమగుమోక్షంబు । వాక్కువలనఁగలుగు వగలుఘనత
వాక్కువలనఁగలుగు నెక్కుడైశ్వర్యముల్ । విశ్వ. 3440

ఆ. వాక్కుశుద్ధిలేనివాఁడు చండాలుండు । ప్రేమశుద్ధిలేక పెట్టు కూళ్లు
నోసటిభక్ష్యమైన నోటితోఁ దేలయా । విశ్వ. 3441

ఆ. వాఁగులడ్డుగట్టి పల్లకాలువలున్ని । మును నడిచెఱ్ఱతోవ నుండ్లుగొట్టి
వైరుపెట్టునట్టి పాపులు గలరకో । విశ్వ. 3442

తే. వాచకాదుల వర్ణింప వశముగాదు । నూతనాగ్రపు శిఖరంబుఁ జూడఁగోరి
గోచరించెడుదానిలోఁ గుఱ్ఱుఁజేరు । మాచరాచరగమ్య మందందు వేమ. 3443

ఆ. వానవిరిసి మొగము వాచినయట్టుల । వదియువదియుఁ దినఁగ మొదలువెట్టి
మరల దింక బుద్ధిమర్యాద పోయిన । విశ్వ. 3444

ఆ. వాడకుటికిలిట్టు వలవన్న నెఖవెట్టు । మగని నెత్తిఁ గొట్టు మందుఁబెట్టు
యిట్టియాలితోడ నెట్టు వేగెదరొకో । విశ్వ 3445

ఆ. వాడకుటికిలిట్టు వలవన్న నెఖపెట్టు । నుంమమగనిఁ దిట్టు మసుఁగుఁబెట్టు
గడుసువాలుమగని గంపతో నమ్మురా । విశ్వ. 3446

ఆ వాడకులములేక వనరు మనుష్యుండు । ఈనినపులిఁబోలు నైజుకనుండు
లేనివానివలెనె దీనవాక్యములాడు । విశ్వ. 3447

ఆ. వాడవదినకేల వావివర్తనములు । చాడిగానికేల జారబుద్ధి
మూఢమతులకేల ముదముతో జ్ఞానంబు । విశ్వ 3448

ఆ. వాడసత్యమెల్ల వడిసముద్రములోన । బండిసత్యమెల్ల బట్టబైట
ఆడుదానిసత్య మాడనే చెల్లురా । విశ్వ. 3449

ఆ. వాఁడువాఁడనంగ వాసికేమిర లోటు । వాఁడటంచురె దేవరుల్ఁ బొగడ
వాఁడుకాక యదియె వాఁడనఁదప్పేమి । విశ్వ. 3450

ఆ. వాఁడువాఁడుగాఁడు వానిలోపలనుండు । వాఁడెవాఁడువాఁడువాఁడుగాఁడు
వాఁడు వానిఁగూర్చువాఁడెపో బ్రహ్మంబు । విశ్వ. 3451

ఆ. వాతిగుణముచేత వగఁగన్నపుగవాఁడు । లొట్టకన్నులవాని లోలతనను
బుట్టిజగతినిలుచుఁ బునరుద్భవంబున । విశ్వ. 3452

ఆ. వాత నానుమేయు వలపలిమెడవాఁడు । ఒంటికాలియాలెఁ దొప్పుచుండు
రాజసభలయందు రంజిల్లమాట్లాడు । విశ్వ 3453

సీ. వాతపైత్యశ్లేష్మ, రీతులొకటిగాఁగ । శాత్రవమిత్రులు, సమముగాఁగ
సరవితోనన్న మా, పథములొకటిగాఁగ । స్వర్ణలోష్ఠంబులు, సమముగాఁగ
జాతిభేదంబులు, సరణినొకటిగాఁగ । కర్మధర్మంబు లొ, కటియుఁగాఁగ
ఘనసుఖదుఃఖంబు, లెనయనొకటిగాఁగ । కనదివారాత్రులొ, కటియుఁగాఁగ
దెలిసియాత్మలోన, దేదీప్యమానమౌ । తేజమందు శివునిఁ, దేటపఱచి
మనసుశివునిఁజూడ, ముక్తిత్వమొనరించు । వాఁడెపరమయోగి, వసుధ వేమ. 3454

ఆ. వాతబుద్ధిచేత వాదంబులాడఁగాఁ । బూనియుండురయ్య పుడమిలోనఁ
గర్మమార్గమునను గడతేరలేరయా । విశ్వ. 3455

ఆ. వాతమయము మేను బాల్యమునందును । యౌవనమునఁ బైత్య మావరించు
వృద్ధిశ్లేష్మమునకు వృద్ధత్వమునను । విశ్వ. 3456

ఆ. వాదమాడితిట్టు వరుసనెవ్వరినైనఁ । జేరరాదటన్నఁ జేటుఁదెచ్చు
గడుసురాలు తెలియు వడిశిలఁబోలురా । విశ్వ. 3457

క. వాదమున వడమనుఁడట । లేవనఁగా భూమిఁదిరుగు లెస్సగఁదనకే
యేదైనహానివచ్చిన । సాధనపాదంబు నడవ జరగదు వేమా. 3453

ఆ. వాన కురువకున్న వచ్చును క్షామంబు । వానకురిసెనేని వరదవారు
వరదకలవు రెండు వరుసలో చెఱుఁగుఁడీ । విశ్వ. 3459

క. వానను దడియనివారును । బూనిక వేమన్నబోధఁ బొరయనివారున్
నానాదిక్కుల వెదకినఁ । గానఁబడఁగలేరు తెలియఁగదరా వేమా 3460

ఆ. వానభయము చేత వడిమూరె పరులోన । నెండకెంత కైన నెండి చరతు
రేల లోకజనులు మేలోర్వకుందురో । విశ్వ. 3461

ఆ. వానరాకడయును ప్రాణంబు పోకడ । కానఁబడదు ఘనులకైనఁ గాని
కానఁబడిన మీఁదఁగలి యిట్లు నడచునా । విశ్వ. 3462

ఆ. వానిఁగనని వాఁడు వాఁడు కానే కాఁడు । వానిలోనివాఁడె వాఁడు సుమ్ము
వానిఁగన్నయట్టి వాఁడు తా యోగిరా । విశ్వ. 3463

ఆ. వాయువందె పుట్టి వాయువందె పెరిగి । వాయువందుఁ గీలు పరుసఁ దెలియ
వాయువందుఁ బ్రాణవాయువె తత్వంబు । విశ్వ. 3464

క. వాయువు బయలున బుట్టెను । వాయువె బయలందు నడగి వచ్చుచునుండున్
వాయువునుబట్టి కుంభక । వాయువులోఁ గలియువాఁడె వశ్యుఁడు వేమా. 3465

ఆ. వారకాంతలెల్ల వలచియేతెంతురా । పొందుఁజేసి ధనము పుచ్చుకొనక
మారకొప్పుచొచ్చి మఱియిల్లు వెడలునా । విశ్వ. 3466

ఆ. వారకాంతలెల్ల వలపించి వత్తురు । బుద్ధులెల్లఁ దోలఁగ పుచ్చుకొనుచు
మాటమాఁకగాఁగ మగలెల్ల వత్తురు । విశ్వ 3467

ఆ. వారణాసి విష్ణు వహ్ని నేత్రులమీఁద । జీవహింస గురుని త్యాగించి
తలచు నున్నవాఁడు తానైన మోక్షమా । విశ్వ. 3468

ఆ. వార్త యందుజగము వర్తించుచున్నది । అదియులేనివాఁడె యవనిపతులు
అంత్యకాలమగ్నులగుచు నుందురుగాన । వార్త నిర్వహింప వలయు వేమ. 3469

ఆ. వార్తలోనివార్తనసుమతీశునిఁ జేర్చు । వార్తలోనివార్త వశ్యుఁడగును
వార్తలోనివార్త వరకవియగునయా । విశ్వ. 3470

ఆ. వార్తలోనివార్త వైభవ మరయుక । మిట్టిపడుదు రిలను మిగుల రీతి
గట్టిఁజేసినిలుపు ఘనుఁడెపో శివయోగి । విశ్వ. 3471

ఆ. వారిలోనఁబుట్టి వారిలోనె పెరిగి । వారిఁబాసి యాను వారిఁ జేరి
కర్మమంటియున్న కారణమేమయా । విశ్వ. 3472

ఆ. వారిదీరి నడుగ వశముఁగాకుండును । పోరి గురునినడుగఁ బొందుపడును
దారిలోన నెఱుక తారొగ్గెనుచుందురా । విశ్వ. 3473

ఆ. వార్ధియందుఁబుట్టి వశముగారావచ్చు । పూర్ణదృష్టియందుఁ బూనరాదు
పూనియుఱుకమించి పొడనిన బ్రహ్మంబు । విశ్వ. 3474

ఆ. వానివర్తనలును పరుసను మర్యాదఁ । దప్పినడచె నేనిఁ దగులుఁగీడు
పదలదపుడు దానునది తప్పినం దుది । ముసలిముప్పునైన మునుఁగు వేమ. 3475

క. వికటంబుమాని భృకుటీ । నికటంబున ముక్తికాంత నేస్తైయుండి తా
నొక్కటై సమరతి యుపరతి । ప్రకటకంబుగఁ జేయునట్టి ప్రభుఁగను వేమా. 3476

క. వికలత్వమేమి లేకయ । భృకుటికి పైచూపు నిలిపి బిత్తరపోకే
యకలంకరూపమందిన । నికరంబగు మోక్షమిదియె నిజముగ వేమా. 3477

క. వికల సుఖదుఃఖములఁదాఁ । బ్రకటితముగ నెంచిచూచి ప్రజ్ఞానిధియై
కకవికలులేక మెలఁగిన । నికరంబగు బట్టబయలు నిలుచుర వేమా. 3478

తే. విఘ్నములకాదికర్తయౌ విఘ్నపతిని । విశ్వసాక్షిగ నెంచుట వినతియగును
శుద్ధచిన్మాత్రుఁడనిఁ దలంచి సాక్షివలయు । మానసారాధనమె యెక్కుడౌను వేమ.

ఆ. విజయుఁడైననరుఁడు విల్లందినప్పుడె । సుజనులైన వారు గూలిరిగద
భజన చేయఘనుఁడు పాలింపకుండునా । విశ్వ. 3480

క. విజ్ఞానదృష్టిలోనను । సుజ్ఞానదీపంబుఁబూని సూక్ష్మమునీవై
యజ్ఞానముడఁచి నిండిన । ప్రజ్ఞానము బ్రహ్మపదవి ప్రబలును వేమా. 3481

ఆ. విటుఁడు దాగుఁజేసివిడిచిపెట్టిన లంజె । పేదపెనిమిటి పడి ప్రియము సేయు
కుప్పలోనిచెప్పు కుక్కతిన్నట్లయా । వవిశ్వ. 3482

ఆ. విటుఁడు తిరిగిరోసి విడిచిపెట్టిన లంజె । బీదవిటునిఁజేరి ప్రియము సేయు.
బఁట్టు ఎడ్డకుక్క పసరంబుఁగరచదా । విశ్వ. 3483

ఆ. విటుఁడుపట్టిరోసి విడిచినలంజెను । బిదపనొకఁడు సేరెఁ బ్రియముతోను
గుడిచివేయుపుల్లె కుక్కలుదాకవా । విశ్వ. 3484

ఆ. విటుఁడు స్త్రీని రోసి విడిచిపెట్టెడువేళ । కేడనున్న నీగ్గ నెంచనేలఁ
గుడిచివేయు పుల్లగోతుల ద్రోల్లదా । విశ్వ. 3485

ఆ. విటునిఁ గన్నవలపు విశదమైయుండును । బోటిచూపునకును సాటిగలదె
కంటిలోనిపాప కుంటెనగాఁడయా । విశ్వ. 3486

ఆ. విటునిఁజేరఁగోరి వీధిలో మదినుంచు । పడతిరీతిఁబరము బ్రౌఢనగును
గుణములన్ని మించి గుప్తించిచూడరా । విశ్వ. 3487

ఆ. విటులకనులకెంత విభ్రమమ్మైలోఁచు । సాటిలేని పొలతిఁ జక్కఁదనము
కంటిలోనిపాప కుంటెనగాఁడయా । విశ్వ. 3488

ఆ. విటుల(జూడ(గానె మటుమాయ(జేయును । కిటికియందు(జేరి కేకరించు(
బటిమమీఱుస్త్రీల( బరికింపలేరయా । విశ్వ. 3489

క. విడుదలలేకయు( జూచిన । నెడతెగకయు నెఱుకమఱపు లెంచకతనలో(
బుడమిని మఱచెడు రిచ్చను । తడబడకయు( దత్త్వమంది తల(గను వేమా. 3490

క, విడువనిమాయాతమమును । గడవ(గలేరైరి జనులు కడు(జిత్రముగా
సుడిపడి పుట్టుచు( జచ్చుచు( । గడతేరుట(గానరైరి ఖలులై వేమా. 3491

ఆ. విడువముడువలేక కుడువ(గట్ట(గలేక । వెఱవులేక విద్యనోరయలేక
వడలలేనివాని నడపీను గంద్రురా । విశ్వ. 3492

ఆ, విడువవలయు నూరు విశ్రాంతిగాకున్న । విడువవలయు నాలి విఘము చేసిన
విడువవలయు రాజు విశరణిగాకున్న । విశ్వ. 3493

ఆ, వితరణంపు(జూడిక్కి విశ్వరూపము(జూచి । మతిని గడకు(దొక్కి మానవాని
సతతి మెస్సువా(డు సరసు(డీ యిలలోన । విశ్వ. 3494

ఆ, వితరణుండు తానె విజ్ఞానతప మూని । మతికి గతియటంచు మఱిగితిరుగ
సతతమాత్మయందె సందేహములురోయు । విశ్వ. 3495

ఆ, విత్తనంబుగురువు విశ్వంబులోపల( । బ్రణవమంత్రమరయ( బరమగురువు
కర్మ గురువునుమ్ము గాయత్రి మంత్రంబు । విశ్వ. 3496

ఆ విత్తనంబు గురువు విశ్వంబులోపల( । బ్రణవమంత్రమొకటి పరమగురువు
కర్మ గురువు తనకు( గారణ మాబుద్ధి । విశ్వ. 3497

ఆ. విత్త మొకరి కిచ్చు వితరణ గుణమును । జిత్త మొకరికిచ్చు చెన్నుపఱచు
బ్రిస్తు చేతలన్ని పాడైన చేతలు । విశ్వ. 3498

ఆ విత్తహీనమైన వేళయందును దల్లి । తనయులాలు సుహృదులనెను లోను
తెల్ల శత్రులగును రెండును జెడెదవు । విశ్వ. 3499

ఆ. వింతచదువుచదువ వివరింప(గా లేని । హీను(డపగుణంబు మానలే(డు
బొగ్గుపాల(గడుగ(బోవునా మలినంబు । విశ్వ. 3500

తే. వింతలుమగని మదిలోన( జింతగలుగు । నంతరంగపుగుడిలోన నంతరించి
మంతనంబున(జేరుటే మానవృత్తి । సంతసంబందు(జింతలు సమయు వేమ. 3501

క విత్తునునుమకయు( దమలో( । బొత్తున(బుట్ట(గను బొట్టుపోయి(చెఱగి
స్వేత్త గునాటనె గర్భం । బత్తెరగున విడిచిపోవు ననుభ్రుగ వేమా. 3502

ఆ. విత్తుముగ్గఁజేసి వృద్ధికా నేరదు । విత్తుముగ్గకున్న వృద్ధియగును
విత్తె విశ్వకర్మ వివరించి చూడరా । విశ్వ. 3503

ఆ. విత్తులేనియట్టి వృక్షమొక్కటి పుట్టె । ఫలము పువ్వు రెమ్మ పత్రిలేదు
స్వాదులేదు చూడ సాపాటునకు లెస్స । దీనిభావమేమి తెలుపవేమ. 3504

ఆ. విత్తు విశ్వకర్మ విశ్వంబులోపలఁ । బ్రాణియనెడి చెట్టు పరగుచుండు
నోలిఁ జెట్టు చచ్చు మూలంబు చావదు । విశ్వ. 3505

ఆ. విద్యగలిగియుండి వినయములేకున్న । నైదువలకు మేలిమైన మంగళ
సొమ్ములుండి కంఠసూత్రంబు లేనట్లు । విశ్వ. 3506

క. విద్యలలోపల నీతియు । వాద్యంబులలోన వీణ వరరసికులకున్
హృద్యంబై విలసిల్లిన । విద్యలలో బ్రహ్మవిద్య విద్యర వేమా. 3507

ఆ. విద్యలేకయున్న విత్తములేకున్న । మూర్ఖుఁడైనఁదనకు మూఁగయైన
నిష్టబంధువునకు నీ దైన్యగన్యసీ । విశ్వ. 3508

ఆ. విద్యలేనివాఁడు విద్వాంసుల కడల । నుండఁగానె పండితుండుగాఁడు
కొలని హంసలకడఁ గొక్కెర లున్నట్లు । విశ్వ. 3509

క. విదితంబగు ఘట మవిసిన । నుదితంబగు నాకసంబు నప్పర మొకటౌ
నదెవిధము విదేహంబను । సదమల కైవల్యసరణి సంపద వేమా. 3510

ఆ. విధవపొందుకూడ విధికడ్డమైయుండు । బ్రతుకు వాంఛయెల్ల భ్రమకుఁ జోటు
బ్రదుకుచావులెల్ల మెఱుకుల కాయెరా । విశ్వ. 3511

క. విధికృతమందురె యన్నియు । విధికిని విధి లెస్సయయ్యె విష్ణు నటింపన్
విధియెవ్వఁ డందురావల । విధి బ్రహ్మము తెలఁపఁ దలఁప వెలయుర వేమా. 3512

క. విధికృతము లందురన్నియు । విధికిని విధి లెస్సయయ్యె విష్ణునిఁ జంపెన్
విధి యాభవు రూపమందెను । విధి బ్రహ్మము సుమ్ము తలఁప వినరా వేమా. 3513

క. విధిలేక జరుగదనుచును । మదిలో నేవస్తువైన మనసునఁ గూడుం
బొదలుచు విడువఁగఁ జాలని । యదియే సంసారబీజ మనఁబడు వేమా. 3514

తే. వినతిసేయుచు సద్గురు వేషభక్తి । మును భ్రమరకీటకన్యాయమునను దగుచె
వాని నెన్నంగఁ దర మెయీ వసుధలోన । సాధుసన్మార్గ మదెయగు సతము వేమ. 3515

ఆ. వినర నరకమెల్ల వెలిఁ ద్రోసివాయువుల్ । మనసులోనఁ గూర్చి మర్మమెఱిఁగి
ఆత్మలింగపూజ నంటిన ముక్తిరా । విశ్వ. 3516

క. వినవలె దశవిధనాదము । కనవలె నిర్భేదపదముఁ గాంచినఁ బైఁబైఁ
గనవలె సోహంభావము । మనవలెఁ బరిపూర్ణమూని మహిలో వేమా. 3517

క. వినవలె నాదము శ్రవణలోఁ । గనవలె బ్రహ్మంబు విడక కౌతుక మొప్పం
గనవలె సోహంభావము । తనుదానై పరమునందుఁ దగులక వేమా. 3518

క. వినవలె నెవ్వరు చెప్పిన । విని నంతనె తమకపడక విచారింపవలె
న్వినికని వివరముఁ దెలిసిన । మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో వేమా. 3519

తే. విన్నదన్నది కన్నది వింతలగును । నిన్న మొన్నను గన్నది నేఁడు లేదు
అన్నిఁటను నిండియున్నది యరయవలెను । హృన్నళినమందు తానుండు నెపుడు వేమ.

ఆ. విన్నవాఁ డెవండొ కన్నవాఁ డెవ్వఁడో । విన్న కన్నవాఁడు వెలయునొకఁడె
అరసి చూడఁ బలయు నంబుధి నైనను । విశ్వ. 3521

ఆ. విన్నవానికన్నఁ గన్నవాఁ డధికుండు । కన్నవానికన్నఁ గలియువాఁడు
ఉన్నతోన్నతుఁడయి యుర్విలోపల నుండు । విశ్వ. 3522

ఆ. విన్నసుద్దికొంత విననిసుద్దులుకొన్ని । వింత సుద్దులెన్నొ వినఁగఁ దెలియుఁ
దాను గన్నయట్టి ధరలోనఁ గందురా । విశ్వ. 3523

క. విని కని పెద్దలపలుకులు । మనవలెఁ బరిపూర్తిఁ జెంది మసలక లోనే
పనుపడఁ గోరుచునుండిన । మనుజుఁడె పరిపూర్ణుఁడగును మహిలో వేమా. 3524

క. విని కలయికలను బాయును । కనికలిసిన కాంతఁ గూడి కలయుం బాయుం
గని కలియుఁ బ్రేమ పోవును । కని కొనఁగాఁ బ్రేమ యెదియొ కనరా వేమా. 3255

ఆ వినియు వినకయుండు కనియుఁ గానకయుండు । తలఁచి తలఁపకుండుఁ దానుయోగి
మనుజవరులచేత మతిపూజఁ గొనుచుండు । విశ్వ. 3526

ఆ. వినియువినకయుండు వెఱ్ఱివాఁడై యుండుఁ । గనియుఁ గానకుండుఁ గదర యోగి
మనుజవరు లతనిని మహితుఁగా నెంతురు । విశ్వ. 3527

క. వినుకరికను కరిఁ గోరును । కనుకరియా కాంతఁ గూడఁ గవయుం గోరుం
గనుఁగొనఁ బ్రేమను బొరలును । ఘనతర మోహంబుచేతఁ గదరా వేమా. 3528

క. వినుమా నిటలముఁ జేరఁగ । ఘనమగు నొకశక్తి కలదు కడుఁ జిత్రముగాఁ
గనుఁగొనదానికి నవ్వలఁ । గనకంబను జ్యోతిగలదు కనుమా వేమా. 3529

ఆ. వినుర నరకమెట్లు తనకుండనుందన్న । గురునిఁ జేరి మర్మ మెఱుఁగునంత
వీలుకలుగునతఁడు మేలుమార్గముఁ జూప । విశ్వ. 3530

ఆ. వినువివేకమనెడు వింతగొడ్డలిచేత । నలయ విద్యయనెడు నడవినఱికి
బ్రహ్మమందెఱింగి పాటించినంతట । ముక్తిఁ జూడవచ్చు మొనసి వేమ. 3531

ఆ. విప్రవరుఁడు చెడ్డ పిండంబుఁ దినఁబోవు । పేరటమునకరుగుఁ బెండ్లిపనుల
కులము మొదలుపోవఁ గూలెపోవానంబు । విశ్వ. 3532

ఆ. విప్రవరులమనుచు వేదంబుఁ జదువక । ప్రాకృతులనఁ జూచి పరిహసించు
ధరణిసురలకన్న దాసరిమతమెచ్చు । విశ్వ. 3533

ఆ. విప్రవరులమూర్తి వివరమునష్టముఁ । బెద్దలనొగిఁ గూర్చి పెండ్లి చేయు
సువిదముఁడయకా ముహూర్తము నిజమెట్లు । విశ్వ. 3534

ఆ. విప్రవరులయందు విహితకర్మములందు । నీతినంచువాఁడె నిర్మలుండు
భక్తిగలుగువాఁడె పరమార్థపరుఁడమా । విశ్వ. 3535

ఆ. విప్రునెంగిలాకు వీథికుక్కలపాలు । మాలపుల్లెయైన మానితంబు
మంతుకెక్కునాకు మాలపుల్లెయటండ్రు । విశ్వ. 3536

ఆ. విప్రులెల్లఁ గూడి వెఱ్ఱికూతలుకూసి । సతిపతులనుగూర్చి సమ్మతమున
మునుముహూర్తముంచ ముండెట్లులాయెనో । విశ్వ. 3537

ఆ. విమలచక్రమందు వింతలన్నిఁ దెలిసి । సముపుగాలిచేత సన్నుతింపఁ
గనఁగ లేదు మహిమ ఘనులకైననుగాని । విశ్వ. 3528

తే. విమలనిర్గుణతపమంది వెలువనేల । నిత్యనైమిత్తికాచారనిపుణుఁ డగుచు
దివ్యపరిపూర్ణదృక్కుంది తేజరిల్లు । ఘనులు పేర్కొందు రెల్లెడఁ గాదె వేమ. 3539

ఆ. విమలసృష్టిఁ బూని విజ్ఞానమందమి । తమముఁ బాయునగునె తథ్యముగను
దమముమీఱినంతఁ దత్త్వార్థమందురు । విశ్వ. 3540

క. విమలాంతరంగమందును । సముగతియగు నిష్ఠఁ బూని సత్యముఁ గనువే
యమమూల సంచితంబులు । కర్మముగఁ దెగ సత్యమమరుఁ గట్టిడి వేమా. 3541

ఆ. విరసరికమెల్ల వెలిమూసివాయువుల్ । మనసులోనఁ జేర్చి మర్మమెఱిఁగి
యాత్మలింగపూజ నంటినముక్తిరా । విశ్వ. 3542

ఆ. విశ్వకర్మగురువు విశ్వంబునకునెల్లఁ । బ్రణవమంత్రమొకటి పరమగురువు
కర్మకపుడుగురువు గాయత్రిమంత్రంబు । విశ్వ. 3543

ఆ. విశ్వకర్మపూజ వేడ్కలోఁ జేయఁగా । విశ్వముజననమయి వెలయుచుండు
విశ్వకర్మయాది విమలవిరాట్టగు । విశ్వ. 3544

ఆ. విశ్వకర్మ పేరు విశ్వదేవుండని । పుణ్యకార్యవిధులఁ బూజఁ జేసి
నమ్మకుండువారు నరకమునఁ బడరే । విశ్వ. 3545

ఆ. విశ్వకర్మమహిమ వినఁగ విచిత్రంబు । విశ్వకర్మమహిమ శాశ్వతంబు
విశ్వకర్మ లేమి విశ్వంబు నిలుచునా । విశ్వ. 3546

ఆ. విశ్వకర్మ లేక విశ్వంబు లేదురా । విశ్వకర్మ చేయు వెలయు నన్ని
విశ్వకర్మ లేమి విశ్వంబు పాడురా । విశ్వ. 3547

ఆ. విశ్వకర్మ లేని విశ్వంబు చూడరా । విశ్వకర్మ చేసె విశ్వమెల్ల
విశ్వకర్మ లేని విశ్వంబు లేదయా । విశ్వ. 3548

ఆ. విశ్వకర్మ లేని విశ్వంబు మతిలేదు । కుడువఁ గూడు లేదు కోక లేదు
విశ్వమయుఁడె యట్టి విభు నేలఁ దెలియరో । విశ్వ. 3549

ఆ. విశ్వకర్మ సుతులు వెలయు దేవతలెల్ల । కానక తిరిగెదరు కష్టజనులు
అట్టివారి యెంగి లందఱు తిందురే । విశ్వ. 3550

ఆ. విశ్వకర్మ సృష్టి వివరంబుగాఁ జేయ । విశ్వమంతఁ దృష్టి వెలుఁగుచుండు
విశ్వకర్మ గాదు విమలవిరాట్టయా । విశ్వ. 3551

ఆ. విశ్వతత్వమెల్ల విశదంబుగఁ దెలిసి । భక్తిమూలమెల్ల బాగుపఱచి
రక్షకత్వమందు రాజయోగివి కమ్ము । విశ్వ. 3552

ఆ. విశ్వనాథుఁడనుచు విశ్వకారణుఁడన్న । విశ్వకర్మ వేదవినుతిఁ గనును
విశ్వకర్మయాది విశ్వగురుండగు । విశ్వ. 3553

ఆ. విశ్వనాథునందు విప్రులయందును । వినయమందు వేదవిధుల యందు
భక్తిలేనివాఁడు పాపాత్ముఁ డిలలోన । విశ్వ. 3554

ఆ. విశ్వమందుఁ బరుని వివరంబుఁ గానక । పరమహంస నెట్లు పట్టనచ్చు
మానసమున నిష్ఠఁ బూనఁగ వలెఁ గాని । విశ్వ. 3555

ఆ. విశ్వమందు బ్రహ్మ విస్తరించుటగాక । వేఱె బ్రహ్మమునికి వెదక నేల
తగిలియుండెఁ గాదె తనలోనె బ్రహ్మంబు । విశ్వ. 3556

ఆ. విశ్వమనఁగ నేమొ వివరించి మాటుండి । విశ్వమైన చేత వెలయుచుండు
విశ్వము మదిలోన వెదకి వీక్షింపుఁడీ । విశ్వ. 3557

ఆ. విశ్వమున నడపంగ విశ్వేశ్వరుండుండు । బ్రాహ్మణులకు నేల పాటిదక్క-
ననములోన కోతి జనుమాలి నడపునా । విశ్వ. 3558

క. విశ్వములో వెలితానై । విశ్వాతీతుండు మఱియు విశ్వంభరుఁడై
విశ్వమునకు వేఱగుచును । విశ్వములో వెలుఁగుచుండు విదుపక వేమా. 3559

ఆ. విశ్వమూలమందు విశ్వభావముఁజెంది । పండియుండుఁ జేను బట్టబైట
పండునదియుచేను భావంబుఁదెలియరో । విశ్వ. 3560

తే. విశ్వరూపము మదిలోన వెలయఁజూచి । హరిస్వరూపమరఁగబుద్ధిని నందిపట్టి
స్వస్వరూపముఁ గనువాఁడె సజ్జనుండు । శాశ్వతానందమందఁగఁ జాలువేమ. 3561

ఆ. విశ్వరూపుఁడైన విశ్వేశ్వరుండుండు । విశ్వమందుఁదాను వెలుఁగుచుండు
విశ్వకర్తతానె విశ్వంభరుండయా । విశ్వ. 3562

సీ. విశ్వవిరాడ్రూపి, విశ్వకర్మనఁగను । విశ్వసహస్రాక్ష, విశ్వకర్మ
విశ్వరూపుఁడుత్వష్ట, విశ్వకర్మనఁగను । విశ్వదిశాంపతి, విశ్వకర్మ
యనివేదములనిట్లు, విను ప్రజ్ఞచేఁబల్కఁ । దెలిపినారే మున్ను, తేటఁబడఁగ
నావేదగోచరుం, డానిత్యవర్తియు । నావిరాణ్మయమూర్తి, యామహాత్ముఁ
డామహాదివ్యపురుషుం డ, నాదియోగ । కల్పితుండును త్రైలోక్య, కారణుండు
గుణములనెల్ల బ్రణుతియై, కొమరుఁబసుధ। వెలసెనభిరామరూపుఁడై, వినరవేమ.

ఆ. విశ్వసింపరాని విశ్వంబుమఱిలేదు । కుదువఁగూడులేదు కోకలేదు
విశ్వమయుఁడె యైన విభునేలఁదెలియరో । విశ్వ. 3564

క. విశ్వాసఘాతకులె యై । వేశ్యల మేమేయటనుచు వెలలుగొనుచు నా
శాశ్వతలాభమునొందుచు । విశ్వములోఁగొంగలనఁగ వెలసిరివేమా. 3565

క. విశ్వోత్పత్తికి నజుఁడని । విశ్వమురక్షింపఁదెంప విష్ణుండని యా
విశ్వముఁజెఱుపఁగ హరుఁడని । విశ్వేశుల కిట్టిపేర్లు వెలసెనువేమా. 3566

క. విషమును బోరసినఁ బోలియుఁడు । విషదిందీవరదళంబు విధమునమతి తా
విషయాదివర్గములలో । విషములుతనుఁబొరయకుండ వేమన నేర్పుగా. 3567

క. విషయములఁ దెరలి పోలుపుగ । విషయములంటక మహాత్మువిధమున ధరలో
విషసంసారమ్మును విడి । విషయములన్నియును గెల్వ వేమన నేర్పుగా. 3568

క. విషయములఁ బొరలి రోయక । విషమంటిన గతినిజూచు విధమున ధరలో
విషసమములాయెసుఖములు । విషయమ్ములఁగూడకుంద్రు వేత్తలువేమా. 3569

క. విషయములొరసిననొరయుఁడు । విషయేంద్రియపరదళంబు వివరింపంగా
విషమారిపట్టమును దు । ర్విషయములను బొందకుండ వేమన నేర్పుగా. 3570

తే. విషయసంబంధమూలమై వెలయుసుఖము । భూరిసంసారజలధిలోఁ బొర్లి మునిఁగి
అంగనాసక్తచిత్తులై యలరుచుండ్రు । మోహమునువీడలేకుండ్రు మునిసివేమ. 3571

ఆ. విషసహితులునరులు విషధరులెన్నఁగ । వృషభవృషణములను విఱియఁగొట్ట
నఘుమునచ్చుఁగడకు నాయువుఁ గొదవగు । విశ్వ. 3572

ఆ. విష్ణుగర్భమందు వెలసెనులోకమ్ము । లందు సకలజీవు లమరఁ గలవు
ప్రాణికోటులెల్లఁ బరగ వైష్ణవు లయా । విశ్వ. 3573

ఆ. విష్ణునంశమందు వివిధవిరక్తులు । కలుగుశక్తులెల్లఁ గాలఁద్రొక్కి
నిలచిచూపఁగాను నిశ్చలతత్త్వంబు । విశ్వ. 3574

ఆ. విష్ణుభక్తులెల్ల విభూతిపాలైరి । శివునిభక్తులెల్ల సిద్ధులైరి
భక్తులెల్ల జీవిపాలుగాఁబోయిరి । విశ్వ. 3575

ఆ. విష్ణుభక్తులెల్ల వెలిబూదిపాలైరి । వాదమేల మతవిభేద మేలఁ
వెలియలింగధరులు తిరుమంటిపాలైరి । విశ్వ. 3576

ఆ. విష్ణుయోనినాదె వివరించిచూచిన । శివుఁడులింగముగద సిద్ధముగను
రెంటికిఁ గలసంధు సంధెను బ్రహ్మంబు । విశ్వ. 3577

తే. కీలు లాగుచు గాలిని పిడిచిపెట్టి । యారుచక్రంబులం దది యమరఁబట్టి
మేరుశిఖరముపై నున్న మిహిరుఁడెవఁడు । వాఁడె బ్రహ్మంబు తెలియంగ వలయు వేమ.

ఆ. వీటిదానిపొందు విడువఁజాలనివాఁడు । చచ్చుదాక మోయుఁ జాపగుడిసె
భోగవశులపట్టు బాపంగనోపఁడు । విశ్వ. 3579

ఆ. వీడవలయువారిఁ గూడినసిగ్గగు । వీడువాడలందు వెలసివాఁడు
పాడుచేయుపనులు పరిపాటియేకదా । విశ్వ. 3580

ఆ. వీనులందువినెడి వేడుకగుటిదాటఁ । బూని ప్రణవరవళి భోరుకొనెడి
స్వానుభవముఁగోర సన్యసింపఁగవలె । విశ్వ. 3581

ఆ. వీరపరమహేశవిభవంబుఁజేపట్టి । బాహ్యవిద్యచేతఁ బరగుటెల్లు
ప్రకటించి మామెఱఁగి పోయినచందంబు । విశ్వ. 3582

ఆ. వీరశైవధర్మవిధము తెఱంగియు । బ్రహ్మవిద్యమీఁదఁ బరగెనేని
చెలఁగిపులికిబంటు సింగపుఁబిల్ల యగా । విశ్వ. 3583

ఆ. వీరుఁడైనరాదు వినయ మున్ననురాదు । చదువులందురాదు సటలరాదు
జన్మపాకమునను సఫలమౌ నరులకు । విశ్వ. 3584

ఆ. వీరుఁడైనలేదు విద్యనేర్చినలేదు । సత్కులమునలేదు సటలలేదు
జన్మఫలమె కాని జపియించినను రాదు । విశ్వ. 3585

ఆ. పీలుగ జడలు పులితోలు విభూతియుఁ । గక్షపాలలు పదిలక్షలైన
మోతచేటె కాని మోక్షంబు లేదయా । విశ్వ. 3586

ఆ. వెడగువేత్తయనుచు వినఁ గనరీఁదరుల్ । వేయుమార్గములను వేలు పఱఁడె
అతఁడు సృష్టికర్తయంతకు గురుఁడెన్న । నతనిఁ దెలియుటది యరయ వేమ. 3587

ఆ. వెడలివచ్చువేళ వెనుకఁ బోయెడివేళ । తేను లేదు కొంచుఁ బోను బోదు
ధన మొదటి కరుగునో తా నెందుఁ బోవునో । విశ్వ. 3588

ఆ. వెడలివచ్చువాఁడు వెనుకపోయెడువాఁడు । వెంటరాదు ధనము జంటకాదు
తానెటకుఁబోవు ధనమెటఁబోవురా । విశ్వ. 3589

ఆ. వెండికొండపసిడికొండయుఁ దనకుండ । దేవుఁడేలఁ బోయె తిరిపెమెత్తె
అతఁ డెంతటిఘనుఁడైన నడుగకుండఁ । దిరదయ్యభువిని తివిరి వేమ. 3590

ఆ. వెతకి కానలేఁడు వేదాంతవేద్యుఁడు । తత్త్వవేత్త లేఁడు ధరణిలోనఁ
గలిగెనే నతండు కనఁబోవ పుటి లేఁడు । విశ్వ. 3591

ఆ. వెతకి కానరేరు వేదాంతివేద్యుని । నుత్తముండె కాంచు నుర్విమీఁద
కలిగెనే నతనిని గానంగలేరయా । విశ్వ. 3592

ఆ. వెతలుదీర్చువాఁడు వేదాంతవేద్యుండు । రతులనేలువాఁడు రమణుఁడగును
సతినిబెనఁగువాఁడు సంసారియోగిరా । విశ్వ. 3593

ఆ. వెతలుపుట్టిచచ్చు వివరమెఱుంగక । తుకిమటురీతి జారుఁడగును
గతికి హితవుఁగనఁడు కామాతురుండయి । విశ్వ. 3594

ఆ. వెదక వెదక దొరకు వేదాంతవేద్యుండు । వెదకువానిఁ దాను వెదకుచుండు
వెదక నేర్చునట్టి వెరపర్లుగలరకో । విశ్వ. 3595

ఆ. వెదకి వెదకి వెదకి వేసరి వేసారి । తిరిగి తిరిగి తిరిగి దిమ్మతిరిగి
బొమ్మలాటఁ జూచి పోఁబడిఁ గంటిరా । విశ్వ. 3596

ఆ. వెన్న చేతఁబట్టి వివరంబు తెలియక । ఘృతముఁ గోరునట్టి యతనిభంగి
తాను దైవమయ్యు దైవంబుఁ దలఁచునే । విశ్వ. 3597

ఆ. వెనకఁ జూతమన్న వెసనుగష్టపుగుంట । ముందు జూత మన్న ముచ్చికిగుంట
నడుమఁ జూచి నరులు వేడుకపడుదురు । విశ్వ. 3598

ఆ. వెన్నఁ దగిలియుండు కన్నుఁ గానని వాఁడు । చిన్నవాఁటినుండి చెలిమిఁ జూపు
అన్నదమ్ములకును నాప్తుఁడై యుండురా । విశ్వ. 3599

ఆ. వెన్నెలనిలుచుండి వేపాకుపడ వేసి । యడ్డసరపు రసము నందుఁ బోసి
కరుగఁ గాఁగి యుపరి కాంచనం బగునయా । విశ్వ. 3600

క. వెయ్యేరు నదుల జలములు । తియ్యక మఱి మునుఁగఁ బోవఁ దిప్పట కాదా
కొయ్యగులాముకు జ్ఞానము । వెయ్యేనను దెలుపరాదు వినరా వేమా. 3601

క. వెయ్యేల నడువవల దీక్ష । నయ్యా రామయ్య నయము నజహరిహరులున్
వెయ్యేండ్లు తప మొనర్చిన । నియ్యెరు మోక్షంబు భువిని హితవుగ వేమా. 3602

ఆ. వెఱపులేక గురుని వేడుచు వేసారి । స్థిరముగాను బూజ చేసి చేసి
పరముఁ గన్నవాఁడు పరిపూర్ణయోగిరా । విశ్వ. 3603

క. వెఱవని మదిదృఢవిజ్ఞత । పరమును గమకించిలోనఁ బదిలముగాఁగన్
స్థిరరూప మంది పొందెడు । గుఱియగు పరిపూర్ణమందుఁ గూడర వేమా. 3604

క. వెఱవవలెఁ బాపమునకును । వెఱవఁగవలె మరణమునకు విశ్వములోనన్
మఱవఁగవలె సంగముల । మఱి మఱవంగవలదు మేలు మహిలో వేమా. 3605

క. వెఱవవలెఁ బాపములకును । వెఱవఁగవలె ఋణములకును విశ్వములోనన్
మఱవవలెఁ బరుల నేరము । మఱవంగా వలదు మేలు మహిలో వేమా. 3606

ఆ. వెఱ్ఱివక్కలవలె వేదములు దవిరే । యాశ్రమంబు లెఱుఁగ రయ్యగాండ్రు
వేదసారమంత వేమన యెఱుఁగును । విశ్వ. 3607

ఆ. వెఱ్ఱిబట్టువాని విషయంబు లధికంబు । చెడ్డముండమూసుగు చెలఁగి పెట్టు
చెడి పెకాపుకు మిగులఁ జేయు నాచారంబు । విశ్వ. 3608

ఆ. వెఱ్ఱిముద్దుకేల వేదశాస్త్రంబులు । ముద్దులాడికేల ముసలిమగఁడు
వద్దిమిగుల నింట సంసార మేలరా । విశ్వ. 3609

ఆ. వెఱ్ఱివానికైన వేషధారికైన । రోగికైనఁ బరమయోగికైన
స్త్రీలఁ జూచినపుడు చిత్తంబు రంజిల్లు । విశ్వ. 3610

ఆ. వెఱ్ఱివేషములను వేసికొని తిరుగఁ । గఱ్ఱికుక్కతెలుపు గాదుసుమ్మి
పుఱ్ఱెలోనిగుణము పుడ్పింపఁ జనవలె । విశ్వ. 3611

ఆ. వెలఁది చక్కఁదనము వెఱ్ఱవైన యీడును । విభునికరుణలేమి విగతి నుండు
నీదు కరుణలేమి నేర్పులుకొఱగావు । విశ్వ. 3612

ఆ. వెలఁదిసొంపుఁజూచి విఱ్ఱవీఁగుటలేల । గలికిగుణముగాదె కారణంబు
చలనచిత్తవృత్తి జారిణికేయబ్బు । విశ్వ. 3613

క. వెలయాలి వలనఁగూరిమి । కలుగదుమఱి కలిగెనేని గడతేరదురా
పలుగురు నడచెడు తెరువునఁ । బులుమొలవదు మొలిచెనేని బొదలదు వేమా. 3614

తే. వెల్లసక్కలయెంగిలి విశదమాయెఁ । బిడుదువేశ్యలయెంగిలి ప్రాప్తమాయెఁ
జెడుగుయెంగిలి యంతయు శ్రేష్ఠమాయె । నిష్ఠగురువారి యెంగిలే యెగ్గు వేమ. 3615

తే. వెలిప్రపంచాది వృత్తులఁ గలియనొల్ల । మనసుమాయలనెల్లను మాపిసొక్క
సత్యసమదృష్టిఁ బూనుట సమ్మతంబు । సాధుహితమును బరదముసతము వేమ. 3616

ఆ. వెలివసింపుమందు వెఱ్ఱికులమువారు । తానిపోనిపసులు కలిగెనందు
తాముతానలేని తరబడిఘనుమైన । విశ్వ. 3617

క. వేసుక మునిలోఁ జూడక । తోడగువారు యెఱుకమీఱి త్రొక్కుడుపడకా
జాడను మెలఁచినవాఁడే । వేడుకఁ బరతత్త్వమంది వెలయును వేమా. 3618

ఆ. వేసుచున్నయుస్త్రి వినయంబుఁ జూపుచు । గోతదింపుసుమ్ము కొండెగాఁడు
చేర్వరాదు వానిఁ జెఱచును దుదకెట్లొ । విశ్వ. 3619

తే. వేదగీతంబులను మించి వెలయువాని । నాదబిందువు కళలంటి నయముగాను
సాధకంబునఁ జొచ్చుటే సమ్మతంబు । జన్మసార్థక్య మప్డనఁ జనును వేమ. 3620

క. వేదంబనఁగా వాదము । వేదంబుల నంటియుండు వెన్నుఁడు శివుఁడు
న్నాదిఁ దగు మూలమందును । భేదాభేదములు లేవు పేర్కొన వేమా. 3621

క. వేదంబుఁ జదివివిప్రులు । వాదంబులు మానితమరు వస్తువుఁ గనిరా
మోదంబు నంటితమలో । భేదంబుల నడఁచువారె పెద్దలు వేమా. 3622

క. వేదంబుఁ జదివినంతట । వాదంబుల కొఱకె శాస్త్రవాంఛలు గలుగున్
భేదంబు కలిగినంతట । లేదందురు దానఫలము లేశము వేమా. 3623

ఆ. వేదమునుజదివియు విఱ్ఱవీగుటెకాని । యడుగుగతికెవచ్చె రంప తోట్లు
బ్రహ్మమహిమఁ దెలిసి బ్రతికిన బ్రతుకయా । విశ్వ. 3624

క. వేదము బాపనిమాటలె । వేదాంతము పట్టుఁగొమ్మ విబుధులకెల్ల
న్నాదిమముఖవచనం బిది । సాధకముని జనులకెల్లఁ జాటర వేమా. 3625

ఆ. వేదములను జదివి పరవేమిగాంచిరి । యరిగి తిరిగి పత్తు రంద లెంజ్లె
బ్రహ్మమహిమఁ దెలిసి బ్రతుకుట నిజమయా । విశ్వ. 3626

తే. వేదములలోనియుక్తిని వెలయఁజూచి । యోధయైయున్న వానికి నుపముతోడు
వాదులేకయు మదిలోని వైరినడఁచి । యిష్టులనుగూర్చి తాఁ గనుఁబుష్టి వేమ. 3627

ఆ. వేదమూలమెల్ల విశ్వకర్మయెయని । వేదములనుబల్కు విధముఁదెలిసి
నమ్మకుండువారు నరకమునఁబడరె । విశ్వ. 3628

క. వేదమెపుడు విడిమాటలె । వేదార్థంబెన్నఁ జదువు విప్రులకెల్లన్
భేదము ఖండనవిధమని । సాదరముగ జగతిలోనఁ జాటర వేమా. 3629

ఆ. వేదవిద్యగాదు వీరవిద్యయుఁగాదు । బాధవిద్యగాదు పరువుగాదు
మధురమైనయుక్తి మనసునిల్పెడివిద్య । సాధువిద్యయెన్న జగతి వేమ. 3630

ఆ. వేదవిద్యలెల్ల వేశ్యలవంటివి । భ్రమలఁబెట్టి తేట పడఁగనీవు
గుప్తవిద్యయొకటి కులకాంతవంటిది । విశ్వ. 3631

ఆ. వేదవిప్రులెల్ల విశ్వోపకారులు । సాక్షియున్నవాఁడు జగతిలోన
సంకరకులజులును సర్వోత్తములె చూడ । విశ్వ. 3632

తే. వేదశాస్త్రపురాణముల్ వెదక నేల । నాది తుదియును లేనిదె యచలమగును
సాదుమదిలోన వెలిగెడు సత్వహాను । పాదములఁ గానరాకుండినరలు వేమ. 3633

ఆ. వేదశాస్త్రములను విడివిగాఁదానేర్చి । వాదమాడువాఁడు వట్టివాఁడు
సారమైనగుణము సాక్షిగా నెంచఁడు । విశ్వ. 3634

ఆ. వేదసారమెల్ల వెదకి తాఁజూచియు । లీనమైనబ్రహ్మ రీతిఁదెలిసి
పరముఁగనెడువాఁడె పరమగురుండౌను । విశ్వ. 3635

క. వేదాంతసారగుణసం । పాదితుఁడగు గురుని వేడి పరిపూర్ణుఁడవై
మోదంబున గుతిమించిన । సాధనలో ముక్తిగలుగు సత్యము వేమా. 3636

## తత్త్వపదము.

వేదాతీతుఁడు వేమనరా । వేమనమాటలు వేదమురా
వేదశాస్త్రములు వాదమురా । వాదులనోళ్లను బూదియెరా
విసువక చదివిన విందురురా । విన్నవారు కన కన్నరురా
కన్నది చెప్పఁగఁ గడఁగఁడురా । చెప్పినదెవ్వఁడుఁ జేయఁడురా
చేసినవాఁడే సిద్ధుఁడురా । సిద్ధులమాట ప్రసిద్ధమురా
జాతరజాతర జాతరరా । జాత్యాతీతుఁడు వేమనరా. 3637

క. వేదాంతుల మని కొందఱు । వాదములకు నడుముఁగట్టి వత్తురె వారల్
సాదులు గారని చెప్పఁగ । భేదగుణం బొకటె గుణము పెద్దది వేమా. 3638

ఆ. వేనవేలు చేరి వెఱ్ఱికుక్కలవలె । అర్థహీనవేద మఱచుచుంద్రు
కంఠశోష కాని కలిగెడిఫల మేమి । విశ్వ. 3639

ఆ. వేపఁగొలిఁ జేసి వెన్నెలలోనుంచి । యాకుపసరె యింత యమరఁబోయ
వేడిదీఱ వెనుక వేగ హేమం బగు । విశ్వ. 3640

ఆ. వేమఁడిట్లు చెప్పు వేలుపద్యంబులు । తప్పులెన్నియున్న నొప్పియుండుఁ
దత్తరపడ కందుఁ జిత్తమ్ము నిల్పరా । విశ్వ. 3641

క. వేమన చెప్పినకల్పం । బేమానవుఁడైనఁ గాని యెద నూహింపం
దామసమేటికి గల్గును । వేమనయే సిద్ధుఁడౌను వినరా వేమా. 3642

క. వేమన చెప్పినపద్యము । సామంబునఁ జదివినట్టి సజ్జను లెల్లన్
సోమన తలఁగలయాతని । నేమంబునఁ జూతురయ్య నేర్పున వేమా 3643

క. వేమన చెప్పినమాటలు । సామంబున సకలవేద సారంబుగదా
సామెత పంచాక్షరిలో । నీమహిమలు దెలియుంట యింపన వేమా. 3644

ఆ. వేమ నన్నఁగ యోగి వెలసెలోకములోనఁ । బూజలిడుఁడు పుణ్యపురుషులార
పూజలిడినయంత భుక్తిముక్తుల నిచ్చు । విశ్వ. 3645

క. వేమ న్నన్నా నాకును । నీమహిమను సత్పదంబు నేఁడు లభించెన్
రామునుతో సరిదేశము । నేమంబునఁ గానమెందు నిజముగ వేమా. 3646

క. వేమన్నా నీమహిమల । నేమన్నను దెలియనింక నెటువలెనన్నా
వేమన్నా నీచిత్తం । బేమన్నను నీవెమాకు నిఁకగతి యన్నా. 3647

ఆ. వేముకన్న విషము వెఱ్ఱిపుచ్ఛధరిత్రి । పాముకన్న విషము ప్రథమశాఖ
వాభికన్న విషము నల్లనిబాపఁడు । విశ్వ. 3648

ఆ. వేముచెక్కఁ దిన్న విషరోగములువాయు । దేహకాంతిగలుగు దృఢముఁగలుగు
తినఁగఁ దినఁగనదియె తీయఁగానుండును । విశ్వ. 3649

ఆ. వేముఁబాలువోసి వేయేండ్లు పెంచినఁ । జేదువిడిచి తీపిఁ జెందనటుల
నోగుగుణము వీడె యుచితజ్ఞుఁ డగునెట్లు । విశ్వ. 3650

తే. వేయుక్రతువులు పనిలేదు వేడ్కమీఱఁ । జేయుక్రియలెల్ల గురుభక్తి చిత్తమందుఁ
బాయకుండుటె ముక్తికి బాటయగును । న్యాయమగుమార్గ మిద్దియా నవనివేమ.

ఆ. వేయుపద్యములు వివేకియై భక్తితోఁ । బఠనఁజేసినట్టి భక్తులకును
బాయకుండు మోక్షపద మరచేతిదై । విశ్వ. 3652

ఆ. వేయువిధము లమర వేమనపద్యంబు । లర్థమిచ్చువాని నరసినంత
చూడఁజూడఁగలుగుఁ జోద్యమౌజ్ఞానంబు । విశ్వ. 3653

ఆ. వేరుపురుగుచేరి వృక్షంబుఁ జెఱుచును । చీడపురుగుచేరి చెట్టుఁజెఱుచు
కుచ్చితుండుచేరి గుణవంతుఁజెఱుచురా । విశ్వ. 3654

ఆ. వేలకొలఁది భువిని వేషముల్దాల్తురు । ప్రాలుమాలి బువ్వఫలముకొఱకు
మేలుగాదుమదిని మిన్నందియుండరా । విశ్వ. 3655

ఆ. వేశ్యకు నుదయించు వివరమంద తెఱంగి । శేషిఋషనఁగ వేఱెయామహిమమునఁ
బరగు బ్రహ్మమెఱుఁగఁబట్టిన దశగదా । విశ్వ. 3656

ఆ. వేషధారినెపుడు విశ్వసింపఁగరాదు । వేషమంత దోష విధమెఱుఁగరె
రట్టుకాదె మునుపు రావణువేషంబు । విశ్వ. 3657

ఆ. వేషధారి యొకఁడు వెలయుపంపులఁ గూర్చు । నూటకొక్కఁడులను నూతఁగలిపి
కల్లుమ్రిచ్చుతాను గట్టునా మోహంబు । విశ్వ. 3658

ఆ. వేషబాషలింకఁ గాషాయవస్త్రముల్ । బోడినెత్తు లొప్పఁ బొరయుచుండ్రి
తలలుబోడులైనఁ దలఁపులు బోడులా । విశ్వ. 3659

తే. వేషములు పొట్టకొఱకయి వేయవచ్చు । ధరణి నిజగురు భక్తిని దలఁగకుండ
నీవుఁగొని యాడిసేవింప నెవరితరము । పూర్వపుణ్యఫలంబునఁబొసఁగువేమ. 3660

ఆ. వేషమొనరఁగట్టి వెలయు శూద్రత్వంబు । తనకు లేదనుకొను ధరణిద్విజుఁడు
అరిది గిట్టువేళనడగు ద్విజత్వంబు । విశ్వ. 3661

ఆ. వైరముడిగి పరము వర్ణించి మదిమించి । పురముఁజేరు నీకుఁబొసఁగుఁబదవి
తరముగాని దదియె తమకించి దాటరా । విశ్వ. 3662

ఆ. వైశ్యులమని యనెడి వార్తమాత్రమె కాని । దొంగ లింత కన్న దొరక రెందు
నేలమీఁద వీరి నేర్పుల నేమందు । విశ్వ. 3663

ఆ. వైష్ణవులను వట్టి వార్తమాత్రమె కాని । ప్రజలఁజెఱుతురయ్య భ్రష్టులగను
కష్టనరులఁకెల్లఁ గలుగునా మోక్షంబు । విశ్వ. 3664

ఆ. వ్యాధికలిగెనేని వైద్యునిచేతను । మందుఁ దినక కాని మానదెందుఁ
జెంత దీపమిడక చీకటి పాయునా । విశ్వ. 3665

ఆ. వ్యాధిపీడితంబు వ్యసనసంతాపంబు । దుఃఖసంభవమునఁ దొడరు భయము
లేని వారలుండ రేనాఁటికైనను । విశ్వ. 3666

ఆ. వ్యాధి వచ్చినపుడు వైద్యునిచే మందు । తీసి తినక కాని తీఱదెందు
మందువంటి మనసు మనుజుఁడు కనవలె । విశ్వ. 3667

ఆ. వ్యాధి ఱుఁగనివాని వైద్యం బదేలనో । కొదవఁ దెలియలేని కోర్కెలేల
మనసుఁ దెలియ లేక మరుజ్ఞానమేలరా । విశ్వ. 3668

క. వ్యాపించియున్నలోకముఁ । బ్రాపింపక గురుని వేడి బహుతంత్రములం
జూపించు మనసు నిల్పుము । రూపంబగు బట్టబయలు రూఢిర వేమా. 3669

ఆ. వ్యాసపక్షముఖుల వ్యాపారములు చూడ । శివునిదూషకులను సిగ్గులేదె
కుంకబోడిఁ జూచి బంకాడ నేర్తురే । విశ్వ. 3670

ఆ. వ్రతము లాచరింప నట్టి కష్టమెకాని । బ్రతుకు మీఁద నాశ పడుటయేల
వ్రతముచేత గురుని వెతకంగలేరయా । విశ్వ. 3671

ఆ. వ్రతము లెన్నియైన నట్టిచిక్కులెకాని । యాత్మచిక్కుఁగాన నలవికాదు
ఆత్మచిక్కుఁబాపు నతఁడెపో ఘనయోగి । విశ్వ. 3672

ఆ. వ్రాతవంటఁగాని వరమీఁడు దైవంబు । చేతకొలఁదిఁగాని వ్రాతగాదు
వ్రాతకజుఁడు కర్త చేతకుఁ దాఁ గర్త । విశ్వ. 3673

తే. వ్రాయనేర్చినఁ జదివిన వశము గాదు । చేయవలె బుద్ధి నొక్కఁడు చేష్టమీఱి
నాయఁబ్రొక్కినవాఁడెపో మహితుఁడరయ । కాయశోషణ మొనరింపఁగనఁడు వేమ.

## శ

ఉ. శక్తికొలంది నాప్రజలు శ్రద్ధగ నెప్పుడు గూడి పాడఁగా
శక్తిగ నున్న పాటయని రమ్యముతో దుత విన్న వ్రాసినన్
ముక్తియనంగఁ జెల్వొనరు మోక్షప్రదాయియె నీకుఁ జేసరున్
భక్తిని జెన్మయంబునను బాదుగఁ జేర్చిన నందు వేమనా. 3675

ఆ. శక్తితోడవచ్చె శంకరాచార్యులు । విశ్వకర్మ మీఱ వెలయఁ బోరెఁ
గడఁగి విశ్వకర్మ ఘనుఁడని మెచ్చెరా । విశ్వ. 3676

ఆ. శక్తిపూజచేసి సరవిఁ గుంభముఁ బోసి । మ్రొక్కుచుండు వేళఁ గుక్కయేడ్వ
నూరుపాడటంచు నూరెల్ల నేడ్తురే । విశ్వ. 3677

ఆ. శక్తిమహిమ సోకి చెడిరయా పురుషులు । ముక్తిమహిమెఱుఁగని మూఢులగుచు
ఆదిశక్తి కూడ నన్యాయమై పోయె । విశ్వ. 3678

క. శతమాత్రము పంచాక్షరి । మిత మెట్లనొ తెలిసికట్టి మేదిని ప్రజకు
సతతముఁ జేసరు మోక్షము । శితికంఠుని పురములోన సిద్ధము వేమా. 3679

క. శతసంఖ్య పద్యములనే । మతిమంతుఁడు పఠన సేయు మమతగదుఱఁగా
నతఁడుగన నాల్గుపదవులు । శితికంఠుని పదముఁ జేరు సిద్ధము వేమా. 3680

తే. శత్రుజయమంది మదిలోన సఖ్యపడఁగ । శాశ్వతంబగు పరిపూర్ణసరణిఁ దెలిసి
నిత్యనిర్గుణ మందుచు నెగడుమయ్య । ముక్తి యటు చేతిపండవు మందు వేమ. 3681

ఆ. శత్రువర్గ మరసి సరగున ఖండించి । మిత్రవర్గమునకు మేలుఁ జేసి
పండి వెలుఁగుఁ జూచి పిండమధ్యంబున । వార్తి నిలుచునతఁడె హరుఁడు వేమ. 3682

ఆ. శత్రువర్గములను శరముచేఁ గూల్చెడి । పరముఁ గోరి గురుని వార్తఁ దెలిసి
తరముఁగానఁ బరముఁ దాకుచే తత్వంబు । విశ్వ. 3683

ఆ. శత్రువులను ద్రుంచి శాంతంబు వహియించి । కృత్యములను నడపు నిత్యనెజేఁగి
సత్యమడగకుండ సాధించినటువంటి । పురుషుఁడౌను పుణ్యపరుఁడు వేమ. 3684

ఆ. శనియె చాలదనుచు ననిరంట విప్రులు । శనికిఁ జాలని దది కనఁగ లేదు
కర్మఫలమె మిగులఁ గష్టము లిడుపురా । విశ్వ. 3685

తే. శర్వు నెంచుచు మది నిల్పి సతముగాను । పర్వమించని ప్రజ్ఞలోఁ బట్టువిడక
నిర్వహించుట ముక్తికి నెలవదగును । సర్వవిహితం బిదియె కాదె జగతి వేమ 3686

క. శాఖలు లోనై జగమున । శోకం గనఁదిరుగుచుండ్రు సొంపుగఁదమలో
లోకాకారుని నెఱుఁగక । మాకున్నది శాఖయనుచు మసిగిరి వేమా. 3687

తే. శాంత మమరెడి చిత్తంబు సంగ్రహించి । చిత్తవిశ్రాంతి నొందిన యుత్తమునకు
దేవదేవుఁడు తెలివొందఁ దేటపడును । దానపుడు పరశివుఁడనఁ దనరు వేమ. 3688

ఆ. శాంత మానసమునఁ జల్లనై శీతల । భాతి నున్నవాఁడు పరమయోగి
అట్టివాఁడు ముక్తి నతివేగఁ గైకొను । విశ్వ. 3689

క. శాంతమున నన్ని పనులును । సంతోషంబునను గూడు సత్యము జయమౌఁ
బంతము చెల్లును ధర్మజుఁ । డెంతేని ప్రయాసముల జయింపఁడె వేమా. 3690

ఆ. శాంతమె జనుల కెటు జయముఁ బొందించును । శాంతమున నె గురునిఁ జేరవచ్చు
శాంతభావమహిమ సరిఁ జెప్పరాదయా । విశ్వ. 3691

ఆ. శాంతశమదమాది సద్గుణములతోడఁ । దెలివి మధ్యగురునిఁ దేటపఱుప
నింపుపూర్ణుఁ డైన నిర్మలుం డెవ్వఁడో । విశ్వ. 3692

తే. శాంతిసమకూర్చి నంతట సత్యమమరు । సత్యమమరిన గురుభక్తి శాశ్వతమగు
నిల్పునిలలోని జనులకు నిరతిశయము । గౌరవముదాననన్నిటఁ గలుగు వేమ. 3693

ఆ. శాశ్వతంపుదేజ సమలక్ష్యమునఁ జూచి । యాశవిడని నాఁడె యధముఁడగును
కాశిజేరఁగానె కలుగునా మోక్షంబు । విశ్వ. 3694

ఆ. శ్వాసలాగివిడిచి సాధింప నేర్చిన । మోసపోక ముక్తిమూటఁగట్టు
దోసకారిగుణము గాసిఁ జెందకపోదు । విశ్వ. 3695

ఆ. శిలను బ్రతిమఁజేసి చీకటింటను బెట్టి । మ్రొక్కవలదు వెఱ్ఱిమూఢులార
ఉల్లమందు బ్రహ్మముండుటఁ దెలియరో । విశ్వ. 3696

ఆ. శిలలఁ జూచి నరులు శివుఁడని భావింత్రు । శిలలు శిలలెకాని శివుఁడు గాఁడు
తనములోని శివునిఁ దా నేలఁదెలియఁడో । విశ్వ. 3697

ఆ. శిలలు దేవతలని చెలరేగి చెలరేగి । మొనసి పూజసేయు మూర్ఖులార
జీవులందెకాని శిలలందు నేనుండు । విశ్వ. 3698

ఆ. శిలలుదేవతలని స్థిరముగా రూపించి । మంటిపాలెయ్యైరి మనుజులెల్ల
మంటిలోని రాళ్ల మదిలోనఁ దెలియరో । విశ్వ. 3699

ఆ. శిలలు మహితములుగఁ జెన్నొందధర హెచ్చు । నెత్తి (బెట్టికొందు) నీతలైనఁ
దేవమెప్పునపుడె దివ్యమందురుగదా । విశ్వ. 3700

క. శిలవృక్షలతలఁబుట్టిన । జలజాక్షులు ముగురు గూడి చతురతతోడం
దలవాకిట రతిసేయఁగ । నిలజనులకు లక్ష్మికలుగు నెల్లెడ వేమా. 3701

ఆ. శిల్పికన్న గురుఁడు నీమ నెవ్వఁడు లేఁడు । శిల్పి చెప్పిన గుణి నీమ కెల్ల
శిల్పిఁ దిట్టిన యెడ శ్రీశుని దూషించి । నట్టుగాదె వినుమ యవని వేమ. 3702

ఆ. శిల్పిఁకన్న గురువు నీమ నెవ్వఁడులేఁడు । శిల్పి చేయు గురువునీమ వెలసె
శిల్పినింద చేయ శ్రీగురు నన్నట్లు । విశ్వ. 3703

క. శివకవులకు నవకవులకు । శివభక్తికిఁ దత్త్వమునకుఁ జింతామణికిన్
శివలోకప్రముఖులకును । శివునకు గురువునకు శరణు సేయర వేమా. 3704

ఆ. శివభజనలవారు భువి మంటిపాలైరి । వాదమేల దైవభేద మేల
విష్ణుభక్తులెల్ల విను భూతిపాలైరి । విశ్వ. 3705

ఆ. శివమతమున కెల్లఁ జెలఁగు హరిగురువు । హరిమతమున కెల్ల హరుఁడుగురువు
గురువుఁ దెలియనట్టి గుణమేమి గుణితయా । విశ్వ. 3706

ఆ. శివమతమున కైన వివరింపఁగ గురువు । హరిమతమున కైన నరయ గురువు
గురువు నెఱుఁగలేని గుణహీనుఁ డెఱుఁగునా । విశ్వ. 3707

క. 'శివ' యను రెండక్షరములు । భువిలో నెవఁడైనఁ గాని పొలుపుదలిర్పం
దవిలి యొకనూఱు మాఱులు । ప్రవిమలముగ వల్లెవేయఁ బరముఁడు వేమా. 3708

ఆ. శివపరంబులేక శ్రుతివాదముల చేత । సంశయంబు చెడదు సాధులకును
చిత్రదీపమునను జీకటి పాయునా । విశ్వ. 3709

క. శివుగుడిని దీపమిడినను । శివమందిర మెల్ల వెలుఁగఁ జేయునె కావే
శివయోగి జ్ఞానదీపము । భువనంబులు వెలుఁగఁ జేయుఁ బొలుపుగ వేమా. 3710

క. శివుఁగూర్చి దీపమిడినను । శివమందిరమందు జ్యోతి స్థిరమగు టరుదా
శివయోగి కమలహృదయము । దివిదళములు లేపుచుండుఁ దెలియర వేమా. 3711

ఆ. శివుఁడు గలఁడటంచు శిలలకు మ్రొక్కెడు । వెఱ్ఱిజీవులార వెతలు విడుఁడి
జీవులందె కాక శిలలనే యున్నది । విశ్వ. 3712

ఆ. శివుఁడు బ్రహ్మ యనుచు స్మృతులెల్లఁ బలుకంగ । పరులఁ గొల్చునేల బ్రాహ్మణుండు
హరుని భక్తులెల్ల నగ్రజన్ములు కారె । విశ్వ. 3713

ఆ. శివుఁడు బ్రహ్మ యనుచు స్మృతులెల్ల బలుకంగ । వేఱు దైవములను వెలియఁ గొల్చి
శిష్టజనులు కూడ భ్రష్టులై పోయిరే । విశ్వ. 3414

ఆ. శివుఁడు మూలకర్త సృష్టి యె విష్ణుండు । విష్ణువందు శివుఁడు వెలయుచుండు
శివునియందు హరియుఁ జెలఁగుచు నుండురా । విశ్వ. 3715

ఆ. శివుఁడు పూలదుంప సృష్టిచే విష్ణువు । విష్ణువనఁగ శివుఁడు వెలుఁగుఁదానె
శివుఁడు విష్ణువనఁగ శివరూపనామముల్ । విశ్వ. 3716

ఆ. శివునిమంత్రమెయగు శ్రీహరిమంత్రము । తెలిసి తెలియ లేరు తిక్కనరులు
దేవునిమరచి తను దేహమే యనుదురు । విశ్వ. 3717

ఆ. శివునిమీఁద మనసు స్థిరముగా నుండిన । నౌను మోక్ష మరయ నా నవౌను
శివునిమీఁద మనసు చీమంత తప్పినఁ । గాదు కాదు ముక్తి కాదు వేమ. 3718

ఆ. శివుని యనుభవంబు సృష్టిలోపల లేక । సంశయం బుడుగదు సాధకులకు
వెలుఁగు దివ్వె లేక చీకటి వాయునా । విశ్వ. 3719

ఆ. శిసువు నరసిపట్టి చేటలో నేపెట్టి । కడమ క్రియముఁ జేసి ఘనతతోడ
నడచుదినములెల్ల నానాఁటికిట్లని । తెలియఁ జేసెనప్పుడు దృఢత వేమ. 3720

ఆ. శిష్యవర్గమునకు శివుఁజూప నేరక । కాసిమతములోనఁ గలుపునట్టి
గురుని యెఱుకనరయు గుడ్డెద్దు జొన్నరా । విశ్వ. 3721

తే. శీఘ్రగమనములో మించిచిన్మయంబుఁ । దాకిపరిపూర్తిఁ జెందును ధన్యుఁడరయఁ
బరమపరిపూర్ణపదవిలోఁ బ్రబలునయ్య । నిర్గుణబ్రహ్మ మనఁగని నెగడ వేమ. 3722

ఆ. శీలమనుచు నరుఁడు సిగ్గింతయునులేక । పరుల సొమ్ములెల్లఁ బరిహరింప
వేషభాషవలన మోసంబుసేయుచు । గ్రాసవాసమందుఁ గదర వేమ. 3723

క. శీలముగల సుందరితన । యాలైనను స్వర్గమేల నైహికసుఖమే
శీలగుసతి దుశ్శీలగఁ । గాలునిపట్టుమాత యగును గదరా వేమా. 3724

క. శుకయోగీంద్రుఁడు తనలోఁ । బ్రకటితముగఁ బూర్ణమంది బ్రహ్మాన్వితుఁడై
యకలంకభావపరుఁడై । నికరంబుగ వెలయుచుండె నిజముగ వేమా. 3725

ఆ. శుక్ల మరయఁ జూడ శుభ్ర మౌ తెలుపగు । నరయ శోణితంబె యలరు నెఱుపు
తెలుపు నెఱుపు రెండుఁ దేజరిల్లెడు నాత్మ । విశ్వ. 3726

ఆ. శుక్లశోణితములు శోధింపనీరదె । నవ్యకర్దమంబు నారమొకద
నారమం దొదవిరి నారాయణుఁడు నరుల్ । విశ్వ. 3727

తే. శుద్ధ చిన్మాత్రపరతత్త్వసుఖముఁ గోరి । ముద్దుగుల్కెడు నాత్మను మూలమెఱిఁగి
సద్దుసేయుఁగఁ బూర్ణుఁడై సంచరించు । సిద్ధయోగికి సరిలేరు చెప్ప వేమ. 3728

ఆ. శుద్ధ దృష్టిఁ దెలిసి శుక్రునంతటివాఁడు । పట్టలేక మనసు పారవిడిచి
కన్నువోఁ బిదపఁ గాకిచందంబయ్యె । విశ్వ. 3729

తే. శుద్ధనిర్గుణపరిపూర్ణసిద్ధిఁ గోరి । యమలనిర్గుణ చింతన నంది పిదప
నభ్యసింపుము తపమాని యనుదినంబు । నిర్గుణబ్రహ్మ మాత్మలో నెగడు వేమ 3730

తే. శుద్ధపరిపూర్ణదృష్టిలో సుస్థిరముగ । నిండి నిర్గుణమందుట నిర్మలంబు
గద్దెపైఁ జేరి బ్రహ్మంబుఁ గాంచనగును । సుద్దులేఁటికి గురుఁ జేరఁ జూడు వేమ. 3731

ఆ. శుద్ధు లెల్లఁగూడి శోధించి శోధించి । శుద్ధిఁజేసి యుక్కుసున్న మొసఁగి
శుద్ధికిఁ బ్రథమంబు సున్నమే కాదయా । విశ్వ. 3732

ఆ. శుష్కబుద్ధి చేత శుశ్రూషలొల్లని । నిష్ఠఁబట్టి యేమి నిజమెఱింగెఁ
గష్టమైనవిద్య ఖలులకు నబ్బునా । విశ్వ. 3733

ఆ. శూద్రతనముపోయె శూద్రుఁడఁ గానని । ద్విజుఁ డనుకొనుటెల్ల తెలివిలేమి
ఇత్తడెసఁగు పసిడి కీడనవచ్చునా । విశ్వ. 3734

ఆ. శూద్రశూద్రియనుచు శూద్రులనోనాడు । శూద్రులను తన్నుఁ జూట్టకొనఁగ
మనసుశుద్ధిలేక మతిద్విజుఁడెట్లౌను । విశ్వ. 3735

ఆ. శూద్రుశ్రీరాలికొడుకు శుద్ధాంతరంగుఁడై । వేదవేద్యమైన పాదుఁదెలిసి
బ్రహ్మపదవిఁ గన్న బ్రాహ్మణాగ్రజుఁడాయె । విశ్వ. 3736

ఆ. శూద్రులనుచు భువిని శూద్రులఁ బోనాడు । మాలకన్నదుడుకు మహినిలేఁడు
నరకమునకు నేగు నష్టమైనవెనుక । విశ్వ. 3737

ఆ. శూద్రులందుఁ బుట్టి శూద్రులదూషించి । ద్విజులమనెదు పేరు నిజముచేసి
మనసునిల్పకున్న మహిశూద్రుఁ డధముండు । విశ్వ. 3738

ఆ. శూలిఁ దెంచి మదిని శుద్ధాంతరంగుఁడై । కాలకర్మములను గాలఁద్రొక్కి
మేలుపూర్ణపదవి మెచ్చుచు శివయోగి । విశ్వ. 3739

క. శృంగారవతులకింటను । బంగారము వంటిపతులు పరమప్రియులై
రఁగుగశోభిలుచున్నను । దొంగవిటులఁ గోరనేమి దొమ్మర వేమా. 3740

క. శోణితము కామసతులకుఁ । బ్రాణితముగ శుక్లమగును బహుపురుషులకుం
బ్రాణము తెలుపెఱుపుఁ గలియఁ । గా నగు నీదేహగంధి ఘనముగు వేమా. 3741

ఆ. శైవవైష్ణవాది షణ్మతములకెల్ల । దేవుఁ డొక్కఁ డనుచు దెలియలేరు
తమకు భేదమైనఁ దత్వంబు భేదమా । విశ్వ. 3742

ఆ. శ్రద్ధతోడ గురునిసన్నిధిఁ జేరినఁ । బద్ధతిఁ దగుఁ బరము సద్రిక్తైన
బుద్ధిచెడరినంతఁ బూర్వపక్షంబగు । విశ్వ. 3743

క. శ్రమపడు వేలర మదిలో । విమలంబగు దృష్టిఁబూని వివరించినచో
నమనస్కభావపరమగు । సమమగుపరిపూర్ణ మమరుసత్యము వేమా. 3744

ఆ. శ్రవణపుటము లున్న సార్థక్యమేమిరా । వినఁగవలయుఁ బెద్దలనెడిపన్ని
వినఁగ వినఁగ నీకె విశదంబు లౌసుమ్మి । విశ్వ. 3745

సీ. శ్రవణములోర్కరును, సంగీతసాహిత్య । భావాదులైనట్టి, పలుకులెల్లఁ
జర్మంబు గోరును, సరవితోడను శైత్య । మృదులోష్ణకాఠిన్య, ములనెయెపుడుఁ
గన్నులుగోరును, గరమొప్పవర్ణంబు । లైనట్టిరూపము, ల్వారుసతోడ
నాలుకగోరును, నయముగాఁదీయన । యొగరుకారము చేదు, నుప్పుపులుసు
ముక్కుగోరును గంధము, ల్మదముతోడఁ । జెవులు చర్మంబుకన్నులు, జిహ్వముక్కు
లిన్నిగలిగిన దిటువంటి దెల్లమోసి । తన్నుఁగనుఁగొన ఘటియింపఁ దగును వేమ.

తే. శ్రీకరంబుగ వేమనచెప్పినట్టి । పద్యములనెవ్వఁడేనియుఁ బఠనసేయు
నట్టిపురుషుఁడు మనమున నిట్టిదనుచుఁ । జెప్పరానట్టివస్తువుఁ జేరు వేమ. 3747

తే. శ్రీకరంబుగ వేమనచెప్పినట్టి । పద్యముల నెవ్వఁడేనియుఁ బఠనసేయు
నట్టి పురుషుని మహిమలనిట్టిదనుచు । మనకుఁ జెప్పంగ శక్యమే మహిని వేమ. 3748

ఆ. శ్రీకరశివతత్త్వ శీలుఁడౌ వేమన । ప్రకటమగు వేయుపద్యములను
లోకమందుఁ జదివి లోవెలిఁ బాయరో । విశ్వ. 3749

క. శ్రీకరు బ్రహ్మాకారునిఁ । బ్రకటముగ మదినిజేర్చి ప్రణవాకృతిలోఁ
సోకినటించెడు జ్ఞప్తిని । బాకముగని దాటువాఁడె భక్తుఁడు వేమా. 3750

తే. శ్రీకరుండగు వేమనచెప్పినట్టి । వేలకొలదుల పద్యము ల్వివరమెఱుఁగు
పురుషవరునకు సిద్ధించుఁ బరమపదము । అనుభవములని వర్ణింపనగుర వేమ. 3751

క. శ్రీమంతులైనవారలు । సామాన్యజనాళి నెటుల సఖ్యతఁ గందే?
పామరగుణ మదికాదా । తామే మేటుల మటనట తప్పర వేమా. 3752

క. శ్రీమ దుమాపతియగు నా । స్వామికి దాసుం డనంగ జగములు పొగడన్
వేమనయనియెడు ధీరుఁడు । నేమంబునఁ జెప్పెదీని నిక్కము వేమా. 3753

క. శ్రీమూలశక్తి యనఁ దగు । నామూర్తులఁ గన్నతల్లి యాఁ గా దన శా
ధీమూర్తి నెంచిచూడుము । నీమూర్తికి సాటియేమొ నిజముగ వేమా. 3754

క. శ్రీయనముఁగళదేవత । శ్రీయనఁగా విష్ణుపత్ని సిరిసంపదయున్
శ్రీయనెడు మూలశక్తిని । శ్రీయని వర్ణింపుమెపుడు స్థిరమతి వేమా. 3755

క. శ్రీరామయనెడు మంత్రము । తారకమని యెఱిఁగి మదిని ధ్యానపరుండై
సారముఁ గోరెడు నరునకుఁ । జేరువఁదగి పరమపదవి చేకురు వేమా. 3756

క. శ్రీరామరామ నామము । మఱవక వినునరునకు మహితాత్ముఁడవై
యూరూరఁ దిరిగి చెప్పుమి । యారూఢతపఃఫలద మదగునని వేమా. 3757

తే. శ్రుతిమునకుదోచరవమున శ్రోత్రియుఁ డగు। మతిని లోగుట్టు లోపలిగతి నెఱింగి
నంతఁ బరిపూర్ణభావంబునందునాతఁ।డరయబ్రహ్మర్షికినిసాటి యగుర వేమ. 3758

క. శ్రుతి దృష్టాంతములేకయె । మతిహీనులు పల్కినట్టి మాటలుచూడన్
సతమని నమ్మఁగ రాదం। దతులితమగు పూర్ణపదవి యందదు వేమా. 3759

## ష

క. షట్చక్రములకు నావల । షట్చింతలు విడువముక్తి షడ్గుణనిధియై
షట్ఛాయలందుఁ బొందుట । షట్చత్రములై వెలుంగు షట్కము వేమా. 3760

37

ఆ. షట్పదంబు లేల ఝుంకారములు సేయు । నెగురఁ గలిగినట్టి పొగరె కాదె
తాను చూడ నెంత తనబ్రదు కెంతరా । విశ్వ. 3761

ఆ. షడ్రుచులును వేలు సార మెల్ల నొకండె । నిష్ఠ వేరు గాని నీతి యొకటె
పరమభక్తి వేలు భవుఁ డొక్కఁడే సుమీ । విశ్వ. 3762

తే. షడ్రుచులు వేలు ధరలోన సార మొకటె । సకలమతములు వేల్వేలు సాధ్యుఁ డొకఁడె
భక్తులు గనఁగ వేలైన బ్రాప్యుఁ డొకఁడె । సువలయంబున దీనిఁ గైకొనుము వేమ. 3763

తే. షండుఁ డుర్విని బ్రదికిన సరసుఁ డగునె । దండి వాఁ డన్న భ్రమ జూపు నిందు గాను
కొండలోపలఁ జేరిన గండఁ డగునె । నిందు పరిపూర్ణ మంద నితండు వేమ. 3764

ఆ. షేకు సైదు మొగలు షెలఁగు పఠానులు । తురకల దొరతనముఁ దొలుకఁ జేసి
రాఁగ రాఁగ విడిచి రైతులై కొలచిరి । విశ్వ. 3765

ఆ. షోడశాక్షరముల శోధించి మది నెంచి । గూఢభావమాని కుదియఁ బట్టి
వేడుకలర ముక్తి విన్నంది చూడరా । విశ్వ. 3766

ఆ. షోడశోపచారశూన్యప్రచారముల్ । భక్తి లేక పాడ ఫలము గలదె
నిక్కమైన భక్తి మొక్కిన నేచాలు । విశ్వ. 3767

## స

ఆ. సకలకల్మషములు సమ్మతింతురె చేయ । విప్రులేల నిట్లు వెఱ్ఱులైరో
కాలగతినె యిట్టి కడగండ్లు పుట్టెరా । విశ్వ. 3768

ఆ. సకలజాతిపురుష సాంకర్యమునకును । సతుల నిచ్చి తాము సమ్మతింత్రె
ఉంపు నెకనలేని యోగులు బాపలా । విశ్వ. 3769

ఆ. సకలజీవములను సమముగా నుండెడి । యతని క్రియముఁ దెలియు నతఁడె యోగి
అతఁడ నీవె యనుట నన్యంపు గాఁడయా । విశ్వ. 3770

ఆ. సకల తనువు లెత్తి సంచరించును జీవి । కలిమి బలిమి తగిలి కలవరించు
నాత్మతేజమాని యచ్చుగాఁ జూడరా । విశ్వ. 3771

ఆ. సకలతీర్థములను సకలయజ్ఞంబులఁ । దలలు గొరుగకున్న ఫలము గలదె
మంత్రజలముకన్న మంగలిజల మెచ్చు । విశ్వ. 3772

ఆ. సకలధర్మములకు శంభుండె యధిపతి । శంభువునకు ముక్తి సౌఖ్యమేది
తఱమతోఁ దిరుగు తజి భ్రష్టులౌదురే । విశ్వ. 3773

క. సకలంబై తాఁబుట్టును । సకలము నొక్కటికిఁగాను సర్వముఁదానౌ
వికటం బైతినజంపుని ! యకటా యావస్తువెవ్వ రందుర వేమా. 3774

క. సకలము నాకలికోఱకే । నికరంబుగఁ బెట్టెమనకు నీచపుగుణముల్
సకలం బందువసించెడి । యకలంకుఁడె యేమివింతో యరయర వేమా. 3775

క. సకలము నిర్గుణచింతను । వికలంబును జెందకీవు విజ్ఞానివె యై
ప్రకటించి మెలఁగునంతట । సకలంకునిఁ గాంచుటదియె యమలము వేమా. 3776

ఆ. సకలయోగములకు శంభుండెయధిపతి । ఆమహేశ్వరునకు నధికుఁడేడి
తఱచుతోఁ బ్రవలరిగి తమి భ్రష్టులౌదురు । విశ్వ. 3777

ఆ. సకలరూపమాత్మ సాక్షిలోనెంచుట । నికరమైనబయలు నిర్ణయంబు
వికలమింతలేక వెలుఁగును దత్త్వంబు ! విశ్వ. 3778

ఆ. సకలరూపములకు సాక్షితానైయుండు । సకలసముఁడు చూడ సమముగాను
వికలమేమిలేక వెలిగించికానరో । విశ్వ. 3779

ఆ. సకలవస్తుజాతి సంతతితనువునఁ । బుట్టెనందుఁ బ్రపంచభూతములని
దానిచేతఁదా ముదరపోషణము చేయు । వారు నిజమెఱుంగలేరు వేమ. 3780

ఆ. సకలవస్తువులను సంతతతనువుల । పుసు రిఁకేడఁ బంచభూతములును
దానిదానిచేతఁ దగుభూషణము చేయు । నేమిలేదుసుఖము నెఱుఁగు వేమ. 3781

ఆ. సకలవస్తువులును సంతతతనువులుఁ । బుట్టిపోవు పంచభూతములర
గాలివచ్చిపోవు కైవడినుండురా । విశ్వ. 3782

ఆ. సకలవిద్యలఁగని సంతోషపడవచ్చుఁ । జేయిసాచి కాసునీయలేఁడు
చెలఁగి యొరులకైనఁ జెప్పవచ్చునుగాని । తాము చేయలేరు ధరను వేమ. 3783

ఆ. సకలవిద్యలందు సంపన్నులైయున్న । యట్టివారుఁ బరిచయమునఁ జౌక
వెరటిచెట్టుమందుఁ బరికింపమెచ్చరు । విశ్వ. 3784

ఆ. సకలవిద్యలెఱిఁగి చచ్చిబ్రదుకువిద్య । యొకటి నేరమనుచు సర్వజనులు
కటకటఁ బడుదురె కడహానిఁ జెలియరు । విశ్వ. 3785

సీ. సకలవేదంబుల, సారమైవిలసిల్లు । సద్గురువాక్యంబు, సత్యముగను
మదిలోనసద్భక్తి, మఱవకచేసిన । మమతలు విడునయ్య, మహితముగను
చిత్తవిభ్రమఁ బాసి, చిన్మాత్రమందఁగఁ । జేరికొల్చినముక్తి, చేరువగును
హరిహరాదులకైన, నలవిగానిది బయ । లనుభవవేద్యమై, యలరనగును

అట్టి సద్బోధమర్మంబు, నరయవలెను । మనసులోఁ గల్మషంబులు, మానవలెను
శీఘ్రకాలంబులో నాత్మ, సిద్ధియగును । నిత్య సంతోషనిలయుఁడై, నెగడు వేమ.

తే. సకలశాస్త్ర పురాణము ల్చదివివిన్నఁ । గలదు లేదని తెలియక కలిమిచేతఁ
గులుకుచుండెడి జనులకు గుణము రాదు । తెలియుదనిచేర గురుబోధ తెలుపు వేమ.

ఆ. సకలశాస్త్రములను జదివియు వ్రాసియుఁ । దెలియఁగలరు చావుఁ దెలియలేరు
చావుఁదెలియలేని చదువు ల వేలరా । విశ్వ. 3788

ఆ. సకలశాస్త్రములను సంపుటంబులువ్రాసి । చదువనేర్చిరైనఁ జా వెఱుఁగరు
చావెఱుఁగని చదువు చదువంగ నేలనో । విశ్వ. 3789

తే. సకలశివరూపతత్వంబు సంస్మరించి । వికల మేమియు లేకుండ విశదుఁడగుచు
నికరమగు నిండుబ్రహ్మంబు నెమకవలెను । సుకరమగుయుక్తి చేకుఱు సొరిది వేమ.

ఆ. సకలసంపదలను సారస్యమెఱుఁగని । వంచెఁగల మనువు వాడిపోవు
సమములేనిమనువు చక్కగానందునా । విశ్వ. 3791

క. సకలాకారుఁ డనంతుఁడు । సకలాత్ములయందు సర్వసాక్షియుఁ దానౌ
సకలగతి నిర్వికారుం । డకలంకస్థితిని బ్రహ్మ మనఁబడు వేమా. 3792

క. సక్తిని మదిలోఁబూనియు । భక్తిని సాధింపనగును బలుతెఱఁగులుగా
యుక్తిని మదిలోఁ జెనిచిన । ముక్తికి భంగంబె యగును మొఁగిచెడ వేమా. 3793

ఆ సక్తిమానుపనులు చక్కగానెరవేరు । భక్తిగలుగుపూజ ఫలమునిచ్చు
యుక్తిగలుగుమాట యొప్పునురా భువి । విశ్వ. 3794

ఆ. సక్తులైనవారు సాగింత్రు కార్యముల్ । రక్తికోలఁది నవియు రమ్యములగు
ముక్తికొఱకు విధులు ముదమునఁ జేయరా । విశ్వ. 3795

తే. సఖుఁడు తోడయ్యె నన్నను సంతసింత్రు । వికలమొందరు నిజమిది వెగటుకాదు
నికరపు టెఱుక తోడైన సుకరములుగ । సకలకార్యంబులొప్పు నిజంబు వేమ. 3796

ఆ. సగరుఁడుర్వి రాజచక్రవర్తియటంచు । పరులు తన్నుఁబొగడ బ్రదుకుచుండె
నిట్టిఘనతవీరి కెందున కయ్యెరా । విశ్వ. 3797

తే. సగుణనిర్గుణభేదార్థసంశయంబు । పరమగురునాజ్ఞ చేఁగాక పట్టువిడదు
అగణితంబుగ మదిలోన నందవలెను । వాదములు సేయ నెచ్చగు వసుధ వేమ. 3798

క. సగుణంబనఁగా లేనిదె । సగుణంబన నదియె మోహజాలములెల్లన్
సగుణంబు మఱచి నీలోఁ । దగులుట నిర్గుణముదారి తలకొన వేమా. 3799

చ. సగుణము నాత్మలోపలను సన్నుతి సేయక భక్తి కల్గునే
జగమున నెట్టివారికిని శాంతము గల్గినఁ గాక కల్గునే
సగుణము మీటి మానసపు సత్తువఁజింత నొనర్ప కున్నఁ దా
నగణితమైన యోగిపద మందెడు మార్గమురాదు వేమనా. 3800

క. సగుణమె లోకములన్నియు । సగుణంబె త్రిమూర్తులాది సకలసురేశుల్
సగుణమె జ్ఞప్తికి మూలము । సగుణమె నిర్గుణపు దారి సమకొను వేమా. 3801

తే. సచ్చిదానందమగు జ్ఞప్తి సరవిఁజేరి । మెచ్చిచిన్మాత్రిమాశక్తి మేనుమఱచి
నిశ్చలత నున్నవాఁడెపో నిత్యయోగి । నిశ్చలాత్మని శివుఁడనవచ్చు వేమ. 3802

క. సంచితకర్మము ద్రుంపను । మించఁగ లేరెవ్వ జనులు మెలకువతోడం
బంచశరు నింట గెలిచెడు । సంచెఱిఁగిన తత్త్వవేత్త సరసుడు వేమా. 3803

ఆ. సజ్జనుల చెలిమియె చాలింపఁగారాదు । ప్రకృతి నెఱుఁగకున్న భక్తి లేదు
పలువ రెట్టిరీతి భక్తి నిల్పుదు రయా । విశ్వ. 3804

ఆ. సతత మాత్మరూపు సాధించి శోధించి । యుతముగాను బుద్ధి నూని నొక్క-
గతిని గోరి ముక్తి గనుటయే లాభంబు । విశ్వ. 3805

ఆ. సంతకూట మందు వింతలు నూడకు । చింతలోని చింతె చిన్మయంబు
పంతగించి చూడఁ బరమామృతంబురా । విశ్వ. 3806

క. సంతతసమాధిఁ బ్రజ్ఞను । వింతలు దలపోయకుండ వివరించినచో
నంతరమునఁ బరమాత్ముఁడు । మంతవ్యుఁడు వెలుఁగు చుండు మదిలో వేమా. 3807

ఆ. సంత బసివి పొందుఁ జలిపందిలి జలంబుఁ । ద్రోవసమ్ముతోడుఁ దొత్తుపొంట
రచ్చసభల నిద్ర రసికులు మెత్తురా । విశ్వ. 3808

ఆ. సంతలోని సరకు సరసమాఁగొనవచ్చు । వింతలంది పొంద వివరమేది
చింతఁ దిద్ది చూడఁ జిన్మయజ్యోతిరా । విశ్వ. 3809

తే. సత్పరబ్రహ్మమయమూని సౌఖ్యమెఱిఁగి । ప్రత్యగాత్మకులోనైన భావమంది
నిత్యనిరతిశయంబంది నిజముఁగనుము । సత్వసంసిద్ధిముక్తి యౌ సంగువేమ. 3810

క. సత్యంబగు విజ్ఞానము । నిత్యము బ్రహ్మాత్మమనుచు నిర్గుణుఁడై తా
సత్యంబుగ మది నెన్నుచుఁ । గృత్యంబు నడంగఁ ద్రొక్కఁ గృతి యగు వేమా. 3811

ఆ. సత్యమనఁగ వేఱె జగమునఁ గనలేదు । నిత్యమగుచు నాత్మ నెగడి యుండు
నిత్య వస్తువెఱుఁగనీవె బ్రహ్మమునుమ్మి । విశ్వ. 3812

ఆ. సత్యమమరియుండ జ్ఞానమమరియుండు। జ్ఞానమమరియుండ సత్యముండు
జ్ఞానసత్యము లవిసమమైన ద్విజుఁడగు। విశ్వ. 3813

ఆ. సత్యము గలుగునెడ జగతిలో వారికి। జ్ఞానమమరగల్గు మానుగాను
జ్ఞానమె కలుగునెడ సమధికద్విజుఁ డగు। విశ్వ. 3814

క. సత్యమును హరిశ్చంద్రుఁడు। నిత్యముఁ దాఁబొందియుండి నిలిచెఁ దిరముగా
భృత్యుఁడవై నీమదిలో। సత్యంబును నిల్పఁజూడు చయ్యన వేమా. 3815

ఆ. సత్యము విడనాడి సాహసంబులు చూపి। బంటు పంతమాడు భక్తి లేక
కర్మజీవితాను గానంగ లేఁడయా। విశ్వ. 3816

ఆ. సత్యమైనయుక్తి సహముగా మదినిల్పి। నిత్యమైనయుక్తి నెలవెఱింగి
భక్తియుక్తిమీఱి బయలంటి పొందరా। విశ్వ. 3817

ఆ. సత్యవంతుల యెడ సరసమాడఁగరాదు। పేదవారితోడఁ బెనఁగరాదు
కలిమి గలుగువారిఁ గలియ నేరాదురా। విశ్వ. 3318

మత్తకోకిల. సత్యవాక్యము గొప్ప మిద్దని శాశ్వతంబుగ నెన్నుచు
న్నిత్యభోగము నిత్యసౌఖ్యము నిత్యనిర్గుణఛాయలో
మత్తుఁడైపరిపూర్ణచిన్మయమర్మ మూనుచు నెప్పుడుం
బొత్తుఁబాసి తలంపు జ్ఞప్తిని బూను వేమన నిత్యముక్తి. 3819

తే. సత్యసమమగు తేజంబు సంతరించి। నిత్యకర్మాద్యనుష్ఠాననిష్ఠ నెఱిఁగి
కృత్యములనెల్లరోయుట కీర్తియగును। స్తుత్యమదియయి కల్పించుసుగతి వేమ.

తే. సత్యసంసిద్ధిసగు బ్రహ్మ నిత్యపదవి। ముత్యమని యెంచి మదిలోన మూలమెఱిఁగి
నిత్యమై మెత్తికములలో నేర్పఁగనుము। భృత్యభావంబుఁ బూననే పొసఁగు వేమ.

ఆ. సతికిఁబతికినైన సంపదేసంపద। పుత్రసంపదయును భువిని మేలు
సరగమదిసి బ్రదుకు సంపదే సంపద। విశ్వ. 3822

క. సతిపతులు పెనఁగు నప్పుడు। పతిశుక్లము సతికి గర్భపతనము కాఁగా
సుతుఁ డగుచు జన్మమెత్తును। హితమతి నీజన్మ మెఱుఁగ హేతువు వేమా. 3323

క. సతియందే పుట్టెఁ బతియును। బతియందే పుట్టె సతియుఁ బరమార్థముగా
సతిపతులనఁగా నెవ్వరో। పతి నది తెలియంగవలయు మహిలో వేమా. 3324

ఆ. సతియుఁజూచిచూచి సౌఖ్యంబుఁగోరును। గతిని గానలేఁడు కర్మజీవి
గతులు సతులవల్ల గానంగ లేరురా। విశ్వ. 2825

ఆ. సతియొనర్చు చెడుగు పతి కవశ్యము వచ్చుఁ । బతియొనర్చునంచి సతికిసగము
పతియొనర్చు చెడుగు సతికేలరా దోసో । విశ్వ. 2826

ఆ. సతులఁగవయు టెల్ల సుతులఁ బడసెదమక్ । వెతల పడుట కేఁటి వెఱ్ఱితనమొ
నేలనున్నరాయి నెత్తికెత్తినయట్లు । విశ్వ. 3827

ఆ. సతులగుణముఁజూచి సాధుభైరవుఁడును । బెద్దకడుపువాఁడుఁబెండ్లిమానెఁ
బుట్టుకాశఁగట్టె భువినాంచజేయుండు । విశ్వ. 3828

ఆ. సతులచేతఁ బుణ్యసౌఖ్యము కలదని । నరుఁడు కర్మములను నమ్మియుండు
దానికాని బుద్ధి హానికి మూలమగా । విశ్వ. 3829

ఆ. సతులఁజూచి నరుఁడు సౌఖ్యంబుఁగోరును । గతులఁగాన లేఁడు కర్మమందు
గతులు సతులవలనఁ గానంగలేరయా । విశ్వ. 3830

ఆ. సతులఁ జూడఁజూడ సంసారి కాఁగోరు । సుతులు పుట్టఁబుట్ట వెతలఁబడును
గతులు చెడఁగఁజెడఁగఁ గర్మపంచేష్టను । విశ్వ. 3831

ఆ. సతుల మాయనమ్మి సౌఖ్యంబుగలదని । మతివిహీను లైరి మనుజు లెల్ల
గతులు సతుల వలనఁ గానంగలే రయా । విశ్వ. 3832

ఆ. సతులు జపతపములు సల్పఁగసాగిన । బురుషులేల నిఁకను బుడమిలోనఁ
బాపమెంచవద్దు పట్టిశిక్షింపుఁడీ । పుణ్యపురుషులెల్ల భువిని వేమ. 3833

ఆ సతులు సుతులుమాయ సంసారములుమాయ । ధనము ఘనముమాయ తలఁపు మాయ
మాయ బ్రతుకునకనె మమతఁగల్పించెరా । విశ్వ. 3834

ఆ. సదసునందు వేశ్యసైగలు కనుపింప । ముదితమీఁద నాశ ముడివడంగ
మదిని భ్రమయుకెప్పుడు మాటొక్కని చూడరా । విశ్వ. 3835

ఆ. సంద్రమునకుఁ జూడ సరియేదియునులేదు । అట్టి జలధినీర మనువుగాదు
అనువుగానినీరె యదియేమిచేయును । విశ్వ. 3836

తే. సందియములేనిమదిలోని సత్యమాత్మ । పొందుఁగూడుట ప్రత్యక్షపరమటంచు
నందుచుండును పరతత్త్వమాస్థనెప్పుడు । కందువదెస్వర్గసౌఖ్యముగాఁగ వేమ. 3837

తే. సద్గురుకటాక్షమొందిన సత్త్వముండు । ధ్యానపరమున జ్ఞప్తిని దగులనించి
నిర్గుణంబును ముట్టును నియతిమీఱి । సోఽహ మనుభావ మాత్మను జూచివేమ. 3838

క. సద్గురుకృపజ్ఞానంబును । సద్గతిదీపించుచున్న చాలపదువులుక్
సద్గతిఁగలుగఁగఁ జేసెడి । సద్గురువే దైవమనుచుఁ జాటర వేమా. 3839

క. సందులుగొందులు వెదకినఁ । బొందునె పరతత్త్వబోధ పురుషార్థునకే
సందొందుఁబొందుపడునన । నందందే యలరుచుండు నమలను వేమా. 3840

క. సందేహ మేల వినరయ । సుందానందంబుగలుగు మర్మముఁదెలియన్
సుందామర్మము వీడమి । నెందఱు చెరోళ్ల నన్న నేవయె వేమా. 3841

ఆ. సంధ్యవార్చనేమి జపముసేయఁగ నేమి । వేదశాస్త్రములను వెలయ నేమి
పరముఁ గననివాఁడు బాపఁడు గాఁడురా । విశ్వ. 3842

తే. సమశానంగను సంయోగసరణి నెఱిఁగి । పోరుచుండిన ధ్యానంబు పూర్తి యగును
తెలియ నఱచేతిదౌ ముక్తి తేటపడును । అనుభవమునకురాఁ జరమదియె వేమ.

ఆ. సనుతగురునిదృష్టి సమముగా మదినిల్పి । బయలరుములమాన భద్రిపఱచి
పరగఁ జూడ బట్టబయలగు బ్రహ్మంబు । విశ్వ. 3844

క. సమబుద్ధిగుఱుతు మీఱిన । యమనస్కమహావిభూతియందును దోడన్
విమలంబగుఁ బ్రజ్ఞానము । క్రమమగు నచలాంశమదియె కనుమిఁక వేమా. 3845

క. సమయంబు మంచిదయ్యెను । క్షమియించితిరయ్య నాకు సాధ్యంబాయెం
దమఫలమటంచుఁ జెప్పితిఁ । గ్రమముగఁ గథయెల్లనుప్పఁగడచెను వేమా. 3846

ఆ. సమువయంబునందు సర్వమొక్కటియైన । వైరమొనపదేమి వారలేమి
ఎమ్మతగ్గులందు నేర్పడ నేహాని । విశ్వ. 3847

తే. సరకుఁగొనఁగూడ దెఱుకను సత్యముగను । బరమపరిపూర్ణమౌ జ్ఞప్తిఁబట్టుఁబట్టి
నిరతమభ్యాసశీలుఁడై నిండవలెను । జరమమందొప్పుఁ దత్స్వాఖ్యసరణి వేమ. 3848

క. సరగున సిద్ధాసనుఁడై । చిర మిలఁ జరణములు నిలిపి శృంగాటకమం
దరయుచు గళబిందువుగను । వెరవున నాముక్తికాంత వేడర వేమా. 3849

ఆ. సరవిచారబుద్ధి జరిగినయంతనే । హరియుఁ బృథ్విచేత నలసుఁడగును
గాని వానిమాయఁ గను మోపమునఁగని । పూని బ్రహ్మమందుఁ బొందు వేమ. 3850

ఆ. సరవిలోడఁగూడు స్వాధిష్ఠచక్రంబు । ప్రాణపవనములను బందుచేసి
వెడలకుంచువాఁడు వేదాంతవేత్తయౌ । విశ్వ. 3851

తే. సరవిఁబంచాక్షరీజ్ఞానపరుఁడటు పర । మాత్మనెఱుఁగును నెఱిగిన నవనియందుఁ
బ్రజ్వరిల్లును వాఁడెపో పరమునందు । దానె పరమాత్మమగునట్టు ధరను వేమ. 3852

క. సరసిజభవుఁబధియించియు । హరియందును గలిపి హరిని హరముగఁ జేసెం
బురహరుని గలిపితానే । హరుఁడై యానందవిధము నందుర వేమా. 3853

తే. సర్వకులధర్మమర్మముల్ సంతరించి । సకలయోగంబులను మించి సన్మతముగ
బట్టబయలందుఁ జేరుటే బ్రహ్మవిద్య । గుట్టిదియటంచుఁ దెల్పరా గురుఁడు వేమ.

తే. సర్వదా సుపరబ్రహ్మ శాశ్వతముగ । వెలుఁగుచున్నది గనుమిదే విశ్వమంత
అనవృశాస్త్రోక్తమైనట్టి దవగతంబు । బట్టబయటనె వెలుఁగొందుఁ బరగ వేమ. 3855

తే సర్వపరిపూర్ణమా బ్రహ్మసత్యమనెడి । యుక్తిలోనెంచి యూహలో ముక్తిఁ గాంచి
యున్నయాతఁడె ముక్తుఁడీ యుర్విలోనఁ । గష్టసుఖములనెంచఁడు గనఁడు వేమ.

తే. సర్వమచలంబుగానెంచి సత్యముగను । నిర్వహించినవాఁడెపో నిర్మలుండు
పర్వలిడకయె పూర్తియై పరగుచుండు । నిర్వికారుఁడతండగు సర్వవేమ. 3857

తే. సర్వమతములయందును సన్యసించి । నిర్వికారతలో మించి నియతిఁ గాంచి
యున్నయాతఁడు పరిపూర్ణుఁ డుత్తముండు । శివునిఁ గా నాతనిం జెప్పఁ జెల్లు వేమ. 3858

క. సర్వము తానని తెలిసిన । నిర్వాణికిఁ గాక ముక్తి నిలువఁగ వశమా
యుర్వెల్లఁ దానుదిరిగినఁ । బర్వతబిలజలధులందుఁ బడినను వేమా. 3859

ఆ. సర్వమొకటెచూడు సమకూడును ధృవంబు । రెప్పవేయఁబోకు రేయిఁబగలు
పగలులోనిపగలు పరమాత్మ చూడరా । విశ్వ. 3860

తే. సర్వవాక్యార్థభావంబు సరణిమఱిగి । నిర్వహించిన గుణచర్య నిజమెఱింగి
పర్వలిడకయనిండుటే ప్రముదితంబు । శర్వకృపఁ గోరువారికి జగతి వేమ. 3861

తే. సర్వసముదీప్తి త్రిగుణవిశ్రాంతమెసఁగె । అంతరంబున హంసమైయులరునదియె
దివ్యపరిపూర్ణనిర్గుణదేవుఁడగుచుఁ । బరగుచుండును గన బట్టబయలవేమ. 3862

తే సర్వసమమగు బుద్ధిలో సత్యమెఱిఁగి । లోన నిజరూపమానసధ్యాన మమర
చింత చేయుచునుండుటే చిన్మయంబు । వాదులాడెడిచదువేల వలదు వేమ. 3863

క సంసారసుఖములూడిన । సంసారముఁ వదలి లోకసంచారియగుః
సంసారేచ్ఛలు విడకయె । హంసనుబట్టంగలే రిహంబున వేమా. 3864

తే. సహచరంబగు నెఱుకను సరకుగొనక । యిహపరంబులు గానట్టి దెఱిఁగి మఱిగి
నిబిడమగు బట్టబయలున నిలుచుటొప్ప । నాత్మరూపము కాన్పింపనగుర వేమ. 3865

ఆ. సహజగుణమువిడదు జారిణికెప్పుడు । సుతులఁ బతినిబాసి సూటె దప్పి
గృహమువెడలి యంతఁ దహతహపడునయా । విశ్వ. 3866

తే. సహజచిన్మయబ్రహ్మంబు సమకొనంగ । సూర్యచంద్రులగతిలోని సూక్ష్మమెఱిఁగి
పూర్ణకుంభకనాసాగ్రపురముఁ జేరు । మపుడె మహనీయమూర్తి వీవగుదు వేమ. 3867

ఆ. సవతితల్లిఁజూడ సాకులునెరపును । స్వంతతల్లివలెను సైప దెపుడు
వింత లడఁచి లోని విజ్ఞాన మందరా । విశ్వ. 3868

క. సాకారనిరాకారము । లోకోత్తరమగుచుమదిని లోబడయై యా
యేకాక్షరపరమార్థము । నీకడనే నిలిచియుండు నిజముగ వేమా. 3869

తే. సాంఖ్యతారకముద్రలు సంతసమున । గురుముఖంబున నెఱిఁగియు గుట్టువిడక
నిరత మాత్మావలోకన నెరపుయోగి । పరమపద మఱచేతను బట్టువేమ. 3870

ఆ. సాటిగానిబయులు సాధించిమించినఁ । బ్రకటితముగనాత్మ ప్రజ్వరిల్లు
నిక్కమమరఁజూడు నేర్పునవిలసిల్ల । విశ్వ. 3871

ఆ. సాటిచెప్పనగునె సాధుసజ్జనులకు । గొప్పచదువుచదివి యొప్పననుచు
వాదులాడునతని వదరుటేలరా । విశ్వ. 3872

ఆ. సాటిచేయవచ్చుఁ జదివివాదములాడు । చదువరులను జెట్టిసముదయమును
పోరిపోరి గెల్చు నోరునోవనివాఁడు । విశ్వ. 3873

ఆ సాటియెవరులేరు సాంబమూర్తికిఁబోల్ప । దీటిలేని గొప్పదేవుఁడతఁడె
ధాటికలుగు నతని ధ్యానించువానికి । విశ్వ. 3874

ఆ. సాటివారు నిన్ను సాధింపఁగాలేరు । ధర్మ మెపుడు నీవు తప్పకున్న
భారతంబులోని పరమార్థ మిదెకదా । విశ్వ. 3875

తే. సాత్వికాంశములో నెంచి సత్యముగను । రాజసంబున మదిమించి రంగుగాను
తామసంబును నడఁచులే తత్పదంబు । గుణములిట్టుల గుదిరిన గురుఁడె వేమ. 3876

ఆ. సాత్వికులయినట్టి సజ్జనులగువారు । వేదరీతిగాను బృథివిలోనఁ
బుణ్యఫలము చేతఁబూజలందుచునుండ । ధన్యులైరివారు ధరణివేమ. 3877

తే. సాధనచతుష్టయంబుల సామ్యమెఱిఁగి । వింతలన్నియు మదిలోన విడచినపుడె
మంతనంబగు గురుభక్తి మహిమయగును । సుంతయైనను బెడదారిఁ జొరదు వేమ.

తే. సాధనను జిక్కు తక్కదు సత్యపరముఁ । జేరగమకించి యుక్తిలోఁ జిన్మయంబు
దారిఁగనుఁగొనువాఁడెపో ధన్యుఁడరయ । గౌరవించెద రెల్లలోకములవేమ. 3879

ఆ. సాధనంబులేక సమకూడదేదియు । బోధలేని విద్య పొంద దెపుడు
పాదుకొల్పిమదిని భావించి చూడరా । విశ్వ. 3880

ఆ. సాధుచరితయైన సతిసత్ప్రవర్తన । జారయేమెఱుంగు సాధుజనుని
బ్రహ్మనిష్ఠ మొఱకు ప్రాకృతుఁ డెఱుఁగునా । విశ్వ. 3881

ఆ. సాదుజనుల చెలిమి చాలింపఁగారాదు । ప్రకృతి విడకయున్నఁ బరములేదు
పిండిఁగోసిచూడ బీజంబుగలుగునా । విశ్వ. 3882

ఆ. సాధుజనులఁబట్టి సంతాపమొందింప । కులవినాశమందుఁ గ్రూరజనుఁడు
సాధుజనుల పూజ సాయుజ్యపదవిరా । విశ్వ. 3883

ఆ. సాధుసజ్జనులను సంతరించినవాఁడు । ప్రజల సంతసంబు పఱచువాఁడు
కదసి శాత్రిపులను గరుణఁజూచినవాఁడు । పొదుకొన్నముక్తి పరుఁడు వేమ. 3884

తే. సాధుసాంగత్యమమరిన శాంతమమరు । శాంతమమరినఁజిత్తంబు శక్యపడును
శక్యపడిన మనంబె యొసంగుఁబరము । పరముఁగాంచిన శివుఁడనఁబరగు వేమ. 3885

ఆ. సాముఁజేసి జెట్టిసాహసియైయుండు । సాముఁజేయకున్న సరణిఁగనఁడు
సాముఁజేయువాఁడు చావకయుండునా । విశ్వ. 3886

క. సారంబగు విజ్ఞానవి।చారంబున హంసఁ గూడి చతురత మీఱం
గోరికలెంచని బయలునఁ । జేరుట కైవల్యపదవిఁ జెందుట వేమా. 3887

క. సారముగల యీతత్త్వవి।చారము గుర్తించి మదిని జపలము విడినన్
మీఱును జ్ఞానవివేచన । మాఱుండని ముక్తిఁజూపు మహిలో వేమా. 3888

ఆ. సారముగలయుక్తి సమముగామదినిల్పి । నిత్యమైనముక్తి నెల వెఱింగి
భక్తియుక్తిమీఱి బయలందిపొందరా । విశ్వ. 3889

ఆ. సారవిద్యలందు సరణిఁ దెలియలేక । దూరమందుఁజేరు దుర్జనుండు
పరముఁ దెలియ నతఁడు భావజ్ఞుఁ డెట్లగు । విశ్వ. 3890

ఆ. సాలె జాండ్రి మాలజాతులవారలు । నేఁతగాండ్రమనుచు నేలమీఁద
చెప్పుదు రిలఁగాని గొప్పవహించిరా । విశ్వ. 3891

క. సాహసమునఁ జతురత్మగి । నూహను దమినెంచి మించి యొప్పుగఁగనినన్
మోహమడంగును భక్తిని । దేహములో దేహిఁగనును దెంపుగ వేమా. 3892

ఆ. సాహసముననైన సత్యముచేనైన । మోహబుద్ధివిడిచి ముక్తి నెఱిఁగి
చేర్చిమదిని గురునిఁ జెలరేగి యుండరా । విశ్వ. 3893

ఆ. సిగ్గటంచనఁ బడు సిగ్గదెచ్చోనుండు । నాక లెచటనుండు నరయుగాను
దాగియున్నయున్కి దాగినచోనుండు । విశ్వ. 3894

ఆ. సిగ్గుగలదటంద్రు సృష్టిలోపలివారు । వెఱ్ఱివేమనఁగని వెఱగుపడిరి
తనకుగల్గుసిగ్గు దైవమే యెఱుఁగురా । విశ్వ. 3895

ఆ. సిగ్గు దాగునెడల జీకటి యెటదాగు । నాకలేడదాగు నాత్మలోన
దాగియున్న నిద్ర దాగుటఁ దెలియఁడీ । విశ్వ. 7896

ఆ. సిగ్గువిడువకున్న శివసౌఖ్యమే లేదు । తగ్గి మెలఁగకున్న సిగ్గుపడదు
సిగ్గువిడుచువాఁడె చిరకాలజీవిరా । విశ్వ. 3897

ఆ. సిద్ధులైనవారి చిత్తమే రంజిల్లు । నొడలిమెఱుఁగు లెక్క కిడరుగాన
పనసపండు ఘనత పైనేమి కలదురా । విశ్వ. 3898

ఆ. సీలవ్రతముచేత శిష్యుల శిష్యులై । తపసికర్మములను దారవోసి
విశ్వకర్మకులము వీటఁ బుచ్చిరిగదా । విశ్వ. 3899

ఆ. సుఖమునందుఁ దాను సుముఖుఁడై యుండఁగాఁ । బ్రకృతిఁ బెండ్లిచేసి పరము జెఱిచి
విధిని బుట్టఁ జేసె విధినితాఁ గానఁడు । విశ్వ. 3900

ఆ. సుఖము లెల్లఁ దెలిసి చూడంగ దుఃఖముల్ । పుణ్యములను బాప పూర్వకములె
కోఱఁత వేయ దొంగ కోరినచందమా । విశ్వ. 3901

ఆ. సుఖసులోలుఁడను చేను సుగుణుఁడై యుండ । నన్నుఁ బెండ్లి కూడ నయముఁ జెప్పి
దీనిఁ గూర్చిన విధి నేనేమియందును । విశ్వ. 3902

ఆ. సుగుణవంతురాలు సుదతియైయుండిన । బుద్ధిమంతు లగుదుఁ బుత్రులొప్ప
స్వర్గమేఁటికయ్య సంసారి కింకను । విశ్వ. 3903

తే. సుజను లందఱుఁ దమలోని సూక్ష్మ మెఱిఁగి । నిజసమాధిని భజియించి నేర్పు మిగిలి
విజయమందరె విజ్ఞానవిధముఁ గోరి । యజనముల్గిలిఁ కేల హింసకా యరయ వేమ. 3904

క. సుడిబడి తిరిగెదు ప్రాణులు । కడ తేరుట కొద్దితెరువొ కనలేరుగదా
యిడుములకు దారిఁ జూపని । విడుదలలో గురుని వేడి వెలయుము వేమా. 3905

తే. సుతధనాదిభోగమ్ములఁ జూచి చూచి । మతివిహీనుఁడు గాకున్న మహితు నెపుడు
మతకమంటము స్వప్నస్థి మాధరనుగును । గుతుక మెడ తెగకుండఁగాఁ గూర్చ వేమ.

ఆ. సుతులచేతఁ బుణ్యసుఖముఁ బొందుదునని । మనుజుఁడుండుఁ గర్మమతముఁ దగిలి
ఏనుఁగుపడియున్న నెత్తునా మశకంబు । విశ్వ. 3907

ఆ. సుతులు సతులు మాయ సుఖదుఃఖములు మాయ । సంస్మృతియును మాయ జాలిమాయ
మాయ బ్రిదుకునకనె మాయఁ గల్పించెరా । విశ్వ. 3908

ఆ. సున్నమనఁగ మహిని సూక్ష్మమైయుండును । సున్నమనఁగ నిదానుఁ జూపుగతినె
సున్న మాపరంబుఁ జూపుచునుండురా । విశ్వ. 3909

ఆ. సున్నమన్న నేదో సూక్ష్మ సిదెలసిన । వన్నెఁగన్నయట్టి వారుగాక
యెన్నఁగలరె యొరు లిఁకెన్ని యోజించిన । విశ్వ. 3910

క. సున్నమును దిన్నవానికి । నున్నతమగు స్వర్గమేల నుండదు చూడన్
వన్నెకు మించిన సున్నం । బున్నతమగు బ్రహ్మమునకు నుపమగు వేమా. 3911

ఆ. సుప్తిజాగరముల సొలపులఁ దానుండి । కప్పుకొన్న మాయఁ గానలేక
యబ్బురనిజములను దాలెస్సఁగనలేక । గొబ్బునఁ జెడిపోవు గుణము వేమ. 3913

ఆ సురలుమాను లెప్పుడు సరవి వర్తింతురు । ధర్మమార్గమొకటె తారకముగ
అట్టుకానివార లసురులై చచ్చిరి । విశ్వ. 3913

ఆ. సూచికాగ్రదృష్టి సొరిదిభ్రూమధ్యముఁ । జూచి చూచి మఱియుఁ జూచెనేని
ఆత్మరాకపోక లప్పుడె తెలియురా । విశ్వ. 3914

క. సూటిగఁ దత్పదమందినఁ । గోటికిఁ బడగెత్త వచ్చుఁ గుదిరినమదితో
మీటినఁ ద్వంపద మనియెడు । కూటస్థునియైక్యమొదవఁ గోరును వేమా. 3915

ఆ. సూటిదప్పరాదు సూక్ష్మతేజమ్మునఁ । గోటకొమ్మలెక్క వాటమునను
మీటిజ్యోతినంటి మిన్నకుండు టెయుక్తి । విశ్వ. 3916

క. సూత్రింబములవిచారణ । నేత్రింబులు సగముమూసి నెఱిఁగను నెదియో
గాత్రింబగు బ్రహ్మాంశము । పాత్రుండై బుద్ధినొక్క పరుఁడగు వేమా. 3917

ఆ. సూదినంటురాయి సూత్రముగా నాత్మ । సాధనంబుమీఱి సంతరించి
పాదుకొల్పువరులు పరమాత్మఁగందురు । విశ్వ. 3918

తే. సూర్యచంద్రాగ్ని నేత్రునిఁ జూడఁగోరి ।। కార్యగురులందుఁ జేరక కారణంబుఁ
గోరి విబుధుని కాంతిలోమీఱియచల । దుర్గమునకును బైఁజేరి తూగు వేమ. 3919

ఆ. సూర్యునిఁబోడఁగన్న సొలకపికసించుఁ । జుక్కలదొరఁగన్న సుక్కవెంచుఁ
గలువ తమ్మిగాదు కలద యీభూమినే । విశ్వ. 3920

తే. సూక్ష్మతేజంబు చూడ్కిలో వీక్షణంబు । నక్షయంబైన యనుపమాఘాక్షయంబు
రక్షకంబనియొంచుచే రాజవిద్య । దీక్షవహియించి సాధింపఁ దివురు వేమ. 3921

ఆ. సూక్ష్మదృష్టిఁబూని సోదరిఁ దెగటార్చి । పాపనిలిపియుండె ఫలముఁగనుము
నీవు నీవె నిలిచి నిన్నుంటిచూడరా । విశ్వ. 3922

ఆ. సూక్ష్మమధ్యమునను సొరిదిజీవుండుండు । స్థూలమధ్యమునను సూర్యుడుండు
నాదుబిందుకళల నడబ్రహ్మముండురా । విశ్వ. 3923

ఆ. సూక్ష్మమరయనీకు సుఖతత్త్వభావంబు । పుట్టుచావులేని పురముదారి
మానసంబునంటి మఱవక చూడరా । విశ్వ. 3924

ఆ. సూక్ష్మరూపమందు సూక్ష్మరూపమనంగ । స్థూలరూపమందు స్థూలమనఁగ
మాటయొక్కటైన మర్మంబుఁ దెలియదా । విశ్వ. 3925

ఆ. సూక్ష్మరూపమెఱిఁగి సుఖమొందఁగాలేక । బహుళముగను జదువుఁ బనుచు నరుఁడు
చావుచే నెఱుఁగని చదువేలఁ జదువఁడో । విశ్వ. 3926

తే. సేకరించినగురుభక్తి సేతువనఁగఁ । జెల్లుభవమను సింధువుఁ జెలఁగిదాట
బంధురంబగు గురునాజ్ఞ బయలుపడును । బరగఁ జేరెనుఁ బురమగు పదము వేమ.

తే. సేకరించిన మనసులో చింతవిడక । రాకపోకలులేనట్టి రాజ్యపదవిఁ
దాకి తన్మయ మందులే తత్పదంబు । కాక పెరమార్గములముక్తి కలదె వేమ. 3928

ఆ. సేతు వందు మునుఁగ క్షితిఁ గాకి తెలుపౌనె । కాశికేగ గద్ద గరుడుఁడగునె
బదరి కరుగ వృద్ధు బాలుండు గాఁడయా । విశ్వ. 3929

ఆ. సేవఁ జేసి గురుని స్థిరభావమందెడు । త్రోవనంటి జ్ఞప్తిఁ దొలఁగనీక
భావమం దెపరముఁ బరికించి చూడరా । విశ్వ. 3930

క. సేవించి గురునిఁ గన్గొని । కావరమును గడచుఁ జిమ్మి కడువేడ్కలరం
గావించు నిజసమాధిని । భావింపఁగ బ్రహ్మబయలు పనుపడు వేమా. 3931

ఆ. సొమ్ముఁగన్నదనుక జ్యోతివెలుఁగవలె । సొమ్ముఁగన్నవెనుక జ్యోతియేల
దేవుఁడైనవెనుక దేహంబుచీకేల । విశ్వ. 3932

ఆ. సొమ్ములున్నచోట్ల శోధింపఁగలుగును । సొమ్ములేనిచోట శోధయేల
అంజనంబులేక యాసొమ్ముఁ దెలియదు । విశ్వ. 3933

ఆ. సొమ్ములెల్లవేఱు చూడ బంగరొకండె । ముదితలెల్లవేఱు మోహమొకటె
పశువులెల్లవేఱు పాలెల్లనొక్కటే । విశ్వ. 3934

ఆ. సోమసుఖులఁ గూడి సుఖియించువాఁడేల । రామమంత్రజపము రహినొనర్చ
పామరత్వమతనిఁ బాయ దెన్నఁటికిని । విశ్వ. 3935

ఆ. సోమయాజిననుచు సొంపుగా వేషంబుఁ । గట్టిమాంస మెల్లఁ గాల్చితినును
బ్రాహ్మణుఁడఁ దాననఁగ నధికమేమి తనవల్ల । విశ్వ. 3936

ఆ. సోమయాజిననుచు సొంపైన శాలువల్ । మకరకుండలములు మనసు దీరఁ
దా ధరించు మనసుఁ దా నేమిలాభించు । విశ్వ. 3937

ఆ. సోమయాజిఁబట్టి సోద్దువేసెనురంభ । మనసుతీర్పనపుడు మమతతోడఁ
గ్రతువుఁజేయుఫలము కాదె యీపాట్లకే । విశ్వ. 3938

ఆ. సోమలతల రసము సోలెడైనఁద్రావ । రేల మేలటంచు నెన్నుచుండె
గ్రతుఫలంబు కంఠగతమగుఁగాఁబోలు । విశ్వ. 3939

ఆ. సౌఖ్యమరయనట్టె సౌఖ్యంబుకలుగును । వారునిక్కపను సౌఖ్య మమరియుండు
సుఖమసుఖములకును శూలికారణమగు । విశ్వ. 3940

ఆ. సౌఖ్యముగలదిలను సద్భక్తివల్లను । సౌఖ్యముగలిగినను సమ్మతమగు
సౌఖ్యముగలవాఁడు సంతోషపడవచ్చు । విశ్వ. 3941

ఆ. సృష్టిలోనఁగల్గు చిద్విలాసములెల్ల । చూడఁ జూడమిగులఁ జోద్యములగు
బట్టబయలుఁజేసి పరమాత్మఁజూడరా । విశ్వ. 3942

ఆ. స్పర్శగాలికలిసి స్వరూపకర్మంబు । తెలియఁజేయునపుడు దేహమునకు
దేహవాంఛచేతఁ దెగితేరలేఁడయా । విశ్వ. 3943

ఆ. స్వప్నమనఁగ మేని స్వాతంత్ర్యమునుగాదు । స్వప్నమనఁగ జీవ సంకటంబు
అల్పనరుఁడు తెలియఁ డవనిలో నరుదయా । విశ్వ. 3944

క. స్వప్నము మేల్కనిచూడఁగ । స్వప్నములోఁ గన్న ఫలము సమయుచునుండున్
స్వప్నముఁ దలఁపనికి్రియ । నిస్వప్నగతి నిలుపుమదిని సరసత వేమా. 3945

తే. స్వస్వరూపంబు తాఁదానె సంగ్రహించి । దుస్స్వభావంబు పూర్తిగా దుగ్గడించి
విశ్వరూపంబు మదినెంచు విధముఁగనుము । శాశ్వతానందమొప్పెడి జగతివేమ.

తే. స్వస్వరూపమున నెఱుక హ్రస్వమగును । బిందునాదకళాతీతభిన్నపరమ
తన్మయశరీరమందు జే తత్త్వమగును । గురుకటాక్షము లభియింపఁ గుదురు వేమ.

క. స్థావరముల భక్షింతురు । భావింపక జంగమములు బహువిధరుచులన్
ఆవల సకలప్రాణులు । తీవరమునఁదమ్ముఁదామె తిందురు వేమా. 3948

ఆ. స్నానమొనరఁజేసి సద్ధర్మమీయక । నీళ్ల మునుఁగనగునె నేర్పులేక
నీళ్లయందుఁగోడి నెలవుగా మునుఁగదా । విశ్వ. 3949

ఆ. స్నాన సంధ్యజపము లైననెభుజియించు । నిష్ఠలెన్నియైన నెరవుఁగాని
ఒకని కీయఁడేమి సుకృతంబు కల్గునో । విశ్వ. 3950

ఆ. స్మార్తకర్మములను శ్రౌతకర్మంబులు । ప్రేతకర్మములను బ్రీతితోను
చేయువారిచేతఁ జేయించు విప్రుండు । విశ్వ. 3951

తే. స్వాత్మతన్మయమనసంబు సంగ్రహించి । నిర్గుణబ్రహ్మపదవికి నెఱయబుద్ధి
నొక్క నిశ్చయమందుచే నుడుపటంద్రు । వేదవేదాంతసారార్థవిదులు వేమ. 3952

ఆ. స్వాతిమెఱుంగుఁజూచి సంతోషపడుదురు । స్వాతిమెఱుపులేమి సఫలమన్న
మెఱపు నుఱుములేక మేఘంబుగురియునా । విశ్వ. 3953

తే. స్వానుభవమాని మదిలోని సారమాని । తాను దానగుచుండును దత్త్వవేత్త
మేనుమఱచిన నిద్రలో మెలఁగునట్టి । మానిలాగున నదెకదా మహిమ వేమ. 3954

ఆ. స్వానుభూతియందు శాస్త్రవాసనలందు । సంశయంబులేని సాధనమున
వెలఁగదీపమట్టి చిత్స్వరూపమునంటు । విశ్వ. 3955

ఆ. స్వానుభూతిలేక శాస్త్రవాసనలచే । సంశయంబువిడదు సాధకునకుఁ
జిత్రదీపమునను జీకటిపోనట్లు । విశ్వ. 3956

క. స్థిరతరబుద్ధిని జూచినఁ । బరిపూర్ణసుఖంబు కన్గి ఫలమందుసువిూ
పరుపడి నీవని మదిలో । గుఱిమించిన గోప్యమదియె గొనబగు వేమా. 3957

ఆ. స్థిరముగాని క్షుద్రపరకూటములఁజేసి । యెచ్చుతగ్గులొంది హీనమతులు
గాడ్దెపిల్లలగుచు గ్రక్కునఁ జెడుదురు । విశ్వ. 3958

క. స్త్రీ జనని యనం జను నటు । స్త్రీ జన్మము చూడ భువిని శివునకు ముందై
స్త్రీ జని శక్తియనందగు । తేజములో ద్రిగుణకర్త తెరువగు వేమా. 3959

క. స్త్రీ నెత్తిని రుద్రునకగు । స్త్రీనోటను బ్రహ్మకెపుడు సిరిగుల్కంగా
స్త్రీసిరి పెను హరి రొమ్మున । స్త్రీ నెడపెడి గురుఁడ వీవె దేవర వేమా. 3960

ఆ. స్త్రీలచనులు పూలచెండ్లుగాఁ బోల్చెను । పాలుమాలినట్టి పనసకొడుప
చన్నులెట్లు పూలసాటికావచ్చురా । విశ్వ. 3961

ఆ. స్త్రీలఁజంపువాని శివుఁడు సైరింపఁడు । స్త్రీలఁ జంపువాఁడు శిధిలమగును
స్త్రీలఁ జంపువాఁడు శివశివా నరకంబుఁ । జెందునయ్య యేమి చెప్పవేమ. 3962

ఆ. స్త్రీలమనుచు నరులు సిగ్గింతయునులేక । పరులసొమ్ములెల్లఁ బరిహరించి
వేషభాషలఁ గడు మోసంబుచేయుచు । గ్రాసపోషణములఁ గంద్రు వేమ. 3963

ఆ. స్త్రీలమాయచేతఁ జిక్కి తాఁ గొన్నాళ్లు । తగులుఁగోరునట్లు తగిలిపోవుఁ
దనిసి పోనిసి తుదను దైవంబుచేఁ జెడు । విశ్వ. 3964

ఆ. స్త్రీలముఖముఁజూచి చిత్తంబు దృఢముగాఁ । జేయనిమనుజుండు చెడు నిజంబు
ఏటికట్టు మ్రాని కెప్పుడు చలనమే । విశ్వ. 3965

ఆ. స్త్రీలముఖముఁ జూచి చిత్తంబునిలుకడ । చేయలేక నరుఁడు చెడునుగాదె
ఏటికట్ట ద్రుమాన దెందాఁక నిలుచురా । విశ్వ. 3966

ఆ. స్త్రీలవ్రతముఁ జెఱచి శిష్యునకును శిష్యుఁ । డగుచు నీమమెల్ల నడవిఁ గలిపి
విశ్వకర్మకులము వీఁడేలఁ జొచ్చెరా । విశ్వ. 3967

ఆ. స్త్రీలుకల్గుచోటఁ జెల్లాటములుగల్గు । స్త్రీలులేనిచోటు చిన్నవోవు
స్త్రీలచేత నరులు చిక్కుచున్నారయా । విశ్వ. 3968

క. స్త్రీలును బురుషులుఁ దమలో । నాలని మగఁడనుచు నమ్మి యనుభవపశులై
చాలఁగ భ్రమియింతురుగద । వీలుగఁ దమపుట్టుచావు వెదకరు వేమా. 3969

ఆ. స్థూలమగును గుడ్డు సూక్ష్మమౌఁగన్పాప । పాపలోనిజ్యోతి పరమపదము
మాపురేపునాక మదినంటిచూడరా । విశ్వ. 3970

ఆ. స్థూలము కనుగుడ్డు సూక్ష్మంబు కన్పాప । కంటిపాపనుండుఁగారణంబు
కారణమును బ్రహ్మకళ నెఱుంగఁగవలె । విశ్వ. 3971

క. స్థూలాంశ మన్నమయ మగుఁ । బాలునఁ గర్మేంద్రియములు ప్రాణమయంబౌ
మేలగు జ్ఞానేంద్రియముల । జాలము మానసమయంబు చవిఁగను వేమా. 3972

## హా

ఆ. హంగుమీఱఁగాను యతులజన్మంబులఁ । దీరి చెప్ప నెంతవారికైన
నాడకాడకనుపు లతిశయమైవచ్చు । విశ్వ. 3973

తే. హఠముసాధించి గుత్తించి యందవలెను । మఠముసందుల గొందుల మరగ నేల
ఘటపటాదుల తిమిరంబుఁ గాలఁద్రొక్కి । జఠరవాయువు పైదోఁడుజరుగు వేమ.

తే. హఠముసాధించి ఘటమున హార్ష మొదవఁ । బఠనమేర్పడఁ జేయుట ప్రాపకంబు
నిటలదుర్గము చేరుటే నిత్యసుఖము । పటిమగలయట్టి లక్ష్యంబు పరగ వేమ. 3975

ఆ. హత్యసేయఁగూడ దది యెందులకునన్న । హత్యసేయువాఁడె యధముఁడౌను
హత్యసేయువాని కాజ్ఞయేమనవచ్చు । విశ్వ. 3976

క. హాయ మదరి పరువు లిడుగతి । రయమునఁ బాఱెడినిమనసు ప్రతికూలముగా
నయమో భయమోచూపుచుఁ । బయనము సాగింపనీక పట్టర వేమా. 3977

ఆ. హాయము గురువుగాదె యఖిలంబుతాఁగాదె । యనుభవింపరాదె హరునిఁగూర్చి
యతికినంతలోనె యంధకారంబేల । విశ్వ. 3978

తే. హాయముల ద్వయముఁబట్టి నీ వంకురించి । ద్వయవినాశకమూర్తివైఁ దాఁకఁగోరి
జయముపొందఁగమదినొక్క జాణఁడవగు । భయనయంబులు పెనఁగొను ప్రజ్ఞ వేమ

ఆ. హాయముసున్నమునకు నతిశయంబైనట్టి । కల్పమేలఁగల్గు కారణంబు
హాయము సున్నముఁ దిన నంధకార ముడుగు । విశ్వ. 3980

ఆ. హాయ మెఱిఁగిన బంటి కల్పునిఁ జేరిన । మాఱుమలయఁదొత్తు మరుగుమగఁడు
మాళ్లముంతకోళ్ల మఱికోతికైనట్లు । విశ్వ. 3981

ఆ. హరికి దొరకనందు రా సిరియప్పుడే । దొరకెఁగాదె విషము హరున కరయ
నెవని కెట్టులగునొ యెవ్వఁ డెఱుంగురా । విశ్వ. 3982

క. హరియజుఁడు తాళకర్తలు । పురహరుఁడొ మేటిపాత్రి భువనములోఁ దా
నరయఁగఁ బతియై చూచును । గురుతరముగ విశ్వకర్త గురుఁడుర వేమా. 3983

క. హరివిధిసురమును లాదిని । మెఱసియు జన్మించి పిదప మేలుల కెడగా
జరయందు మరణమందును । వరుస న్వర్తిలిరి మాయవాసన వేమా. 3984

క. హరివిధులు కనుటవినరా । హరుఁడు నిమిత్తంబులందు నాడుటవినరా
గుఱిగల చదువులువినరా । తఱివచ్చిన దెఱఁగియుండి తలఁపర వేమా. 3985

ఆ. హరిహరవిధు లెన్న నాత్మలోనుండఁగఁ । దీర్థములకుఁబోవ దేబెతనము
గొఱ్ఱెఁజంకఁబెట్టి గొల్లఁడు వెదకఁడా । విశ్వ. 3986

ఆ. హరిహరవిధులెన్న నాత్మలోనుండఁగ । శివుని వెదుకఁబోవు జీవుఁ డరయ
జీవుఁడు శివుఁడవును సిద్ధంబు తెలియరో । విశ్వ. 3987

ఆ. హరిహరాదులకును నజుఁడు తానె జగము । యోని ముగ్గురనుచు నొప్పుచుండ్రు
కళలనఁగఁ గలుగుటఁ గళ గానరాదయా । విశ్వ. 3988

తే. హరిహరాదులకైన నయ్యాత్మవిద్య । గురుకటాక్షముఁబొందక యెఱుకపడదు
పరమపరిపూర్ణభావంబు బయలునఁగను । నిరుపమానందనిర్గుణనిరతి వేమ. 3989

ఆ. హరిహరాదులందు నాశను దిగనాడి । శాంతబుద్ధిఁగూడి సగుణమందుఁ
జింతమానిపిదపఁ జిన్మయమందరొ । విశ్వ. 3990

ఆ. హరునివిల్లువిఱచి యారామభద్రుండు । ప్రియముతోడ నాఁడు పెండ్లియాడె
భూమికన్నెయెచటఁ బుట్టెను గానరో । విశ్వ. 3991

తే. హవము మదియందు నల్పుట హంసవిద్య । శివముఁ బరికించి జీవుని నేకరించి
భవముహరియింప నైక్యంబుభద్రపడఁగఁ । గవయుచుండెడిజ్ఞప్తిలోఁగలియు వేమ.

తే. హంసదేవములోనైన దనుభవంబు । సంశయంబుల దుంచిన సత్యమమరు
గురుకటాక్షము దొరికిన గుఱుతుచిక్కు । గుఱుతుకూడిన లభియించుఁబరము వేమ.

ఆ. హంసమానసోద మంటక తిరిగిన । ముట్టుఁగర్మచయము ముఖ్యముగను
యోగితిరుగుహంస భోగముతోడను । విశ్వ. 3994

తే. హంసయోగమునకు సాటి యవనిఁగలదె । శంసమించిన మదిలోన శంకరుండు
ధ్వంసమొనరించి యెఱుకను దర్పమణఁచు ।। హంసకునిఁబట్టి శిక్షించు పగిదివేమ.

ఆ. హానిగలుగునాఁటి కల యవస్థలుమెండు । హానిలేనినాఁటి కవియులేవు
హానిఁదెలియునట్టి యతఁడెపో శివయోగి । 3996

ఆ. హానిగలుగఁబోదు హరి మదినెంచెడు । వానికబ్బుఁ బరము వసుధయందుఁ
బూని నిష్ఠమీఱి పొదలకయుండరా । విశ్వ. 3997

ఆ. హానిచేతఁగలుగు నధికదుఃఖంబులు । హానిచేతఁదప్పు నరయ సుఖము
హానిచేతఁగొంత యలమటగల్గురా । విశ్వ. 3998

తే. హానిఁజెందని గురుభక్తి ననుసరించి । పూని పరిపూర్ణవిజ్ఞప్తిఁ బొంచిమిగిలి
స్వానుభవమూని యందులే సమరసంబు । శానివాదంబు లాడఁగా ఘనమెవేమ.

తే. హానిలేనట్టి పదవిని బూనిపిదప । స్వానుభవసిద్ధి యందుట సమ్మతంబు
ధ్యానపరమగు రిచ్చలోఁ దలఁపునిలుప ।మానమూనుము మమతలుమాను వేమ. 4000

తే. హానివృద్ధుల రెంటిఁబోనడఁచి మదిని।బూని గురుమంత్రరాజంబుఁ బొందుపఱచి
తానెతానగుచుండును దత్వవేత్త । మానితంబగు గురుబోధ మహిమవేమ. 4001

తే. హాయినొందుచు గురుభక్తి నందవలెను । మాయయెఱుకను నమ్మక మంజులముగఁ
గాయమందును నీశ్వరుఁ గనుటముక్తి । హేయగుణములఁ బెడఁబాపుమెంచివేమ.

తే. హాళిమీఱిన గురుభక్తి ననుసరించి । యీళితంబుగ గాలిని నీడ్చిపట్టి
కూజితంబున సొక్కుట కుంభకంబు । రాజయోగికి నియమమా రమణవేమ. 4003

ఆ. హింసచేయరాదు సంసారధర్మంబు । జంతువులనుజంపి పాపడుదురె!
బాపుపశువుఁ దినెడు చండాలుఁడే మేలు । విశ్వ. 4004

ఆ. హింసచేయునాతఁ డిలలోన నజ్ఞాని । హింసఁ జేయనున్న హీనుఁడగును
హింసహింస పరచు నిలలోన సుజ్ఞాని । విశ్వ. 4005

ఆ. హింసలన్నిమాని హితుఁడయి జనుఁడు సం । సారియయిన ముక్తిఁజేరవచ్చు
హింసలెన్నొచేసి హితుఁడౌట యెట్టులో । విశ్వ. 4006

ఆ. హింససలుపువాని కెన్నఁడు దయలేదు । హింసయెఱుగనతనికెపుడు భయమె
హింస సేవగింతు రెల్లసజ్జనులును । విశ్వ. 4007

ఆ. హీనజాతివాని కెచ్చు వైష్ణవమిచ్చి । ద్విజులకన్న దొడ్డతీరటన్న
కల్లుకడవఁగడిగి గంగ కిచ్చినరీతి । విశ్వ. 4008

ఆ. హీనజాతివాని నిలుసేరనిచ్చిన । హానివచ్చు నెంతవానికైన
నీగకడుపుఁ జొచ్చి యిట్టట్టుజేయదా । విశ్వ. 4009

ఆ. హీననరులతోడ నింతులతోడను । బడుచువాండ్రతోడఁ బ్రభువుతోడఁ
బ్రాజ్ఞజనులతోడ బ్రహ్మఘ్నజనుతోడ । నైపుఁ దెలిసి పలుకవలయు వేమ. 4010

ఆ. హీనుఁడగుచుఁ జనఁడె యింద్రుఁడింతు కామియై । మారుఁడట్లె మున్ను మడిసిపోఁడె
బ్రహ్మకామియగుచు భంగంబుపడలేదె । విశ్వ. 4011

ఆ. హీనుఁడెన్నివిద్యలిలనభ్యసించిన । ఘనుఁడు కాఁడు హీనజనుఁడెకాని
పరిమళముల గర్ధభము మోయ ఘనమౌనె । విశ్వ. 4012

ఆ. హెచ్చుతక్కువన్న నెటువంటివారికి । తనువు నిత్యమగునె తథ్యమరయ
ఎఱిఁగి యెఱుఁగలేరె యేమనవచ్చురా । విశ్వ. 4013

ఆ. హేమకారవిద్య నెఱిఁగినవారెల్ల । నితలఁ బడనియట్లు విద్యచేతఁ
దత్వమెఱుగు వెనుకఁ దనకుఁ జింతేలరా । విశ్వ. 4014

ఆ. హేమనగము చేత నెప్పుడుఁ గలవాఁడు । వెండికొండమీఁద వెలయువాఁడు
ఎత్తపలసె బిచ్చ మేమనవచ్చురా । విశ్వ. 4015

ఆ. హేమముగలవాఁడు కాముఁడు సోముఁడౌ । దినకరుఁడగువాఁడు తేజమందు
విత్తహీనుఁడైన వెఱ్ఱులతమ్ముఁడౌ । విశ్వ. 4016

క. హృదయం బలరఁగఁ జేసియుఁ । బెదరని మనమున శివునికిఁ జేసినపూజల్
పృథగా దది యెంచంగను । ముదిసిన యందాఁకఁ జేయ ముక్తుఁడు వేమా. 4017

క. హృదయంబున శివుఁగని నె । మ్మదినిలిపి చిదాత్మతత్వమయమై తలపం
గుదిరెడి పరిపూర్ణుఁడు శివుఁ । డుదయంబై తేజరిల్లు నుపమగ వేమా. 4018

ఆ. హృదయమందున్న యీశునిఁ దెలియక । శిలలకెల్ల మ్రొక్కు జీవులార
శిలలనేమియుండు జీవు లందేకాక । విశ్వ. 4019

ఆ. హృదయమందును శివుఁ డిమిడి యుండంగను । ఏల మ్రొక్క శిలల కెఱగి మొఱగి
జీవికంటె నెచ్చె శిల బుద్ధిహీనుఁడా । విశ్వ. 4020

ఆ. హృదయమందును శివుఁ డుండుటఁ దెలియక । శిలల కేటికెఱగి చేతులెత్తి
అంధకుండు ముకుర మరసి చూచినయట్లు । విశ్వ. 4021

మమందు శివునిఁ జెదరకనిలిపినఁ । బడిలుఁడగును భవుఁడు ప్రాపుగాను
నొక్క మదిని గ్రక్కునఁజూతురా । విశ్వ. 4022

దయముఁ జెదరక నిల్పిన । నదియే మోక్షంబుదారి యనువౌనువిన్నా
ఱుఁగని చదువేలనో । మదియందే ముక్తి కిరువు మహిలో వేమా. 4023

మె పదిలం బైనను । గుదిగొను సన్న్యాసమునకుఁ గొమ్ములుగలవా
ఱుఁగరె చదువరులట । మది ముక్తికి నాస్పదంబు మహిలో వేమా. 4024

గంబు నంటెడు విధము మరిగి । కదియ నేర్చినధీరునిఁగాంచుటరుదు
పరిపూర్ణుఁడై గుట్టుగాను । బడిలముఁగఁగాంచుబయలునఁ బరము వేమ

గరమును దాటి వ్యాప్తినొంది। కుదురుపడఁగను గురుమర్మ కుంభకంబు
బైలులోఁ జేరి సంచరించు। విదితమగునప్పుడా బ్రహ్మవిద్య వేమ. 4026

స్వప్నంబునందొప్పుసవయుఁగన్న। ముదములభియించునప్పుడువిదితముగను
నిఁజదివి యా మదముకొలఁది । వదురువారికి లేసుండు కుదురు వేమ.

## క్ష

మతఁడు సాధువై శోభించు । ఓర్పుఁబోలునట్టి దుర్విగలదె
మేలు లెన్నియైననుగూడు । విశ్వ. 4028

మందు సమయును జంతువుల్ । భూమియందు బంట లేమిఁజేసి
మ్వైనఁ గాలిపోదేమిరా । విశ్వ. 4029

లాదికర్మలు చేతి కొలఁదిఁ । జేయ దుర్గంధ మరుగునే చెలఁగుఁగాక
లముష్టినాయమా మార్గమనుచుఁ । దెలియరేలకో తేటగాఁ దెలుపు వేమ.

నికిఁ దగిన శృంగారములునున్న । విభునికరుణ లేక వెలయదెందు
ను లేక నేర్పులుచెల్లవు । విశ్వ. 4031

మహత్యలు చేసిన । మతిలేకున్నట్టి కుమతి మనుజులబాధల్
తోయంతో దానికి । మితమును నేఁ జెప్పలేను మేదినివేమా. 4032

నీరము రెండును । జేరికయగు దారిఁదెలిసి చిట్టాడనలెం
ని శివుని జీవునిఁ । బోరుము పరిపూర్ణమతిని బొందిక వేమా. 4033

ప్పి నిద్రక్షుభితములైయుండు । రిత్తలోకమాయ రీతిఁగాదె
ర్ణసుప్తి సాధింపవలెనయా । విశ్వ. 4034

మును క్షేత్రజ్ఞుని । గాత్రంబును జూచి నియతిఁ గన లక్ష్యంబౌ
మఁ బయలును నొకటిగ । సూత్రించినఁ గలుగుముక్తి సులభము వేమా. 4035

సంపూర్ణము.

